# షష్టిహాయనమాతృక

శ్రీ నాయని సుబ్బారావు

నిను గంటి వాక్కుల శారద
దినాపరార్ధమున, కనులు తెఱచి తేటి నూ
న్నను చూడనేర్చు లోపల
ననిలత్వర మాయమైతి వమ్మ ! వికారీ !

కలికి వెన్నెల వెల్లువలు ముంచుకొనివచ్చు
లీల రెక్కొని పున్నపూలు పొదివి,
అపర సంధ్యారాగ మలముకొన్న విధాన
తరుణ మందార వల్లికలు విరిసి,
తనరు హిరణ్యరేతుని రశ్ము లడరు చా
ప్పున ప్రొద్దుతిరుగుడు పూలు నిగిడి,
తొలుకరింపు నవాబ్దవలయ నీలముల మూ
రికి నల్లకలువదొంతరలు కదలి

ఆనవుసన్నగ నగ్నవిన్యాస రమ్య
శబలిత విచిత్రరోచి ర్జ్వలిత మొక మ
హాయుగాకృతి నా కన్నులందు పొడిచి—
అఱువదేండ్ల కీనాడు నిన్నరయ గంటి !

నీవలె నారులుగా నరము విన్నలి వన్నెలతో పరిస్ఫుర
ద్భావలు నన్ను సాకిరిట తల్లులు, తల్లివి నీ వొకర్తవై
యీ విధి షష్టి మాతృకల పేరు వహించుచు కాలచక్ర శీ
లా వలమాన వర్తన విలాస విమోహన చిత్రవృత్తివై !

ప్రకృతి స్వభావసిద్ధము
వికారి నామ మ్మదేమి విడ్డూరము నీ
కకుతోభయుండు పోషక
వికార పరివేషమూర్తి విభుడై యుండగ !

అతడు నీయందు చైతన్య మావహించి
షష్టిదార వికార సంసక్త చిత్త
వైన నీతోడ తెగని సయ్యాట లాడు
విభు

ఆంధ్రపత్రిక - వికారి సంవత్సరాది సంచిక

ఉత్సాహ నవ వసంతోత్సారి తౌదార్య
మహిత సద్భావ సంపద చిగిర్చి,
అంతర్బహిశ్శాత్రవాభీల నైదాఘ
తప్త మానసము బద్దలుగ పగిలి,
అంతరంగ స్నేహసంతతామృత వృష్టి
సంతోషము తటంకమముగ పాఱి,
రమ్యశృంగార శారద కృపాజ్యోత్స్నార
సోద్రిక్త హృదయ ముఱ్ఱూతలూగి,

పాఱయు వార్ధక్య హేమంతపూర్వశిశిర
వలసమున సర్వవాసనల్ పండబాఱె,
చలిత వివిధ వికార సంసర్గ సార
శీలమీ జీవికకు నీడు చాలు వచ్చె!

మఱల వసంత మ్మొదిగ
మెఱయుచున్న నీ తగులపు మెఱుమెచ్చులు నీ
తెర వెనుక భాగవత ము
క్కఱ లేదిక నాకు సంటగట్టకు తల్లి!

రాగిత్వ ముడిపి ద్వంద్వపు
కాకుడు చల్లార్చి కాల కబళన సంశ
ద్యోగము నయించు నంత
ర్యాగము సిద్ధింపజేయు మమ్మ! వికారీ!

# ఆంధ్రప్రదేశ్ జాతకఫలము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

శుభగ్రహబలములో అభివృద్ధి కార్యములను జరుపుట శ్రేయమని జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము. సామాన్యముగా, వ్యక్తి జీవితమునకు సంబంధించిన కార్యములకే ఇట్టి నియమములు అవసరమైనపుడు, దేశమందలి, అథవా రాష్ట్రమందలి, ప్రజా సముదాయముయొక్క క్షేమాభివృద్ధికి ఆధారమైన రాజాభిషేకమునకు శుభముహూర్తము నేర్పఱచుట యెంత ఆవశ్యకమో ప్రత్యేకముగా విన్నవించుట అనవసరము. కావుననే, రాజ్యాధికార స్వీకారమునకు, కాలనిర్ణయముచేయు సందర్భమున ఎన్నియో నియమములను ముహూర్తశాస్త్రము పేర్కొని యుండుట. మన దేశమున ప్రాచీనకాలపు మహారాజులు ఈ ముహూర్త నియమములను ఎంతో శ్రద్ధతో పాటించెడివారు. వారు కోరినది ప్రజారంజనమే గాని, ప్రజలపై యాధికారము కాదు. "రాజా ప్రకృతిరంజనాత్" అని కాళిదాస మహాకవి రాజశబ్దమునకు నిర్వచనమును ప్రసాదించి యుండుట [illegible] తెలియగలదు. కావుననే, దేశక్షేమమునకై తగిన ముహూర్తములను నిర్ణయించి ఇచ్చుటకొఱకు రాజాస్థానములలో జ్యోతిశ్శాస్త్రవేత్తలకు గణ్యమగు స్థానము ఆ కాలములో లభించి యుండెను. జ్యోతిష్కుని సాహాయ్యములేని రాజు దీపములేని రాత్రిగాను అంధునివంటివాడని ప్రాచీనులు చెప్పిరి.

"అప్రదీపా యథా రాత్రిః అనాదిత్యం యథా నభః,
తథా సాంవత్సరో రాజా, భ్రమ త్యంధ ఇవాధ్వని"
(వరాహమిహిరుడు)

సరేకాని, ఈ ఇరువదవ శతాబ్దమున రాజులు లేరు; రాచరికములు నశించినవి. అట్టిచో ఈ నియమములేలకు? అనవచ్చును. రాజులు పోయిరి; మణికిరీటములు పోయినవి. వాస్తవమే. కాని ప్రజలున్నారు. రాజ్యము లున్నవి. పరిపాలనము సాగవలసియే యున్నది. ప్రజల బాగోగులను కలుపుపోటుతో—శ్రద్ధసాహాయ్యము ఉంచినే యున్నది—సాధించగల అధికార మున్నది. ప్రజాసత్తాకరాజ్యములలోనైనా ఈ అధికారమును నిరంకుశముగనో, సాంకుశముగనో, ప్రధానమంత్రిగానీ, ముఖ్యమంత్రిగానీ, తన అనుయాయివర్గముతో నిర్వహించుచున్నారు. రాజశబ్దము పోయినా, రాజ్యములు పోలేదు. కిరీటభారము తగ్గినది కాని, పరిపాలన భారము తగ్గలేదు. ఇట్టి అధికారస్వీకారమునకు వ్యక్తిక్షేమ దృష్టితో కాకపోయినా, దేశక్షేమదృష్టితోనైనా, శుభముహూర్త మక్కరలేదని చెప్పగలమా? రాజాభిషేకమునకు విధించిన నియమములే మంత్రిపట్టస్వీకారమునకు సయితము అన్వయించవలయునని ముహూర్తశాస్త్రము విధించినది.

"అభిషేకోక్త కాలేషు, యౌవరాజ్యాభిషేచనమ్;
మహిషీ, మంత్రి, సామంత, గజానామ్ పట్టబంధనమ్."
(జ్యోతిషార్ణవము)

ఇప్పటికాలమున మనదేశములో ఇట్టి అధికారపట్టము కట్టుకొన్నవారందఱు సామాన్యముగా స్వార్థత్యాగులగు మహనీయులే, దేశసేవాపరాయణులే. ఉదారాశయములతోనే వారి భారనిర్వహణమునకు సిద్ధపడుచున్నారనుట నిస్సంశయము. కాని, దైవశక్తి సహాయము లేనికాలమున వారి మహత్తరభార వహనమునకు పూనుకొన్నచో, వారి కేవల పురుషకారశక్తి, ఎంత గొప్పదె కానిండు, ఎంత సాధించగలదు? కావలసినంత ఆవిరిబలమో, విద్యుచ్ఛక్తి సహాయమో లేనప్పుడు, సారథి ఎంత నిపుణుడైనా, ఎన్ని మార్లు మరలు త్రిప్పినా, రైలుబండిని గమ్యస్థానము చేర్పలేడుకదా?

కాని, ప్రాచీనుల అభిప్రాయములు, ఆదర్శములు, రుచించని నాగరికత ప్రబలి చెలరేగుచున్న కాలమిది. అందులో అతి ప్రాచీనమైన జ్యోతిశ్శాస్త్రముగూర్చి అనేకులకు అర్థములేని నిరాదరము. కొందఱికి అకారణద్వేషముకూడా. ఈ శాస్త్ర నియమములకు ఏమాత్రమైనా విలువ యున్నదా, లేదా, యని విద్యార్థులు గమనించుటకై నిష్పక్షపాతమైన ఆధునిక పద్ధతులతో, ఇతర శాస్త్ర విషయముల [illegible] చేయుటగా, వారిచే పరిశోధనములు చేయించుటగా [illegible] పాటుపడకుండుట విషాదకరము. కాలమహిమ!

కావుననే, ఇప్పటి రాజ్యాంగ పద్ధతులలో అధికారస్వీకారమునకు శుభముహూర్తములు నిర్ణయించు ఆచారము మృగ్యమైనది. దీనికి ఫలితమంటె ఈ క్రింది దృష్టాంతములు పాఠకమహాశయులు గమనించియుందురు:—

(i) వ్యయసంవత్సర భాద్రపద శుక్ల సప్తమినాడు, విశాఖ నక్షత్రయుక్త సోమవారమున (3-9-1948), 11-16 A. M. (I. S. T.) లో సాయన కటకలగ్నమున కాలసర్పయోగములో, స్వతంత్రభారత మహాసామ్రాజ్యమునకు కంకణ బంధనరూపముగ తాత్కాలిక నూతన జాతీయప్రభుత్వము దేహళి నగరమునందు ఆరంభమయ్యెను! విశాఖనక్షత్రము ద్విదైవత్యమనుట ప్రసిద్ధము. ఇంద్రుడు, అగ్ని దాని యధిపతులు. భారతదేశ విభజనము జరుగుట అప్పుడే. శాశ్వతమైన సవతిపోరు దైవము సూచించినది.

(ii) సర్వజిత్తు సంవత్సరమున అధిక శ్రావణ కృష్ణ చతుర్దశి నాడు, పుష్యమీనక్షత్రయుక్త గురువారమున (14-8-1947), మహానిశా సమయమందు సాయనమిథునారంభలగ్నమున, భారత దేశమునకు అధినివేశస్వాతంత్ర్యమిచ్చుట! గ్రహరాజగు రవి అస్తమించియున్న కాలమున కటికచీకటిలో సంపాదించిన ఈ స్వాతంత్ర్య సోపానమునకు ప్రకాశమెట్లు రాగలదు?

(iii) విరోధిసంవత్సర మాఘ శుక్ల అష్టమినాడు, అశ్వినీ నక్షత్రయుక్త గురువారమున, వ్యతీపాతయోగములో విష్టికరణ

మందు, (26-1-1950) 10-30 A. M. (I.S.T.) లో ధియా నవాంశ సాయన మేషరాశి 8 వ భాగ లగ్నములో నుండగా, లగ్నాధిపతి కుజుడు సప్తమభావములో నుండి లగ్నమందలి రాహువుతో హోరాహోరి పోరుచుండగా, సంపూర్ణస్వాతంత్ర్యముతో ప్రజాసత్తాక సామ్రాజ్యము భారతదేశములో ఆరంభమయినది. ముహూర్తము ఎంత శోభాయమానముగ నున్నదో, వ్యాఖ్యాన మనవసరము. ఈ తొమ్మిది సంవత్సరములకాలములో దీనిఫలము అనుభవముతో ఎట్లు సమన్వయమయినదో, వారివారికి తోచినరీతి నూహించుకోవచ్చును.

భారత ప్రభుత్వమే దైవబలము చాలక అల్లాడుచున్నపుడు, అందలి రాష్ట్రప్రభుత్వములకు దైవబల మెంత లభించగలదు? తల్లి నీడలోని పిల్లలుకదా! దైవశక్తి లోపమును మహత్తర పురుషకారశక్తితో సవరించుటకై రాజనీతి దురంధరులగు మహనీయు లనేకులు కార్యదీక్షతో కంటికి నిద్రలేక పాటుపడుచున్నారు. ఏటికి ఎదురీతవంటిది!

ఇతర రాష్ట్రముల మాట అట్లుంచి, మన ఆంధ్రరాష్ట్రమునకు దైవసాహాయ్యమేమనుచున్నదో కొంత పరిశీలింతముగాక! గత విజయ సంవత్సర భాద్రపద కృష్ణ నవమివాడు, పునర్వసూ నక్షత్రయుక్త గురువారమున, (1-10-1953) 7-10 A.M.(I S.T.) కాలమందు, సాయన తులాలగ్నమున, ఆంధ్ర మహాజనుల చిరతపః ఫలముగ తుంగభద్రానదీతీరమున కందనవోలుపురమందు ప్రత్యేక— ఆంధ్రరాష్ట్రము నెలకొల్పబడినదికదా? అప్పటి గ్రహస్థితి ఈ క్రింది చక్రము చూపగలదు:—

| | | | |
|---|---|---|---|
| | ఆంధ్ర తార 21°-18' | | గు 26-9 |
| | (సాయనము) ఆంధ్రరాష్ట్రారంభము | | X 21-8<br>చ 21-8<br>వ 22-45 |
| రా 29-37 | | | పుణ్య 5-36<br>య 24-16 |
| | రాజ 11-54 | ర 7.35<br>రాహు 22.8<br>I 22.3<br>[illegible] 24.17<br>[illegible] 23.2<br>ర 27.27 | శు 8-25<br>శ 10-19 |

ఈ రాష్ట్ర నిర్మాణకాలమునందలి గ్రహఫలమునుగూర్చి పలువురు హోరాశాస్త్రజ్ఞులు తమ యభిప్రాయములను ఈవఱకే వెలిబుచ్చియున్నారు. అత్యుత్తమయోగములు ఈ ముహూర్తమందు కలవని, ఉత్ప్రేక్షా పరమానములతో కొందఱు తెగపొగడిరి. లోప భూయిష్ఠముగ నున్నదని అతిశయోక్తులతో వేఱు కొందఱు తెగడిరి. అరవసోదరుల యాజమాన్యమునుండి తప్పించుకొని బయట పడినచో, 'బలుసాకయినాతిని బ్రతుకవచ్చు'నని భావించినవారు ముహూర్తగుణములను వేనోళ్ల ప్రశంసించినారు. 'నీటగోని చేప బయటపడితే చాలదు. బాగుపడి బ్రతికినపుడుకదా సంతోషము!' అను నభిప్రాయము కలవారు భావి ఫలములను సందేహించి ముహూర్త దోషములను లెక్కపెట్టసాగిరి. ఈ రెండు పక్షముల వారి ఊహాలలో కూడ కొంత సత్యము లేకపోలేదు. పితృపక్షపు దినములలో రాష్ట్రనిర్మాణము శుభసూచకమా యని కొందఱు శంకించగా, అమరజీవి పొట్టి శ్రీరాములను పితృపక్షమున కెక్కించిన ఫలముగా సాధించిన ఈ రాష్ట్రమునకు ఆ సమయము తగియేయున్నదని ప్రతివాదులు సమర్థించిరి. చరలగ్నము, చర నవాంశ, చరనక్షత్రము, చరరాశిచంద్రుడు, అనుయోగములు రాష్ట్రమునకు స్థైర్యము నెట్లు సూచించగలవని కొందఱు సందేహించినారు. చిన్న ఆంధ్రరాష్ట్రము విశాలాంధ్రము కావలయునని, కందనవోలుపురము విడిచి రాజధాని భాగ్యనగరమునకు బయలుదేర వలయునని, సర్వసౌభాగ్యములతో సరిరాష్ట్రములలో ముందంజ వేయవలయునని కోరుచున్న ముక్కోటి యాంధ్రుల పురోగమన కార్యప్రణాళికలకు ఈ ముహూర్తము ప్రోది నిచ్చుచున్నదని ప్రతివాదము వచ్చినది.

"ఓజాః సర్వే శుభాః ప్రోక్తాః తిథయో నవమీం వినా."

అని అధికార స్వీకారమునకు 'రిక్త' తిథియగు నవమి నిషేధించ బడుటచే, ఆంధ్రుల కోరికలు, రిక్తయగు నేమోయని కొందఱు భావించగా, శ్రీరామచంద్రమూర్తి యంతటి అవతారపురుషుడు జనించిన తిథి—అందులో అతని నక్షత్రమే పునర్వసు—ఆంధ్ర రాజ్యము రామరాజ్యమగునని సూచించు అత్యుత్తమయోగమను సమాధానము వచ్చినది. సరేకాని, పదునాలుగు సంవత్సరముల దీర్ఘ కాలము నారచీరలుకట్టి, ఆకలములు తిని, అరణ్యవాసక్లేశమును సహించి, భార్యావియోగదుఃఖము ననుభవించి, సముద్రమును దాటి శత్రువులతో హోరాహోరి పోరాడి, గెల్చిన యనంతరమే కదా శ్రీరామచంద్రుని రామరాజ్య మారంభించుట? అను అధిక్షేపము రాకపోలేదు. కష్టపడకయే సుఖమెట్లురాగలదు? వచ్చెనేని అది సుఖమే యనిపించదు, అని దానికి ప్రత్యుత్తరము. ఇట్టి పక్షపాతపు ఊహాలకు, వాదములకు, ఆద్యంతము లుండవు. అది యట్లుండె.

ముహూర్తకాలములో లగ్నము తుల. చతుర్థ పంచమాధిపతి యగుటచే రాజయోగకారకుడైన శని ఉచ్చబలముతో తనుభావ మందే యుండుట అమూల్యమగు సుగుణము. ఆ లగ్నమందే శనితో చేరి బుధుడున్నాడు. మందగతితోనైనను, ప్రతిభతో రాజనీతి నడపుచు ఆంధ్రులు సక్రమాభివృద్ధిని పొందగలరని యోగములు సూచించుచున్నవి. ధర్మస్థానమందలి బృహస్పతియొక్క శుభ త్రికోణ దృష్టి లగ్నమునకే కాక, శనికిని, ధర్మస్థానాధిపతియగు బుధునికిని కలుగుట దైవానుగ్రహము. రాజనీతిలో ధర్మదృష్టికి ప్రాధాన్యము కలదని, ఎగుడు దిగుడు లెన్నివచ్చినా అభివృద్ధి చూపట్టగలదని, ఈ బృహస్పతి సూచన. రాజ్యభావబిందువందే

...రాజ్యాధిపతి చంద్రుడు ప్రజారంజకముగా రాష్ట్ర పాలింతునని వాగ్దాన మిచ్చుచున్నాడు. ఆంధ్రతార (తిమండలి యోగతార) యొక్క పరిపూర్ణ కటాక్ష ... లగ్నమునకు లభించుట గొప్ప విశేషము. దశమకేంద్ర ప్రభావశాలి వరుణుడు నిరర్గళముగా రాజనీతి నిర్వ ...నని చాటుచున్నాడు. ఇవన్నియు గొప్ప సుగుణములే.

...ని, లగ్నాధిపతి శుక్రుడు నీచరాశిలో నిలిచి దుర్బలు ...డు. ఇది చాలక, పరమనీచభాగకు అతిసన్నిహితుడుగా ...డు గ్రహరాజు రవి, ఆదర్శ (లాభ) స్థానాధిపతి. రవి దుర్బలుడయినపుడు ఎన్ని రాజయోగములుండినా ఫలించుట కష్టము.

"జాతకస్య దశమేభాగే స్థితః కమలబోధనః,
సహస్రం రాజయోగానాం, నాశమేవ కరోత్యసౌ."

అని కల్యాణవర్మసూత్రము. ఆదర్శమైన విశాలాంధ్రమును ఆంధ్రులు సాధింపలేకపోయినారు.

"ఆంధ్రత్వ మాంధ్రభాషాచ, నాల్పస్య తపసః ఫలమ్."

అని స్మరించుచు లక్షలకొలది యాంధ్రులు మదరాసు రాష్ట్రమున కొందఱు, మైసూరు రాష్ట్రమున కొందఱు, ఉత్కల రాష్ట్రమున మఱికొందఱు, నిలిచిపోయి, గుటకలు మ్రింగుచుండగా, విశాలాంధ్రము ఎట్లు సాధ్యము? లగ్న లాభాధిపతులు శత్రువులు దుర్బలులై కార్యమును సాధింపలేకపోయినారు. యథాలాభ సంతృప్తినొందక మరి యేమి చేయగలరు? లగ్నమందలి బుధశనులతో ఇంద్రుడు చేరియున్నాడు. వీరికి దశమ భావ నిర్వాహకుడగు వరుణునినుండి ప్రబల కేంద్రవేధ! కుట్రలు, కుతంత్రములు, పలుపుచు, వేషములు మార్చు ప్రతిపక్షులవలన పాలకవర్గమునకు చిక్కులు కలుగునని, లేదా, ఎత్తుల కెత్తుగా రాజనీతియే అట్టి ఉపాయములు కొన్నింటిని ఆశ్రయింపవలసి యుండునని కాని, దీని సూచన. సమయానుసారముగ యీ రెండు ధర్మములుకూడ రాష్ట్ర పరిపాలనములో అనుభవమునకు వచ్చుట అసంభవము కాదు.

దశమవరుణుడు మార్పుల నభిలషించువాడు. మంత్రివర్గములలో తఱచుగా మార్పులు రాగలవని అర్థము. రాజధానిమార్పు సహా ఈ వరుణగ్రహకార్యమే. ఈ మార్పులవలన పాలకవర్గము కొన్ని చిక్కులనుభవించునని, ఇంద్రా వరుణుల వలను చిక్కి చీకాకుపడి యున్న లగ్నాధిపతి శుక్రుడు తెలుపుచున్నాడు. మరియు, పాలకవర్గమును కూలద్రోయుటకై స్వార్థపరులొకవైపున, సంఘవిద్రోహకారులను విప్లవవాదు లొకవైపున చేయు పన్నాగములబారి నుండి తప్పించుకొనుటకై రాజ్యాంగమువారు పాటుపడవలసియుండుననుట సహా ఈ పాపకర్తరిఫలము. ధనాధిపతి కుజుడు వ్యయభావము నాశ్రయించుట వ్యయాధిక్యమును ఆర్థిక క్లేశమును తెల్పగలదు. షష్ఠభావాధిపతియగు బృహస్పతి శుభవీక్షణములోనున్న చతుర్థ పంచమాధిపతి శని పారిశ్రామిక జనాభ్యుదయము, విద్యాభివృద్ధి, కార్మిక జనక్షేమము, ఇవి ఈ రాష్ట్రపు ప్రధానాదర్శములుగ నుండగలవని సూచించుచు

న్నాడు. దశమకేంద్రమందలి చంద్ర కిరణములు వ్యవసాయాభి వృద్ధి, జలాశయ నిర్మాణము, విద్యుచ్ఛక్తి సంపాదనము, అను పను స్థలలో అతి అసాధారణ ప్రణాళికలతో కార్యక్రమము జరుపబడు నని తెలుపుచున్నారు.

ఆంధ్రరాష్ట్రపు జాతకఫలపుయొక్క సామాన్యస్వభావము ఇట్టిదనవచ్చును.

కాని, ఇప్పటి పద్ధతులలో ప్రదేశ పరిపాలనము ప్రధానముగా ముఖ్యమంత్రి అధీనము. అగుటచే, ఏ ముహూర్తమున ఏ వ్యక్తి ముఖ్య మంత్రి కాగలడో, అతని జాతకదశాఫలస్వభావముతో మిళితమై ముహూర్తఫలము రాష్ట్ర జాతకదశలలో వ్యక్తము కాగల దనుట మరువరాదు. మంత్రివర్గము మారి క్రొత్త మంత్రివర్గము వచ్చి నచో, ఫలస్వరూపములో సహా కొంత మార్పు చూపట్టకతప్పదు. అనగా, రాష్ట్ర జాతకదశలకు అనుగుణమైన జాతక ఫలముగల వ్యక్తియే ముఖ్య మంత్రి కాగలడనియు, అతని దశాస్వభావము ముహూర్త ఫలముతో చేరి రాష్ట్రమునకు రాగల మంచి చెడ్డలకు సూచకమగున నియు, సారాంశము.

ఇంతేకాదు. భారత ప్రభుత్వమునకు లోబడి దాని శాసనమును పాలింపవలసినభాధ్యత రాష్ట్రప్రభుత్వమునకున్నది. అగుటచే తాత్కాలిక భారతమహాప్రధాని జాతకముతో అనుకూలసంబంధములు చూపు వ్యక్తియే రాష్ట్రమునకు ముఖ్యమంత్రి యగుట శ్లాఘనీయము. అట్లు కానిచో, కేంద్రప్రభుత్వపు సానుభూతి లేక విరసము పుట్టగలదు. రాష్ట్రప్రభుత్వము సక్రమముగా ప్రజాహితకార్యములు చేయజాలదు. ఏ మహానీయుడు ముఖ్యమంత్రి అయినాసరే, మరి యొక్కటి. కేంద్రప్రభుత్వ మిపుడు అఖిలభారత కాంగ్రెస్ ఆదర్శములతో కార్యక్రమమును సాగించుచున్నది. ఆ సంస్థ ఆదర్శములను వ్యతిరేకించు రాష్ట్రప్రభుత్వము **నిలుచుట** కష్టము. నిలిచినా, పనులలో సాఫల్యముండదు. అట్లగుటంబట్టి, రాష్ట్ర ప్రభుత్వపు మంత్రివర్గము ఆ సంస్థ యాజమాన్యమునకు చేరినదై యగుట సామాన్యముగా తప్పనిసరి యగుచున్నది. చెప్పవచ్చిన దేమనగా, రాష్ట్రము బాగుపడవలె నన్నచో, ముఖ్యమంత్రికి భారత మహాప్రధానియొక్కయు, కాంగ్రెసు సంస్థయొక్కయు, సానుభూతి అత్యవసరమనుట. మొత్తముమీద, ఇది చాల చిక్కుసమస్య యగుచున్నది. కాని, దీనిని నిరాదరించలేము. ఉన్న పరిస్థితిని లేదనుకొనుట ఏమి నీతి ?

ఆంధ్రరాష్ట్ర మారంభమయినప్పటినుండి మూడు సంవత్సరములలో రెండు మంత్రివర్గములు బాలారిష్టముపాలై మారినవి. మూడవ మంత్రివర్గము వచ్చునప్పటికి ఆంధ్రరాష్ట్రము విశాలమయి తెలంగాణాతో చేరి, ఆంధ్రప్రదేశమయినది. పురుటింటి "లాలి" వంటి కందనవోలుపురమును వదలి, ఆంధ్ర రాజ్యలక్ష్మి తనయోగ్యతకు తగిన భాగ్య నగరమును ఒయ్యారముతో చేరుకొనగలిగినది.

దుర్ముఖినామ సంవత్సరమున ఆశ్వయుజకృష్ణ చతుర్దశినాడు, చిత్తా నక్షత్రయుక్త గురువారమున (1-11-1956) ఆంధ్రప్రదేశ రాష్ట్రావతరణమునకు భారతప్రభుత్వము సుముహూర్తమును నిర్ధరించినది. రాజ్యాధికారస్వీకారమునకు కృష్ణపక్షమందలి కడపటి మూడుతిథులు గర్హ్యములని ప్రాచీనులు చెప్పిరి. "శుక్లపక్షేతి శస్తస్స్యాత్, కృష్ణేచాంత్య త్రికం వినా" అని. అందులో, ఆనాడు ఘోరమగు విష్టికరణము. అది పూర్వార్ధ విష్టియగుటచే, ముఖ్యముగా పగటి ముహూర్తమునకు ప్రబలదోషకారి.

"కార్య నాశకరీ విష్టిః" అని ప్రమాణము. గురువారముతో కూడిన చిత్తానక్షత్రమునింద్యమట. "చిత్రా చ, పితృ....త్యం, గురువారేణ, వర్జయేత్." అని ప్రమాణము. ఈ మున్నగు ముహూర్త శాస్త్రనియమములేవియు పాటించబడినట్లు తోచదు. ఐకమత్యము లేని ఆత్రగాండ్రగు ఆంధ్రులనోటిగయ్యాళితనమునకు జంకి, నేయివేయక 'పప్పుపెట్టిపోరుమాన్పి' నన్న సామెతగా, పసత్నిమాతృవాత్సల్యము చూపి, 'మీ రాజ్యము మీరు తీసికొండి. మీ తలవ్రాత!' అని ముహూర్తము పెట్టినట్లున్నదే కాని, ఆంధ్రప్రజా సౌభాగ్యమును లక్ష్యములో నుంచుకొని నిర్ధరించినది కావనవచ్చును. "ముహూర్తము మంచిదికాదు. మార్చవలెను." అని భారత ప్రభుత్వమునకు విన్నవించు ధైర్య మెందరికి కలదు? ఉండెను పో, "శుభస్యశీఘ్రం" అను న్యాయముపైననే పలువురు నాయకులకు దృష్టియునుట సత్యదూరముకాదు. కష్టపడి సంపాదించిన కనకకిరీటమును ధరించ చుటకు తటాలున తలయొగ్గక, ఆకాశమందలి చుక్కలను లెక్కపెట్టుచు, కాలవిళంబనము చేయునోపిక—అథవా చేదస్తము—ఎందరికి యుండగలదు?

ఆనాడు రమారమి 10-30 A. M. (I. S. T.) లో మంత్రివర్గ నిర్మాణము జరుగునని కింవదంతి యుండినది. కాని కాంగ్రెసు వర్గ నాయకునుగా ఎన్నుకోబడియుండిన శ్రీయుత నీలం సంజీవరెడ్డి నిర్ణీతదినమును మార్చలేకపోయినా, ముహూర్తకాలమైనా తన జాతకమునకు అనుకూలముగ నుండవలయునని కాబోలు, కాలమును 9-15 A. M. (I. S. T.) కి మార్చి ముఖ్యమంత్రి పట్టమును స్వీకరించినాడు. ప్రస్తుత మంత్రివర్గ ప్రభుత్వమునకు ఇదే జన్మకాలము. ఈ క్రింద నుండలి అప్పటి గ్రహస్థితిని చూపగలదు:—

| | | | |
|---|---|---|---|
| కు 16-7 | ఆంధ్ర తారక 21-20 | శే 29-56 | |
| | (సాయనము) ఆంధ్రప్రదేశ మంత్రివర్గ జాతకము | | |
| | | | వ 6-56 |
| I 18-21<br>శ 2-16 | బు 0-29<br>శు 1-16<br>ర 8-42-13<br>రాహు 11-34<br>పుష్య 9 2<br>రా 29.56 | గు 0-38<br>చ 19-23 | య 0-12<br>న 23-54<br>X 24-39 |

లగ్నము ధనుస్సులో కన్యాంశ. 'చాపే సర్వ సుఖం స్యాత్.' అని పొగడ్తకెక్కిన లగ్నమిది. దీనిలక్ష్యము గొప్పది.



నలగొండ హరిజన హాస్టల్

# ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ కార్యకలాపములు

ఆంధ్రప్రదేశ్ నందు జరుగుచున్న యీ యేడాదికి సాంఘిక సంక్షేమ కార్యక్రమ ప్రణాళికల క్రింద రు 288 లక్షల రూపాయలకు పైగా ఖర్చు చేయవలసి యున్నది. ఈ ప్రణాళికల ద్వారా షెడ్యూల్డు జాతులు, షెడ్యూల్డు కులములు, ఇతర వెనుకబడిన తరగతులు, విముక్తజాతులున్నూ స్త్రీలున్నూ, నిరుపేదలైన పురుషులున్నూ లాభము పొందగలరు.

షెడ్యూల్డు జాతులవారు నివసించే యేజెన్సీ ప్రాంతములో, క్రొత్తగా పాఠశాలలు పెట్టబడుచున్నవి. రాకపోకల వసతులు అభివృద్ధి అగుచున్నవి. మలేరియా జ్వర నివారణోపాయములు ప్రవేశపెట్టబడినవి. క్రొత్త నివాసముల యేర్పాట్లు చురుకుగా సాగిపోతున్నవి. ఈ అనాగరిక జాతుల ఆర్థికాభివృద్ధికి అన్ని విధాల సత్వర చర్యలు తీసుకొనబడుచున్నవి. ఆంధ్రా షెడ్యూల్డు ట్రైబ్స్ కో ఆపరేటివ్ ఫైనాన్సు అండ్ డెవలెప్మెంటు కార్పొరేషన్ వారి విస్తృత కార్యక్రమములవలన పదివేల అనాగరికజాతుల కుటుంబాలు అభివృద్ధిలోకి రానున్నవి. చెంచులు, యానాదులు, యెరుకలు, సుగాలిలు వీరి అభివృద్ధికి కూడా ప్రణాళికలు అమలు పెట్టబడినవి. అలాట్మెంట్లు పెంచుట, స్కాలర్ షిప్‌లు అధికం చేయుట, ఇతర వసతులు కలిగించుట ద్వారా హరిజనులు మొదలైన వెనుకబడిన తరగతులవారికి విద్యావసతులు యెప్పటికప్పుడు వృద్ధి చేయబడుచున్నవి. హరిజనులకు ఉచితంగా నివేశన స్థలాలు యిచ్చేందుకై ప్రభుత్వ వ్యయముతో భూములు కొనబడుచున్నవి. హరిజనులకై కుటీర పరిశ్రమల కేంద్రాలలో ట్రెయినింగ్ - కమ్ - ప్రొడక్షన్ సెంటర్సు, పారిశ్రామిక సహకార సంస్థలు ప్రారంభింపబడుచున్నవి. న్యాయమైన వ్యవహారాలలో హరిజనులకు న్యాయరక్షణ కూడా కల్పింపబడుచున్నది.

రాష్ట్రములో యిప్పుడు ముప్పది మూడు వెల్‌ఫేర్ ఎక్స్టెన్షన్ ప్రాజెక్టులు పనిచేయుచున్నవి. సోషియల్ అండ్ మారల్ హైజీన్ స్కీము క్రిందను ఆఫ్టర్ కేర్ ప్రోగ్రాముల క్రిందను అయిదు ప్రభుత్వ గృహములున్నూ 20 జిల్లా రక్షణ కేంద్రాలున్నూ రాష్ట్రములో ప్రారంభింపబడినవి. ఇందులో చేరేవారికి తగిన వృత్తులలోను చేతిపనులలోను శిక్షణ ఇచ్చి, వారికి జీవనోపాధులు కలిగింపబడును.

ఈ విధముగా రాష్ట్రములో ఆర్థికంగా వెనుకబడిన తరగతులవారు, పేదప్రజలు సుఖంగా జీవించగలిగేందుకు, తగిన వసతులు కలిగింప ప్రభుత్వం పూనికతో పనిచేస్తూంది.

ఇన్ఫర్మేషన్ అండ్ పబ్లిక్ రిలేషన్స్ శాఖ, ఆంధ్రప్రభుత్వం, హైదరాబాద్, (ఆంధ్రప్రదేశ్)

ఆదర్శములు అంతకంటె గొప్పవి. లగ్నాధిపతి దేవగురువు. జ్ఞానము సుఖము, అభివృద్ధి, ధర్మదృష్టి, అనునవి ఇతని ప్రధానగుణములు. ఇట్టి గ్రహము రాజ్యస్థానపు కార్యనిర్వాహకత్వము వహించుట అదృష్టఫలము. కన్నులపండువుగా దశమకేంద్రబిందువందే తళతళ మెఱయుచున్న ఈ గురువు ఈ మంత్రివర్గ పరిపాలనములో రాష్ట్ర సౌభాగ్యము సర్వతోముఖముగా వికాసము చెందునని వాగ్దాన మిచ్చుచున్నాడు. లగ్న నవాంశాధిపతియు రాజ్యభావాధిపతియు, అగు బుధుడు లాభభావములో నుండుట సయితము అభ్యుదయ సూచకమే. లాభభావమందే చంద్రుడుండుట, ఆ భావాధిపతి శుక్రుడు స్వక్షేత్ర బలముతో, వర్గోత్తమాంశలో, రాజ్యభావమందే నిలుచుట, అను నీ యోగములు ఆంధ్రప్రదేశము సరి రాష్ట్రములలో ముందంజ వేయగలదని చాటుచున్నవి. శుభ గ్రహములగు గురు, బుధ, శుక్ర, చంద్రులు నల్వురును ఉపచయ స్థానములలో నిలిచియుండుట భాగ్యము.

ముఖ్యముగా పాలిత జనాభ్యుదయము, వ్యవసాయాభివృద్ధి, ఖనిజసంప దుపయోగము, అనునవి చతుర్థాధిపతియగు గురువు యొక్క లక్ష్యములు. షష్ఠాధిపతియగు శుక్రుడు రాజకీయోద్యోగుల యొక్కయు, కార్మిక సంఘముల యొక్కయు క్షేమదృష్టి కలవాడు. వృశ్చికరాశిలో పదునొకండవ భాగములో నున్న రాజ్య సహాయము జలాశయములు, భవనములు, నిర్మించు ప్రణాళికలతో మంత్రివర్గము పురోగమించునని సూచించుచున్నది. ఈ కార్యక్రమమును కొనసాగించుటకు వలసిన ఉత్సాహశక్తి మంత్రివర్గమునకు సమృద్ధిగా కలదని, ధనుస్సులో పదునెనిమిదవ భాగలో నున్న లగ్నము ప్రకటించగలదు. ప్రాచీనాంధ్రవైభవము పునరుజ్జీవించకలదన్న కుతూహలముతో ఆంధ్రతార పంచమ భావములోనుండి ఆశీర్వదించుచున్నది. ఇవన్నియు రమ్యములైన యోగములు.

అయిననేమి, ఈ ముహూర్తమున లోపములు లేవనికాదు. సమృద్ధిగనే యున్నవి. గ్రహరాజగు రవి, ధనాధిపతి శనిసహా, వ్యయభావమునందు ఆ భావబిందువునకు చేరియొకవైపున సమాంతరములో నిలిచి, శక్తికి మించిన వ్యయము చేయవలసివచ్చుటచే ఆర్థికస్థితి లోటుపడునని ఢంకా వాయించుచున్నారు. దశమాధిపతి బుధుడు ఇంద్రసంయోగములో నున్నాడుకదా. స్వపక్షమందే యుక్తిశాలులగు స్నేహితులు, కుట్రలుపన్ను హితశత్రువులుసహా ఉండగలరని సూచన. నాల్గింట కుజుడు శ్రమ అధికమయినా తగినంత ఫలము కానరాని కారణముగ, పాలకవర్గమునకు సుఖరాహిత్యమును, మనోవ్యథను సంపాదించిపెట్టగలడు. షష్ఠ భావమందలి కేతువు 'అపరిహార్య పురాకృత దుష్కర్మ పరిపాకమును' చూపు భాగములో నిలిచి పైగా యముని కేంద్రవేధపాలయినాడు. రాజకీయోద్యోగులలో నీతినియమములు శైథిల్యము క్రమక్రమముగా హెచ్చి కార్యనిర్వాహము కంటకప్రాయమగునని, దురాశావిష్టులగు కార్మికుల గొంతెమ్మ కోరికల మూలమున చిక్కులున్నవని, ఈతిబాధలచే ప్రజాసామాన్యముయొక్క క్షేమారోగ్యములు తృప్తికరముగ నుండవని, నిరుద్యోగ సమస్య క్లిష్టపరిస్థితులను తెచ్చిపెట్టునని ఈ యోగము తెలుపగలదు. ఆర్థికస్థితి అందుకోలేనట్టి వ్యయ ప్రణాళికలు సిద్ధమగుట, ఇరుగు పొరుగు రాష్ట్రముల సానుభూతి లేకుండుట, మున్నగు కారణములచే అభివృద్ధి కార్యకలాపములు అనుకొన్నరీతిగా జరుగుటకు ప్రతిబంధక సామగ్రి యేర్పడగలదని యముని కేంద్రవేధలోనున్న ద్వితీయ తృతీయాధిపతి శని చెప్పగలడు. మరియు, రాజనీతిని విమర్శించుపట్ల వార్తాపత్రికలు సహృదయత్వమును, సానుభూతిని చూపకపోవచ్చును. ధర్మస్థానాధిపతియయిన గ్రహరాజు రవి వరుణకేంద్రవేధ నభిలషించుచుండుటచే, అనేక సందర్భములలో రాజ్యాంగపు కార్యములను న్యాయస్థానములు కఠిన విమర్శకు గురిచేయుట అసంభవముకాదు. విప్లవవాదుల చేయివాడితనముకూడ తన ప్రభావమును అపుడపుడు చూపగలదు.

ఈ గుణదోషముల సమష్టి ఫలము ఈ మంత్రివర్గ పరిపాలనములో కనుపట్టవలసి యున్నది. సత్కార్యముల కెన్నియో ప్రతిబంధకములు. ఓపికతో వానినెదుర్కొని నిర్వహించుటే ధీరోదాత్త నాయకుల లక్షణము. లగ్నాధిపతి బృహస్పతి రాజ్యభావములోనుండి "నేనున్నా"నని భుజము తట్టుచున్నాడు. ఈ ముహూర్తములోని ఉత్తమ గుణ మిది.

అయిననేమి? ఆంధ్రరాష్ట్ర జాతక స్వభావమునకు లోబడి కదా, ఈ మంత్రివర్గ జాతకము తనశక్తిని ప్రదర్శించగలదు?

రవివరుణులకు కేంద్రవేధ కలదుకదా? అది మంత్రివర్గమును విచ్ఛిన్నము చేయజాలదా? అని భావించువారుందురు. ఆ వేధ కలదనుమాట సత్యమే. కాని, వరుణ కేంద్రమును దాటి రవి పురోగమించుచున్నాడని గమనించితిమేని, విప్లవకారుల గాయిడిని ఎట్లో తప్పించుకొని గండముగడచి మంత్రివర్గము తనకార్యమును సాగించుననియే దీని సూచన. ఇప్పటి రాజనీతి పద్ధతులలో రాజ్యాధికారము పొడవుచేతులవాని పణ్యారము! యోగ్యత, స్వార్థత్యాగము, దేశభక్తి, మానవ సేవాభిలాష, ప్రధానములు కావు. అధికారపదకాంక్ష ప్రబలి ఆత్మసేవా పరాయణత్వము జనులలో అధికమై అనవసర స్పర్థలకు త్రోవ చూపుచున్నకాలమిది.

"ఘటం భింద్యాత్, పటం ఛింద్యాత్, కుర్యాద్వా గార్దభస్వనం,
యేనకేనాప్యుపాయేన, ప్రసిద్ధః పురుషోభవేత్."

అనునీతితో జనులు నానావిధములగు ఉపాయముల నాశ్రయించి అధికారములకు చేతులు చాచుచుండుట యిప్పటి సామాన్యలక్షణము. అగుటచే, మంత్రివర్గమునకు ప్రతికూలపక్షమొకటి సర్వదా సిద్ధముగనేయుండి, ఎప్పుడు సమయము దొరుకునో యని, కాచుకొనియుండుట అసహజముకాదు. ఇట్టి పరిస్థితులలో ఏ మంత్రివర్గమైనా, శత్రుబాధ ననుభవించుట తప్పనిది. చేసిన పనులు తృప్తికరము కావని, చేయనివి దురుద్దేశమని, దోషము లెంచుచు దండోరావేయుట అంతకష్టముకాదు.

'తప్పులెన్నువారు తండోపతండంబు,
ఉర్విజనులకెల్ల నుండు తప్పు,
తప్పు లెన్నువారు తమ తప్పు లెఱుగరు"

అన్నాడు మన వేమన్న.

ఇన్ని చిక్కులుండగా, ఈ మంత్రివర్గ మేమి సాధించగలదందురేమో? ఉద్దేశము మంచిదై, కష్టముల నెదుర్కొను ఓపికయుండి, లక్ష్యశుద్ధితో కార్యక్రమమును జరిపినచో, మంత్రివర్గము సాధ్యమైనంత ప్రజాహితమును సాధించవచ్చును.

"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన."

అను గీతాచార్యుని సూక్తిని స్మరించుచు తృప్తి చెందుదము గాక.

ముఖ్యమంత్రి జాతక ఫలము ననుసరించియే కదా ముహూర్త ఫలము చెల్లవలయును! ఆ సౌకర్య మెట్లున్నదో కనుగొనుటకు

# కమలాప్త కన్యకు కైమోడ్పు

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

మాతా! పాతకపాతకారిణి! నిను న్ప్రత్యూష శోభన్ దటా
యాతుంగై లలితేంద్రనీలపటలోద్యత్స్నిగ్ధ ముగ్ధాకృతిన్
ప్రాతర్దర్శన మాచరించు నెవడా భవ్యాత్ము చిత్తంబు జీ
మూతశ్యామల కోమలాచ్యుతకళా పూర్ణంబు గాకుండునే?

పాతక భంగమాంగళిక భంగిమమున్ శితికంఠ కంఠశో
భాతరళమ్ము నీజలము వర్ణన కెవ్వడు మాటకారి? నీ
పూతతరాంబు పూరముల మున్కలువేయు వరాకుడేని, రం
భాతరుణీ కరవ్యజన మంజుల మింద్రపదంబు గెల్చెడిన్.

దానాంధీకృత గంధ సింధురఘుటోద్యద్గండపాళీమిళ
ద్గానోన్మత్త మిళిందమైన నృపతిద్వారానకున్ మ్రొక్కదన్;
నానామూల ఫలంబు నీతటమునన్ మౌనీంద్రవృత్తిన్ సదా
ధ్యానాప్తిన్ దినముల్ క్రమించెద గతాయాసమ్ములన్ సూరజా!

లోనన్ మౌక్తికపుంజ మంజిమ వెలిన్ లోలేంద్ర నీలప్రభల్
నీ నీరద్యుతులౌట, మున్కలిడువానిన్ బ్రాప్తరూపద్వయిన్
గానంజేయు క్షణంబు శ్రీహరిహరాకారంబునన్ దల్లి! త్వ
త్పానీయం బది నాకు సమ్మదము సంపాదించు నెల్లప్పుడున్.

పాపకదంబముల్ బలిసి బాధలువెట్టుట, కాలుడుగ్రతన్
జూపుట, మానసాబ్జమున క్షుద్రభవభ్రమ పొంగి రేగుటల్,
నీ పరిశీలదూర్మి రమణీయ రసస్రుతి కొంత కొంత మా
చూపుల కందుదాకనె, యశోవిమలా! కమలాప్తకన్యకా!

'కాళిందీ'యని కౌతుకాన నెపుడేఁగానీ భవన్నామ వ
ర్ణాళిన్‌బల్కిన వానికిన్ గరమునం దత్తాడు మేల్సిద్ధు, లు
ల్లోల ధ్వాంతకులాంతకారిణివి నీలో మున్కలంబెట్టు చే
వేళం దేలు జనమ్ము దివ్యమహిమల్ విన్పింపగా శక్యమే?

స్వర్ణస్తేయి, సపేయపాయి, గురుతల్పస్థాయి, బ్రహ్మఘ్నునిన్
దూర్ణం బోమ ధృతవ్రతమ్ములగు నీతోయమ్ము లల్పాల్పముల్
తీర్ణప్రేతపతి ప్రతాపకలనా ధిక్కారహుంకార పూ
ర్ణార్ణస్స్రోతముముం దవేల నిక ప్రాయశ్చిత్త సంభారముల్?

(పండితరాయల రచనకు అనువాదము.)

# తృతీయ ప్రణాళిక : కొన్ని సూచనలు

శ్రీ కె. వి. రమణ

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలులోకి వచ్చి మూడు సంవత్సరాలు గడచిపోయాయి. అప్పుడే తృతీయ ప్రణాళిక దాని స్వరూపం, ఆశయాలు, ఖర్చు పెట్టవలసిన మొత్తం మొదలయిన విషయాలమీద చర్చలు ఆరంభమయ్యాయి. వీటిమీద పలువురు పలువిధములైన అభిప్రాయాల్ని వెలిబుచ్చుతున్నారు. ఈ అభిప్రాయాలు ద్వితీయ ప్రణాళిక సాధించిన ఫలితాల అంచనాల మీద ఆధారపడిన వన్నమాట. ఈ ఫలితాలను విమర్శించేవారిని రెండువర్గాలుగా విడదీసి వారి అభిప్రాయాల్ని చర్చించవచ్చు.

ఓ వర్గంవారు—ద్వితీయ ప్రణాళికలో యిబ్బందులు ఎక్కువ కల్గాయని దీనికి ముఖ్యకారణం—ద్వితీయ ప్రణాళిక మనశక్తికి మించినదిగా తయారు చెయ్యబడిందంటారు. దేశంలో ప్రజలు ఆదా చేయగలిగిన మొత్తంకన్న ఎక్కువగా లోటుబడ్జెటువిధానం అవలంబించి ఖర్చుపెట్టారు. ప్రథమ ప్రణాళికలో ఈవిధంగా ఖర్చుచేసిన డబ్బు 450 కోట్ల రూపాయలే అయినా ద్వితీయ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలోనే ఈవిధంగా 900 కోట్లకు పైగా వెచ్చించారు. దీనికి తోడు కమర్షియల్ బ్యాంకులు యిచ్చే అప్పులు కూడ బాగా పెరిగిపోయాయి. తత్ఫలితంగా దేశంలో ధనం సప్లయి పెరిగింది.

(గత సంవత్సరంమీద మార్పులు—కోట్లరూపాయిలలో)

| ధనం | 1951-53 | 1953-54 | 1954-55 | 55-56 |
|---|---|---|---|---|
| సప్లయి | —214 | +29 | +129 | +264 |

ఈ పరిస్థితుల్లోనే ఉత్పత్తి పెరిగే రేటు మందగించటంవల్ల ప్రజల ధనరూపంలోని ఆదాయాలు మాత్రం పెరిగిపోవటం సంభవించింది. తత్ఫలితంగా ధరలు పెరిగాయి.

| ధరల | మే 55 | మే 56 | డిసెంబరు 56 | ఆగస్టు 57 |
|---|---|---|---|---|
| సూచి | 89 | 98 | 108 | 112 |

అంటే ధరల శాతములో 14 వరకు పెరిగాయి. ఈవిధంగా ధరలు పెరగటంవల్ల పరిమితాదాయులవారి జీవనప్రమాణాలు తగ్గాయి. తక్కినవారికి ధనరూపంలో ఆదాయాలు పెరుగుటవలన వారి వినిమయం ఎక్కువయింది. తద్వారా ఎగుమతులకు కేటాయించబడిన వస్తువులు దేశంలోనే ఖర్చు అవుతున్నాయి. ఎగుమతులు తగ్గటానికి మరొక ముఖ్యకారణం, ధరలు పెరగటంవల్ల విదేశాలవారికి మన సరుకులు కొనటం లాభసాటిగా కనబడదు. అందుచేత కూడ ఎగుమతులు తగ్గాయి. బాగా ఆదాయాలు పెరగటంవల్ల దిగుమతుల మీద ఖర్చుకూడ పెరిగింది. పైగా ద్వితీయ ప్రణాళికలో చాలా భాగం దిగుమతుల మీద ఆధారపడింది. ప్రభుత్వం మొదట్లో దిగుమతులను కంట్రోలు చెయ్యకపోవటంవల్ల కూడ ఇవి బాగా పెరిగాయి. మొత్తంమీద విదేశీ మారకపు ధనం కొరత వచ్చింది. దానిని భర్తీ చేయటానికి, విదేశాలనుండి తెచ్చిన అప్పులు చాలకపోవటంవల్ల, మనకువున్న విదేశీద్రవ్యనిధులను పూర్తిగా వినియోగించవలసి వచ్చింది. ఈ ద్రవ్యనిధులు 1956-57 లో 280 కోట్ల రూపాయలు, 1957-58 లో 240 కోట్లు తరగిపోయాయి. తద్వారా మనకి వున్న స్టెర్లింగు నిల్వలు క్షీణించాయి.

| స్టెర్లింగు నిల్వలు | మార్చి 1956 | మార్చి 58 | ఆగస్టు 58 |
|---|---|---|---|
| (రూ. కోట్లు) | 746 | 267 | 187 |

ప్రథమ ప్రణాళికలో ఖర్చుపెట్టిన మొత్తంలో నూటికి 20 వంతులు మాత్రం లోటుబడ్జెటువిధానాలద్వారా ఖర్చు పెట్టబడింది. కాని ద్వితీయ ప్రణాళికలో అనుకొన్నదానికి వ్యతిరేకంగా, మొదటి మూడు సంవత్సరాలలోనే ఖర్చుపెట్టిన మొత్తములో నూటికి 40 వంతులకు పైగా ఈ విధంగా ఖర్చు చేకూర్చబడింది. మొదటి మూడు సంవత్సరాలలోనూ మొత్తం ఖర్చు రూ. 2456 కోట్లు. ఆ ద్రవ్యం ఈ క్రిందచూపిన విధంగా సేకరింపబడింది.

| | (రూ. కోట్లు) | మొత్తం ఖర్చులో శాతము. |
|---|---|---|
| మిగులు బడ్జెటుల ద్వారా | 439 | 17 |
| రైల్వేలు ఇచ్చినది | 129 | |
| దేశంలో చేసిన ఋణములు, చిన్న మొత్తముల పొదుపు ఉద్యమము మొదలయిన వాటిద్వారా | 533 | |
| | 1101 | 44 |
| మొత్తం ప్రజలు ఆదాచేసిన వాటినుండి విదేశీ సహాయం | 438 | 17 |
| లోటు బడ్జెటు విధానంద్వారా | 917 | 39 |
| | 2456 | 100 |

మొదటి మూడు సంవత్సరాలలోనే ఇంతడబ్బును "ధరలు పెరుగుటకు తోడ్పడే విధానాల ద్వారా" సేకరించి ఖర్చుచేయటంవల్ల ప్రభుత్వం పన్నులను ఎక్కువ చేయటానికి ప్రయత్నించింది. వివిధములైన ప్రత్యక్షపు పన్నులు వేసింది. వీటివల్ల ప్రయివేటు రంగం మీద పన్నులభారం అధికమయి అది అభివృద్ధి చెందటానికి అడ్డు పడుతోందని విమర్శలు వస్తున్నాయి. వీటిలో నిజానిజాలు ఎలా వున్నా, మన ప్రణాళికలు ప్రయివేటు రంగానికికూడ ప్రాధాన్యం యిచ్చినంతకూ వాటిఅభివృద్ధికి తోడ్పడేదిగా పన్నుల విధానం వుండాలి. రెండవది పన్నులు వసూలు చెయ్యటంలో అసమర్థత ఎక్కువవుతోంది; అవి చెల్లించటంలో అవినీతి ప్రబలుతోంది. ఈ పరిస్థితుల్లో ఎక్కువపన్నులు విధించిన మాత్రాన ఎక్కువ డబ్బు వసూలుకాక పోవటమే కాకుండా, 'అవినీతికి' అవకాశం ఎక్కువవుతోంది—అది శ్రేయస్కరం కాదు. పరోక్షపు పన్నుల భారం సామాన్యప్రజలమీదకూడ బాగా ఎక్కువయింది. ధరల పెరుగుదలకి ఈ రకం పన్నులుకూడ కొంతవరకు కారణ మంటున్నారు కొందరు పెద్దలు.

పైగా ప్రభుత్వం ఎక్కువఖర్చుపెట్టేకొలదీ దుర్వ్యయం ఎక్కువవుతోందని కొందరి అభిప్రాయం. అందుకై తృతీయ ప్రణాళికను సాధ్యమయినంతవరకు కుదించి ఆర్థికాభివృద్ధి ప్రయివేటు వ్యవస్థద్వారా సాధించేందుకు ప్రయత్నించాలంటున్నారు.

ద్వితీయ ప్రణాళికనే మరొక కోణంనుండి చూడవచ్చును. బడుగుదేశాలు ఆర్థికాభివృద్ధికై ప్రజాతంత్రయుత ప్రణాళికలు అమలు బరచేటప్పుడు, ముఖ్యంగా యంత్రసామగ్రికై విదేశాలపై ఆధారపడవలసినప్పుడు, ఇలాంటి యిబ్బందులు తప్పవు. వాటినిగురించి ముందుగానే జాగ్రత్తపడటం సాధ్యంకాదు. విదేశాలతో ఏవిధంగాను సంబంధంలేకుండా ప్రభుత్వ సామాజమాన్యంక్రిందనే పూర్తిగా వుండే దేశాలలో ఈ యిబ్బందులు రావు. అయినా గత 7 లేక 8 సంవత్సరాలలోను చెప్పుకోదగ్గ అభివృద్ధి కనపడింది. మొదటి ప్రణాళిక ఆరంభంలో నూటికి ఐదువంతులుమాత్రమే పెట్టుబడిపెట్టేవారం. కాని అది ప్రస్తుతం నూటికి 11 వంతులు అయింది. వ్యవసాయ రంగంలో మార్పులుతెచ్చి దాని ఉత్పత్తిశక్తిని చెప్పుకోదగ్గంత అభివృద్ధిచేశాము. విద్యుచ్ఛక్తి సప్లయిలోనూ, వాణిజ్య పరిశ్రమల రంగాలలోనూ, రవాణాసౌకర్యములు పెంపొందించటంలోనూ చెప్పుకోదగినంతగా పురోగమించాం. ఆర్థికవ్యవస్థ సత్వర పురోభివృద్ధికి అనుకూలంగా మారింది. ఈ పరిస్థితుల్లో తృతీయ ప్రణాళికలో ఎక్కువగా ఖర్చుపెట్టకపోయినచో ఇంతవరకు సాధించిన ఫలితాలన్నీ నిష్ప్రయోజన మవుతాయి. అంతకన్న అర్థరహితమైన కార్యముండదు.

అయితే ఈ ద్వితీయ ప్రణాళిక ఆచరణలో కలిగిన యిబ్బందుల మాటేమిటి అనవచ్చు. వాటిని కొంచెంతలు చేయటం ఒకవిధానం. కాని కొంతవరకు కారణం ప్రథమ ప్రణాళికలో వలసినంత ఆహారధాన్యాల ఉత్పత్తిని సాధించలేకపోవటం పెద్దలోటు. ద్వితీయ ప్రణాళిక—ఈ రంగంలో ఉత్పత్తి చాలినంత పెరిగిందనే భ్రమమీద తయారుచెయ్యబడింది. కాని 1955 నుండి అనుకూల వాతావరణం లేక పంటలు చెడిపోగానే మనసమస్యలు ఆరంభమయ్యాయి. ధరలు పెరిగాయి. అనుకోకుండా అమెరికానుండి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవలసివచ్చింది. దీనికై 360 కోట్లు ఖర్చుపెట్టాం. దానివలన అనుకొన్నట్లుగా ప్రణాళిక అమలు జరుగలేదు. ఈలోటును ఇప్పుడైనా భర్తీచేయగలిగితే తృతీయప్రణాళికను భారీఎత్తున ప్రారంభించవచ్చును. ప్రణాళికాభివృద్ధి వ్యవసాయరంగంలో మనం సాధించే అభివృద్ధిమీద ఎక్కువగా ఆధారపడి వుంటుందన్నమాట.

ఆదిలో ప్రణాళికబద్ధంగా అభివృద్ధి లేవాలనుకొన్నప్పుడు కొన్ని దీర్ఘకాలప్రయోజనాలను సాధించటానికి నిర్ణయింపబడింది. అవి: 1974 సంవత్సరమునకు వ్యక్తి ఆదాయమును రెట్టింపు చేయుట. వ్యవసాయరంగంలో భూమిపై ఒత్తిడిని తగ్గించుటకై ప్రస్తుత వృత్తివిధానాలలో తగినంత మార్పు తీసికొనివచ్చుట; భారీ పరిశ్రమలను అభివృద్ధిచేసి యంత్రసామగ్రి మొదలయినవాటికి విదేశాలమీద ఆధారపడకుండా ఉండుట; ఉద్యోగావకాశములను విస్తృతముచేయుట, ఆర్థిక అసమానత్వాన్ని తొలగించి, సోషలిస్టు తరహా సమాజనిర్మాణానికి కృషిచేయుట. వీటి సాధనకై ప్రణాళికాబద్ధంగా ఆర్థికాభివృద్ధి లేవాలని నిర్ణయించినప్పుడు ద్వితీయ ప్రణాళిక ఆచరణలో కలిగిన యిబ్బందుల దృష్ట్యా తృతీయ ప్రణాళికను కుదించివేయుట అవివేక మవుతుంది. ద్వితీయ ప్రణాళిలోని లోటుపాట్లను తర్వాత సరిదిద్దుకోవడానికి ప్రయత్నించాలి. పై ఆశయాల సాధనకై కృషి చేయాలంటే తృతీయ ప్రణాళికలో 9 లేక 10 వేల కోట్ల రూపాయలను ఖర్చుపెట్టాలి.

అయితే యింత మొత్తం సేకరించుట సాధ్యమా? ద్వితీయ ప్రణాళికలో అన్నివిధములా ప్రయత్నించి కొత్తపన్నులు ఎన్ని విధించినా, పన్నులద్వారా ఎక్కువ ధనమును సేకరించలేనుకదా ప్రభుత్వం అనే ప్రశ్నలు వస్తాయి. పెట్టుబడి ధనాన్ని సేకరించుట ప్రభుత్వ శక్తిసామర్థ్యాలపైన, దానికి తగినట్టి వ్యవస్థను నిర్మించి ప్రజలసహకారం సంపాదించుటమీద ఆధారపడివుంటుంది.

ద్వితీయ ప్రణాళికలో కనుపించిన ఈ లోపాన్ని తృతీయ ప్రణాళికలో సరిదిద్దాలి. కాని పెట్టుబడి రేటును మాత్రం తగ్గించుట వలన చాలా అనర్థాలున్నాయి. ముఖ్యంగా జనాభా సుమారు నూటికి రెండువంతులు చొప్పున ప్రతిసంవత్సరం పెరుగుతున్నప్పుడు వీరిలో కొందరికయినా ఉద్యోగావకాశాలు కల్పించాలన్నా, ప్రజల జీవన ప్రమాణాలను ఎక్కువ చేయాలన్నా పెట్టుబడి రేటు ఎక్కువ కావాలి. లేకుంటే సాంఘిక భద్రతకి రాజకీయసుస్థిరతకే భంగం వాటిల్లుతుంది.

అయితే తృతీయప్రణాళిక ఆశయాలేవిధంగా వుండాలి అనే ప్రశ్న వస్తుంది. జనాభా పెరిగే రేటు హెచ్చుతోంది. ఎంత ప్రయత్నించినా దీనికి తగ్గట్టు పెట్టుబడి రేటును ఈ బడుగుదేశాలు వృద్ధి చేయలేవు. అందుకై సాధ్యమయినంత కృషి చేసి పెట్టుబడి రేటును పెంచటమే కాకుండా, జనాభా పెరిగే రేటును కూడ తగ్గించటానికి కృషి చేయాలి. మొదటిది ఎంత అవసరమో రెండవదీ అంతే ముఖ్యం. ద్వితీయ ప్రణాళికలో ఈ ప్రయత్నాలలో అశ్రద్ధ చూపించారు. జనాభానిరోధకప్రయత్నాలమీద వెచ్చించిన మొత్తమే దీనికి నిదర్శనం. ద్వితీయ ప్రణాళికలో 0.1% కంటె దీనిమీద ఖర్చు చేయలేదు. తృతీయ ప్రణాళికలో కనీసం 10% అయినా దీనికై కేటాయించాలి.

ద్వితీయ ప్రణాళికలో కలిగిన యిబ్బందులకు మూలకారణం వ్యవసాయరంగంలో ఉత్పత్తి తగినంతగా పెరుగకపోవుటే. దీనిని సరిదిద్దటానికి తిరిగి తృతీయ ప్రణాళికలో ఎక్కువ మొత్తాన్ని వ్యవసాయరంగంలో అభివృద్ధికి కేటాయించాలి. ఈ సమస్య గురించి చర్చించేటప్పుడు కేవలం పెద్ద ప్రాజెక్టులమీద పెట్టే ఖర్చునే దృష్టిలో పెట్టుకోకూడదు. చిన్న చిన్న ప్రాజెక్టులు త్వరలో ఎక్కువ పంటకు దోహదం చేసేటట్లుగా నిర్మించాలి. కొత్తవి నిర్మించేటప్పుడు పాత చెరువులు, బావులు మొదలయిన వాటిని అశ్రద్ధ చెయ్యటం కద్దు. వాటిని మరామత్తు చేయించటానికి, చవకగాను, విరివిగానూ మంచివిత్తనాలు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు సామాన్యరైతులకు అందుబాటులో వుండేటట్లు చూడాలి. భూసంస్కరణలను ప్రతిష్ఠగా అమలుపరచాలి. ఈ సంస్కరణ పూర్తిఫలితాలను పొందాలంటే—సహకార వ్యవసాయం అవసరం అవుతుంది. ఇంతవరకూ పల్లెటూళ్ళలో అధికారం చెలాయించే భూస్వాములు దీనికి వ్యతిరేకిస్తారు—కారణం ఇవి చిన్నరైతులను తమ అధీనంలోనుండి తప్పించి వారిని ఆర్థికంగా బలపరుస్తాయి కనుక. ఈ సహకార వ్యవసాయపద్ధతులు చిన్నరైతులలో నూతనోత్తేజం కార్యదీక్షను, ఎక్కువ పరిశ్రమను ప్రేరేపించేటట్లుగాను, తత్ఫలితంగా వారికి ఎక్కువ ఆదాయాలు వచ్చేటట్లుగాను వుండాలి. తగిన పట్టుదలవున్న ఇలాంటి కార్యక్రమాన్ని అమలుపరచటం అసాధ్యంకాదు—కష్టమైనా. ఈ సందర్భంలో శ్రీ బల్వంతరాయ్ మెహతా కమిటీ సూచనలు అమలుపరచ ప్రయత్నించాలి. లేకపోతే 'బ్యురాక్రసీ' మాత్రం పెరిగి ఈ వ్యవస్థే కుంటుపడి ఏ విధంగాను సత్ఫలితాలను ఇవ్వదు. మూడవప్రణాళిక విజయానికి ఇవి పునాదులు అవుతాయి.

తృతీయప్రణాళికలో ద్వితీయ ప్రణాళికవలెనే నూనె, అటామిక్ పరిశ్రమలు, రవాణా సౌకర్యములమీద చాలా ఎక్కువగా వెచ్చించవలసి వస్తుంది. చేతి, లఘు పరిశ్రమలను ప్రోత్సహించటానికి ద్వితీయప్రణాళికలో ఫ్యాక్టరీలమీద నిబంధనలు పెట్టారు. వాటిని సడలించి నిత్యజీవిత అవసరవస్తువులను ఫ్యాక్టరీలద్వారా కూడ ఉత్పత్తి ఎక్కువగా చేయటానికి అవకాశమివ్వాలి. లేకపోయిన భారీపరిశ్రమలలో ఉత్పత్తి అయినవస్తువులు నిరుపయోగమవుతాయి. తర్వాత ముఖ్యముగా ఆయా ప్రాంతీయ అవసరాలు అక్కడ దొరికే సంపదలనుబట్టి లఘుపరిశ్రమలను దేశవ్యాప్తంగా పెట్టాలి. అనేక కారణాలవల్ల అవి ఇంతవరకు వ్యాప్తిచెందటం లేదు. తృతీయప్రణాళికలో ఇవి అభివృద్ధి అయేటట్లు చూడాలి. లేకపోతే గ్రామీణ జీవనాభివృద్ధి త్వరితగతిని తేలేము. లఘు పరిశ్రమల స్థాపనకు చేతిపరిశ్రమల అభివృద్ధికి—చిన్నయంత్రాలను దేశంలో సృష్టించటమో లేక విరివిగా దిగుమతిచేసికోటమో జరగాలి. వీటన్నిటిమీద ఖర్చు పెట్టాలంటే చాలా మొత్తం కావాలి. మూడవప్రణాళిక తప్పనిసరిగా భారీఎత్తున ఉండాలి.

వీటన్నిటికీ కావలసినధనం ఎక్కడినుండి వస్తుంది? విదేశ సహాయంమీద ఎక్కువ ఆధారపడలేము—గాని తృతీయ ప్రణాళికలో వెయ్యికోట్ల రూపాయిలవరకు ఈ రకమైన సహాయాన్ని ఆశించవచ్చు.

పోతే, పన్నులమూలంగా ఎంతవరకూ ధనాన్ని సేకరించవచ్చునో పరిశీలించాలి.

వ్యవసాయరంగం చూస్తే—గ్రామీణ వ్యవస్థలోని ఉత్పత్తి జాతీయాదాయంలో నూటికి 70 పాళ్ళు అయినా, పన్నుల

మొత్తంలో ఈ రంగం నూటికి 40 పాళ్ళు మాత్రమే ఇస్తోంది. తర్వాత ప్రస్తుతపు భూమిపన్ను పెరిగేసరిలతో సమానంగా పెరగటంలేదు, అంటే ఇది ఏ విధంగానూ వ్యక్తుల ఆర్థిక శక్తినిబట్టి విధింపబడటం లేదన్నమాట. ఐదు ఎకరాలకన్న ఎక్కువభూమిని కలిగినవారు పదోవంతు రైతులు అయినా, వీరిచేతుల్లోనే 5/6 వంతు భూమి వుంది. ఇలాంటివారిమీద భూమిశిస్తును ఎక్కువచేస్తే చెప్పుకోతగ్గంత అదనపుసొమ్ము వసూలు అవటమేకాకుండా 'ఆర్థిక సమానత్వా'నికి అనుగుణంగాకూడా వుంటుంది. తర్వాత రైతులు భూయజమానులకు చెల్లించే 'కౌలు' మీద పన్ను విధించటం సమంజసం. ఈ పన్నుభారం భూస్వామిమీద పడేటట్లు చూడాలి. దీనివలన గుత్తేవారిమీద భారం ఎక్కువ అవదు కనుక వారికృషినితగ్గించదు. పన్నులవిచారణ సంఘంవారుతమ నివేదికలో ఒకముఖ్యమయినవిషయాన్ని వ్యక్తపరిచారు. పల్లెటూళ్ళలో ఎక్కువ ఆదాయాలువచ్చేవారికన్న తక్కువఆదాయాలుకలవారిమీదే పన్నుల భారం ఎక్కువగా వుందని. ఆదాయాలతోబాటు పన్నులరేటు పెంచే మాట అటుంచి, కనీసం అన్ని వర్గాలనూ సమానంగా భారం భరించేటట్లు చేయాలన్నా అధిక ఆదాయాలు వచ్చేవారిమీద అదనపు పన్నులు విధించటం అవశ్యం. కాని ఈ అదనపు పన్నులు విధించటంలో గమనించతగిన విషయమొకటి వుంది—ద్వితీయ ప్రణాళికలో సాధించదలచుకొన్న వ్యవసాయాభివృద్ధికి ఏ విధంగాను భంగం కలుగకూడదు.

ఆదాయపుపన్నులకోవకు చెందిన పన్నులు మొత్తం జాతీయాదాయంలో నూటికి పదివంతులను మాత్రమే స్పృశిస్తున్నాయి. మిగిలిన 90 పాళ్ళ మీద ప్రత్యక్షపు పన్నులు లేవు. ఈ ఆదాయం మీద అటువంటి పన్నులు వేయటంకూడా దుర్లభం. ముఖ్యంగా వ్యవసాయరంగంనుండి వచ్చే ఆదాయంమీద మరీ దుర్లభం. అందుకని పరోక్షపు పన్నులను అదనంగా విధించాలి.

ఇవి ముఖ్యంగా శ్రీమంతుల వినోదవస్తువులమీద, వారి తదితర సుఖాలకు పనికొచ్చే వస్తువులమీద ఎక్కువగా పడాలి. తర్వాత అవసరవస్తువులమీద కూడా వీటిని వెయ్యాలి. లేకపోతే తగినంత ధనం రాదు. ప్రజలు కొద్ది పన్నుల భారం—ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలవల్ల వచ్చే లాభాల రెంటిమధ్య—రెండవ దానిని బాగా గ్రహించేటట్లుచేయాలి. అంటే కొంత పన్నుల భారాన్ని స్వీకరించడానికి సిద్ధపడాలి—అప్పుడే ప్రభుత్వం ఈ విధంగా ఎక్కువ ధనాన్ని కూడబెట్టగలదు. ఈ రకం పన్నులవల్ల ప్రజల వినిమయం కూడా తగ్గి ఆదాచేయటానికి తోడ్పడుతుంది. ఈ దేశాలలో అదనపు ఆదాయం రాగానే, అసలే చాలా తక్కువ జీవన ప్రమాణాలు కలిగివున్నారు కనుక, ఖర్చు పెట్టాలనే ఆతురత చూపిస్తారు. ఆర్థికాభివృద్ధికోసం ఈ ఖర్చును ప్రస్తుతం తగ్గించి ఆదాచేసి అభివృద్ధి ప్రణాళికలకు దోహదం చెయ్యటం అవసరం.

ఈ విషయాలు చర్చించేటప్పుడు ప్రభుత్వం 'ఆదాయం గ్రూపు'లో పన్నుల రేట్లను ఎక్కువచేయాలి. కారణం ఆదాయం మీద పన్ను ఎక్కువ చేయలేకపోయినా, మరణసుంకం, సంపద పన్ను, ఖర్చుమీద పన్ను వీటిని ఎక్కువచేయాలి. లేకపోతే ఈ భారం లేనివారిమీద పడుతుంది. అది ఆర్థికన్యాయం కాదు. అలాగే రాష్ట్రప్రభుత్వాలు పరోక్షపుపన్నుల రేట్లను, అవి విధించవలసిన వస్తువులను ఎక్కువచేయాలి. తర్వాత వ్యవసాయ రంగంలోని ఆదాయం మీద పన్నులువేయాలి. లేకపోయిన ఈ రంగంలో "అసమానత్వాన్ని" పెంచినట్లే అవుతుంది. వాణిజ్య పంటల మీద ఎక్కువ పన్నుల భారం మోపటానికి యింకా అవకాశముంది. ఇలాంటి మార్పులవల్ల ద్వితీయప్రణాళికకి కావలసిన మొత్తంలో చాలా భాగం రాబట్టవచ్చు. ఈ సందర్భంలో పెట్టుబడిదారుల "పన్నుల భారం" అనే కేకల కన్నా సామాన్య ప్రజల మీద భారాన్ని మాత్రం గుర్తుపెట్టుకొని తగిన సవరణలు చేయాలి.

పన్నుల ఎగవేత మన దేశంలో చాల ఎక్కువగా వుంది. అందరూ తలోకవిధంగాను ఈ విధంగా నష్టపోయే ధనాన్ని లెక్కవేశారు. అది 150 కోట్ల మొదలు రూ 600 కోట్ల వరకూ వుంది. ఏమయినా పన్నుల వసూలు విధానాలను కొంచెం కచ్చితంగా అమలు పరచిన—దీనివల్ల కనీసం రూ 100 కోట్లు అయినా ఎక్కువ ధనం రావచ్చు. అంటే చాలా అదనపుపన్నుల అవసరం లేకుండా చెయ్యవచ్చును. ప్రజలమీద భారాన్ని తగ్గించవచ్చు. ఈ విధంగా చూస్తే దేశద్రోహులు పన్నులు ఎగకొట్టేవారే నన్నమాట. వీరిని ఈ విధంగా చూసి ప్రభుత్వం పన్నుల వసూలును కచ్చితంగా అమలుపరిస్తే అపరిమితమైన లాభం కలుగుతుంది. తక్కిన సంస్కరణల కన్న ఈ సంస్కరణ చాలా ప్రధానమైనది. దేశాభివృద్ధి కాంక్షించేవారు మాత్రం ఈ విషయంలో ముభావంగా వుండకూడదు. అప్పుడు ద్వితీయ ప్రణాళికను భారీ ఎత్తున నిర్వహించటం ఏమంత అసాధ్యమైన పనికాదు.

ప్రభుత్వపు రెవిన్యూ చాలా భాగం అభివృద్ధికి ఉపయోగం కానివాటిమీద ఖర్చు అవుతోంది. ఈ ఖర్చు తగ్గించాలి, కనీసం పెరగకుండా చేయాలి. వివిధ కారణాలవల్ల ఇంతవరకు ప్రభుత్వం ఆ పని చేయలేకపోయింది. ఇప్పుడైనా అశ్రద్ధ వహించకూడదు. ధనవ్యయంలో చాలా శ్రద్ధ వహించాలి—అంటే "వృథా" కాకుండా చూడాలి. వీటన్నిటికి ఒక రకమైన

అర్గనైజేషన్, త్యాగబుద్ధితో ముందుకు వచ్చే ప్రజలు, శక్తి కొలదీ పని చేసే పార్టీ సభ్యులు, "స్వంతలాభాన్ని" ప్రక్కకు పెట్టి దేశం కోసం పాటుపడే నాయకులు కావాలి. ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి అయిన దేశాలు ఈ అంగాలను ముందు సృష్టించుకొన్నాయి. మనం ఇప్పుడైనా ఆలసించక ఆ రకం ముందు తయారుచేసికొని తృతీయ ప్రణాళిక ఆరంభించాలి. ఈ విషయంలో అశ్రద్ధ చూపటంవలననే చాలచోట్ల ప్రభుత్వఖర్చులలో "దుబారా" కనిపిస్తున్నట్లు ఆడిటర్ల రిపోర్టుల్లో కనపడుతోంది.

దేశాభివృద్ధికి ప్రజలు ఆయత్తులయ్యేటట్లు చేయాలి. దానికి తగిన "త్యాగం" చేయటానికి సంసిద్ధులుగా చేయాలి. కష్టాలు లేకుండా, శ్రమకలుగకుండా అభివృద్ధిరాదు. ఏ దేశం అల్లా అభివృద్ధి చెందలేదు. ఆ విధమైన "మానసికతత్వం" ముందు అలవర్చాలి. ప్రణాళికలను ఆచరణలో పెట్టేవారు ముందుగా అలవర్చుకోవాలి. దీని ప్రాముఖ్యం యింతకన్న నొక్కి చెప్పలేం. కొంతమంది భూసైన్యంతయారుచేసి పోరంబోకులను, బంజరు భూములను సాగులోకి తేవాలని సలహాలిచ్చారు. అవి ఏవర్గాలవారినుండి వచ్చినా ఆచరణలో పెట్టతగ్గ సలహాలు. ప్రభుత్వం వాటిని పరిశీలించటం ముఖ్యం. యుద్ధకాలంకోసం నిత్యమూ పెంచిపోషిస్తున్న సైనికదళం, జాతీయ సైనికదళం మొదలైనవాడు వున్నారు. వారిని అభివృద్ధి కార్యక్రమాలకోసం వినియోగించే మార్గం ఆలోచించలేకపోవటం శోచనీయం. 'సైనికదళం' కనుక యుద్ధాలుచేయటానికే, అనుకోకుండా, దేశాన్ని తిరాల్చించి పీడిస్తున్న దారిద్ర్యం మీద 'యుద్ధం' చేయటానికికూడ ఉపయోగించటం సమంజసం. స్వీడన్ లాటి దేశాలలో ఈ 'స్టాండింగ్ ఆర్మీ' తక్కువే—అంటే దానిమీద ఖర్చుతక్కువే అవుతుంది. కాని ప్రతివారికి అంటేశిక్షణ యిస్తారు. మనం కొంతవరకు దాన్ని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తున్నాం—వారందరినీ దేశోపయోగ కార్యక్రమాలకి ఎక్కువగా ఉపయోగించుకోవాలి.

ఈ ప్రణాళిక స్వరూపం నిర్ణయించేముందు ఒక ప్రధాన విషయం గుర్తుపెట్టుకోవాలి. కొందరు 'ఆర్థిక సమానత్వం'—'జాతీయ సంపదలో పెరుగుదల' ఈ రెంటిని ఏకసారి సాధించలేం అంటున్నారు. 19వ శతాబ్దంలో పాశ్చాత్యదేశాలు ప్రయివేటు పెట్టుబడిమీద ఆధారపడి అభివృద్ధి చెందాయి. అప్పుడు ఆర్థిక అసమానత్వంకూడ పెరిగింది. అదేవిధంగా సంపదను అభివృద్ధిచేయాలంటే మనం "సమానత్వం"కోసం ప్రాకులాడకూడదని అంటున్నారు. కాని అప్పుడు సామాన్య ప్రజకి రాజకీయంగా సమానావకాశాలు యివ్వలేదు. వారికి ఆర్థికాభివృద్ధి—దానివలన కలిగే శ్రేయస్సు గురించి తెలియదు. కాని నేటప్రజలకు అది తెలుసు. ఏ పేరుతో పిలిచినా, సమానావకాశాలు, ఆర్థికంగా తన శ్రేయస్సు పెరగాలని ప్రతివ్యక్తి ఆశిస్తున్నాడు. దానికై పోరాడుతాడు. మనం రాజకీయంగా సమానత్వాన్ని యిచ్చాం. కాని ఆర్థికంగా 'అది ఇవ్వకపోతే,' 'ఆర్థిక సమానత్వంకోసం' పోరాడమని అతన్ని ప్రోత్సహించినట్లే అవుతుంది. ప్రస్తుతపు ప్రజాస్వామ్య ప్రభుత్వాలు 'ఆర్థికాభివృద్ధిని' సామాన్యప్రజలకు కలిగించకపోతే, ప్రజలే దాన్ని సాధించటంకోసం పెనుగులాడుతారు. అప్పుడు ఆ ప్రజాస్వామ్య సంస్థకే ముప్పు వాటిల్లుతుంది. మిర్డాల్ అన్నట్లు 'ప్రజాస్వామ్యం' నిలపెట్టాలంటే రాజకీయ ఆర్థిక సమానత్వాలు అవసరం. అది ఇవ్వలేని ప్రభుత్వాలు సుస్థిరంగా నిలవలేవు.

# అశ్వహృదయం

## శ్రీ భారతీప్రియ

ఒకర్నొకరు ఎగాదిగా చూసుకొన్నారు.

గురుతు చిక్కినట్టు తోచలేదు.

అయినా ఎక్కడో చూచినట్టు మసక మసకగా జ్ఞాపకం; మనస్సులోని లోతుల్లో సన్నని గుసగుస.

స్మృతి గత కాలపు మబ్బులలో దోబూచు లాడుతున్నది.

మొదట మాట్లాడింది వాడే.

"మనం ఎక్కడో కలుసుకున్నట్టు జ్ఞాపకం."

"నాకూ అలాగే తోస్తుంది."

"ఎక్కడై ఉండవచ్చు?"

"సరిగా గుర్తు లేదు; నేనూ అదే ఆలోచిస్తున్నాను."

"నీవు కొల్హాపురంలో ఉన్నావా?"

"ఔను. ఉన్నాను. బహుశా అక్కడే మనం ఒకర్నొకరం చూచుకొని ఉంటాము."

"ఉండవచ్చు. కొల్హాపురంలో రాజా ముఖీరామ్ తెలుసా?"

"ఓహో! చాలా బాగా తెలుసు. నేను వాళ్ళ ఇంట్లోనే ఆరునెలలున్నాను."

"నేను నిన్ను అక్కడే చూశానేమో!" "అదే అయి ఉంటుంది; నాకూ అలాగే తోస్తుంది."

"నీవు పూనా వచ్చి ఎన్నిరోజులయింది?"

"సుమారు మూణ్నెళ్ళు."

"మూణ్నెల్లా! అప్పటినుంచీ ఎక్కడా కనిపించనే లేదే?"

"నేను అంతగా వెలుపలికి వెళ్లడం లేదు. ఇది నాకు కొత్త చోటు. ఇవ్వల వెలుపలికి వస్తున్నాను. అంతేకాక కొంచెం తర్ఫీతు వేరే పొందుతున్నాను."

"మంచిపనే. బస ఎక్కడ?"

"నానాసాహెబ్ గారి యింట్లో."

"నానాసాహెబా?"

"ఔను; ఎందుకలా అలా అడుగుతున్నావు? నీకు అయన పరిచయమా?"

"ఆయన నా యజమాని దాయాది."

"మీ యజమాని ఎవరు?"

"కాకాసాహెబ్. నీకు తెలుసా?"

"విన్నాను. వారికీ, వారికీ చాలా ద్వేషమట."

"ఉండవచ్చు: కాని, దానికీ మనకూ ఏమీ సంబంధం లేదుకదా!"

"ఏమీ లేదు."

"నిన్ను మళ్లీ చూడడం నాకు చాల సంతోషమైంది."

"నాకూ అంతే."

కొననాలుక మాటకాదు; నిజంగా హృదయంనుంచి వచ్చిన మాట అని మనస్సుకు తట్టింది. అలాగే ఒక క్షణం తన కొత్త స్నేహితురాలిని తేరిపార చూచాడు. వెన్నవంటి మన్నని దేహం; దానికి అనుగుణమైన నవనవ; ముద్దైనముఖం; కళ్లల్లో ఇంకా లేత దనపు కాంతి; గంభీరమైన నిలవడం; ఆ రూపుకు మైకావలిగా లజ్జ. ఒక్కసారి చూస్తే వెన్నెలవంటి ఆ చెలువాన్ని వదలి మరొకవైపు చూపు మరల్చడానికి మనస్సు రాదు.

కొత్తచెలిమి చల్లని వెలుగులో ఇద్దరూ క్షణకాలం మౌనంగా ఉన్నారు.

నౌకర్లు వచ్చి ఒక్కటిగా నిలబడి ఉన్న గుర్రాలు రెంటినీ విడివిడిగా తీసుకొని వెళ్ళారు.

దేహం దూరమైతే నేమి! మనస్సు దగ్గరకు వచ్చింది.

## 2

ఒకదాని పేరు రాజ, మరొకదాని పేరు రాణి. వాటి యజమానులూ నౌకర్లూ ప్రీతితోను, సులువుకోసమూ పిలిచే పేర్లవి. అయితే వాస్తవమైన లోకానికి తెలిసిన పేర్లు వేరే. ఒకటి "ప్లేయింగ్ ప్రిన్స్", మరొకటి "డెక్కన్ క్వీన్". రెండూ పేరు ప్రఖ్యాతి పొందిన పందెం గుర్రాలు. రాజా భారీ భారీ పందేల్లో గెలిచి కీర్తి శిఖరాన్ని ఎక్కింది. దానిని కొని, సాకి, తర్ఫీదు ఇవ్వడానికి కాకాసాహెబ్ లక్షాంతరంగా డబ్బు వెచ్చించాడు.

రాణి ఇవ్వల కీర్తికాంతిలోకి వచ్చింది. ఇంకా లేతవయస్సు. చూడడానికి సౌమ్యంగాను, సుందరంగాను కనిపించినా, రేస్ కోర్సులో దాని చలాకీని చూచి పెక్కుమంది వెరగుపడిపోయారు.

దాని వేగం, చురుకుతనం, అణకువ చూచి కాకాసాహెబ్ కు లోలోపలే కడుపు రగులుతూ ఉంది. తన దాయాది ఇలాంటిసొగసైన గుర్రం సంపాదించాడు కదా అని ఒకవైపు అసూయ; తన రాజాతో పోటీకి ఇంకొకటి వచ్చిందికదా అని మరొకవైపు మంట. ఈ యోచన రాత్రీ పగలూ అతని మెదడును తినివేసేది. నానాసాహెబ్ కూ అలాగే నానాటికి పెరుగుతున్న రాజా కీర్తి చూచి దాయాదిపై ద్వేషం ఇనుమడించింది; లోపల మాత్సర్యం ముమ్మరం కాసాగింది.

రెండుగుర్రాలూ రేస్ కోర్సులోను, క్లబ్ దగ్గరా అప్పుడప్పుడు భేటీ అవుతూ వుండేవి. అపురూపమైనా మావగాని ఈ పరస్పర సందర్శన సామీప్యాలవల్ల అవి చాల సంతోషపడ్డాయి. ఒకదాని చూపు మరొకదాని చూపుతో అకస్మాత్తుగా మెరుపులాగ కలిసినప్పుడు రెండిటి ఒళ్ళూ జలదరించేది; ఒకదాని ఒళ్ళు మరొకదానికి అనిరీక్షితంగా తాకినప్పుడు వెంటనే ప్రపంచమే మరపువచ్చేది; హర్షం వర్షంగా కురిసేది; కొత్త ప్రపంచమే కళ్ళముందు కలకల నాట్యమాడేది. నవలెత్తిన ఈ స్నేహం రెండింటి జీవితంలో కమ్మని తావులను కమ్మజేసింది. నూతన విలాసం సంతరించింది.

## 3

పందెంరోజు సమీపించింది. రెండు గుర్రాల మీదా పందెగాళ్ళు భారీగా పందెం ఒడ్డారు. రెండిటికీ బాగా తరిఫీదు ఇచ్చేవారు. రాజా గెలిస్తే ఒక అసే తనకు లభిస్తుందని కాకాసాహెబ్ ఆలోచిస్తే, రాణి గెలిస్తే తనకొక లిచ్చే దొరుకుతుందని నానాసాహెబ్ మనస్సులోనే 'మండిగలు' వండుకొంటున్నాడు. జూదగాళ్ళ స్వభావానుసారంగా పందెం రోజు సమీపించిన కొద్దీ కాకా, నానా మహోత్సాహోద్వేగాలతో త్రుళ్ళిపడుతున్నారు.

ఒకరోజు రేస్‌కోర్స్‌లో రాజా, రాణి అకస్మాత్తుగా కలుసుకొన్నప్పుడు ప్రసంగవశాత్తు ఈమాట వచ్చింది. ఈమాట ఎత్తడం ఔచిత్యం కాదేమోనని రెండు శంకిస్తూ ఇన్నాళ్ళూ ఊరకే ఉన్నాయి. కాని ఈసారి ఊరుకోక రాజాయే మాట మొదలు పెట్టింది.

"పందెం అంటే ఈ జనం తల ఎలా చెడిపోతుందో చూచావా ?"

రాణి జవాబు చెప్పక ఊరకే ఊకొట్టింది.

"పైసలు, పేరు, పట్టుదలా - ఇవే ముఖ్యమా ?"

"మనుష్యులలో అంతేనని తోస్తుంది."

"దానికంటె మిగిలిందీ, ముఖ్యమైందీ లేదా ?"

"ఉంది - స్వార్థం !"

"చక్కగా అన్నావు; దానిలోనూ ఎంత పైపోటీ !"

"అది ఆరురాశి, స్వార్థాల సంతు."

"నిజం; అన్నట్టు, హెచ్చుతగ్గుల గుద్దులాట చూచావుకదూ?"

"అది వారికే తగును."

"అందుకోసమే మనకీ త్రిప్పట కాబోలు! మనం వారి ఆశలు ఈడేర్చే సాధనాలు మాత్రమే."

"ఔనౌను; కావలసినప్పుడు మనమీద వెయ్యార్ల రూపాయలు కురిపిస్తారు. కొట్టినప్పుడూ, మనం కొంచెం ఉపయోగపడక పోయామా గడ్డిపోచకంటే కదా. మన కర్మ."

"కర్మా! అదెలాటి కర్మ? దాన్ని చూస్తే ఒళ్లు చిట చిట లాడుతుంది."

"అయినా గత్యంతరం లేదుకదా?"

"ఔను; ఈ తలక్రిందుల సృష్టి సరిగ్గా అయ్యేవరకూ మరొక ఉపాయమూ లేదు; ఉపశాంతమూ లేదు. అంతవరకూ..."

మాట అంతకే ఆగిపోయింది. యథాప్రకారం సాకలవాళ్ళొచ్చి, ఒంటికి ఒళ్ళు తోమించి, మూతిపై మూతి ఆనిస్తూ నిలబడిన గుర్రాలను విడదీసి తోలుకొని వెళ్ళారు.

## 4

ఈరోజు పందేలు. సాహెబ్ సోదగలకు ఎక్కడాలేని తమకం; మనస్సులో కసమసం; ఎప్పుడా ఎప్పుడా అని తటపట లాడే గుండె. తామే లాయాలకువెళ్ళి తమ గుర్రాల వీపు చరచి మాటలతో ఉత్సాహపరిచారు. సాకర్లు గుర్రాలకు మంచి దాణా వేసి, బాగా మాలిష్ చేసి జీను తగిలించి తయారుచేశారు.

సాయంకాలం నాలుగు గంటలకు పందేలు ప్రారంభమయాయి. రేస్‌కోర్సులో కాలుపెట్టడానికే సందులేని జనం కిటకిట. నేటి పందెంలో రాజా, రాణి పరుగెత్తుతాయనే సంగతంతా అందరికీ సంతోషోత్సాహాలు కలిగించింది. వాటి పరుగును చూడడానికి వేలాదిగా జనం వచ్చారు. ముందున్న స్థానాలలో అప్పుడే ఒకవైపు నానా, మరొకవైపు కాకా తమ తమ పరివారంతో కూచున్నారు. రేస్‌కోర్సు అంతటా వ్యాపించిన జనం కోలాహలం నేటి ఉత్సాహానికీ, నిరీక్షణకూ దర్పణమైంది.

ఏడెనిమిది పేరుమోసిన గుర్రాలు పందెంలో దిగాయి. విశాలంగానూ, వృత్తాకారంగానూ ఉన్న ఆ మైదానంలో ఎక్కడ చూచినా జనమే, ఎక్కడ విన్నా గుర్రాల గొడవే. పందెం వేడి జనానికి అప్పుడే సగం ఎక్కింది. పరుగెత్తుతున్న గుర్రాలను అంటిపెట్టుకొనే ఉంది జనం చూపు. మధ్య మధ్య గుర్రాల సకిలింపులు; సమగతిలో లయబద్ధంగా వినిపిస్తున్న గిట్టల ధ్వని; అశ్వహృదయాన్ని ఆకళించుకున్న జాకీల హెచ్చరింపుల ధ్వని; జనసమ్మర్దపు ఒకే గొంతుకల పొలికేకలు—వాతావరణాన్ని వేడెక్కించాయి. ఆయా గుర్రాల యజమానులూ, వాటిపైన పందెం కట్టినవారూ అప్పుడప్పుడు లేచి నిలబడుతూ తమ గుర్రాలను పేర్లతో పిలుస్తూ ప్రోత్సహిస్తున్నారు.

నిమిష నిమిషానికీ వేగం హెచ్చిస్తూ ముందు పరిగెత్తుతున్న రాజా జనుల ఈ ఆనంద కోలాహలాన్ని గుర్తించకపోలేదు. కాని, మరొకవైపు దృష్టిపెట్టే పురసత్తు దానికేది? తన లక్ష్యం సాధించి కృతకృత్యం కావడానికి అది తక్కిన గుర్రాలన్నిటినీ ఒక్కటొక్కటిగా వెనక్కు వేస్తూ ముందుకు సాగిపోతున్నది. దాని ఈ పరుగు పెరుగుతూ పోయినకొద్దీ రకరకాల కేకలన్నీ ఒక్కటే అవుతూ వచ్చాయి. "రాజా! రాజా!" అని అందరూ కేకలు వేయసాగారు. రాజా అన్ని గుర్రాలకన్నా ముందుగా వచ్చే సూచన స్పష్టమవుతూ ఉంది.

రాజా మనస్సు తన లక్ష్యంమీదే కేంద్రీకృతమైంది; జన సందోహంలో అగ్గలమైన కేకలు దాని చెవిలో ఏమీ పడడం లేదు. దానిపై స్వారీఅయిన, జాణ అయిన జాకీ మాటలతో హుషారిస్తున్నాడు. ఒళ్ళు గాలిలో తేలిపోతున్నది; వేగం క్షణక్షణానికీ ఎక్కువవుతూ ఉంది; ఎగఊపిరి, దిగఊపిరి; ముకుపుటాల్లోనూ, నోట్లోను నురుగులు కురుస్తున్నాయి; మనస్సు ఏకాగ్రమైంది. ఎప్పుడూ కనివిని యెరుగని, అనన్యాదృశమైన రాజా తలవదము త్కృతిని చూచి జనం పెద్దపెట్టున జయఘోష పెట్టింది.

ఈ స్థితిలో ఉన్నదున్నట్టుగానే రాజా మనస్సు కించిత్తు సడలి పక్కకు పార్లింది. పక్కన ఎవరో వచ్చినట్టు తోచింది. పరిచితమైన ఆ గిట్టల చప్పుడు ఎవరిది? ఎవరిది ఆ అలవాటయిన ఆమేని వాసన? రాజా చిత్తం ఒక్కక్షణంలో చెదిరిపోయింది. జాకీ హెచ్చరికనుగూడా అది లక్ష్యపెట్టక మెరుపు మెరిసినంత కాలంమాత్రం అది పక్కకు చూపు సారించింది.

రాణి! తను ఊహించినట్టుగానే రాణి! ఇంకెవరికి సాధ్యం ఈ చమత్కారమైన పరుగు; ఈ గంభీరమైన పదాఘాతం; ఈ మృదుచపలగతి? రాణి సరాసరి తనపక్కకే వచ్చివేసింది; తనవైపే చూస్తున్నది.

ఒక్కక్షణం రెండింటి చూపూ చేరింది.

ఎంత ఉత్సాహపడుతున్నది ఈ పరుగులో రాణి! అయితే, తనవేగంముందు దానివేగమా? తన పరుగుకు దాని పరుగు సాటా? తన గెలిచి దానికుండా? తాను గెలిచి రాణి ఓడిపోతే? ఎలాంటి ఆలోచన! ఎంత స్వార్థం! ప్రేమ స్వార్థరహితం కదా? అయితే కర్తవ్యం? ఏది గొప్పది - ప్రేమా? కర్తవ్యమా? తన జీవనసఖికి పరాజయమా? ఈ పరాభవాన్ని అది సహించగలదా? సహించినా, సహించవచ్చు. అయితే, నేను సహించడం ఎలాగా? దాని ఓటమి తన—ఓటమి; దాని పరాభవం తన ఆత్మకు అవసానం...కాదా? ఈ కర్తవ్యానికి ప్రేమను బలిపెట్టాలా? రాణి దీనదృష్టి మనస్సును కరిగించేట్టు ఉందికదా? తనవల్లగాదు...కాని, కర్తవ్యలోపం అయితే? స్వామిద్రోహమైతే? కర్తవ్యం...ప్రేమ...

మనస్సు ఈ సందిగ్ధావస్థలో ఒక్కక్షణంలో చిక్కుకొని తికమక అయింది; గుండె దిటవు చెడిపోయింది. పరుగులోని వడి సడలి మనస్సు ఈ కలవరంలో కొట్టుకుంటున్నప్పుడు శరీరం తన కర్తవ్య నిర్వహణంలో కొద్దిగా లోపంచేసింది; పట్టు తప్పింది; కుడికాలు కుసిపడింది. దానినుంచి మెలకువతో తప్పించుకొనే శక్తి తనకు ఉండీ లేనట్టు, రాజా, ఆ జనసముద్రపు మహాకోలాహలంలో, తన పైని జాకీతో సహా దభీమని నేలపై పడి పొర్లి, స్పృహ తప్పిపోయింది.

లక్ష్యం చేరడానికి ఇక నాల్గే బారలదూరం ఉంది.

## 5

గెలిచిన సంతోషం రాణికి కొంచెం కూడా లేదు. రాజాకు కలగవలసిన గెలుపు తనకు కలుగడం దానికి సంతోషం కలిగించలేదు; ఇమ్మడిగా సిగ్గు కలిగించింది. తనకోసమే రాజా ఈ కీర్తి వదులుకొందని రాణికి పూర్తిగా మనసుకు తెలిసిపోయింది. ఈ తెలివిడి దాన్ని కత్తులు, కటార్లతో పొడిచినట్టయింది.

రేస్‌కోర్సునుంచి చాలమంది వెళ్ళిపోయారు. అక్కడా అక్కడా కొంతమంది తిరుగాడుతున్నారు. కొంచెంసేపు ముందు జనసమూహంతో కిటకిటలాడుతున్న మైదానం ఇప్పుడు వట్టి బోడుగా కనిపిస్తున్నది. పందెంలో పరిగెత్తిన గుర్రాలన్నీ రేస్‌కోర్స్ ఆవరణంలో విడివిడిగా గుడారాల్లో విశ్రాంతి తీసుకుంటున్నాయి. పందెంలో గెలిచిన రాణి కూడా వాటిలో ఉంది. దానికి చాల ఉపచారాలు జరుగుతూ ఉన్నవి. నానాసాహెబే ఖుద్దున వచ్చి, దానిని మెచ్చుకొని ముద్దుపెట్టుకొని వెళ్ళాడు. ఇద్దరు నౌకర్లు దానికి మాలిష్ చేస్తున్నారు. ఒకడు దాణాపట్టుకొని ముందు నిలబడ్డాడు. కాని, రాణికి కొంచెం కూడా ఈవైపు దృష్టి లేదు. దాని మనస్సులో ప్రతిధ్వనిస్తున్నది ఒకే ప్రశ్న: రాజా ఎక్కడ? దానికి ఏమయింది? రాజా ఎందుకు కనిపించదు?— దానికి దెబ్బతగిలి ఉంటుందని, బహుశా చికిత్స జరుగుతూ ఉండవచ్చునని రాణి ఊహించింది. ఆ ఊహ దాని మనస్సులో తాళలేని తల్లడం కలిగించింది; సహించలేని వేదన కలిగించింది. కళ్లు మూసిన దానిని మనస్సు తెలుసుకోలేదు—రాణి మనస్సు ఉద్విగ్నమై మూక వేదనకు పాల్పడింది. పద్దన్నా, దాని హృదయాన్ని అమంగళపు నీలినీడలు మూగసాగాయి.

రాణి హృదయంలో ఈ చెడుయోచనలు ముసురుకొన్నప్పుడే ఆ ధ్వని వినిపించింది:

ఒకటి—రెండు—మూడు!

మూడుసార్లు తుపాకి గుండ్లు పేల్చిన ధ్వని!

రాణి గుండెకు ఆ గుండ్ల దెబ్బ తగిలినట్టయింది. ఒళ్ళంతా భయం మెరుపులాగ పాకింది; ఎక్కడలేని ఆవేగంతో దాని దేహం వణకసాగింది. తెలివితెప్పి, కట్టుకట్లను యమసాహసంతో తెంచుకొని, చెంగున ఎగిరి గుడారంనుంచి ఒక్క ఉరుకుతో వెలుపలికి వచ్చిపడింది.

ఆ ఉగ్రమూర్తిని చూచి జనం అదిరిపడింది. దానిని పట్టుకొనడానికి ఎవరికీ సాధ్యంకాలేదు. రాణి పసికట్టి సుమారు ఫర్లాంగు దూరంలో ఉన్న ఒక గుడారంవైపు ప్లుతగతితో—నాలుగు కాళ్ళూ గాలిలో వేస్తూ పరిగెత్తింది. భయాశ్చర్య చకితులైన జనం "హా!" అని కేకలు వేస్తూ దాని వెంటనే పరుగున వచ్చారు. విల్లునుంచి విడలిన బాణంలా రాణి ఉరకలు వేసుకుంటూ వచ్చి ఒక్క నిమిషంలో ఆ గుడారంలో జొరబడింది. జొరబడి అక్కడి దృశ్యం చూచి స్తంభించిపోయి వాకిట్లోనే నిలబడింది.

రాజా నేలమీద అస్తవ్యస్తంగా ఎగఊపిరులతో పడిఉంది; పడిన గాయంనుంచీ, గుండ్ల దెబ్బలనుంచీ ఒళ్లంతా రక్తంతో తడిసింది; కళ్లగుడ్లు తేలిపోతున్నాయి; నోట్లో నురగ కట్టింది; చెమట ఓడికలై పారింది; మెడ వాలిపోయింది; పక్కనే ఇద్దరు తుపాకులు పట్టుకొని నిలబడి ఉన్నారు; వారి తుపాకుల గొట్టాలనుంచి కమ్మిన పొగకూడా ఇంకా చెదరిపోలేదు.

రాణి ఈ దృశ్యం చూచి సహించలేక గుండె పగిలి రాజా పక్కన కుప్పగా కూలిపోయింది. కళ్లనుంచి నీరు కాలువకట్టింది, గుండె వేడి వెలుపలికి కమ్మింది.

"రాజా, నా రాజా!

రాజా కష్టమ్మీద తలయెత్తి చూచింది.

"రాణీ, వచ్చావా, నా బంగారం!"

"వచ్చాను, నా వలపా; నీకు చావు తెచ్చాను."

"వద్దు నా బంగారుకొండా; అలా అనవద్దు."

"అయ్యో! ఎంతటి పని అయిపోయింది. నే నెంత పాపిని? నేనే నీ మరణానికి కారణమయ్యాను. దీనిని ఎలా సహించను రాజా?"

"సహించు రాణీ, దుఃఖపడవద్దు; అయిందానికి ఏడు పెందుకు? ఇలాటి చావు చావా? నీ కోసం ఇలాటి వేయిచావులు చావడానికి సిద్ధమే!"

"నీ ప్రేమతో నా ఆత్మ పునీతమైంది. కాని, నా రాజా నీవు లేనిదే నా జీవితం బీడయిపోయింది."

"మళ్ళా అక్కడ చేరేవరకూ అంతే. నీ కోసం కాచుకొని ఉంటాను; అంతవరకూ నన్ను మాత్రం మరువవద్దు."

కళ్ళల్లో త్యాగపు దివ్యజ్యోతి మెరిసింది. తన సర్వశక్తులూ కూడగట్టుకొని కళ్ళను పెద్దగా విప్పి ఆఖరుసారి మనసారా రాణిని చూచింది. ఎత్తిన మెడవాలి పక్కనఉన్న రాణి మెడపై పడిపోయింది.

క్షణభంగురమైన నొప్పితో బాధపడి, చిరనూతనమైన వలపుతో వెలిగిన ఆ జీవం ఈ లోకం వదలిపెట్టింది. రాణి మాత్రం అక్కడినుంచి లేవక ధారాపాతంగా కన్నీరు కురిపిస్తూ ఏడుస్తూనే ఉంది.

అక్కడున్నవా రెవరూ ఉన్న స్థలంనుంచి కదలలేదు; ఎవరూ నోరు విప్పి పలుకలేదు; ఎవరికీ ఏమీ బోధపడలేదు.

('త్యాగ' అనే కన్నడ కథకు అనువాదం)

# స్త్రీ విద్యా సమస్యలు: పరిష్కారం




శ్రీ చావలి వేంకటహనుమంతరావు

ఇంతవరకు మనదేశంలో స్త్రీవిద్యాసమస్యల ప్రత్యేక పరిశీలన కాని దాని వ్యాప్తికి ప్రత్యేక ప్రయత్నాలు కాని జరిగియుండలేదు. ప్రభుత్వం కూడ వాటి పరిష్కారానికి ప్రత్యేక బాధ్యత, శ్రద్ధ చూపి యుండలేదు. బాలికల, స్త్రీల విద్యకు సంబంధించిన పథకాలను గురించి ఇంతవరకు నిర్దుష్ట కార్యక్రమం ఏమీ లేదనే చెప్పాలి. ఈ పరిస్థితులలో శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ గారి అధ్యక్షతను కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేసిన జాతీయ స్త్రీ విద్యా సంఘం వారి రిపోర్టు ఈ విషయాలను గురించి పర్యవేక్షణ చేయడంలో మొదటి ప్రయత్నమని, ఆ కమిటీవారి పని, వారి సూచనలు ఈ సందర్భంలో చరిత్రాత్మకంగా ఉండగలవని అనుకోవచ్చు. కమిటీవారి అధ్వర్యంలో జరిగిన పరిశోధన కొంతకాలం వరకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల పథకాలకు దారిచూపించేదిగా ఉంటుందనేది నిస్సందేహం.

ఇండియా స్వతంత్రం సంపాదించుకున్న తరువాత జరిగిన 10 సంవత్సరాలలో అంతకుముందు వంద సంవత్సరాలలో వివిధ విషయాలలో ఏర్పడ్డ లోట్లను పూర్తిచేసుకుంటూ అభ్యుదయ పంథాలలో చాలా ముందంజవేసింది. ఈ అభ్యుదయం సర్వతోముఖంగా ఉండి, దేశం ఔన్నత్యం పొందడానికి ఆర్థికంగా, సాంఘికంగా, సామాజికంగా విద్యావిషయాలలో ఇంకా చాలా అధిగమించవలసిన అవసరం ఉంది. ఇతర విషయముల మాట వదలి ఒక విద్యా విషయం దృష్ట్యా పరిశీలిస్తే స్త్రీవిద్యావ్యాప్తిలో పెద్దలోటు కన్పిస్తుంది. దేశాభివృద్ధి సక్రమంగా జరగడానికి ఈలోటును తొలగించడం ఎంత అవసరమో మన స్త్రీల వ్యక్తిత్వం పెంపొందించడానికి కూడా విద్య అంత అవసరమే కాని ఈ సమస్యను గురించి దానికి అనుబంధించిన ఇతర విషయాలను గురించి ఇంతవరకు సరియైన ఆలోచన జరిగియుండలేదు. దుర్గాబాయి దేశ్‌ముఖ్ కమిటీవారి కృషి వల్ల ప్రభుత్వదృష్టి ప్రజలదృష్టి వాటిపై కేంద్రీకరింపబడతాయని ఆశించవచ్చు.

మూడునాలుగు దృక్పథాలనుంచి స్త్రీవిద్యావ్యాప్తి త్వరితగతిని జరుగవలసిన అత్యంతావసరం కన్పిస్తుంది. మొదటిది: పురుషులవలెనే స్త్రీలుకూడ విద్య నభ్యసించి, దానిద్వారా ప్రపంచంలో వివిధరంగాలలో జరుగుతున్న మార్పు, అభ్యుదయం, అభివృద్ధి అవగాహన చేసుకోవడం అవసరం. ఈ విషయాన్ని గురించి ప్రత్యేకంగా నొక్కి చెప్పవలసిన దేమీలేదు. రెండవది: మన రాజ్యాంగ చట్టంప్రకారం నిర్దిష్టమైనహక్కులు కొన్ని ప్రతిపౌరునికి స్త్రీపురుష భేదం మత, కుల భేదం లేకుండా—సంక్రమించాయి. ఈహక్కుల వల్ల వచ్చే ప్రతిఫలం పూర్తిగా పొందాలంటే స్త్రీలు పురుషులతో పాటు విద్యావంతులయి, దేశాభ్యుదయ కార్యక్రమాలలో పాల్గొంటూ, దేశాభివృద్ధికి తోడ్పడడానికి తగు అవకాశాలు కల్గి ఉండాలి. మూడవది: మన రాజ్యాంగం ప్రజాస్వామ్యసిద్ధాంతం పునాదిపై నిర్మించబడింది. ఆ సిద్ధాంతంయొక్క అంతరార్థం ప్రతి పౌరుడు తన హక్కులను, వాటికి తోడైన బాధ్యతలను తెలుసుకొని వాటిని నిర్వహించడానికి తగిన శక్తిసామర్థ్యాలు కల్గియుండి జాతీయ సాంఘిక, రాజకీయ, సాముదాయిక సంక్షేమకార్యక్రమాలలో పాల్గొనడం అవసరం. వీటన్నింటికి మూలంగా ఉండేది విద్య. నాల్గవది: మన పంచవర్ష ప్రణాళికలక్రింద ఆర్థిక, సాముదాయిక సాంఘిక సంక్షేమకార్యక్రమాలు విరివిగా పట్టణములలోను పల్లెలలోను నడుపబడుతున్నాయి. వీటిలో పాల్గొనటకు వాటిని జయప్రదంగా నడపడానికి స్త్రీబలం, స్త్రీసిబ్బంది చాలా అవసరం. ప్రైమరీస్కూళ్లలో ఉపాధ్యాయినులుగాను, సాముదాయిక సంక్షేమ కార్యక్రమాల్లో గ్రామసేవికలుగాను, ఆరోగ్య ప్రణాళికలలో నర్సులు, దాయీలు, మంత్రసాన్లు, హెల్తు విజిటర్లుగాను పట్టణాలలో ఆఫీసు స్టెనోగ్రాఫర్లుగాను, చిన్నపరిశ్రమాభివృద్ధి కార్యక్రమాల్లో చేతిపనులను నేర్పే అధ్యాపకురాండ్రుగాను కొన్ని లక్షలమంది మిడిల్ స్కూల్, హైస్కూల్, హైయర్, సెకండరీ పరీక్షల్లో ఉత్తీర్ణులై ప్రత్యేక శిక్షణ పొందినట్టి స్త్రీలకు అవసరం ఉంది. ఈ కార్యక్రమాల్లో పాల్గొనడంవల్ల వారికి స్వతంత్ర ఆర్థిక జీవితం గడుపుటకవకాశం కల్గడం కాకుండా, వారివారి కుటుంబాల ఆర్థిక స్తోమతును బలపర్చుకోడానికి తోడ్పడడానికికూడా అవకాశాలు ఏర్పడతాయి. ఆర్థిక పరిస్థితులు క్లిష్టంగా ఉన్న ఈ రోజుల్లో, జీవిత ఆర్థిక ఖర్చుల పరిమాణం పెరుగుతూన్న ఈ కాలంలో స్త్రీలు చాలామంది తమతమ కుటుంబములకొరకు, ముసలి తలిదండ్రులకొరకు, తమ స్వంత ఆర్థిక స్వాతంత్ర్యం కొరకు ఏదైనా వృత్తి విద్య నభ్యసించడం, దాని తరువాత ఆ వృత్తికి సంబంధించిన పనుల్లో చేరి ఆదాయం సంపాదించుకోవడం మర్యాదకు లోటయినపనికాని, దేశకాలపరిస్థితులకు వ్యతిరేకమైన పనికాని కానేరదు. పైగా దేశాభ్యుదయానికి, సామాజికావసరాలను తీర్చడానికి అనుగుణ్యమైన కార్యక్రమంగా దానిని పరిగణించాలి.

ఈవిధంగా ఇండియాదేశ స్త్రీలు తమ వివిధ బాధ్యతలను నెరవేర్చడానికి వారికి విద్యాసౌకర్యాలు విరివిగా ఏర్పాటుచేయడం, ఆ సౌకర్యాలను వారు ఉపయోగించుకోవటానికి తగిన పరిస్థితులు కల్పించటం, దానికి దోహదంగా అవసరమైనన్ని స్కూళ్లు, శిక్షణ కేంద్రాలు ఏర్పాటుచేయడం అవసరం. మన ఆర్థిక సాముదాయిక జాతీయ పరిస్థితులు చాలా త్వరితగతిలో నడుస్తున్నాయి. దేశం యొక్క అభివృద్ధి అవసరాలు రోజురోజుకు ఎక్కువవుతున్నాయి.

అందువల్ల పైన చెప్పిన ఏర్పాట్లను కూడా చాలా తొందరగాను, అవసరమైనంత విరివిగాను నిర్మాణంచేయడం కూడా ప్రధానంగా గ్రహించాలి. స్త్రీవిద్యకు ప్రత్యేక ప్రణాళికలు నిర్మించడం, ప్రత్యేక సౌకర్యాలు ఏర్పాటు చేయడం, ప్రత్యేక ప్రయత్నం కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు, ప్రజాసంస్థలు జరిపితేనేకాని ప్రస్తుతం ఉన్న లోటుపాటు తొలగించడానికి పరిస్థితులు అనుకూలించవు.

దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్ కమిటీవారు చేసిన సిఫార్సులలో వెంటనే ఆచరణలో పెట్టవలసిన కార్యక్రమాన్ని గురించినవి కొన్ని, నిలకడమీద ఆచరణలో పెట్టడానికి వీలయినవి మరికొన్ని ఉన్నాయి. మొదటిశ్రేణికి చెందినవాటిలో ముఖ్యమైనది కేంద్రంలోను, రాష్ట్రాలలోను ప్రభుత్వ విద్యాశాఖలలో స్త్రీల విద్యకు సంబంధించిన ప్రణాళికలు తయారుచేయడానికి, వాటిని నిర్వహించడానికి ప్రత్యేక శాఖలు ఏర్పాటు చేయబడవలెనని, వాటిని కట్టుదిట్టంగా నిర్వహించడానికి అవసరమైన సిబ్బందిని నియమించవలెనని ప్రణాళికలు తయారుచేయడంతోపాటు వాటిని కార్యరూపంలో మార్చడానికి అవసరమైన సొమ్మును కేటాయించవలెనని కూడ వారు సూచించారు. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మిగిలిన పరిమితిలో ఈ ప్రణాళికలపై ఖర్చుకై 10 కోట్ల రూపాయిలు ప్రత్యేకంగా కేటాయించవలసి ఉంటుందని తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఎంత సొమ్ము కావలెనో సమాలోచన జరిపి దానికి కూడ తగిన బందోబస్తు ఆ ప్రణాళిక తయారు చేసేటప్పుడే, ఆ ప్రణాళిక పత్రంలోనే నిర్ణయింపవలసి ఉంటుందని వారు సూచించారు.

ఇవికాక వెంటనే అవసరమైన ఇతర కార్యకలాపాలను కమిటీ ఈ విధంగా పేర్కొన్నారు. బాలికల విద్యావిస్తరణకు కావలసినన్ని మధ్యమ తరగతి పాఠశాలలు, ఉన్నత తరగతి పాఠశాలలు ఏర్పాటు చేయబడాలి. స్త్రీలకు కొన్ని చేతి పనులలోను, పరిశ్రమలలోను సాంకేతిక శిక్షణ నియడానికి ప్రత్యేక పాఠశాలలు విరివిగా ఏర్పాటు చేయాలి. మధ్యమ తరగతి విద్యను, ఉన్నత తరగతి విద్యను అభ్యసించడానికి స్త్రీలకు బాలికలకు ప్రోత్సాహంగా ఉండేటట్లుగా ఆయా పాఠశాలల కనుబంధంగా విద్యార్థినుల సౌకర్యార్థం వసతి గృహాలను ఏర్పాటు చేయాలి. ఇవికాక పల్లెటూళ్ళలో నిర్బంధ ప్రాథమిక విద్య ముందంజవేయడానికి ప్రధాన అభ్యంతరంగా ఉన్న కారణాలలో ఒకటి ఉపాధ్యాయినులు పల్లెటూళ్ళలో నివసించడానికి తగిన ఏర్పాట్లు లేకపోవడం. కాబట్టి ఆ లోటును తొలగించడానికి అవసరమైన ఏర్పాట్లు చేయాలి. చిన్నప్పుడు విద్య నభ్యసించడానికి అవకాశాలు లేకపోవుటవల్ల అక్షరాస్యులైన వయోజన స్త్రీలకొరకై వయోజనవిద్యాప్రణాళికలు ఆచరణలో పెట్టవలసి ఉంది.

తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఈ కార్యక్రమాలు చురుకుగా ముందుకు సాగిపోవటానికిగాను ఇప్పటినుంచీ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు శ్రద్ధ చూపించవలసి ఉంటుందని, ఆ కార్యక్రమాల ఆచరణకు ఎట్టి అడ్డు రాకుండా ప్రణాళికలోనే 100 కోట్ల రూపాయిలు ప్రత్యేకంగా దానికొరకై కేటాయించవలసిందనికూడా కమిటీ సూచించారు. స్త్రీల ఉన్నత విద్యవిషయమై సిఫార్సులు చేయడం కమిటీవారి బాధ్యత కాకపోయినా కళాశాలలో విద్య నభ్యసిస్తూన్న బాలికల సౌకర్యార్థం స్త్రీల కళాశాలల కనుబంధంగా వసతిగృహాలు నిర్మించడం అవసరమని, దానికై విశ్వకళాపరిషత్ గ్రాంటుల సంఘంవారు ఒక కోటి రూపాయిలు కేటాయించవలసిందని వారు సూచించారు. ఈ సూచనను విశ్వకళాపరిషత్తు గ్రాంటుల సంఘంవారు అప్పుడే ఆమోదించారుకూడా.

కేంద్ర విద్యాశాఖవారు దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ కమిటీవారి సూచన ననుసరించి స్త్రీల విద్యాప్రణాళికలను నిర్వహించడానికి ప్రత్యేకశాఖను సిబ్బందిని ఏర్పాటుచేసినా, అదేవిధంగా వివిధరాష్ట్ర ప్రభుత్వాలుకూడ ప్రత్యేక సిబ్బందిని నియమించినా స్త్రీల విద్యావ్యాప్తి త్వరితగతిని జరగడానికి పునాదివేయబడుతుంది. దానితోపాటు ప్రయిమరీ, మిడిల్, హైస్కూళ్లలో పనిచేయుటకు ఉపాధ్యాయినులను తయారుచేయుటకు కావలసినన్ని ట్రెయినింగు సంస్థలు ఏర్పాటు చేయడంకూడా చాలా అవసరం. సాంకేతిక విద్య, వృత్తివిద్య గరపడానికి సౌకర్యాలు విరివిగా చేయబడితేనేకాని మధ్యతరగతి కుటుంబాల స్త్రీలకు తాము చదివిన చదువువల్ల పూర్తిలాభం పొందడానికి అవకాశం ఉండదు కాబట్టి అట్టివారికి శిక్షణ నిచ్చే వృత్తి విద్యాసంస్థలు విరివిగా ఏర్పాటుచేయవలసి వుంటుంది. గ్రామసేవికలు, చేతి పనులలో శిక్షణనిచ్చే స్త్రీ అధ్యాపకులు, మంత్రసానులు, సాంఘికవిద్యాబోధకురాండ్రు మొదలైన వృత్తులలో శిక్షణ పొందినవారికి ఏర్పడుతూన్న ఉద్యోగావకాశాలు వారు పూర్తిగా చేపట్టాలంటే ఇట్టి శిక్షణ కేంద్రాలను ద్విగుణీకృతంగా చేయాలి. కేవలం ప్రభుత్వప్రయత్నాలవల్ల, ప్రభుత్వం చేయగల ఏర్పాట్లవల్ల ఈ కార్యక్రమం త్వరగా సాగటానికి కొన్ని ఇబ్బందులు ఉండే వుండవచ్చును, కాన సేవాసంస్థల సహకారాన్ని సలహాల్ని ఈ సందర్భంలో ప్రభుత్వం ఆశించడం అవసరమౌతుంది. దానికి కేంద్రరాష్ట్రప్రభుత్వాలు సిద్ధంగా ఉండటమేకాక అవసరమైతే ప్రత్యేకంగా అట్టి సహకారాన్ని అర్థించడానికి వెనుదీయకూడదు.

ఈ సందర్భంలో దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ కమిటీవారు మన దేశంలో స్వచ్ఛంద సేవాసంస్థలు అనేక సంవత్సరాలుగా, వివిధ ప్రాంతాలలో స్త్రీ విద్యావ్యాప్తికి చేసిన కృషిని ప్రత్యేకంగా ప్రశంసించారు. ఈ సంస్థలు, వాటి పోషకులు వివిధ రాష్ట్రాలలో వారి ఆధిపత్యంక్రింద స్త్రీల పాఠశాలలను ఏర్పాటుచేయడమేకాక, వాటిని నడపడానికి కావలసిన మూలధనాన్ని కూడబెట్టడం, భవనాల్ని నిర్మించడంద్వారాకూడా అత్యున్నతమైన సేవ చేశారు. ఈ సంస్థలకు వాటి యజమానులకు అవసరమైన ధనసహాయం, ఇతర విధాలుగా ప్రోత్సాహం ప్రభుత్వం ఇచ్చినట్లయితే వాటిద్వారా స్త్రీ విద్యా కార్యక్రమాల్ని జయప్రదంగా కొనసాగించడానికి ఎంతైనా అవకాశం ఉంటుంది. ఇట్టి సంస్థల సహకారం కూడగట్టుకోవడంవల్ల ప్రధానలక్ష్యమైన స్త్రీవిద్యావ్యాప్తిని త్వరగా అందుకోవడమే కాకుండా ఆ విషయంలో ప్రభుత్వం తన బాధ్యతను చాలా వరకు తగ్గించుకోడానికి కూడా వీలవుతుంది. ఈ సంస్థలకు ధనసహాయం చేసేందుకు నిర్ణయించిన నిబంధనలలో అవసరమైన సవరణలు చేసి ఒక్కొక్క సంస్థ ఒక్కొక్క ప్రత్యేక విద్యాశాఖకు సంబంధించిన కార్యక్రమాన్ని పూనుకొని జరిగించేటందుకు చేయూత

వీగాలి. ధనసహాయం చేయడంలో ఖర్చులో నూటికి 50 వ వంతో, 75 వ వంతో సహాయం చేయడంకాక పూర్తి ఖర్చుకు కావలసిన సొమ్ముఅంతా గ్రాంటుగా ఈయడానికి ఆమోదించాలి. ఈ విధమైన మార్పులు నిబంధనలలో చేస్తే ఆయా కార్యక్రమాల్లో ప్రత్యేకాభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. ఇదికాక గ్రామాలలో స్త్రీ వయోజన విద్యాకార్యక్రమాలు చురుకుగా సాగించడానికి స్వచ్ఛంద సంస్థల సహకారం చాలతోడ్పాటుగా ఉంటుంది. కొన్ని ఏండ్లనుంచి జరుగుతూన్న సాముదాయిక అభివృద్ధి, సంఘసంక్షేమకార్యక్రమాలలో వయోజనవిద్యావ్యాప్తికి ఈ సంస్థలు చేసే కృషినిబట్టి చూస్తే ఈ విషయంలో ప్రభుత్వ ప్రయత్నాలకన్న స్వచ్ఛంద సంస్థల యొక్క, స్వచ్ఛంద సేవకులయొక్క ప్రయత్నాలే ఎక్కువ లాభదాయకంగా ఉన్నట్లు స్పష్టమౌతుంది.

స్త్రీ విద్యా సౌకర్యాలను విస్తరింపచేయాలనే విషయంలో ఇప్పుడు అభిప్రాయభేదాలేవీ లేవని, వాటికి అవకాశంకూడ లేదని చెప్పవచ్చు. అట్టి విస్తరణ చురుకుగా జరగాలంటే దానికి అనుగుణ్యమైన పథకాలను నిర్మించి ఆచరణలో పెట్టటానికి ప్రభుత్వం దృఢనిశ్చయానికి రావలసిఉంటుంది. ఆ సమస్య ప్రాముఖ్యాన్ని, ఆవశ్యకతను వారు గ్రహించాలి. ఇంతవరకు జరిగిన జాప్యానికి బదులు తొందరపాటుతో కార్య నిర్వహణకు వారు పూనుకోవాలి. మనదేశంలో వివిధరంగాల్లో త్వరితగతిని వస్తూన్న మార్పుల సందర్భాన్నిబట్టి పరిశీలిస్తే ఈ తొందరపాటు ఎందుకు అవసరమో గ్రాహ్యమౌతుంది. ఈ మార్పులకు కారణాలు అనేకములున్నా అన్నిటికంటె ప్రధానమైనది మన స్త్రీసంఘంలో ప్రబలంగా, తొందరగా వ్యాపిస్తూన్న క్రొత్త మానసిక విప్లవం, దానివల్ల ఉద్భవిస్తూన్న నూతన ఆశయాలు, నూతన అభిప్రాయాలున్నా. మన గ్రామాలలో ఇంకా చాలామంది తలితండ్రులు తమ బాలికలను పాఠశాలలకు పంపుటకు సంకోచం చూపిస్తూన్నా, వారు కూడా దేశంలో రాజకీయ, సాంఘికార్థిక పరిస్థితులలో ఏర్పడ్డ సంచలనం అనే వలనుంచి తప్పించుకోలేక పోతున్నారు.

కాన గ్రామాల్లో బాలికావిద్య పెంపొందడానికి ఇప్పుడు ఉంటూన్న ఇబ్బందులను తొలగించితే, తమ బాలికలు విద్య నభ్యసించడాన్ని గురించి పల్లెటూళ్ళల్లో కొంతమంది తలిదండ్రుల మనస్సులలో నివాస మేర్పర్చుకొన్న కొన్ని విపరీతాభిప్రాయాలను మార్చుకొనేందుకు వీలుగా అవకాశాలు కల్పిస్తే, పల్లెటూళ్ళల్లో విద్య నభ్యసించడానికి ముందుకువచ్చే బాలికలసంఖ్య వెంటనే పెరుగుతుంది. ఏ ఏ మార్పులుచేస్తే ఈ అనుకూల ఫలితం లభిస్తుందో దుర్గాబాయ్ దేశ్ముఖ్ కమిటీవారి రిపోర్టులో విపులంగా చర్చించబడింది. చాలా గ్రామాల్లో బాలబాలికలు కలిసి ఒకేపాఠశాలలో చదువుకోవలసి వస్తూండడం, బాలికల చదువుకు పెట్టే ఖర్చు బాలుర చదువుకు పెట్టే ఖర్చంత లాభకరంకాదని, బాలికలు విద్య నభ్యసించడంవల్ల వచ్చే ప్రత్యేక ప్రతిఫలం ఏమీ లేదని, వారికి నేర్పే విద్య గ్రామజీవితం గడిపే స్త్రీలకు ఎక్కువ ఉపయోగించదని, వారిలో

ప్రబలంగా ఉన్న అభిప్రాయాలను తొలగించడానికి అనుగుణ్యమైన మార్పులు విద్యావిధానంలోను, బోధనాపద్ధతులలోను, పాఠశాలల నిలబన్నులలోను చేయబడితే ఇప్పుడున్న ప్రతికూలత చాలవరకు అదే సమసిపోతుంది. ఉపాధ్యాయినులు పల్లెటూళ్లలో పనిచేయుటకు చూపే విముఖతకు కారణాలు గమనించి వాటిని తొలగించేందుకు తగిన ఏర్పాట్లుచేస్తే ఎక్కువమంది ఉపాధ్యాయినులు గ్రామాల్లో ఉండటానికి, బాలికల విద్యావ్యాప్తికి కృషిచేయడానికి అవకాశాలు ఏర్పడతాయి. ఇప్పుడున్న ఇబ్బందులలో ముఖ్యమైనది పైనచెప్పినట్లు గ్రామాల్లో ఒంటరిగా పనిచేసే ఉపాధ్యాయినులకు నివాసయోగ్యంగా ఇండ్లు, ఇతరసౌకర్యాలు లేకపోవడం. ఈ సౌకర్యాలను ఏర్పర్చడానికి గ్రామప్రజలుకూడ సహకరించవలసి ఉంటుంది; తమతమ పిల్లల లాభంకొరకై "ఈవిషయంలో మీరు సహకరించాలి"అని వారికి సరియైనవిధంగా నిర్దేశిస్తే వారు తప్పక అంగీకరిస్తారనడానికి అనుమానం లేదు. సాముదాయిక అభివృద్ధి ప్రణాళికలు ఆచరణలో ఉన్న ప్రదేశాల్లో పాఠశాలల ఏర్పాటుకై గ్రామస్థులు చూపే ఉత్సాహం, ఆదుర్దాలే దీనికి తార్కాణం.

ఈ వ్యాసం ముగించకముందు స్త్రీ విద్యకు సంబంధించిన కొన్ని వివరాలను తెల్పుట సమంజసంగా ఉంటుంది. 1951 సంవత్సరంలో 6-11 సంవత్సరముల మధ్య వయస్సుగల బాలికలలో నూటికి 40 మంది,11-17 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలికలలో నూటికి 10 మంది, 17-23 సంవత్సరాల మధ్య స్త్రీలు నూటికి ఒకటికి తక్కువగాను విద్య నభ్యసించుచుండిరి. మొత్తం జనాభాలో స్త్రీలు నూటికి సుమారు 50 మంది అయినా, ప్రైమరీ, మధ్యమ, ఉత్తమ తరగతులలో వారి సంఖ్య నూటికి 28, 18, 18 మాత్రమే ఉండేది. కళాశాలలలోను, విశ్వవిద్యాలయాలలోను విద్య నభ్యసించేవారి సంఖ్యలో బాలికల సంఖ్య నూటికి 10.4 వంతు మాత్రమే. ఇది కాక ప్రాథమిక పాఠశాలలలో విద్య నభ్యసించు చుండిన బాలికలలో నూటికి 60 మంది నాల్గవతరగతివరకు రాకుండా మధ్యనే విద్య చాలించేవారుగా ఉండిరి. అట్టి పిల్లలవిద్యపై ప్రభుత్వం వెచ్చించే డబ్బుకు ఎట్టి ప్రతిఫలం లేదన్నమాట.

1950 సం॥లో మొత్తం జనాభాలో నూటికి 17.2 మాత్రం (స్త్రీలు, పురుషులు కలిసి) అక్షరజ్ఞానం కల్గినవారుండిరి. 1951 జనాభా లెక్కల ప్రకారం స్త్రీలలో అక్షరజ్ఞానం కల్గినవారు నూటికి 7.8 మాత్రం ఉండిరి. 1950-51 లో దేశం మొత్తంమీద 6-11 సం॥రముల మధ్య వయస్సుండిన బాలబాలికలలో విద్య నభ్యసించేవారు నూటికి 59 మంది బాలురు 25 మంది బాలికలు ఉండిరి. 1955-56 నాటికి (అనగా మొదటి పంచవర్ష ప్రణాళిక అంతమయ్యేసరికి) బాలుర సంఖ్య నూటికి 69 వరకు, బాలికల సంఖ్య 33 వరకు పెరుగుతుందని, 1960-61 నాటికి (అనగా రెండవ పంచవర్ష ప్రణాళిక అంతమయ్యేసరికి) బాలుర సంఖ్య నూటికి 86 వరకు బాలికల సంఖ్య 40 వరకు పెరుగుతుందని అంచనా వేయబడింది. అదేవిధంగా 11-14 సం॥రముల మధ్య పిల్లలలో 1950-51 లో నూటికి 22 బాలురు, 5 బాలికలు పాఠశాలలలో ఉండగా 1955-56 నాటికి బాలురసంఖ్య నూటికి 30 వరకు బాలికల సంఖ్య 8 వరకు, 1960-61 నాటికి బాలురసంఖ్య నూటికి 36 వరకు బాలికల సంఖ్య 10 వరకు పెరుగుతుందని అంచనా వేయబడింది. సెకండరీ విద్య స్థాయిలో బాలికల విద్య ప్రాథమిక విద్యకంటే చాలా వెనుకబడి ఉంది. 14-17 సం॥రముల మధ్య ఉండిన ఒకకోటి 20 లక్షలమంది బాలికలలో నూటికి 8 మాత్రం ఉన్నతవిద్య నభ్యసించు చుండిరి. ఈ అంకెల అన్నిటినిబట్టి, 6 మొదలుకొని 14 ఏండ్ల మధ్య పిల్లలందరిని నిర్బంధ, ఉచిత ప్రాథమిక విద్యా పథకంలోనికి 1960 నాటికి తీసుకురావలెనని రాజ్యాంగచట్టంలో పేర్కొనబడ్డ నిబంధన, పరకు పూర్తి చేయడానికి ప్రత్యేక ప్రయత్నం అవసరమని, ప్రత్యేక ఏర్పాట్లు చేయవలసి ఉంటుందని, అట్టి ప్రయత్నములు లేనిసందర్భంలో ఆ లక్ష్యాన్ని అందుకోడానికి ఎంతకాలం పట్టుతుందో నిర్ణయించడం కష్టమని తెలుస్తుంది. ప్రస్తుతం 1951 నుంచి 1966 వరకు దీనికి పరిమితి పెంచబడింది.

గతించిన పది సంవత్సరాలలో మనదేశంలో వివిధరంగాల్లో విప్లవాత్మకమైన మార్పులు, క్రొత్తపోకడలు రావడం మనం చూస్తూన్నాం. ఈ మార్పుల ఫలితంగా మన జాతీయ జీవితం పునరుద్ధరింపబడడమే కాక, అనేక విషయాల్లో అభివృద్ధికూడా మనకు కన్పిస్తూంది. వాటివల్ల ప్రజాస్వామిక సిద్ధాంతం, ప్రజాస్వామిక పద్ధతులు మనదేశంలో బలపడుతూండడం కూడా జరుగుతోన్నందుకు సంతోషించవలసిందే. ఈ వివిధ మార్పులలో స్త్రీల అభిప్రాయాల్లోను, వారి జీవితంలోను, ఆశయాలలోనువచ్చిన మార్పులు చాలా ముఖ్యంగా పరిగణించి మన సాంఘిక, రాజకీయ, ఆర్థిక జీవితాలను కలతపెడుతున్నాయి. ఈ అభివృద్ధికి, మార్పులకు విద్యావ్యాప్తి పునాది అవడంవల్ల, స్త్రీల విద్యావిస్తరణ ముందంజ వేస్తేనే కాని ఇంతవరకు జరిగిన అభివృద్ధి నిజమైనది, పటిష్ఠమైనది, శాశ్వతమైనదీ కానేరదు. స్థిరమైన అభివృద్ధి విద్యాభివృద్ధిపైన అంత ఎక్కువగా ఆధారపడి ఉండటంవల్ల స్త్రీల విద్యకు సంబంధించిన పథకాలకు ప్రణాళికలకు ప్రముఖస్థానం ఈయవలసి ఉంటుంది. ఒక విద్యావంతురాలయిన స్త్రీ ఒక కుటుంబంలో ఉంటే ఆ కుటుంబం అంతా పురోగమిస్తుంది అనే సూత్రప్రాయమైన విశేషం గమనించి మన ప్రభుత్వాలు, ప్రజానాయకులు పైనచెప్పిన సమస్యల పరిష్కారానికి పూనుకొంటారని ఆశిస్తున్నాను.

# అమృతాభిషేకము

శ్రీ దాశరథి

ఎదగుడిలో సరస్వతి వసించి విపంచిక మీటి పాడుచు
న్నది; నవచైత్రమాస గహన స్పృహణీయ పలాశసూన సం
పదకు ఉగాది మండపము మంజులమైనది నేడు; తెల్గు శా
రద కమృతాభిషేక మొనరన్ కవితాంజలిబూని రం డహో!

కలతలు లేని చక్కని ఒకానొక సౌధముగట్టి, దానిలో
పల కవితా సరస్వతికి వజ్రకిరీటము బెట్టి రేబవల్
కొలుతము రండు; ఘర్షణలకున్ కలహమ్ముల కాలవాల మౌ
ఇలకు ప్రశాంతి కల్పక మహీజము తెందు జనాళి మెచ్చగన్.

ద్వేషాగ్ని యార పీయూష ధారలు వార పద్యాల గొన్నింటి పాడవలయు,
కాఠిన్యములు డింద కరుణమ్ము పెంపొంద పదముల గొన్నింటి పాడవలయు,
వినమొల్ల డుల్లగా రస ముప్పతిల్లగా వివిధ భావముల కల్పించవలయు,
అసమానమ్ముల్ద్రుంచ నైకమత్యము పెంచ నిర్మల స్నేహమ్ము నించవలయు,
దేశప్రాంతాలలో చేదు విరిగిపోవ రసనపై తీయమాటలు విసరవలయు,
ఉదయమే లేని గాఢాంధ హృదయమందు చిత్రభాను సూనము వికసించవలయు.

ప్రతి కలమ్ములోన పద్యాలు వ్రాసెడి
దండిదనము నిండుచుండవలయు
ప్రతిగళమ్ములోన పాటలు పాడెడి
ఇంపు దనము లావహింపవలయు.

ఈ యమృతాభిషేకమున కెందరు సత్కవు లేగుదెంచినా
రోయి మరందమాధురుల నూను లసత్ కవితా ప్రసూనముల్
దోయిటబూని! వారి ఎదలోన వసంతము లావహించి చాం
పేయ పరీమళమ్ములను వీచిన వ్యస్తదిశాంతరమ్ములన్.

ఆ ఉగాది కాంత అంగుళుల్ తాకిన
తీవె తీవె పూలు ప్రోవు బోయు;
ఆమె పాదతలము లంటిన ఇరవెల్ల
నందనమ్ము వోలె అందగించు.

ఆమ్రశాఖాశోభి హైమాంశుకమునుండి ముఖ చంద్రబింబము మురిసిపోవ,
చిరువేప కొమ్మపై సింగార మొలికించు చేలాంచలమ్ములు జీరువార,
శోకాపహాశోక సుందరాగమునుండి కనకాంగదమ్ములు ఘల్లుమనగ,
వివిధ రాగాలాపవిధి చొక్కు ప్రేంకణమ్మామెతో జతగూడి ఆలపింప,
పూలతో పండ్లతో నవనాళికేర జలముతో శుకపిక కలకలముతోడ
అరుగు దెంచె నుగాది సుందరి, మహాంధ్ర కవిత కమృతాభిషేచనోత్సవము జరుప.

# ఉరుదు పరిచయంతో పెరిగిన తెనుగు

**శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

ఆంధ్రదేశం బహమనీ రాజులూ, కుతుబ్ షాహీలు చాలకాలం యేలిరి. మొగల్ చక్రవర్తులూ ఏలిరి. వీరందరూ పార్శీభాషాభిమానులు. అందువల్ల రాజభాషప్రభావం సర్వత్రా పడటం సహజం. ఇంతేకాక రాజ్య వ్యవహారాలు, చాలావరకు పార్శీ ఉర్దూలలోనే జరిపిరి. వారు సనదులు పార్శీలోనే వ్రాసి యిచ్చేవారు.

బహమనీలకన్న కుతుబ్ షాహీలు కొంత సహనంతో తమ ఉర్దూతోపాటు తెలుగుకు గూడా ప్రాధాన్యం యిచ్చిరి. సనదులు తెలుగులో వ్రాయించడం. ప్రభుత్వ వ్యవహారాలు తెలుగులో జరపడం, తెలుగు కవితను, కవులను ఆదరించడం వారు చేస్తూవచ్చిరి. వారిలో ఇబ్రహీం కుతుబ్ షాహ అనురాజు తెలుగు నేర్చుకొని తెలుగువారిచే ఇభరాముడని పిలువబడెను. ఇతడే మల్కిభరాముడు. అద్దంకి గంగాధర కవిచే "తపతీ సంవరణోపాఖ్యానము" అను కావ్యమును తెలుగులో వ్రాయించి అంకితమొందెను. ఈ కావ్యంలో 'శౌరి ఘనుడై కరుణారసవృష్టిచే నిరాయాసతి బ్రోచుగావుత నృపాగ్రణి "మల్కిభరాము" అని కవి వ్రాసెను. ఈ నవాబు గూడ తెలుగు కవిత వ్రాసేవాడు. నవాబును అనుసరించి ఆయన ఆశ్రయంలో ఉన్న మహమ్మదీయ ఉన్నతాధికారులు గూడా తెలుగు సాహిత్య కవిత్వాలపై ఆదరం చూపుతూ వచ్చిరి. ఉదాహరణానికి, ఆనవాబు సేనానియగు అమీన్ ఖాన్ పొన్నగంటి తెలగనార్యునిచే యయాతి చరిత్రమును వ్రాయించి కృతిపందెను. ఇది తెలుగులో మొదటి అచ్చతెలుగు కావ్యము. ఈ సేనాపతి చాల ఉదారుడు, సరసుడు. ఇతనిని—

"కడక నమీనుఖానుడు జగంబు తనున్ బొగడంగ వేడ్కతో విడువక యెప్పుడున్ పుడమివేల్పుల బిడ్డలపెండ్లి సేయు" అని కవులు ప్రశంసించిరి. అతనిభార్య బడే బీబీ కూడా అంతటి ఉదారురాలే యగును. మహమ్మద్ కుతుబ్ షాహ హిందూరాజుల నాదరించెను. 1617 లో గణనాథకవి "కుతుబ్షావనీశ్వరాస్థానకవీంద్రుడ" నని చెప్పికొన్నాడు. అతడు గొప్పకవి. అతని గ్రంథాలేవీ ఇప్పుడు లభించుటలేదు. దోమకొండ మల్లారెడ్డికవి పద్మపురాణమును కుతుబు షాహీల అండలోనే యుండి రచించెను. గోలకొండ కోటలో కవిగా ఉండిన సారంగు తిమ్మయ్య వైజయంతీవిలాసమును వ్రాసి సుల్తానున కంకితముచేసెను. అందులో "ఇనముతేజుడా నృపుల నెల్ల మహమ్మదు షాహి" అని పొగడెను. ఈకవి గోలకొండకు కరణము. ఇబ్రహీం కాలంనుండి తానాషావరకు నవాబులు తెలుగు నేర్చుకొని. కవులను ఆదరించి వారికి అగ్రహారాలిచ్చిరి. ఇంతగా కుతుబ్ షాహీ రాజులు పోషించిన తెలుగుకు అసఫ్ జాహీల కాలంలో రాజకీయంగా తప్పనిసరిగా ఉర్దూ, పార్శీభాషల ప్రభావం తెలుగుభాషపై పడవలసివచ్చింది. ఆరోజుల్లో దక్కనీ ఉర్దూ అని నేటి ఇక్కడి ఉర్దూకు పూర్వరూపంగా ఒకభాష వాడబడుతుండేది. ఆ దక్కన్ ఉర్దూలో పార్శీపదాలేకాక హిందీ, మరాటి కన్నడ, తెలుగుపదాలు వాడబడుతూవుండేవి. అలాగే ఈ భాషల్లో కూడా ఉర్దూ శబ్దాలు కలిసిపోయినాయి. ఈవిధంగా యీ భాషలకు ఉర్దూతో పరస్పరసంబంధం ఏర్పడింది. ముసల్మానులు, పాలకులుగా ఉండడంవల్ల అన్నిప్రాంతాల తెలుగులో ఉర్దూపదాలు విశేషంగా చేరి వాడుకలోకి వచ్చినాయి. అక్బర్ కాలంలో రాజభాష పార్శీ. ఆ కాలంలో తోడర్ మల్ అనువారు రెవిన్యూ అధికారంలో ఉండేవారు. అప్పుడు దేశభాషలలో రెవిన్యూకు సంబంధించిన అనేక ఉర్దూ, పార్శీపదాలు చేరినాయి. ఐతే తెలంగాణంలో ఇటీవలిదాకా ఉర్దూభాష రాజభాషగా ఉండడంవల్ల ఇక్కడి తెలుగులో అన్నిరంగాలలో ఉర్దూప్రభావం సహజంగా పడింది. విశేషించి ఉర్దూపదాలు రాజకీయోద్యోగ సంబంధంగల వ్యక్తులలోను, తద్వ్యవహారాలలోను కరణాలకవిలెలలోను చాలా వరకు విధిగా చేరవలసివచ్చినాయి. ఆంధ్రలోని ఇతర ప్రాంతాలలో కేవలం రెవిన్యూలోమాత్రమే ఉర్దూ పార్శీపదాలు వాడబడుతూ వుండగా తెలంగాణాలో ఇతరరంగాలలో కూడా ఈ పదాలుకూడా వాడడానికి కారణం, న్యాయస్థానాలు, కార్యాలయాలు, విద్యాలయాలు మొదలగు అన్ని ప్రజాసంస్థలలోనూ, ఉర్దూయే ఉండడమే. చివరకు పైన్న లెక్కలు, మెడికల్ కాలేజీ విద్యవంటి సాంకేతికవిద్యలు కూడా ఉర్దూలోనే జరుగుతూండడంవల్ల తెలంగాణాలో ప్రజలకు తెలుగు భాషాసాహిత్యాలు నేర్చుకునే అవసరం అంతగా లేకపోయి క్రమంగా దానిపట్ల ఉత్సాహం తగ్గడంమూలాన దాని అభ్యాసానికి తగినంతగా అవకాశాలు నాటి ప్రభుత్వం కల్పించలేదు. అందువల్ల అన్ని వ్యవహారాల్లోనూ ఉర్దూపదాలు వాడేవారు—ఇప్పుడూ వాడుతున్నారు. తెలంగాణా తెలుగువారు ఉత్తరాలు కూడా పరస్పరం ఈ క్రిందివిధంగా వ్రాసుకునేవారు. "బఖిద్మత్ జనాబ్ రావుసాహెబుగారికి వ్రాయటం యేమనగా నేను బాద్ ఖతం బహంషుమారీ బర్దారాగలను. అప్పుడు మీకు ఇత్తిలా ఇస్తాను. కాచీగూడా ఇస్టేషన్ లో నాకొరకు టాంగా ఇంతెజాంచేసి ఇంతెజార్ చేస్తూ వుండగలరు" ఈలాగు వుండేది. రాజకీయప్రభావంవల్ల కేవలం భాషారంగమే తెలంగాణాలో దెబ్బతిన్నది. కాని మత సాంస్కృతికరంగాలూ, హిందువుల ఆచారవ్యవహారాలు మతాంతర ప్రభావితములు కాలేదు. బ్రిటిష్ పాలనకాలంలో తెలంగాణేతరాంధ్రంలో విరివిగా ఇంగ్లీషుపదాలు చేరినట్లే ఇక్కడ ఉర్దూపదాలు చేరినాయి. రాయలసీమ తెలంగాణాలు చాలాకాలందాకా ముసల్మానుల పాలనంలో వుండినందుచేత సర్కారుజిల్లాల తెలుగులోకన్నా ఇక్కడి తెలుగులో ఉర్దూ ఎక్కువ కలిసింది.

“ కొత్వాల్, కిస్తు, జమేదార్, బటాయి, నౌకరు, నాజాను, జమాబందీ, సిరస్తాదార్, ఇనాము, ఫసలీ, అర్జీ, తహశీల్దార్, హవల్దార్, తబాదిలా, సిదా, దగాహిసాబ్. హర్కారా, నిగ్రానీ, హద్దు దుకాణం, గుమాస్తా, పేష్కార్, కిటికీ, రోజా మొహరిర్,— అంటే వ్రాతకాడు–(రైటర్,) తాలూకా, జిల్లా, సుబా, కైఫీయత్, తర్బియత్, –(ఇది తర్ఫీదుగా మారింది–) మంజూర్, షాల్, హయాం, చౌఫస్లా, చెలామణీ. బహాల్, జనానా, గోషా, తగాదా, సబబు, సిలుకు, ముద్దయీ –(ఈ పదం ఆంధ్రలో ప్రతివాదికి వాడుక)– తక్రార్, షికార్, –(ఈ పదం ఆంధ్రలో వాహ్యాళికి వాడుతారు)– గస్తీ (సర్క్యులర్), నిషాన్ (నెంబర్) బందోబస్తు, జప్తీ, జబర్దస్తీ, మిసల్, దస్తఖత్, (దస్కతుగా అయింది.) (దస్త్ అంటే చేయి ఖత్ అంటే వ్రాలు–చేవ్రాలు అని అర్థం–) లగాయత్, సేబాస్, షేప్, రైతు, కౌలు, సిస్తు, జమీన్, జమీన్దారు, వకీలు, తాలూకు, బాబత్, హమాబాబత్ –(దీన్ని అమాంబాబత్ అంటారు.) దామేషా, (అంటే రేషియో), ఖైదు, బందీఖానా, ఖిల్లా, తయారు, నవాబ్, రాజీ, సలహా–(ఈ పదం సలహాదారులు, సలహాసంఘాలు అని సమాసంలోకూడా వాడుతారు–) హాజరీ, (దీనికి తెలుగులో వేరే పదం వాడరు–) హుజూర్, ఖామిందు–(ఈ పదం ఫార్సీలో “ఖావింద్” అంటారు అనగా యజమాని అని అర్థం–), రస్తా, మైదాన్, నామూషీ, నామర్దా, తాఖీత్, దప్తాసీ, పీడా, ఓడీ, డబ్బా, సీసా, షర్బు, నజరానా, జేబు, జేబురుమాల్ –(రూ అంటే ముఖం, మాల్ అంటే తుడుచుకోవడం అని అర్థం)–, తనఖా, మాఫీ, జాయిదాదు, హౌజు హాయిషీ, తసక్కు, జవాబు, సవాల్ –(ఇవి ఛాలెంజికి వాడుక–) బిఛానా, మహల్, ఫౌజు (ఫౌజ్ పేటుగా మారింది–) రంగు, ముసాయిదా, (మూలపదం ముస్వదా–) ఖాతరు ఫస్లీ, దరఖాస్తు, సంజాయిషీ, ఖాతా, దస్తావేజు, అమీన్, జవాబుదారీ, అసల్, మెహర్బానీ, పైసా, పాలీనా, దబాయింపు, మినహాయింపు, ఈ విధంగా వేలాది ఉర్దూ పదజాలం తెలుగులోకి వచ్చి అవి ఇంచుమించు తెలుగుపదాలుగానే చెల్లుబడి అయినవి. ఈలాగే ఇంగ్లీషు భాష పరిపాలనభాషగాగల ప్రాంతంలో పూర్వపు ఉర్దూ పదాలతోపాటు ఇంగ్లీషు పదాలుగూడా తెలుగుభాషలో వాడుకలోకి వచ్చినవి. ఎన్నో అన్యభాషాపదాలు తెలుగులో అర్థభేదంతోనూ, ఉచ్చారణభేదంతోనూ వాడబడుతున్నవి. ఈ విషయం చిన్న చిన్న తెలుగు కథానికలు చదువుతున్నప్పుడు మనకు స్పష్టమవుతుంది. మహాకావ్యాల్లోకూడా ఉర్దూపదాలు ప్రాకి శిష్టములైనాయి. దీనికి ఉదాహరణంగా “తామరసనేత్రి లింప్ల ‘బందాలు’ కొర” అను పెద్దన మనుచరిత్ర ప్రయోగం చూడవచ్చును.

సాధారణంగా వాడుకలో ఉన్న జీవద్భాషల్లో పరస్పరం ఆదాన ప్రదానాలు ఉంటాయి. కనుకనే కొన్ని ఉర్దూ పదాలు తెలుగుపదాలు, ఇంగ్లీషులోకి గూడా ప్రాకినాయి. ఉదాహరణకు “సుమర్ హింద్” అనే ఫార్సీ పదం, ఇంగ్లీష్‌లో “టామరిండ్” అని అంటారు. (అంటే చింతచెట్టు.) (తమర్ అంటే ఖర్జూరం. హింద్ అంటే భారతదేశం. హిందూదేశపు దేశము ఖర్జూరం అన్నమాట.) పందికొక్కు అనే తెలుగుపదం ఇంగ్లీషులో “బ్యాండీకూట్” అయింది. జంగల్, ధర్నా, హర్తాల్, వంటి యితర పదాలు ఇంగ్లీషులో చేర్చుకున్నారు.

బహమనీ, కుతుబ్‌షాహీ నవాబులు కొన్ని భూదాన పత్రాలు తెలుగులో వ్రాసి యిచ్చినారు. వాటిలో అధికంగా ఫార్సీ, ఉర్దూ పదాలు వాడబడినాయి. ఉదాహరణకు—

“ సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్ షాహగారు కిల్లా కట్టుటకునకు ప్రయత్నించేస్తీ కుదురసంగున తన ముకుప్తైన హైయత్ ముస్తఫా సాహెబ్ ఖాదరీ, సాకిన ఔరంగాబాద్, హాల్ ముకాం గుల్బర్గా గారిలో బాదుషా చేసే బగాన్ ఏమనగా భాగా నగరంవద్ద కిల్లా కట్టవలెనని ఉన్నది. కుదురలేదు. దమ్మగు కొంపెయ్య చాలా కరాముతు కలవాడు. అతని మహరాజా ఏమంటే” ఈలాగు సనదులు తెలుగులో వ్రాసేవారు. అవి అర్థం చేసుకోవడానికి ఆ భాషాపదాలు అలవాటులో ఉండకపోవడం అగోముల్లో నేమి— ఈ రోజుల్లోకూడా అవసరమై ఉన్నది.

ఈలాగే ఇంగ్లీషుభాషా ప్రభావంగూడా తెలుగుపై పడింది. కోర్టు, కోర్సు, ఆఫీసు మొటారు మొదలైన ఎన్నో ఉన్నాయి. మనం వాడే అంకెలు ఇంగ్లీషు అంకెలే. తెలుగు అంకెలు, పొంకంగానూ, అలవాటుగానూ వ్రాయడం, తెలంగాణాలో తప్ప ఆంధ్రలో ఎక్కడా కనబడదు. తెలుగు గ్రంథాల ముఖపత్రాలు, పీఠికలు ఇంగ్లీషులోనే వ్రాయించే ఆచారం ఇప్పటికీ గూడా ఉన్నది. ఉద్దండ తెలుగుపండితుడైన కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి తెలుగు గ్రంథములపై అభిప్రాయాలు, తెలుగు సభలకు సందేశాలు, ఇంగ్లీషులోనే ఇచ్చేవారు. ఇప్పటికీ యీ ఆచారం తెలుగు పెద్దలలో వున్నది. కనుక రాజకీయభాషా ప్రభావం పాలితుల భాషలపై తప్పనిసరిగా పనిచేయడానికి ఎన్నో దృష్టాంతాలు చూపవచ్చును. ఒక భాషాదాస్యమేకాక భావదాస్యం కూడా తప్పకుండా కలుగుచుండడానికి మనలో కొందరు ముస్లిం ప్రముఖులు, కొందరు ఆంగ్లేయప్రముఖులు పేరుకోవడం, మన భాష వాక్యాలననుసరించి ఇతరభాషల వాక్యాలు కూర్చి వాడడం తార్కాణంగా తీసుకోవచ్చు. ప్రేమచందు, టాల్‌స్టాయి, బెర్నార్డ్‌షా మొదలగువారి గ్రంథాలు అధునిక తెలుగు వాఙ్మయంలో తర్జుమాచేసినప్పుడు తప్పకుండా ఆయాభాషల భావాల ప్రభావం పడుతుంది. ఇవి ప్రాంతీయ సరిహద్దులనుండి క్రమంగా ప్రాంతమంతా ప్రాకిపోతాయి. భాష ఆయాప్రాంతాల ప్రజల వ్యవహారానికి ప్రధానంగా ఉపయోగపడేది కనుక ప్రజలకు విషయగ్రహణం కావడమే భాషకు ప్రయోజనం. అందువల్ల వారి బహుళప్రచారంలో వున్న ఇతర భాషాపదాలే తెలుగులో వాడడం ఆచారమైనది. ఇది అనివార్యమూ, అత్యవసరముకూడా అయింది. ఇతర భాషల సంపర్కం ఏమీ లేకుండా శుద్ధంగా వుండినుకున్న సంస్కృతానికికూడా యీ దెబ్బ తప్పిందికాదు. జగన్నాథ పండితుడు అసఫ్‌ఖాన్ శతకం వ్రాసినప్పుడు కృత్రిమ సంస్కృతికి చెందిన పదాలెన్నో సంస్కృత శ్లోకాల్లోకి ఎక్కించినారు. ఆయన ‘భూమినాథ శహాబుద్దీన’ అని సంస్కృతపద్యం వ్రాసినారు. కనుక జీవద్భాషల్లో కలిగే పరస్పర సంబంధాలను గుర్తించి వాటిని ఓర్పుతో గ్రహించి విజ్ఞానం సంపాదించడం ప్రపంచ ప్రజల కెంతో అవసరం. ఒక భాష పదాలు మరియొక భాషలో కలిసిపోవడానికి కేవలం రాజుల స్వమతాభిమానం, భాషాభిమానమేకాక ప్రజల వ్యవహారంకూడా ముఖ్యమని తెలుసుకోవడం అవసరం.

# మన్మథ మహిమ

శ్రీ జి. జాషువ

నిండుజాబిలిలోన పండిపోయిన హాయి
చిరునవ్వు తునకలో జిలికినావా!
పుట్టతేనియలోన మిట్టాడు మధురిమ
నధర బింబంబులం దదికినావా!
కులపర్వతములలో నెలకొన్న బిగువెల్ల
గుబ్బ పాలిండ్లలో గ్రుక్కినావా!
ఆణిముత్యాలయం దలరారు మెరుగును
మేనుకీవెలలోన మెదిపినావా!

హృదయవేద్యమైన ఎంత తీపిబిగించి
మగువ నద్భుతముగ మలచినావా
నాడు శతముఖుండు కోడిపుంజై నాడు
మేనుమరచి — ఆడుదానికొఱకు.

బిగిగుబ్బల్ వలికుబ్బ బుగ్గలగులా
బీ వన్నెరాణింప, జి
ర్నగవుం జూపుటలుంగులం బరపి ఆ
రాధించు దుర్గమ్మ యొం
టిగ చేజిక్కగ పాపకచ్ఛదములన్
భేదించి చేపట్టడే
సెగకన్నున్న శివయ్య, మారునిశరా
ర్చి జ్వాల సామాన్యమే!

# ఆంధ్రలో పారిశ్రామికాభ్యుదయం

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

పారిశ్రామిక వ్యవస్థకు అవసరమైన అనేక సదుపాయాలు కల రాష్ట్రాలలో మనఆంధ్రప్రదేశ్ గణనీయమైనది. అనంతమైన ప్రకృతిసంపద, అపారమైన విద్యుచ్ఛక్తి, విస్తృతమైన తీరప్రదేశము, దీర్ఘమైన నదీమార్గాలు, కావలసినంత శ్రామికశక్తి, ఆహార స్వయంసమృద్ధి—అన్నీ ఉండికూడ పారిశ్రామిక పురోగమనదృష్ట్యా మనరాష్ట్రం వెనుకబడింది. ఈ అవాంఛనీయమైన వెనుకబాటుతనానికి కారణాలు అనేకం కావచ్చును. మొన్నటివరకు కేవలం స్వలాభాపేక్షతో అనేక ప్రదేశాలను, ప్రజలను ఒక్కొక్క అసహజమైన రాష్ట్రంగా ఏర్పాటుచేసి పరిపాలించిన పరదేశీయులు కావచ్చును. స్వరాష్ట్రసిద్ధిలో కలిగిన విశేషజాప్యం కావచ్చును. కాని ఆ కారణాలను మననం చేసుకోవటం గతజలసేతుబంధనం వంటిది. నేడాంధ్రలో ఏకీకరణ సిద్ధి చేకూరింది కాబట్టి, త్వరిత పారిశ్రామిక పురోగమనానికి పరిస్థితి అనుకూలించింది. రాష్ట్ర ఆదాయాన్ని అభివృద్ధిచేసి, ప్రజల జీవనప్రమాణాలను పెంపొందింపచేయుటకు పారిశ్రామిక పురోగమనం అత్యవసరం.

విదేశాలలో రెండు విభిన్న విధానాలద్వారా పారిశ్రామిక పురోగమనం జరిగింది. అమెరికా, ఇంగ్లండు, హాలండు, కెనడా, ఆస్ట్రేలియా, ఫ్రాన్సు మొదలైన పెట్టుబడిదారీ దేశాలలో అవలంబింపబడిన స్వేచ్ఛావిధానం ఒకటి. సర్వంసహాధికార ప్రభుత్వ పాలితదేశాలలో అవలంబింపబడిన సామ్యవాద విధానం రెండవది. ఈ రెండవ విధానాన్ని అవలంబించి శీఘ్ర పారిశ్రామిక పురోగమనాన్ని సాధించిన ముఖ్యదేశం సోవియట్ రష్యా. భారతదేశం తన పరిశ్రమాభివృద్ధి కవలంబించిన విధానం పై రెండు పద్ధతులను తగువిధంగా మిశ్రితమొనర్చడంవలన జనించిన ఒకమహత్తర నూతన విధానం. దీనికే సోషలిస్టిక్ పాటర్న్ ఆఫ్ సొసైటీ అని మనవారు నామకరణం చేసేరు. ఒక్కముక్కలో చెప్పాలంటే ప్రజాస్వామ్య విధానాలద్వారా సామ్యవాద ఆశయాలను సాధించడం. సాధారణంగా ప్రజాస్వామ్యానికి, సామ్యవాదానికి ఎక్కడా సమన్వయం కనపడదు. భారతీయ వాతావరణానికి అనువైన అంశాలను రెంటిలోను ఏర్చి కూర్చి, రెంటికీ మూలములైన ప్రజా, ప్రభుత్వ రంగాలలో మహత్తరాభివృద్ధికి దోహదమొసగగలిగేటట్లు ఈ నూతన విధానం రూపొందించబడింది. దేశంలో ఆర్థిక పురోగమనానికి ఈ సూత్రం అవలంబిస్తూ, ఒకవంక పరిశ్రమల అభ్యుదయానికి ప్రభుత్వం తీవ్రకృషిచేస్తూ ప్రజారంగంలో పెట్టుబడిదారులను ప్రోత్సాహిస్తుంది. ఆంధ్ర పారిశ్రామికాభ్యుదయాన్ని పరిశీలించటప్పుడు, ఈ జాతీయార్థిక విధానాన్ని విస్మరింపకూడదు.

పారిశ్రామిక వ్యవస్థానిర్మాణంలో అనేక విషమసమస్యలు ఎదురౌతాయి. వీటిని విజయవంతంగా పరిష్కరింపనిదే పురోగమనం సాధ్యంకాదు. వీనిలో ప్రప్రథమంగా పరిశీలింపదగినది ఆర్థిక సమస్య. భారీ కర్మాగారాలను నిర్మించేందుకు (Factories) కార్మికులకు ఈయవలసిన వేతనాలకు (wages) అతి వ్యయసాధ్యమైన నూతన యంత్రాంగాన్ని కొనుగోలుచేసేందుకు, సాంకేతిక నిపుణులను వినియోగించేందుకు, విద్యుచ్ఛక్తి సరఫరాకు (power supply) అధిక వ్యయమౌతుంది. ఈ సమస్య ఆంధ్రరాష్ట్రంలో రెండువిధాలుగా అంకురిస్తుంది. పెట్టుబడి పెట్టగలిగినా, ముందంజవేయడానికి సాహసింపలేనివారినుంచి, అద్భుతమైన పారిశ్రామిక నిర్వహణశక్తి, పరిజ్ఞానం కలిగియుండికూడ తగిన మూలధనం లేనందువలన వెనుకంజవేసే పారిశ్రామిక వేత్తలవరకు మొదటితరగతివారికి ప్రభుత్వ ప్రోత్సాహం, రెండవతరగతివారికి ప్రభుత్వ సహాయం అవసరం.

ఇక రెండవ సమస్య విద్యుచ్ఛక్తి సరఫరా విషయంలో ఎదుర్కొనవలసియుంటుంది. భారీపరిశ్రమల నిర్వహణకు అతిచౌకగా ఎక్కువశక్తి సరఫరా కావలసివుంటుంది. పై రెండు సమస్యలకన్న తీవ్రతరంగా పరిణమించి పారిశ్రామిక పురోగమనానికి గొడ్డలిపెట్టుగా వున్నది విదేశీమారక ద్రవ్య సమస్య. ఏ కర్మాగారాన్ని నిర్మించాలన్నా అతి వ్యయకమైన విదేశీ యంత్రాంగాన్ని మనం దిగుమతి చేసికోవాలి. యంత్రాంగాన్నే కాక పరిశ్రమను నిర్వహింపగల సాంకేతికనిపుణులను సహితం ప్రథమావస్థలో పైదేశాలనుండి రావించాలి. దీనికి గొప్ప విదేశీ ద్రవ్యసంపద అవసరం. మన రాష్ట్రంలో అనేక పరిశ్రమలు రాష్ట్రప్రభుత్వానుమతులను పొందికూడ దిగుమతులపై ఆంక్షలవలన ఆరంభదశలోనే అంతరిస్తున్నాయి. మన పారిశ్రామికాభ్యుదయానికి ముఖ్యమైన ఆటంకాలలో విదేశీ ద్రవ్య సమస్య ఒకటి.

ఒక రాష్ట్రంకాని, ఒక దేశంకాని పారిశ్రామిక వ్యవస్థను సాధించే ముందు రవాణాసదుపాయాలను వృద్ధిచేసుకోవాలి. ఆంధ్రప్రదేశ్ రవాణాసౌకర్యాలలో చాలా వెనకబడి ఉంది. దూర దూరంగావున్న గ్రామములను, ముడిపదార్థాల స్థానాలను, విక్రయ కేంద్రాలను కలపడానికి అతి విపులమైన రవాణా అవసరం. రాష్ట్రమంతటా దీర్ఘ జలమార్గాలు, రైలుమార్గాలు, రస్తాలు ఉండడమేకాక ఎగుమతి దిగుమతులకై నౌకాశ్రయాలుకూడా అవసరం.

పారిశ్రామిక పురోగమనం దృష్ట్యా ఆంధ్రరాష్ట్రంలో జనింపనున్న మరొక సమస్య, భారీపరిశ్రమల సంస్థాపనద్వారా కలిగే స్పర్థ (competetion)కు తట్టుకోనజాలని అసంఖ్యాకములైన చిన్నపరిశ్రమల నాశనాన్ని కలుగజేస్తుంది. మనరాష్ట్రం గ్రామీణ పరిశ్రమలకు, విశేషమైన పనితనం అవసరమైన చేతిపరిశ్రమలకు ప్రపంచ ప్రసిద్ధిపొందిన విషయం సువిదితమే. ఇరవైవ శతాబ్దారంభంలో

విదేశీ పారిశ్రామిక వస్తుజాలంవలన ఈ తరహా పరిశ్రమలు దెబ్బ తిన్నవి. ఈ సమయంలో భారీపరిశ్రమలు వృద్ధిపొందినట్లయితే వీనికి అపారనష్టం కలుగవచ్చును. తరతరాలుగా ఈ పరిశ్రమలందు వంశ పారంపర్యమైన నేర్పరితనాన్ని కలిగిన అనేక పారిశ్రామికులు ఒక్కసారిగా నిరుద్యోగులయ్యే ప్రమాదం వుంది. ఈ ప్రమాదం ముఖ్యంగా చేనేతవస్త్ర పారిశ్రామికులకు ఎక్కువ. అందువలన రాష్ట్ర పరిశ్రమాభివృద్ధి ప్రణాళికలందు ఈ సమస్య తగువిధంగా పరిష్కరింపబడవలసిన ఆవశ్యకత చాలావుంది.

ఏ పరిశ్రమఅయినా తదుత్పాదిత వస్తుజాలానికికల గిరాకీ (Demand) ననుసరించి పురోగమిస్తుంది. దేశంలో పారిశ్రామిక విప్లవాన్ని సాధించాలనే ఉద్రేకంతో వివిధ పరిశ్రమలను వానివాని గిరాకీ పరిస్థితులను గమనింపకుండ నెలకొల్పడం అవివేకమే అవుతుంది. ఒక ప్రత్యేక పారిశ్రామిక వస్తువునకు దేశీయమైన గిరాకీ కూడ విదేశీయోత్పత్తి పైననే కేంద్రీకరింపబడి ఉన్నట్లైతే ఆ పరిశ్రమను స్థాపించే ముందు ఆ గిరాకీని దేశీయోత్పత్తి వంకకు మరల్పడానికి తగిన కృషి అవసరం. ఈ కృషే విదేశీయోత్పత్తిదారులతో స్పర్ధకు దారితీస్తుంది. దాదాపు అన్నిరంగాలలోను విదేశీ పారిశ్రామికవేత్తలు మనవారిని జయించేరని చెప్పవచ్చును. తరతరాలుగ స్వాతంత్ర్య వాతావరణంలో పురోగమించినవారి పరిశ్రమల ముందు మన బాల్యపరిశ్రమలు (Infant Industries) పోటీకి నిలువడం కష్టసాధ్యం. అయితే పారిశ్రామికపురోగమనం ప్రాథమిక దశలో, అంతర్జాతీయ విక్రయరంగంలో ఆధిపత్యాన్నటుంచి దేశీయమైన గిరాకీకి సరిపోయే ఉత్పత్తిని తయారుచేసేందుకు కృషి అవసరం. పారిశ్రామిక పురోగమనానికి మరొక విషయాన్ని కూడ గమనించాలి. కేవలం దేశం నలుమూలలా నాలుగు కర్మాగారాలను నెలకొల్పినంతమాత్రాన సరిపోదు. అతి వ్యయకరమైన భారీపరిశ్రమల నిర్మాణానికి వైదేశిక సాంకేతిక నిపుణుల సహాయం అవసరం. విదేశాలనుండి సాంకేతికనిపుణులను తీసుకవచ్చినంతమాత్రాన, మన జాతీయ గౌరవానికి భంగం వాటిల్లదని గ్రహించాలి. మనవారికి తగిన సాంకేతిక విజ్ఞానసంపద చేకూరేవరకు విదేశీయులను దిగుమతిచేసుకోవాలి. ఈ నడుమనే జరిగిన ఒక అనభిలషణీయమైన విశేషనష్టం ఈ విషయాన్ని ధ్రువపరచింది.

రాష్ట్ర పారిశ్రామికపురోగమనానికి అడ్డుతగలగల అనేక సమస్యలు పైన వివరింపబడ్డాయి. అయితే ఈ సమస్యలకు పరిష్కార మార్గాలు లేకపోలేదు. ప్రథమంగా ఆర్థికసమస్యను పరిశీలిద్దాం. జర్మనీదేశంలో ఆర్థికపురోగమనానికి ముఖ్యంగా ఆర్థిక సదుపాయం చేసినవి ఆ దేశపు ధనాగారాలే. ప్రభుత్వ ప్రోత్సాహంతో ఈ బ్యాంకులు పెట్టుబడిదారులకు విస్తారమైన ఋణ సౌకర్యాలను కల్పించి సహాయపడ్డాయి. నూతన పరిశ్రమలను స్థాపింపచేయడం, ఆర్థిక దుస్థితిలోనున్న భారీపరిశ్రమలను ఉద్ధరించడం, మూలధనాన్ని ఋణంగా ఒసగడం, ప్రారంభదశలో వాటాలను క్రయించి పరిశ్రమ పెంపొందినతరువాత వానిని విక్రయించడం మొదలైన సౌకర్యాలనవి చేయడంవలన జర్మన్ పరిశ్రమలు శీఘ్రపురోగమనం చేయకలిగాయి. ఇంతేకాక ఒక ప్రత్యేక ధనాగారం ఒక పెద్ద భారీపరిశ్రమను ఆర్థికంగా నిర్వహింపలేకపోతే నాలుగు మూడు సంస్థలు కలిసి ఒక సమితిగా (Consortium) ఏర్పడి పరిశ్రమకు చేయూతనొసగేవి. ఈ విధమయిన పారిశ్రామిక ధనాగారాలను ప్రభుత్వరంగంలో సాధ్యపడకపోతే, కనీసం ప్రైవేటురంగంలోనైనా ప్రోత్సహించాలి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తలచుకుంటే ప్రజలసహకారంతో వీటిని సులభతరంగా స్థాపించవచ్చును. భారతదేశాని కంతకు ఏర్పాటుచేయబడిన పారిశ్రామికార్థిక సహాయసంస్థ (Industrial Finance Corrporation) రాష్ట్రీయంగా అనేక శాఖలుగా విభజింపబడి ఎక్కువ సహాయకారి కావచ్చును. ఈసంస్థలమూలకంగానే కాక రాష్ట్రప్రభుత్వంఋణాలరూపకంగాను గ్రాంట్ల రూపకంగాను ప్రత్యక్షసహాయాన్ని కావించవచ్చును. ప్రతీదానికి ప్రభుత్వంపైననే ఆధారపడరాదని మన మంత్రులు బోధిస్తున్నప్పటికి సత్వరాభివృద్ధి సాధనకు పారిశ్రామిక ప్రాథమిక దశలో ప్రభుత్వసహాయాన్ని అపేక్షించకుండా ఉండడం సాధ్యం కాదు. విప్లవం జరగడానికి పూర్వం చైనాలో పారిశ్రామికసహకార సంఘాలు (Industrial Co-operative Societies) ఆ దేశంలో పారిశ్రామిక పురోగమనానికి చాలా దోహదమొసగాయి. ఈ విధమైన సంఘాలను మన దేశంలోకూడ ప్రోత్సహించవచ్చును. చిన్నతరహా పరిశ్రమలలో అధిక ఫలితాలనొసగే ఈ సంఘాలు భారీపరిశ్రమల ఆర్థిక నిర్వహణకుకూడ విస్తరింపచేయబడాలి.

ఆంధ్రరాష్ట్రంలో పారిశ్రామిక శక్తి సరఫరాసమస్య అంత క్లిష్టమైనది కాదని చెప్పవచ్చు. కృష్ణా, తుంగభద్ర, గోదావరి నదులవలన మనకు అపారమైన జలవిద్యుచ్ఛక్తి లభిస్తుంది. నాగార్జునసాగరం పథకం ఫలవంతమైన వెనుక సుమారు 75,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి వస్తుంది. ఈ సంవత్సరంలో ఇంతవరకు తుంగభద్రా జలపాత విద్యుత్పథకంక్రింద (Tungabhadra Hydro Electric Scheme) 18,000 కిలోవాట్లశక్తికి పైగా లభించింది. క్రిందటి సంవత్సరానికి 18,000 కిలోవాట్లశక్తి లభించింది. ఈ 36,000 కిలోవాట్లశక్తికాక ఇంకా 27 వేలకిలోవాట్లశక్తిఉత్పత్తికాగలదని అంచనా వేసేరు. 18,000 కిలోవాట్ల శక్తి నుత్పత్తిచేయగల ఎడమభాగపు శక్త్యుత్పాదక గృహనిర్మాణం (Power House) అనుకున్న అంచనాలప్రకారం సాగిపోతోంది. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సారాష్ట్రాల పరస్పర సహకారంతో నిర్మితమయ్యే మాచ్‌ఖండ్ జలపాత విద్యుత్పథకంవలన లభించే శక్తిలో డెబ్భైపాళ్ళు ఆంధ్రకు, ముప్పైపాళ్ళు ఒరిస్సాకు లభ్యమౌతుంది. గోదావరి నదీజలాలు డుడుమా జలపాతం వద్ద 850 అడుగుల ఎత్తునుండి పడడంవలన అపారమైన శక్తిని జనింపచేస్తాయి. ఇది విశాఖపట్టణానికి 125 మైళ్ల దూరంలో ఉంది. ఇప్పటికే, నిర్మాణం పూర్తి అయిన మొదటి దశలో, మూడు ఉత్పాదక యంత్రాలు స్థాపింపబడినాయి. వీనిలో ఒక్కొక్కటి 17,000 కిలోవాట్ల శక్తిని ఉత్పత్తి చేస్తుంది. దీనిని 1955 లో రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేసేరు. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరులు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు ఈ శక్తి వినియోగమౌతుంది.

గోదావరికి మరొక ముఖ్యఉపనది అయిన మంజీర నాధారంగా చేసికొని నిజాంసాగర్ జలపాత విద్యుదుత్పాదక కేంద్రం

నిర్మితమాతోంది. 5000కిలోవాట్లశక్తి నుత్పత్తిచేసే యంత్రాలిక్కడ ఉన్నాయి. దీనికి హుస్సేన్‌సాగర్ థర్మల్ స్టేషన్‌తో సంబంధం ఉంది. హైదరాబాదువద్దనున్న యీ థర్మల్ స్టేషన్ ఆంధ్రలో అన్నిటికన్న పురాతనమైనది. ఇది హైదరాబాదు, సికిందరాబాద్ నగరాలకు సుమారు 20,000 కిలోవాట్లశక్తినందిస్తుంది. విజయవాడలో నున్న థర్మల్ స్టేషన్ సుమారు 12,000 కిలోవాట్లశక్తి నొసగుతుంది. విశాఖపట్టణం నౌకాశ్రయంవద్దనున్న థర్మల్ స్టేషన్ 6,750 కిలోవాట్ల శక్తిని; నెల్లూరు థర్మల్ స్టేషను 2,500 కిలోవాట్లశక్తిని, రామగుండం థర్మల్ స్టేషను 12,500 కిలోవాట్ల శక్తిని సరఫరా చేస్తాయి. ఇవికాక మొత్తం 15,000 కిలోవాట్లశక్తి నుత్పత్తిచేసే అనేక డీజెల్ స్టేషన్‌లు దేశం నలుమూలలా ఉన్నవి. ఎగువసీలేరు విద్యుదుత్పాదక పథకప్రకారం 60,000 కిలోవాట్లశక్తి నుత్పత్తి చేయగల రెండు యంత్రాలు నిర్మితమాతాయి. దిగువ సీలేరు ప్రణాళిక మూలంగా 60,000 కిలోవాట్లశక్తి లభ్యము కాగలదు. దేవనూరు, సిద్ధేశ్వరం, పులిచింతల, ఇంచంపల్లి, సింగారెడ్డిపల్లి, లక్ష్మీపురం కేంద్రాలనుండి అధికశక్తి మనకు త్వరలోనే లభింపగలదు. కాబట్టి శక్తిసరఫరా విషయంలో మన రాష్ట్రానికి లోటు ఉండదు. ఇట్టి శక్తిసంపద మన పారిశ్రామికాభ్యుదయానికి దోహదకారి కాగలదు.

ఇక నేటికీ అపరిష్కృతంగానే మిగిలిపోయినది విదేశీమారక ద్రవ్య సమస్య. ఇది దేశీయమైన విషమసమస్య కావడంవలన కేవలం ఏ ఒక్క రాష్ట్రం దీని నెదుర్కొనడం సాధ్యంకాదు. ఎంతటి విషమ సమస్య అయినప్పటికి విదేశాలు మనదేశంపట్ల చూపుతూన్న సహృద్భావంవలన ఈ సమస్య త్వరలోనే పరిష్కారంకాగల అవకాశం లేకపోలేదు. ప్రపంచ ధనాగారం (World Bank), అంతర్జాతీయ ద్రవ్యనిధి (International Monetary Fund) మొదలైన సంస్థలు జపాన్, అమెరికా, పశ్చిమజర్మనీ, కెనడా, రష్యా, ఆస్ట్రేలియా మొదలైన విదేశాలు మన ప్రణాళికలపట్ల చూపిన ఔదార్యం, భారత వైదేశిక రాజనీతికి ఒక ఘన విజయం అని చెప్పవచ్చును. విదేశీ సహాయం వలన, దిగుమతులపై తీవ్రమైన ఆంక్షవలన, ఎగుమతుల ప్రోత్సాహంవలన యీ సమస్య సడలిపోసాగింది.

మనం ఎదుర్కొనగల మరొక సమస్య, పారిశ్రామిక పురోగమనం వలన చిన్నతరహా పరిశ్రమలకు, భారీ పరిశ్రమలకు నడుమ ఏర్పడకలిగే అనభిలషణీయమైన స్పర్ధ. దీనివలన తరతరాలనుండి వస్తున్న సాంప్రదాయికమైన చేతి పరిశ్రమలకు నష్టం వాటిల్లి, తత్కారణంగా అనేకులకు నిరుద్యోగం సంభవింపగల ప్రమాదం ఉంది. అయితే ఒక నిర్ణీతపథకం ప్రకారం దేశంలో పారిశ్రామికపురోగమనం జరిగితే దీన్ని తొలగింపవచ్చును. ఈవిధంగానే రవాణాసమస్య పరిష్కారంకూడ. అయితే రోడ్ల నభివృద్ధిచేయడం ఒకటే కొంతవరకురాష్ట్రప్రభుత్వం చేతిలోని పని, కాని రైలు మార్గాలను, నౌకా కేంద్రాలను విస్తృతపరచడం కేంద్రప్రభుత్వం మాత్రం చేయగలపని. రాష్ట్ర ప్రభుత్వం వీటిపై పరిశీలనలు జరిపి నిర్మాణాత్మకములైన సలహాల నొసగవచ్చును. ఇక రోడ్ల సంగతి. ఆంధ్ర ప్రదేశ్ లో చదరపు మైలు ఒక్కంటికి 0.18 మైలు పొడవుగల రోడ్డు మార్గం సరాసరిన కలదని అంచనా వేసేరు. పూర్వాంధ్ర రాష్ట్రంలోకన్న తెలంగాణాలో రోడు సౌకర్యం చాల తక్కువ. విస్తారంగా రోడ్ల నభివృద్ధి పరచటాన్ని నాగపూరు పథకం (Nagpur Plan—1943) ఆంధ్ర జిల్లాలకే కాని తెలంగాణాకు ఇంకా విస్తరింపబడలేదు. కాబట్టి ఆ ప్రణాళిక సత్వరమే తెలంగాణాకు కూడ విస్తరింపబడాలి. ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలంలో మనరాష్ట్రంలో మొత్తం 782 మైళ్ళు పొడవైన క్రొత్త రోడ్డుమార్గాన్ని నిర్మించారు. ద్వితీయ ప్రణాళికా కాలంలో 1,516 మైళ్ళ పొడవైన మార్గాలను నిర్మించాలని నిర్ణయించారు. ఆంధ్రప్రదేశ్ లో రవాణాసౌకర్యాలఆవశ్యకతకుగురించి రాష్ట్రంలో ప్రత్యేకరహదారీశాఖను (High ways Department) స్థాపించారు. ఇప్పటికీసంస్థ సుమారు 1400 మైళ్ళ పొడవైన బాటలను నిర్మించింది. దీనిలో 92 మైళ్ళు సిమెంటు కాంక్రీటు చేయబడినాయి. ప్రభుత్వాధ్వర్యంక్రింద నిర్మింపబడినవి 17,836 మైళ్ళు పొడవైన బాటలు. దీనిలో 118 మైళ్ళు సిమెంటు కాంక్రీటు చేయబడినాయి. ఇవికాక ద్వితీయ ప్రణాళికలో మహత్తరాభివృద్ధి పథకాలు తయారుచేయబడ్డాయి. ఖనిజసంపదలు, బొగ్గుగనులు, పంచదారమిల్లులు ఉండేచోట్ల ఏజన్సీ ప్రాంతాలందు ఇవి వల ప్రత్యేకశ్రద్ధ తీసుకొంటున్నారు. ఇప్పుడు జరుగుతూన్న ప్రకారం రోడ్లనిర్మాణం కొనసాగితే, నాగపూర్ పథకంలో అనుకున్నదానికంటె రెండు సంవత్సరాలముందే ఆ ఆశయాలు నెరవేరకలవు. ఈవిధమైన రవాణాభివృద్ధి పారిశ్రామికాభ్యుదయానికి మిక్కిలి దోహదకారి కాగలదు.

ఏ రాష్ట్రంలోనైనా, పారిశ్రామిక పురోగమనానికి విస్తారమైన ఖనిజసంపద అవసరం. ఈ విషయంలో ఆంధ్ర ప్రదేశ్ అదృష్టవంతమైన రాష్ట్రమనే చెప్పవచ్చును. ఖనిజ సంపద విషయంలో ఆంధ్రరాష్ట్రం భారతదేశంలో బీహార్ తరువాత అగ్రస్థానా న్నాక్రమిస్తుంది. మైకా, మాంగనీసు, లోహఖనిజం, ఆస్బెస్టస్ (రాతినార), సున్నపురాయి, బెరైటిస్ మొదలైనవన్నీ మనరాష్ట్రంలోనే లభిస్తాయి. ఇవికాక సిమెంటు, ఇటుకలు, పెంకులు, పింగాణీ, గాజు పరిశ్రమలలో ఉపకరించే అనేక ఇతరముడి పదార్థాలు మనరాష్ట్రంలో లభిస్తాయి. ఈ ఖనిజపదార్థాలకు తగినంత గిరాకీ కూడ ఉంది. మన రాష్ట్రంలో లోహఖనిజం మొత్తం 480 మిలియనుటన్నులవరకుఉందని అంచనావేసేరు. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో విరివిగా లభించే ఖనిజం మాంగనీసు. 1957 లో మొత్తం 19,000 టన్నుల ఖనిజం ఉత్పత్తి అయింది. నెల్లూరులో మైకా లభిస్తుంది. కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో అధికంగా బెరైటిస్ లభ్యమాతుంది 1956 లో ఒక్క ఖమ్మంమెట్టులోనే ఎనిమిదిలక్షల టన్నులు లభించింది. రబ్బరు, లినోలియం, ప్లాస్టిక్సు, అచ్చుసిరాలు మొదలైనవాని ఉత్పత్తిలో బెరైటిస్ బాగా ఉపయోగపడుతుంది.

ఇక మనరాష్ట్రంలోని ముఖ్య పరిశ్రమలకు అభివృద్ధి పథకాలను పరిశీలిద్దాం. మొదట పరిశీలింపవలసినది సిమెంటు పరిశ్రమ. సిమెంటుపరిశ్రమకు కావలసిన ముడి పదార్థాలు అతి చవుకగాను, సులభంగాను మనకు లభిస్తున్నాయి. సున్నపురాయి, బంకమన్ను సిమెంటు ఉత్పత్తికి అవసరమైన మూలపదార్థాలు. సిమెంటును సాధారణంగా మూడు రకాలుగా తయారుచేస్తారు. ఒకటి పోర్టు

"మీ మాటలు వింటుంటే నాకు భయంగా వుంది. దయచేసి నన్ను వెళ్ళిపోనివ్వండి. మీరు ప్రభావతిని చూడ్డం కోసం వచ్చారు. మీ మాటల్ని మా వాళ్ళు గనుక వింటే..."

చూపులతోనే వారించి భానుమూర్తి లక్ష్మికి అడ్డు తగిలాడు. "మీ వాళ్ళతో నాకు ప్రసక్తి లేదు లక్ష్మీ! ఆ ప్రసక్తిని తెచ్చి మన ప్రసంగాన్ని కలుషితం చేయవద్దు. పావురం వలలో నుంచీ బయటపడడం ఏ పరిస్థితిలోనూ వేటగాడికి సంబరంగా వుండబోదు. బస్తీ నుంచీ వెళ్ళిపోక తప్పదన్న నిర్ణయానికి వచ్చిన తర్వాత రాత్రంతా మేలుకుని శేషగిరి నీ కథ వ్రాశాడు. వ్రాసి ముగిస్తూ 'లక్ష్మి నా కోసం ఎవరిని అడుగుతుం'దని వాపోయాడు. నువ్వు మేష్టరుగారెక్కడ అని నన్ను ప్రశ్నిస్తున్నావు. ఈ అంకె గూడా దైవికంగానే వుంది. నేను నీకు క్రొత్తవాణ్ణి. వినా నువ్వు నన్ను దాసవున్నాని మాత్రం భావించక పోతేచాలు. నువ్వు నన్ను నమ్మాలే గానీ, నమ్మలేక పోతే బాసలు పలికి నిన్ను నమ్మించడం గూడా నాచేత గాదు. ఏమంటావు లక్ష్మీ?"

రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడచిపోయాయి. ఆ రెండు నిమిషాల్లో మొదట లక్ష్మి కనుగొలకుల్లో కన్నీటి ముత్యాలు నిలిచాయి. ఆ తరువాత కన్నీటిధారలు కపోలాల వెంట చారికలు కట్టాయి. పెదవులు గులాబీరేకుల్లా వణికాయి. శోకం గొంతుకను పెగల్చుకుని బయటపడింది. వెక్కి వెక్కి ఏడుస్తూ లక్ష్మి గోడపైకి ఒరిగిపోయింది.

"తప్పు కాదూ! ఏడుస్తావెందుకు లక్ష్మీ?"

"నాకిదంతా ఓకలలా వుంది. కలే అయినప్పటికీ యిది కరిగి పోకుంటే చాలు!"

పైటకొంగుతో లక్ష్మి కన్నీటిని తుడుస్తూ అన్నాడు భానుమూర్తి—"ఇది కలెందుకౌతుంది లక్ష్మీ! నిజం. నీ హృదయంలోని మార్దవానికి మల్లె, నీ మనసులోని సైర్మల్యానికి మల్లే, నీ కళ్ళల్లోని అమాయకత్వానికి మల్లే అక్షరాలా నిజం!"

* * *

"నీకోక వుద్యోగం చూశాను. తక్షణం బయల్దేరి రావలిసింది—" వచ్చింది జాబు గాదు; టెలిగ్రాము. చూడగానే బయల్దేరాడు శేషగిరి. భానుమూర్తి స్టేషను దగ్గరకే ఎదుర్కోలు వచ్చాడు.

మిత్రులిద్దరూ చేతులు కలుపుకుని నవ్వుకొన్నారు. దోవ పొడుగునా భానుమూర్తి రాజకీయాలనుగురించి, యిటీవల పత్రికల్లో వెలువడిన మంచి కథలను గురించి చెప్పుకపోతున్నాడు. పల్లెటూరి నుంచీ వచ్చిన శేషగిరికి ప్రతి వార్తా క్రొత్తదిగానే వుంది. కానీ మనసంతా తనకోసం భానుమూర్తి చూచిన వుద్యోగంపైన్నే లగ్నమై వుండడంచేత అతడు నిద్రలాంటి పరధ్యానంలో మునిగి పోయి, తెప్పరిల్లి నప్పుడల్లా "ఓహో! అలాగా! అవును మరి" అన్న ఊతపదాలను దొర్లిస్తూ మిత్రుడి వెంట నడుస్తున్నాడు.

"ఇదిగోనోయ్ శేషగిరీ నా కుటీరం!" అన్నాడు భానుమూర్తి శేషగిరిని ఒకచోట ఆపి.

అది కుటీరంగాదు. భవనమే! శేషగిరి నవ్వుతూ "యింకా నయం! ఆశ్రమమనో, మఠమనో అన్నావుగావు" అన్నాడు.

"ఎంత చక్కగా వూహించావు శేషగిరి, పూర్వాశ్రమంలో యిది మఠమే! ఆ మఠంలో ఈ వైరాగి ఈగలు తోలుకుంటూ కాలం గడిపేవాడు!"

"ఐతే ప్రస్తుతం ఈ వైరాగి చేస్తున్న వనేమిత్రా భాగనూ కుండల్లో గుర్రాలుతోలడం కాదుగదా!" పకపక నవ్వుతూ శేషగిరి యింట్లో ప్రవేశించాడు.

"రాక రాక వచ్చావు. కూర్చో శేషగిరీ! నిన్నెలా సత్కరించడమో తోచడంలేదు. ఛాయిస్ నీకే వదిలిపెడ్తున్నాను. ఏం కావాలో చెప్పుకో! సర్బత్తా, కాఫీయా, టీయా, ఓవల్టినా?"

"ఓ గ్లాసులో చల్లగా మంచినీళ్ళు" అంటూ శేషగిరి కుర్చీలో కూర్చున్నాడు.

భానుమూర్తి లోపలికి వెళ్ళగానే శేషగిరి టేబిలుపైనించీ ఓ పత్రిక తీశాడు. వరుసగా బొమ్మల్ని మాత్రం చూశాడు. పత్రికను యథాస్థానంలో వుంచి మరో పుస్తకం చేతికి తీసుకుని అక్కడక్కడా నాలుగు పద్యాలు చదివాడు. అప్పటికే అయిదు నిమిషాలు గడచిపోయాయి. శేషగిరి విస్తుపోయాడు. మంచి నీళ్ళకోసం భానుమూర్తి క్రొత్తగా ఓ చేద బావి త్రవ్వడం లేదు గదా!

అడుగుల సవ్వడి వినిపించింది. శేషగిరి తలపైకెత్తాడు.

ఎట్టయెదుట పట్టుచీరలో లక్ష్మి.

నుదుట కుంకుమ. జడలో మల్లెపువ్వులు. మెడలో వన్నె మాయని పసుపుదారం.

లక్ష్మి చేతుల్లో పళ్ళెరం. పళ్ళెరం నిండుగా పువ్వులు. పువ్వుల పైన తన చివరికథ. అన్నింటికీ పైన ఓ చిన్ని కానుక—ఔదారంగు వూలు కలం.

పళ్ళెరాన్ని శేషగిరి పాదాల ముందుంచింది లక్ష్మి మొక్కరిల్లి "అంతా మీ దయ మేష్టరుగారూ! దీవించండి" అంది.

శేషగిరికి ఒక్క నిమిషంపాటు అనిమిషత్వం సిద్ధించింది. విప్పారిన అతడి కళ్ళ ఎదుట భానుమూర్తి గృహలక్ష్మి. ఆనంద వివశత్వంతో కనురెప్పలు బరువెక్కి క్రిందికి వ్రాలిపోయాయి. వండు వెన్నెల తళతళలలో పరవశమై దిగంతాలవరకూ అలలు అలలుగా కదిలిపోతున్న పాలమున్నీరు అతడి హృదయంలో వుయ్యాలలూగుతోంది!

# సంఘంతో వ్యక్తి, వ్యక్తితో సంఘం

శ్రీ కపిల కాశీపతి

సృష్టి క్రమంలో సంఘజీవిగా పరిణమించిన మానవుడికి నాటికి నేటికీ ఒక్కటే సమస్య. తనకీ తాను నివసిస్తున్న సంఘానికీ వుండవలసిన పరస్పర సంబంధ బాంధవ్యాల మీమాంస. వ్యక్తి యొక్కవా, సమాజం యొక్కవా? ఇదే ప్రశ్న. కాలమాన పరిస్థితుల్ని అనుసరించి అనేకమంది అనేక జవాబులూ, సమాధానాలూ చెప్పేవున్నారు. సమాజంకూడా ఆయారీతుల్లో నిర్మాణ పునర్నిర్మాణావస్థలు పొందుతూ వచ్చింది. వ్యక్తిగతంగా మానవుడికి కావలసింది ఏమిటి? మనశ్శాంతి. సామాజికంగా లోకానికి శ్రేయస్కరం ఏమిటి? అందులో నివసించే వ్యక్తికి ఏదిసుఖమో, సమాజానికికూడా అదేసుఖం. ప్రశాంతి. ఈవిధంగా వ్యక్తికి శాంతి సౌఖ్యం, సమాజానికి ప్రశాంతి సౌఖ్యం చరిత్రలో ఎప్పుడైనా ఉన్నాయా అంటే, ఇదమిత్థమని చెప్పడం కష్టం. సత్యయుగంలో ధర్మదేవత నాలుగుపాదాలా నడిచినప్పుడు వుండేదని వూహించాలి. ఒకసమాజంలో కొందరు వ్యక్తులికి శాంతి లభించి వుండవచ్చును. ఒకానొక ప్రాంతంలో మానవసంస్కృతి ఉచ్ఛస్థితిలోవున్న కాలంలో సమాజానికి సంతృప్తీ, సంతోషం, శాంతీ వుండివుండవచ్చును. అది మానవవిధులే ధర్మమైనకాలం అయివుండాలి. అటువంటిదే ఋషులకాలం. అటువంటిదే రామరాజ్యం. ఆధునిక చరిత్ర రీత్యా రామరాజ్యం అనేది కావ్యజగత్తులో వృత్తాంతం. అయినా మనదేశంలో అటువంటి సమాజం ఒక లక్ష్యం, ఒక ఆదర్శమూ అయినది.

ఈ కావ్యజగత్తు ప్రసాదించిన ఆదర్శానికీ మనతరంలో ప్రత్యక్ష ప్రపంచంలో మనకు సంప్రాప్తించే సమస్యలికీ ఏమైనా సామ్యంవున్నదా? అసలు వ్యక్తికీ సంఘానికీ వుండే పరస్పర సంబంధబాంధవ్యాల మీమాంసే సనాతనం, శాశ్వతం అయినప్పుడు ఆయా ఆదర్శానికీ సమస్యకీ సామ్యం వుండితీరుతుంది. శ్రీరామచంద్రమూర్తికి కలిగిన ఒకసమస్య ఆధునిక ప్రపంచంలో మరో చక్రవర్తికి కలిగిందా? కలిగితే రెంటి పరిష్కారంలోనూ అనుసరించిన పద్ధతులు పరిశీలించవచ్చు. శ్రీరాముడికి భార్యవిషయంలో ఒక సమస్య కలిగింది. మారువేషంలో వచ్చిన రజకుడొకడు గూఢచారులు వినేటట్టుగా రాముడిప్రవర్తన సరిగా లేదని దెప్పిపొడిచాడు. అన్నేళ్ళు రావణాసురుడి చెరలోవున్న భార్యని తెచ్చుకుని ఏలుకుంటున్నాడు రాముడూ అన్నాడు. ఆ మాటలో దేవేరిశీలమే శంకించాడు. రాజు ప్రవర్తన విమర్శించాడు. రాముడికి సీతమ్మ శీలంలో ఏవిధమైన శంకాలేదు. కాని వీడీవిధంగా ఆక్షేపణ లేవదీశాడు. నిజానికి వీడొక్కడే. తక్కిన ప్రజానీకానికి సీతమ్మ అంటే రాముడికంటెకూడా ఎక్కువ గౌరవం. ఆమాట వాళ్ళెవరన్నా వింటే నమ్మరు సరిగదా, రామరాజ్య సామాజిక శిక్షావిధానంలో వీలుంటే వాణ్ణి చీల్చి చెండాడివుందురు. ఏమైనా కాకపోయినా రాజైన రాముడి కిది సమస్య. యథారాజా తథాప్రజా అన్నారు. తనప్రవర్తన సక్రమంగావుంటే ప్రజలప్రవర్తన బాగుంటుంది. అప్పుడు సమాజంలో సంతృప్తీ, శాంతీ వుంటాయి. తనరాణి ప్రవర్తన సరిగావుంటే రాజ్యంలో స్త్రీలంతా సరిగా ప్రవర్తిస్తారు. తనకీ తనరాణికీమధ్య సంబంధబాంధవ్యాలు సరిగావుంటే రాజ్యంలో దంపతులంతా సరిగావుంటారు. ఇప్పుడు రాణికి ఈ పరోక్షనిందా దోషం కలిగింది. తాను నమ్మడు. ప్రజానీకం నమ్మదు. ఆ విషయం తనకి తెలుసును. కాని ఆ నమ్మకంతో దోషం తొలగిపోదు. నిర్దోషం అంటే ఆ పరోక్ష నిందకూడా వుండకూడదు. అది రాముడి ఆదర్శం. రామరాజ్య లక్ష్యం. ప్రజాబాహుళ్యం ఆమోదమే కాదు, సర్వప్రజానీకపు ఏకగ్రీవ ఆమోదం కావాలి. ఈ నిందాదోషానికి పరిష్కారం ఏమిటి? సీతని విడిచిపెట్టడం. తనకి ఏవిధమైన సందేహమూ లేదు. సీత తనప్రాణం. ఆమెని విడిచిపెట్టి వుండడం కష్టం. పైగా నెలలునిండిన చూలాలు. వ్యక్తిగా తనకర్తవ్యం ఏమిటి? సీతసుఖం, తనసుఖం, అంకురించబోయే తన సంతానసుఖం చూసుకుని, సీతమ్మలో దోషంలేదని ఘోషించి, కడుపులోనీళ్ళు కదలకుండా హాయిగా వుండడం. మరి తానూ సీతమ్మా మామూలువ్యక్తులు మాత్రమేనా? తాను రాజు, ఆమె రాణి. వ్యక్తిగా భార్యావియోగం తనకి బాధ. రాజుగా తనప్రవర్తనలో వ్యక్తిత్వం అడ్డురాకూడదు. తనబాధమాత్రం తనది. తన ఋజుప్రవర్తన ప్రజలది. వారికి ఆదర్శం తను. అందువల్ల రాముడు భర్తగా బాధపడుతూ, ప్రభువుగా సమాజక్షేమంకోసం సీతమ్మతల్లిని అడవులకి పంపించేశాడు. ఇది మానవతని మించిపోయిన రామునీతి. అసిధారావ్రతం.

ఇటువంటిదే మరొక రాజుకి కలిగిన సమకాలిక సమస్య పరిశీలిస్తే నాటి నేటి దృక్పథాలు బోధపడతాయి. బ్రిటిషు సామ్రాజ్యాన్ని కొద్దికాలంపాటే పరిపాలించి, రాజ్య సన్యాసంచేసిన ఎనిమిదవ ఎడ్వర్డు చక్రవర్తి బ్రహ్మచారిగా సింహాసనం అధిష్ఠించాడు. ఆయన వివాహసమస్య వచ్చింది. ఆయన అప్పటికే సంసారం చేస్తున్న అమెరికాదేశపు వనితని ప్రేమించివున్నాడు. ఆమెకూ, ఆమె భర్తకూ విడాకులు ఇప్పించి ఆ స్త్రీరత్నాన్ని వివాహం చేసుకుంటానన్నాడు. మరొకడిభార్య మా రాజుభార్య కాకూడదు, మాకు రాణి కాకూడదు అన్నాడు బ్రిటిషు ప్రధాని, బాల్డ్విన్. అవునన్నారు ప్రజలు. సరే, నాకు రాణి అక్కర్లేదు; మీ రామెను రాణిగా అంగీకరించవద్దు; ఆమె సంతానానికి రాజ్యం ఇవ్వవద్దు; ఆమెను నేను పెళ్లిచేసుకుని, రాణిలేని రాజుగా వుంటానన్నాడు. మాకు రాణిలేని రాజు అక్కర్లేదు; రాజూ, రాణీ ఇద్దరూ కావాలి; వారి సంతానం రాజ్యానికి రావాలి; రాణికాని రమణిని

పెళ్లి చేసుకుంటే ఆమె వుంపుడుకత్తెతో సమానం; ఆ అవమానం మేము భరించలేము; సత్కుటుంబంలో పిల్లని చేసుకుని, సుఖంగా రాజ్యం చెయ్యమన్నారు. నేను రాజుని సరే, ఒక వ్యక్తినికూడా. నాకూ ఇష్టమూ అయిష్టమూ, ప్రేమా, ద్వేషమూ, మంచీ చెడ్డా వున్నాయి; నేను పెళ్లిచేసుకోబోయే వనిత నా భార్యగాని ప్రజలభార్య కాదుగదా, దీంతో ప్రజలప్రమేయం ఏమిటీ అన్నాడు. రాజుభార్య ప్రజలభార్య కానిమాట వాస్తవమేకాని, ప్రజల భార్యమాత్రం రాజుభార్య కావడానికి వీలులేదు. రాజు భార్యకి రాణిగా వుండగలిగిన అర్హతలు వుండాలన్నారు. ఎడ్వర్డుకి విషమసమస్య కలిగింది. ఒకవేపు రాజ్యం, దేశం, ప్రజలు. మరొక వేపు తన ఆపేక్ష, సౌఖ్యం. ఒకటి సమాజానికి తనమీదవున్న హక్కు. ఒకటి వ్యక్తిగా తనకున్న హక్కు. ఇవి ఇల్లావుండగా తాను రాజు. తాను సామాన్యవ్యక్తి అయితే ప్రజలకీ తనకీ అంత తగాదా లేదు. ఎడ్వర్డు వ్యక్తిగా తన సౌఖ్యం, తన అధికారం ఎక్కువ అని నిర్ణయించుకుని, సామ్రాజ్యసన్యాసం చేశాడు. బ్రిటిషుప్రజలు వివాహితుడై సుఖంగా పిల్లలతో కాపురంచేస్తున్న అతని తమ్ముడు జార్జిని చక్రవర్తిగా పట్టంగట్టి తమ సంప్రదాయం, సంస్కృతీ సంరక్షించుకున్నారు.

ఆనాడు ఒక వ్యక్తియొక్క ఉన్నత లక్ష్యాల ఆచరణశుద్ధివల్ల సమాజం నిష్కల్మషమైంది. ఈనాడు ఒక సమాజం సత్ప్రవర్తన వల్ల ఒకవ్యక్తి విపరీతస్వార్థాచరణ అరికట్టబడి సంఘం శుద్ధి అయింది. ఆనాటి వ్యక్తి శ్రీరామచంద్రమూర్తి. ఈనాటి సమాజం బ్రిటిషు ప్రజానీకం. ఏతావతా తేలిందేమంటే, వ్యక్తి తన ధర్మం నిర్వర్తిస్తే సంఘం నిష్కల్మషంగా రూపొందుతుంది. వ్యక్తిపట్ల ధర్మాచరణ లేనిపక్షంలో సంఘం ఆవ్యక్తిని శిక్షించి ధర్మం నిలబెడుతుంది. అనగా వ్యక్తి తన ధర్మనిర్వహణలో సంఘాన్ని దిద్దుకురావాలి. సంఘం వ్యక్తిని శాసించి ధర్మం పరిపాలిస్తుంది. వ్యక్తికి ధర్మవిరుద్ధమైన సంపూర్ణ స్వేచ్ఛ అనేది సంఘంలో వున్నంతకాలం లేదు. వ్యక్తికీ సంఘానికీ వుండే సంబంధం భార్యాభర్తల అనురాగంవంటిది. సంసారంలో అన్యోన్యతవల్ల సుఖం కలుగుతుంది. సంఘంలోకూడా అంతే. సంబంధబాంధవ్యాలు ఇచ్చి పుచ్చుకోవడంలో వృద్ధి అవుతాయి. వ్యక్తి సంఘానికిచ్చి, ఆ సంఘమిచ్చేవి తాను పుచ్చుకోవాలి. ఇవ్వనివాడికి పుచ్చుకునే అర్హత లేదు. ఈ ఇచ్చి పుచ్చుకోవడంలోనే మానవుడూ, మానవసంఘమూ ఉన్నత స్థితిలోకి వస్తాయి.

అయితే వ్యక్తి నిర్వర్తించవలసిన ధర్మం ఏమిటి? సమాజ ధర్మం ఏమిటి? ఈ రెంటి పరస్పరధర్మాలూ ఏమిటి? ధర్మం అనేది ఒక సిద్ధాంతంకాదు. ఒక సూత్రంకాదు. ధర్మమనేది ప్రవర్తన. ఏ ప్రవర్తనవల్ల లోకానికి సుస్థిరత్వం కలుగుతోందో అది ధర్మం. సృష్టిస్థితిలయాలు ధర్మం. సూర్యచంద్రులు ఉదయించి అస్తమించడం ధర్మం. లోకానికి ఏది ఆధారమో అది ధర్మం. ఏది నిలబెడుతుందో అది ధర్మం. సముద్రుడు చెలియలికట్ట దాటకుండా వుండడం ధర్మం. గ్రహాలు తమ ఆకాశ పథాలలో క్రమంగా పరిభ్రమణయాత్ర చేస్తూవుండడం ధర్మం. భూమియొక్క ఆకర్షణ శక్తిని మించిన శక్తితో ఒక యంత్రం కల్పిస్తే అది ఉపగ్రహం కావడం ధర్మం. ఇది ప్రకృతి ధర్మం. ప్రకృతిని దాటి ధర్మంలేదు. ధర్మంలేనిదే ప్రకృతి లేదు. ప్రత్యక్ష ప్రమాణంమీద ఆధారపడ్డ భౌతికశాస్త్రాలు ఈ ధర్మపరిశోధన చేసి మానవుడి ఔన్నత్యానికి మార్గాలు సూచిస్తున్నాయి.

ఈవిధంగా ప్రకృతిని అనుసరించి వుండే ధర్మాలు అనేకం. ప్రాణిధర్మం పుట్టడం, జీవించడం, మరణించడం. ఈ ధర్మం యావత్తు సృష్టికీ వుంది. కాలమాన పరిస్థితుల్నిబట్టి ఏర్పడుతూ వచ్చేది యుగధర్మం. అల్లాగే రాజధర్మం, సంఘధర్మం, వ్యక్తి ధర్మం.

శిశువు జన్మించగానే ఏడుస్తుంది. ఎందుకు? గర్భవాస పరిస్థితులకి భిన్నమైన వెలుతురూ, గాలీ, తాను తల్లి శరీరంనించి వేరుకావడంలో వున్న అనుభవంవల్ల కలిగిన భయంవల్ల. ఎందుకీ భయం? తనకేమైనా అపాయం కలుగుతుందేమో నని. పొత్తిళ్లలో చుట్టబెట్టి తల్లికడుపుకి చేర్చుకుని చెయ్యివేసి పూర్వపరిస్థితిలో వున్న వెచ్చ, సామీప్యం కలుగజెయ్యగానే వూరుకుంటుంది. ఈ భయం తగ్గినా ఏడుస్తుంది. ఎందుకు? ఆకలేసి. తల్లి వొళ్ళోవేసుకుని పాలిస్తే కళ్లుమూసుకుని, పిడికిళ్ళుమూసి కతుకుతుంది. ఆశిశువు ముఖంలో అప్పుడు సచ్చిదానందం గోచరిస్తుంది. ఆ తృప్తి, ఆశాంతి మహాయోగుల ముఖసీమలోగాని వుండవు. పాలిచ్చే తల్లి ముఖ వర్చస్సులో కుమారస్వామితో కూడిన పార్వతీదేవి పరమసంతోషం గోచరిస్తుంది. పిల్లకి పాలుతాగడంలో తృప్తి, శాంతి. తల్లికి పాలివ్వడంలో తృప్తి, శాంతి. ఇది ధర్మం. ఈ భయానికి, ఆకలికి, అవిపోవడం వల్ల కలిగే శాంతికీ కారణం ఏమిటి? ఆధారం ఏమిటి? ప్రతి ప్రాణీ తాను జీవించాలని కోరుతుంది. ప్రయత్నిస్తుంది. ఈ కోరికా, ప్రయత్నమూకూడా ధర్మమే. అది ఒకరు చెబితే, బోధిస్తే వొచ్చేదికాదు. సహజంగా ప్రాణి జన్మతోనే కలిగేది. ఇది స్వప్రాణసంరక్షణాసక్తి. ఈ ఆసక్తివల్ల సహజంగా కలిగేదే తిండితిప్పలకోసం కృషి. ప్రకృతిలో అననుకూల పరిస్థితులైన జంతు, ఋతు, వాతావరణాల నించి సంరక్షణకోసం ఏర్పాటుచేసుకునే నివాసం, కట్టుకునే గుడ్డాను. ఏ యెండ కొగొడుగుపట్టి మానవుడు తనప్రాణం సంరక్షణ చేసుకుంటాడు. దీనికిగాను కొత్తపరికరాలతో ప్రకృతిని వశం చేసుకుని ఆహారవృద్ధి, తదితర నివాసానుకూల వృద్ధీ చేసుకుంటాడు. ప్రపంచంలో చాలావరకు పటాటోపం అంతా ఈ స్వప్రాణ సంరక్షణకోసం. వ్యక్తిమూలంగా సంఘం, దేశం. భయం, ఆకలీవల్ల వ్యక్తమయే ఈ ఆసక్తే వ్యక్తి, సంఘ, దేశ, జాతిసంఘర్షణలకీ యుద్ధానికీ కారణం అవుతున్నది. ప్రాణికి భయంలేదు, తినడానికి కావలసినంత తిండి, కట్టుకోడానికి వస్త్రం, వుండడానికి నివాసం సమృద్ధిగా వున్నాయని తోచిననాడు, వున్ననాడు ఈ సంఘర్షణ అంతరిస్తుంది. ఈ నిత్యజీవితావసరాల సరఫరాలో హెచ్చు తగ్గులు వున్నంతకాలం భయంతప్పదు. భయంవల్ల సంఘర్షణతప్పదు. అదే నేటి అంతర్జాతీయ ఆర్థిక సమస్య. ఈ సమస్యా పరిష్కార పద్ధతులలో కలిగిన భేదాభిప్రాయాలే నేటి వొత్తిడికి కారణం.

ప్రాణికి ఆకలితో వ్యక్తమై, ఆహారంతో తృప్తికలిగే స్వప్రాణ సంరక్షణాసక్తి ఒక్కటేకాదు. ఇంకా ఆసక్తులూ, ఆవేశాలూ వున్నాయి. ఆకలిదప్పులు తీరి శరీరం చేవెక్కినప్పుడు

కలిగేది స్వజాత్యుద్ధరణాసక్తి. సర్వప్రాణులతోపాటు మానవుడికి కూడా ఈ ఆసక్తి వుంది. తనజాతిని వృద్ధిచేసుకోవాలీ అనే కోరిక. ఈకోరిక కామంవల్ల వ్యక్తమవుతుంది. సంభోగంవల్ల సంతృప్తి పొందుతుంది. ఫలం సంతానం, సంసారం, సంఘం. ఇది మరొక ధర్మం. కామం సృష్టిలో స్త్రీ పురుషుల్ని సంధానించే ఒకశక్తి. తల్లి తండ్రులికి సంతానం మీద వుండే వాత్సల్యం అనే ధర్మంవల్ల కలిగిందే సంసారం. ఈ సంసారాల సమిష్టి సంరక్షణకోసం కలిగిందే సంఘం. స్వజాత్యుద్ధరణా సక్తిలో మానవజాతి నిర్మించుకున్న కట్టుబాట్లే సంఘ మర్యాదలు, నీతులు. ఈ మర్యాదలు కాలమాన పరిస్థితుల్ని, అనుసరించి తదనుగుణంగా మారుతూ వుంటాయి. స్త్రీపురుషుల జనసంఖ్యననుసరించి సంసార మర్యాదలు ఏర్పాటు అవుతాయి. వివాహధర్మంకూడా అంతే. పరిణామదశలలో ఒక పురుషుడూ ఒకస్త్రీ ఒకసంసారంగా వుండడం, న్యాయం ధర్మం అని నిర్ణీతమైంది. ఒకసమాజంలో స్త్రీలు ఎక్కువా పురుషులు తక్కువా వుంటే బహుభార్యాత్వం ఏర్పడ్డ నిదర్శనలు వున్నాయి. లేనిచోట కూడా, అనాగరిక సమాజాలలోనూ, కాని సత్వ సిద్ధాంతాలు అమలులోవున్న కాలంలోనూ బహుభార్యాత్వ మున్నది. ఇది భరించకలిగినవాడికి. కాని, అనాదినించీ ఇది దురాచారంగానే పరిగణించబడింది. పశు పక్ష్యాదులలో కూడా ఏకపత్నీవ్రతం వున్నదంటారు. సహజమైన అనురాగంవల్లనే కాక, సంతాన పోషణకోసం కూడా ఏకపత్నీవ్రతం ధర్మంగా ఎంచబడుతోంది. కుటుంబం సంఘానికి పునాది.

సమాజంలో స్త్రీల సంఖ్య ఎక్కువై పురుషులసంఖ్య తక్కువై నప్పుడు వివాహధర్మం మారుతుంది. అటువంటి సమాజాలు ఇంకా వున్నాయి. ఒకే స్త్రీని నలుగురైదుగురు వివాహం చేసుకుని, ఒకే యింట్లో, సుఖంగా కాపురం చేస్తున్నారు. భర్తలందరు భార్యని సమానమైన అనురాగంతో చూస్తారు. భార్య భర్తలందరితోనూ అన్యోన్యంగా వుండి వారికి సేవచేస్తుంది. వారిలో అసూయ కానరాదు. కలిగిన సంతానానికి తల్లి ఒకతె. తండ్రులు నలుగురు. ఇటువంటి కుటుంబంతో కొన్నాళ్లు నివసించి వివేకానంద స్వామి విస్తుపోయాడు. ఈ వ్యవస్థ ఒక విశిష్ట ప్రయోగం అన్నాడు. ఆ దంపతులు దేవతలతో సమానులన్నాడు. పాసు భూతి లేనివారికి మాత్రం ఇది విపరీతంగా కనబడుతుంది. ప్రత్యేక పరిస్థితుల్ని బట్టి మనోభావాలు ఏర్పాటవుతాయి. మనః ప్రవృత్తిని బట్టి మానవప్రవర్తన వుంటుంది. అన్యోన్యంగా వున్న కుటుంబంలో పదిరొట్టెలువుంటే ఆకలి తీర్చుకోడంకోసం పదిమందీ తలో రొట్టె తింటారు. ఒక రొట్టె వున్నరోజున పదిమందీ అది పంచుకు తింటారు. కామేచ్ఛకూడా ఒక ఆకలి. పదిమందికి ఒకే స్త్రీ లభించిననాడు సంస్కృతిలేని వారు కొట్టుకుని చీకాకు పడతారు. ఒకస్త్రీ ఒకపురుషుడు మిగిలేదాకా కొట్లాడు కుంటూనే వుంటారు. జయించిన పురుషుణ్ణి ఆ స్త్రీ వరిస్తుంది. జంతువులలోకూడా ఇది రివాజు. కాని సంస్కృతివున్న సమాజంలో ఆ ఒక స్త్రీతోనే అన్యోన్యంగా వుంటారు. ఆయా పరిస్థితులలో ఇదీ ధర్మమే. వ్యక్తులమధ్య అది ఒక సర్దుబాటు. సమాజంలో సర్దుబాటుని మించిన ధర్మం లేదు. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య, వ్యక్తికీ సమాజానికీ మధ్య ఏర్పాటుచేసుకుంటూ వచ్చే సర్దు బాట్లే సంఘమర్యాదలు. సర్దుబాటు మానవ ధర్మం. సర్దుబాటు లేని చోట సంఘర్షణ తప్పదు. నాలుగువేళ్లూ నోట్లోకిపెళ్లి తినడానికి తిండి పుష్కలంగా వున్నకాలంలో ఏకపత్నీవ్రతుడైన శ్రీరాముడి భార్యను ఎత్తుకుపోయి లోకకంటకుడైనాడు రావణాసురుడు. జనసంఖ్య ఎక్కువై, భిన్నరాజ్యాలు ఏర్పడ్డ కాలంలో, భూమికోసం, కొంతవరకు స్త్రీ కోసం కూడా మారణహోమంలో మునిగిపోయారు కౌరవ పాండవులు. ఆహార విహారాలైన ధర్మనిర్వహణలో, ఆకలితో, కామేచ్ఛతో కొట్టుకుంటూనే వున్నారు మానవులు. జంతు ధర్మమే గాని, సర్దుబాటు అనే మానవధర్మం గుర్తించనన్నాళ్లు ఈ సంఘర్షణ తప్పదు.

మానవుడి నైజం ఒక్క ఆకలీ, కామంతోనే పరిపూర్ణమై ఆగిపోలేదు. సృష్టిలో మేథకలిగిన మానవుడు యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం కలిగివున్నాడు. అదే వివేకం. తన కామభోగంలో సృష్టి రహస్యం గమనించి సౌందర్యం అనే ఒక ఆనందహేతువు అందుకున్నాడు. రచన, రాగం, రసం అనే కళాసృష్టి బీజాలు కూడా సాధించి కవిగా, గాయకుడుగా, కళాకర్తగా, చిత్రకారుడుగా, శిల్పిగా సృష్టికర్తను సమీపించాడు. జంతు స్వభావంలోంచి పైకివచ్చి మానవత వృద్ధి చేసుకుంటూ, సంస్కృతి పొందుతూ ప్రాణికోటికి రాజైనాడు. ప్రకృతిని స్వాధీనం చేసు

కున్నాడు. కామిగా యాత్ర ప్రారంభించి మోక్షగామిగా పరిణమించివాడు. వయసు ముదిరినవాడు, ఆకలి దప్పులు క్షీణించి, జవ సత్త్వలు తగ్గి, ఆహార విహారాసక్తుల ప్రేరేపణ మందగించిన సమయంలో తీరికగా కూచుని, కునికిపాటులో సింహావలోకనం చేశాడు. ఏమిటి దంతా? నే నెవరు? ఎందుకొచ్చాను? ఎక్కణ్ణించి వొచ్చాను? ఎక్కడికి పోతాను? అసలు ఈ సృష్టి ఏమిటి? ఈ విధంగా ఆలోచన బయలుదేరింది. ఆ ఆలోచన తీవ్రమైంది. తపస్సుగా మారింది. ఈ యాత్రలో ఇంద్రియశక్తి నిద్రపోయింది. మేథ ఆగిపోయింది. కనుమూతలో ఒక అతీంద్రియశక్తి, చూపుగానిచూపు, వినికిడిగానివినికిడి, తెలివికందని తెలివి, సుఖంగాని సుఖం, నవ్వుగాని ఆనందం, అనుభూతి కలిగాయి. జాగ్రదవస్థలో తోటిమానవులకి వారిభాషలో తన అనుభవం బోధపర్చలేకపోయాడు. 'అదీ' అన్నాడు. "తాను" అన్నాడు. అది లేదన్నాడు. తాను లేనన్నాడు. నువ్వు లేవన్నాడు. తన్మయత్వ మన్నాడు, సచ్చిదానంద మన్నాడు. "తత్త్వమసి" అన్నాడు. "ఓం" అన్నాడు. అంతే అన్నాడు. ఇంకా అడిగితే "మౌనం" అన్నాడు.

స్వప్రాణసంరక్షణాసక్తి, స్వజాత్యుద్ధరణాసక్తి ఏవిధంగా మానవ నైజమో, తన్నుతాను తెలుసుకోవాలనే జిజ్ఞాస, ఆత్మజ్ఞానాసక్తికూడా మానవుడి నైజమే, ధర్మమే. జంతు స్థాయిలోంచి మానవస్థాయిలోకి కలిగే ప్రాణి పరిణామానికి ఈ జిజ్ఞాసే మూలం. మానవుడిజీవితం పరిపూర్ణం కావాలి, వ్యక్తికీ, సంఘానికీ శాంతి చేకూరాలీ అంటే పురుషుడికి ఈ ఆసక్తుల ఫలం లభించడానికి వీలైన సమాజనిర్మాణం కావాలి. స్వభావం, స్వధర్మం వ్యక్తికి పుష్పానికి వాసనవంటివి. ఈ వాసనకి వృద్ధి ప్రసారమే. తను సుఖంగా బతకాలని ఆశించడం, తన సంసారం నిలబడాలని కోరడం, తానెవరో తెలుసుకోవాలని ప్రయత్నించడం మానవుడి స్వభావ స్వధర్మాలు. వీటి నన్నింటినీగాని, ఏ వొక్కటినిగాని అరికట్టడానికి ప్రయత్నించి, నిరోధాలు కల్పించే సమాజం తొరు మారవుతూనే వుంటుంది.

అర్థికవాదంలో పడిపోయి, అర్థికసూత్ర ప్రాధాన్యమైన వ్యవస్థే ముఖ్యమని ప్రతిపాదించి ఆ మార్గంలోనే మానవసమాజం పునర్నిర్మాణం చెయ్యడం ఇల్లుఅలకడం మాత్రమే అవుతుంది. పండుగమాత్రంకాదు. పండుగ చెయ్యడానికి ఇతరహంగులు అవసరం. ఆ హంగులు మానవుడి స్వధర్మం, స్వభావం గమనించి, సర్వతోముఖాభివృద్ధికి అనుకూలమైన సమాజనిర్మాణంతోగాని అమర్చుకోడానికి వీలులేదు. మానవుడు మార్క్సు చెప్పినట్టు అన్నవస్త్రాలకోసమే జీవించడు. మానవ స్వభావంలో మార్పులు ఫ్రాయిడ్ చెప్పినట్టు కామేచ్ఛానుభవాలలో కలిగే లోటుపాట్లవల్లనే కలగవు. మహాత్ముడు చెప్పినట్టు మానవుడు సర్వత్రా నీతిమీదా, అహింసమీదా, సత్యం మీదా మాత్రమే ఆధారపడి అసిధారావ్రతం అనుసరిస్తూ నిస్సంగిగా వుండడు. ఈ ముగ్గురూ వారివారి కాలాలలో సంఘంలో వ్యాపించిన వ్యాధులకి వైద్యులవంటివారు. చావుకి పెడితేనేగాని రోగి లంఖణానికి వొప్పుకోడు. వీరివీరి వాదాలు తాత్కాలిక మానవరోగాలికి మందులుమాత్రమే. సరియైన ధారకంలేకుండా మందులుకూడా పనిచెయ్యవు. శరీరతత్వానికి అనుగుణంగా ఔషధం అనుపానం కూడా మార్చుకోవాలి. ముఖ్యంగా రోగి తన మనోదార్ఢ్యంవల్ల తనని తనే బాగుచేసుకోవాలి. సమాజంలో నివసించే మానవులు సామాన్యంగా సహజంగా వుండాలి. అందరూ మహాత్ములైనా సంఘం నిలవదు. సంఘం శరీరం వంటిది. సర్వత్రా అన్ని అవయవాలూ, మేథ, హృదయంతో సహా ఆరోగ్యంగా అభివృద్ధిపొందినప్పుడే ఆరోగ్యవంతుడైన మనిషి అవుతాడు. ఒక్క కాలో చెయ్యో బలిసిందని అనుకుందాం. అది వ్యాధి. విపరీతవృద్ధి: బోదకాలు బలుపుకాదు. అల్లాగే బోదబుర్ర విజ్ఞానంకాదు. సంఘం అంతా సన్యసిస్తే సంసారంలేదు. సహజ మానవవ్యక్తి సరిసమాన పురోగమనంలోనే సమాజ పురోగమనం వుంటుంది. ఈ సంపూర్ణ లక్ష్యసిద్ధికి మార్గం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ సాధనం. పురుషార్థాలన్నీ సక్రమంగా, సామరస్యంతో, సమన్వయంతో సాధించాలనే ప్రయత్నం, జ్ఞానం సమాజంలో కలిగేవరకూ, లోటుపాట్లు తప్పవు, ఎగుడుదిగుళ్ళు తప్పవు. ఇదే భారతదేశం లోకానికిచ్చిన సనాతన సందేశం. ఈనాడు తానే వ్రతంగా అనుసరించవలసిన స్థితిలో వుంది. ఆనాటి విజ్ఞానక్షేత్రం ఆశ్రమం. ఆధ్యాత్మిక దృష్టితో భౌతికప్రయోజనాలకోసం సమాజ నిర్మాణంచేసి వ్యక్తికీ, సంఘానికీ శాంతికూర్చినకాలం. అది ఆ ఆశ్రమా లీనాటికీ ఈ ధర్మభూమిలోనూ, కర్మభూమిలోనూ వున్నాయి. అందుచేతనే ధర్మదేవత ఒంటికాలిమీదనైనా నడవగలుగుతోంది.

ఈనాటి విజ్ఞానక్షేత్రం భౌతికశాస్త్ర ప్రయోగశాల. భౌతిక దృష్ట్యా బాహ్యప్రకృతిని స్వాధీనంచేసుకుని సౌఖ్యం పొందడానికి కృషి, తత్ఫలితాలు సంకుచితమానవుల చేతుల్లో మారణయంత్రాలుగా మారిపోయాయి. ఒకవేపు ఇహలోకస్వర్గ సృష్టికి కావలిసిన పరికరాలు. రెంటిమధ్యా భయంతో వొణికి పోతూ దినదినగండంగా నరాలమూట అయిపోయిన మనిషి. అశాంతి. వ్యక్తికీ, సమాజానికీ కూడా తరణోపాయం ఏమిటి? అటునించి ఆశ్రమం, ఇటునించి ప్రయోగశాల ఒకదాన్ని ఒకటి సమీపించి ఏకీభూతం కావాలి. అయేసూచనలు వున్నాయి. అవుతాయి. అప్పుడే మానవజాతికన్ను తెరుస్తుంది. మానవుడు తన్నుతాను తెలుసుకుంటాడు. లేసికన్ను తెరుస్తాడు. తనయావత్తు చైతన్యానికీ మూలకారణం తెలుసుకుంటాడు. ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ సిద్ధికోసమే తనజీవితం అని గ్రహిస్తాడు. అప్పుడే ధర్మదేవత మళ్ళీ నాలుగుకాళ్ళమీద నడుస్తుంది. తథాస్తు!

# మాధవసందర్శనము

శ్రీ కొమాండూరు కృష్ణమాచార్యులు

ఉదధి సమానసైన్యముల నుద్ధతితోడ గళింద నందినీ
యుదకము లుత్తరించెను యదూద్వహుఁడం చనువాదరీతిగా
విదితవిశేష విత్తముడు వీరుడు ధర్మజు డాలకించె దా
ముదమున గృష్ణువార్త జరముఖ్యులు దెల్ప నెఱింగియుండియున్.

శాత ఖురాభిఘాతపటుశబ్దములై హయఘట్టముల్ మరు
ద్ధూతపరాగ ధూసరవిధుంతుద సంపిహితార్క దీప్తిపా
దాతబలంబు లుద్ధత మద ప్రవిలోల మిళిందబృంద సం
స్ఫీత గజావళుల్ గొలువ వీరుడు ధర్మజుడేగె సోదర
వ్రాతము తోడరాగ యదువంశవిభుం గన వైభవోన్నతిన్.

కుకురాధీశ కురూత్తమానుగతముల్ కుంభీంద్రముల్ తుండముల్
ముకుళింపంగ విషాణ ఘట్టనములన్ భూమీధర ప్రక్రియన్
బ్రకట స్ఫూర్తి నెదుర్కొనె న్నిజ సుహృద్భావంబు రూపింపలే
కకలంక స్థితి నుండునెట్లు మదమత్తానేకపానీకముల్.

కురు యాదవ ధరణీపతు
లురుముదమున గౌగలింప నుద్ధత మదముల్
కరు లప్పుడు గిరులై వెస
గరిమన్ మార్కొనియె వలిత కాండోగ్రములై.

ఆధోరణాంకుశాహతి
యూధపతుల్ మదముదక్కి యుద్ధతిమానెన్
గ్రోధాంధుల గురుశిక్షన్
సాధించుట రాజనీతి సారముగాదే!

కౌరవయాదవేశ్వరులు గాఢ భుజాపరిరంభ సంగతిన్
భూరిమహీధరంబులు సముజ్జ్వల వజ్రహతి న్విపక్షమై
ధారుణిగూలకున్న తఱిదార్కొను వైభవ ముల్లసిల్లగా
భూరిభుజుల్ పరస్పరము బొల్చిరి పర్వతతుల్యకాయులై.

యాదవ కౌరవాంగనలు హారలతల్ బెరయంగ నొండొరుల్
మోదముతో సువర్ణమయ పూర్ణఘటోపమిత స్తనైక సం
వాపముగా గవుంగిళులబట్ట గృశోదరముల్ విదూరమై
పేదల కైవడిన్ దొలగె బెద్దలతో సరిపోల నేరమిన్.

దైతేయాంతకుఁడి ట్లవంధ్యగతి నింద్రప్రస్థముం జేరఁగా
నేతెంచెం విను డంచు దెల్పుగతి గాంతేయాగ్రజాట్టాలక
వ్రాతోపస్థిత భేరికా నినదముల్ ప్రాధ్మాత శంఖధ్వనుల్
యాతాయాత జనప్రమోదకరమై యవ్వేళ మ్రోసెం గడుం.

ధీరుఁడు వాసుదేవుఁడు యుధిష్ఠిరుచేయి ముఖంబుజూడఁగా
గూరిమి వచ్చె వాద్యపటు ఘోషములుం వినవచ్చె జాతమా
శూరకులావతంసు నని శోభనవేషవిశేష యుక్తులై
పౌరులు సందడిం జనిరి వాహనముల్ సమకట్టి వేడుకం.

హరియాగమనము వినఁగా
బరితోషముతోడ దేహభావము పొంగని
బురి పట్టకున్న వెలికిం
బురజను లరిగెదరొ యన్నబుద్ధి జనించెం.

యాదవ పాండవుల్ హార్దభావంబున
ప్రణామ సందర్శన విధులు నడపి
వందిమాగధులు కైవారము ల్సేయంగ
బురి రాజవీథుల బోవుచుండ
బటుసంభ్రమంబున బౌరకాంతామణుల్
హరిజూచు వేడుక యతిశయిల్ల
నొండొరుం బిలుచుచు నుచ్చైస్స్వరంబుల
హర్మ్యతలంబుల నధివసించి
దానవాంతకు దివ్యసౌందర్యమునకు
హరి పరాక్రమ లీలావిహారములకు
నచ్చెరువుపాటు భీతియు నావహిల్ల
గన్నులున్నట్టి ఫలమిదె కంటిమనిరి.

పూతనాఘాతంబు నీతండు గావించె
లీలతో శకటంబు గూలదన్నె
జలదముల్ వర్షింప సప్తరాత్రంబులు
గోవర్ధనంబను కొండ నెత్తె
గువలయాపీడంబు కోఱలుపెకలించె
గంసాదినృపకీటకముల జమరె
గాళియనాగుని గడకాల మర్దించె
దావాగ్ని యడరిన దాని మ్రింగ
రాసరసకేళి దేలిన రసికుఁ డితఁడె
యంజలినిగోరు వస్త్రాపహారి యితఁడె
పార్థునకు సర్వవిధముల బంధు వితఁడె
మనము గాంచితి మీతని మగువలార!

దనుజవిరోధిసైనికులు ధర్మతనూజభటావళుల్ విభూ
షణ రచనావిశేషముల జహ్నుసుతాయమునా సమాగమం
బన ఘనరావమొప్పగ బురాంతర రాజపథానుసారులై
చనిరి సమగ్రవాహినుల సాంద్రమహారవ సంకులంబుగన్.

ఉవిద యొకర్తు మాధవుని యుజ్జ్వలరూపము జూచువేడ్కతో
నవయవముల్ ప్రమోదరభసాతిశయంబున బొంగిపోవగా
శ్రవణయుగంబు దాకెను విశాల విలోచనముల్; కుచోన్నతిం
బవిలెను కంచుకంబు; మణిసంక్తులు రాలెను కంకణంబులన్.

లలన యొకర్తుపాదముల లత్తుకరంగును బూయుచేటికన్
వలదని మాన్చి యేకచరణక్రమణాంకిత కుట్టిమంబునన్
గలకల నవ్వనెచ్చెలుల గానక యేగె హారార్ధభాగ సం
కలిత నిజాంగవల్లియగు గౌరిమనోహరమూర్తియో యనన్.

వచ్చెను మాధవుండు కడు వైభవమొప్పగ వాని జూడగా
నెచ్చెలులార! రండనుచు నీలనిచోళనిబద్ధమూర్తియై
యచ్చరలేమపోలె నొకయంగన పోయెను పారిజాత పా
టచ్చరమూర్తి గన్గొన రటత్కటక స్ఫుట చంక్రమోద్ధతిన్.

వేణీబంధము వీడి కుట్టిమమునన్ విజ్ఞాత సౌరభ్యమై
పాణిగ్రాహ్యము గాగనున్న నవ పుష్పస్రగ్విశేషంబు వి
న్నాణం బొప్పగ జేత బట్ట దొక కన్యారత్న ముత్కంఠతో
జాణూర ప్రతిమల్ల విగ్రహ దిదృక్షారంభ సంరంభినై.

కన్నులదిద్ద గాటుకయు గాంచన రత్నశలాకయుం దగన్
విన్ననువొప్పబట్టి తనవెంటనె నెచ్చెలి యోర్తురాగ నా
వెన్నుని జూడబోయె నొక భీతకురంగ విశాలనేత్ర తా
గన్నన నద్దబూనెనొకో! కంసవిరోధి శరీరదీధితుల్.

భవన గవాక్షలక్ష్య పరిభావితదృష్టివిలాసనై చనన్
జవమున నీవిబంధము విశాలకటీతటసీమ నిల్వమిన్
గువలయపత్రనేత్ర నిజ కోమల పాణిపుటప్రవాళ సం
భవ నవ లోహితాంశుక విభా రమణీయత నేగ జెచ్చెరన్.

ఆసవ గర్భగంధమగు హాసములొప్ప గవాక్షలక్ష్య వి
న్యాస విశేషసుందర ముఖాబ్జములన్ గళ నొప్పి రా సురా
వాసముబోలు నప్పురిని బాండవలక్ష్మి యనంతరూపయై
శ్రీసఖు వేయికన్నుల విశిష్టత గన్గొనురీతి నెంతయున్.

హరి జూచుఁ దనువెల్ల గన్నులుగ నీయబ్జాక్షి యెవ్వారినిఁ
జొరనీదమ్మ గవాక్షజాలకములన్ జూడంగదా కుబ్జయో ?
అరయన్ గోపనితంబినీమణియొ'? సత్యాకాంతయో ? యంచు ము
ష్కరతన్ బల్కె సపత్ని నొక్కతరుణాబ్జాతాక్షి రోషంబునన్.

రమణులు పుష్పము ల్మణులు లాజలు పైగురియంగ పాండవ
ప్రమదపయోధి బొంగ యదుపార్వణచంద్రుడు వచ్చి సాత్యకి
ప్రముఖులు గొల్వ నిల్చె నొక ధర్మమహోన్నత హర్మ్యసీమ సం
భ్రమమున పాండవుల్ తనదు భావములోన మెలంగుచుండగన్.

కరతల శుక్తిసంపుటయుగ ప్రవికీర్ణ సలాజపుష్పయౌ
తరుణి మరుద్విధూత చలితస్తనపట్టికయై యురోజ వి
స్ఫురణము శాతకుంభమయ పూర్ణఘటద్వయిగా మురారికై
పురసతి పూర్ణకుంభముల బూని యెదుర్కొనుకీర్తి భాసిలెన్.

హరి జూడన్ నిజమందిరోన్నత శిరోహర్మ్యంబు పైనెక్కి బం
గరునెమ్మినిషన ల్బయల్పడ మరుత్కల్లోల దూరాహతాం
బరయై కాంచన గౌరయష్టికలిత ప్రస్ఫీతకేతు ద్యుతిన్
బురణించెన్ భువి వైజయన్తి యనగా బూబోణి యుల్లాసియై.

పరిచుంబితాంగుళీ పాటలాధర దీప్తి
పరభాగముగ నవ్వ బడతి యొకతె
ఉన్నమితైక వక్షోజ భుగ్న నితంబ
యై జూచె నట నొక్కయబ్జగంధి
యాకూణితాక్షియై హరిగాంచు నొకతన్వి
గళితాంశుకము పట్టె కరతలమున
విశ్వాస సౌరభానిలలోల భృంగంబు
దోలునొక్కతె పాణిచాలనమున

స్వప్నగతమానసాబ్జయై కీరవాణి
శూన్యదృష్టిని బయలు దాజూచు నొకతె
పౌరలోకైక నేత్రచకోరచంద్రు
డైనహరి యుత్సవంబొప్ప నరుగు నపుడు.

("మాఘమాహాదము" నుండి.)

# పాశ్చాత్యులపై మన సంస్కృతి ప్రభావము

శ్రీ జటావల్లభుల పురుషోత్తము

కొన్ని శతాబ్దములు పరపరిపాలనములో నుండిన భారతీయులలో పలువురు స్వీయసంస్కృతిని నిరసించి పరసంస్కృతి నాశ్రయించుటలో నాశ్చర్యము లేదు. కాని పాలితజాతిగానుండి ప్రపంచములో నెట్టి గౌరవప్రపత్తులును లేక దారిద్ర్యముచే క్రుంగి, ఎట్టి తళుకుబెళుకులును లేని భారతీయుల సంస్కృతి సంప్రదాయముల చేత సకలైశ్వర్య భరితమై రాజకీయౌన్నత్యవిరాజితమై ఆధునిక విజ్ఞాననిలయమై భోగభాగ్యాలవాలమై యొప్పారు పాశ్చాత్య ప్రపంచమునకు చెందిన మహామేధావులు కొందరాకృష్టులై, ఉద్దీపితులై, ప్రభావితులై, ప్రహ్వీభావముతో వాని నాశ్రయించినారనుట మిక్కిలి యాశ్చర్యకరమైనది. ఇట్లాశ్రయించినవారిలో హెచ్చుమంది అసాధారణ మేధాసంపన్నులు; పాశ్చాత్యవిద్యాపారంగతులు. విశేషించి శీలసంపన్నులు. అట్టి యుత్తమశ్రేణికి చెందినవారిచేతమాత్రమే తెలిసికొనదగిన సంస్కృతిసంపత్తి గడచిన రెండు శతాబ్దములలోను భారతదేశము నిలబెట్టుకొని యుండినది.

చరిత్ర కందని ప్రాచీనకాలములోను, చారిత్రక ప్రాచీన మధ్యయుగములలోను భారతీయప్రభావము విరివిగా వివిధదేశముల మీదికి ప్రసరించుచునే యుండెను. మనమిప్పుడు విచారించునది గడచిన రెండుశతాబ్దముల చరిత్రకు మాత్రమే సంబంధించినది. కొన్నిశతాబ్దముల విలీనస్థితికి పిమ్మట తిరిగి 18 వ శతాబ్దిలో సంస్కృతము యూరపులో వ్యాపింపనొడగినది. ఈ రెండు శతాబ్దములలోను వందలకొలది పాశ్చాత్యులు, అన్నిదేశములకు చెందినవారును, సంస్కృతభాషను, సాహిత్యమును తర్కవ్యాకరణ మీమాంసాది శాస్త్రములను, వేదములను అది యిది యననేల సమస్త సంస్కృత వాఙ్మయమును అవలోడనముచేసి, లిఖితప్రతులను ముద్రించియు, వానికి పీఠికలను వ్రాసియు, గ్రంథముల, గ్రంథకర్తల కాలాదులనుగూర్చి విమర్శించియు, అనువాదములను గావించియు, శతవిధములుగా బహువిపులమైన కృషిని సాగించిరి. ఆ కృషినంతను కాదు సరికదా యిందు కొంతభాగమునుగూడ నిచట నిరూపించుట కవకాశము లేదు. సామాన్యాకారముగా భారతీయ సంస్కృతిచే ఉద్దీపితులై, ప్రభావితులైన కొందరు పాశ్చాత్యులు ముఖ్యముగా స్మరణార్హులగుటచే వారి ప్రశంస యిట గావింపబడుచున్నది. ఈ వ్యాసమునందు పేర్కొనబడువారు కొందరు సంస్కృతములో మహావిద్వాంసులు; కొందరు సామాన్యజ్ఞానము గలవారు; కొలదిమంది సంస్కృతజ్ఞానము లేనివారైనను సంస్కృతములో చాలకాలము కృషిచేసిన యితరులకంటె హెచ్చుగా భారతీయ సంస్కృతివల్ల ప్రభావితులైనవారు.

## మాక్సుముల్లరు

పాశ్చాత్య సాంస్కృతికులెల్లరిలోను శిఖామణియనదగినవాడు మాక్సుముల్లరు. యావజ్జీవము సంస్కృతసాహిత్యములో కృషిచేసినవారు చాలమంది కలరు; కాని యీయనవలె ఆనందపారవశ్యముతో భారతీయ సంస్కృతిని గ్రోలినవారరుదు. ఈయన 1823 లో జర్మనీలో జన్మించి లీప్‌జిగ్ విశ్వవిద్యాలయములో సంస్కృతమును నేర్చెను. పిమ్మట విశ్వవిఖ్యాతుడైన ప్రొఫెసర్ బాప్ వద్ద బెర్లిన్ విశ్వవిద్యాలయములో భాషా సాదృశ్యశాస్త్రము నధ్యయనము చేసెను. తరువాత పారిస్ పట్టణమున జెందవెస్తాలో గాఢమైన కృషిచేసెను. 1848 లో నాతడు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగా చేరెను. 1846 నుండి 1900 సంవత్సరము వరకు 54 సంవత్సరములు ఇంగ్లండులోనే యుండెను.

మాక్సుముల్లరు రచించిన గ్రంథములలో ముఖ్యముగా పేర్కొనదగినవి: The Six Systems of Indian Philosophy, India: What Can it Teach Us ?, Comparative Mythology, Gifford Lectures. The Savage, History of Ancient Sanskrit Literature మున్నగునవి. ఇందు India: What Can It Teach Us అను గ్రంథము భారతదేశ పరిపాలకులుగా రాదలచి లండనులో ఐ. సి. యస్. పరీక్షకు వెళ్లు విద్యార్థులకు ఉపన్యాసరూపముగా మొట్టమొదట మాక్సుముల్లరుచే బోధింపబడినది. తరువాత చాల సంవత్సరములు ఆ పరీక్షకు విధిపాఠ్యగ్రంథముగా నుండెను.

మాక్సుముల్లరు సంపాదకత్వమున వెలువడిన బహుగ్రంథములలో ఋగ్వేద సాయణభాష్య మొకటి. దీని ప్రచురణమునకు విజయనగరాధీశ్వరులు శ్రీ ఆనందగజపతి మహారాజు ధనము నొసగిరి. Sacred Books of the East Series అను గ్రంథమాలను నెలకొల్పి మాక్సుముల్లరు ప్రచురించిన 51 గ్రంథములు భారతీయవిజ్ఞానము ప్రపంచములో వ్యాపించుటకు మిక్కిలి తోడ్పడినవి. ఇంతదీర్ఘకాలము సంస్కృతవాఙ్మయములో కృషిచేసి యిన్ని గ్రంథములను ప్రచురించిన పాశ్చాత్యులరుదు; ఈ రెండు విషయములలో నీయనకు దాపుననున్నవారుకూడ భారతదేశముపట్ల భక్తిప్రపత్తులను గల్గియుండుటలో నీయనకు చాలరు.

యూరపుఖండములో మాక్సుముల్లరుకుండిన ఖ్యాతి నిరుపమానము; రాజకుటుంబములలోకూడ నీయనకు విశేషగౌరవ ముండెను. అన్నింటికిని తగిన శీలసంపత్తి గలవాడగుటచే పాశ్చాత్య సాంస్కృతికులలో నీయన స్థానమద్వితీయము.

సంస్కృతములో నప్పుడప్పుడు శ్లోకములను వ్రాయుట యీయనకు విలాసముగానుండెను. ఈ క్రింది శ్లోక మాయన గ్రంథములో ప్రారంభపుటలలో నొకచోట విడిగా ముద్రింపబడినది. ఇది యాయన రచించినదేయని తోచినది. ఇది సంస్కృత వాఙ్మయములోనే గ్రంథములోకాని, చాటువుగాకాని తాను

చూచినారా యని నే ననేకపండితుల నడిగితిని; ఎవ్వరునూ చూడలేదనిరి. కావున నిది మాక్సుముల్లరు రచితమేనని నేను భావించుచున్నాను. పత్రికాముఖమునకూడ నీయంశమును వెల్లడించుచో నీ శ్లోక మెచటనైన పూర్వమే యుండియున్నచో విజ్ఞులా సంగతిని తెలుపుదురను నూహతో నాశ్లోకము నిట నుదాహరించుచున్నాను.

సుకృతం నకృతం కించి ద్దుష్కృతం బహుళః కృతం!
నజానే జానకీ జానే తవాహ్వానే కిముత్తరమ్ ॥

ఈ శ్లోకము బహు లలితములైన పదములతో భక్తిరసభరితమై శ్రీరామచంద్రుని సంబోధించుచున్నది.

మాక్సుముల్లరు తనపేరును "మోక్షమూలర భట్టః" అనికూడ వ్రాసికొనుచుండెను. తాను ఆక్సుఫర్డ్‌వాసి యగుటచే "గోతీర్థవాసీ" యని తన్ను గూర్చి చెప్పుకొనుచుండెను. (ox = గో, Ford=తీర్థ=రేవు.)

హంసకు పద్మవనములో సంచరించుట యెట్లు విలాసమో మాక్సుముల్లరుకు సంస్కృతవాఙ్మయములో విహరించుట యంత వ్యసనము. భారతదేశవిజ్ఞానముపై నింత భక్తిగలవాడగుటచే నొక్కసారి ప్రత్యక్షముగా భారతదేశమును దర్శింపవలయునని కొందరు భారతీయమిత్రు లాయనను కోరిరి. ఆయన వారి కిట్లు సమాధానము వ్రాసెను: "వేదములను, ఉపనిషత్తులను, ధర్మగ్రంథములను, రామాయణ మహాభారతాదులను నిరంతరము నేను మననము చేయుచుండుటచే నా హృదయము ప్రాచీన భారతీయవిజ్ఞాన వాతావరణముచే నుత్తేజితమై యున్నది. ఉపనిషత్తుల ఉన్నత సందేశము, కణ్వాశ్రమ మనోహరదృశ్యము మున్నగువాని స్మరణచే నేను నా మనస్సులో నెలకొల్పుకొన్న భారతదేశములోనేయుండి ప్రాణము వదలదలచినాను; కాని యిటీవల ఆధ్యాత్మికసౌభాగ్యమును కోల్పోయి, పాశ్చాత్యులపద్ధతులలోనికే మారిపోవుచున్న ప్రజలతోకూడిన భారతదేశమునుచూచి యా స్మరణతో ప్రాణము వీడుట నా కిష్టములేదు." భారతీయ సంస్కృతికి పాశ్చాత్యుడు చేయగల జోహారు దీనినిమించి యుండజాలదు.

ప్రపంచములో భారతీయవిజ్ఞానమునకు నిరుపమస్థానము గలదను భావమును మాక్సుముల్లరీ క్రిందివాక్యములలో తెలిపియున్నాడు:

"ప్రపంచములోనికెల్ల ప్రకృతిదేవత యొసగగల యైశ్వర్యమును, శక్తిని, సౌందర్యమును పరిపూర్ణముగా గల్గియున్న దేశము నన్వేషింపవలసియున్నచో, భూతలస్వర్గమేయని చెప్పదగిన ప్రదేశములను గొన్నింటెని గల్గియున్న దేశ మెద్దియో నేను చెప్పవలసియున్నచో, భారతదేశమునే నిర్దేశింపగలను. ఏ ప్రదేశములో మానవుడు తన ఉత్తమశక్తులను కొన్నింటెని పరిపూర్ణముగా వికసింపచేసికొనెనో, ఘనతములైన మానవ జీవితసమస్యలపై లోతైన విచారముచేసి ప్లేటో, క్యాంట్ మున్నగువారి గ్రంథముల నధ్యయనము చేసినవారుకూడ గ్రహించుకొనవలసిన పరిష్కారములను కనుగొనెనో చెప్పవలసినదని నన్నడుగుచో నేను భారతదేశమునే చూపింపవలసియుండును. గ్రీకు, రోమను భావములచే పోషింపబడిన యూరపువాసులమగు మనమును, సెమిటిక్ యూదుజాతీయులును ఆంతరంగికప్రకృతిని లోపరహితముచేసికొని, విశాలమును విశ్వజనీనమును, ఇంతకంటె మానవార్హమును గావించుకొనుటకును, జీవితము నైహికముకొఱకేకాక యమరత్వముకొఱకుగూడ పరిణమింపచేసికొనుటకును సహాయపడగల సారస్వత మెక్కడనున్నదని మీరు నన్నడుగుచోకూడ నేను భారతదేశమునే చూపింపవలసియుండును.

"మానవజాతియొక్క మనస్సునకు సంబంధించిన యే విషయమును నీవు ప్రత్యేకముగా పరిశీలించుటకు పూనుకొనినను—భాష, మతము, పురాణగాథలు, తత్త్వశాస్త్రము, ధర్మశాస్త్రము, ఆచారములు, ప్రాచీనకళలు, ప్రాచీన విజ్ఞానము—అనువానిలో నే విషయమును నీవు పరిశీలింపజూచినను భారతదేశమునకే వెళ్లవలసియుండును. నీ కిష్టమైనను కాకపోయిననుగూడ నక్కడకే వెళ్లవలసియుండును. ఎందువల్లననగా మానవజాతిచరిత్రలో మిక్కిలి విలువగల్గినట్టియు, మిక్కిలి ప్రబోధకమైనట్టియు సామగ్రి భారతదేశములో మాత్రమే నిక్షిప్తమైయున్నది."

బహుగ్రంథరచన ప్రచురణములచే ప్రపంచములో ప్రాచీన భారతీయవిజ్ఞాన వ్యాప్తికి కృషిచేయుటయేకాక ఆనందపారవశ్యముతో పైరీతిగా భారతీయసంస్కృతికి జేజేలుపట్టిన మహాపురుషుని భారతీయులు తమలో నొకనిగా భావించుటకొనుటయేకాక తమకు స్ఫూర్తిదాయకునిగాకూడ నెంచుకొని ఢిల్లీపట్టణమున నీ సంవత్సరములోనే "మాక్సుముల్లరు భవన్" అను వైజ్ఞానికమందిరమును నెలకొల్పుకొన్నారనుటలో నాశ్చర్యములేదు.

స్వామి వివేకానంద లండనుపట్టణమున మాక్సుముల్లరు కతిథిగా నుండెను. ఆ విద్వాంసుని నిర్మల నిరాడంబర జీవితమును, భారతీయాదర్శాచరణ రక్తిని వర్ణించుచు స్వామిజీ ముల్లరుదంపతుల గృహము అరుంధతీ వసిష్ఠుల యాశ్రమమును తలపించెనని వ్రాసియున్నారు.

## డాక్టర్ అనీబిసెంట్

పూర్వజన్మలో తాను భారతదేశమున క్షత్రియోపాధిలో నుంటిననియు, రాబోవుజన్మలో బ్రాహ్మణోపాధిని ధరింతుననియు చెప్పిన పాశ్చాత్యవనిత అనీబిసెంటు.

ఈమె రచించిన భగవద్గీతాంగ్లానువాదము పాశ్చాత్య విద్యాధికుల నెక్కువగా నాకర్షించినది. భారతీయ సంస్కృతికి చెందిన బహువిషయములమీద నీమె పరిశోధనగావించుటయేగాక బహు గ్రంథములను, వ్యాసములను రచించినది. ఈమె యారితేరిన రచయిత్రి; ఉపన్యాసకురాలుగా అసమానమైనఖ్యాతిని సంపాదించినది. ప్రపంచములోని ఆంగ్లభాషావక్తలలో మొదటివల్గురైదుగురిలో నీమె యొకతె.

సుమారు 40 సంవత్సరముల వయస్సునకు నీమె భారతదేశమునకు వచ్చి యిచ్చటనే స్థిరపడిపోయెను. భారతదేశమునకు వచ్చుటకుపూర్వమే యీమెకు అంతర్జాతీయఖ్యాతి యుండెను. ఐర్లండు స్వాతంత్ర్యము నిమిత్తమై యుద్యమము నడిపినవారిలో నీమె యొక ప్రముఖురాలు. దివ్యజ్ఞానసమాజమున అద్వితీయస్థానము నలంకరించి సర్వఖండములయందును నీమె పూజింపబడుచుండెను.

ఇట్టి జగత్ప్రసిద్ధురాలు, విద్యాధికురాలు, బహుసద్గుణసామర్థ్యశాలిని యగు ఈమె నిరాజితురాలు భారతదేశములో స్థిరపడి పాశ్చాత్యవేషమును విడిచి, భారతీయవేషము ధరించి, శ్రుతి స్మృతి పురాణేతిహాస పఠనములోను వాని మహాత్మ్యమును వెల్లడించుటలోను విశేషకాలము గడపుచు, వర్ణాశ్రమధర్మములను సమర్థించుచు, కర్మపునర్జన్మసిద్ధాంతములు సత్యములని ప్రపంచమునకు చాటుచు, హిందువుల ఆచారములు ఆధునిక విజ్ఞానమునకు (సైన్సుకు) అనుకూలములుమాత్రమేకాక అతీతములని కూడ నిరూపించుచు నిర్విరామమైన ప్రచారమును వేదికలమీదను, పత్రికలలోను, గ్రంథరచనవలనను చేయుటవలన శతాబ్దములుగా పరప్రభుత్వముచేతను, పరసంస్కృతి ప్రభావముచేతను అభిహతులై ఆత్మగౌరవమును కోల్పోయి నిరాశులై నిస్పృహులైన భారతీయులకు ఆత్మగౌరవము, జాతీయవిజ్ఞానప్రత్యయము పెరుగజొచ్చెను. హిందూసంస్కృతి పునరుజ్జీవనోద్యమము భారతదేశమందలి యన్ని ప్రాంతములలోను బయలుదేరెను. కొంతకాలము కాశీలోను, చాల కాలము మద్రాసులోను నీమె నివసించుటచే నా ప్రాంతములలో నీమె ప్రభావము హెచ్చుగా పడెను. ఆమె స్వరాజ్యోద్యమములో కూడ ప్రముఖనాయకురాలై 1917 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభకు అధ్యక్షురాలుగా నుండెను. ప్రపంచములోను భారతదేశములోను నంత ఖ్యాతినిపొందిన వ్యక్తి ప్రచారము చేయుటవలన భారత సంస్కృతికి ఆధునికులలో గలిగినంత యాదరము మరొక రీతిగా కలిగియుండెడిదికాదు.

అయిర్లెండులో జన్మించిన యీమెకీ జన్మలో భారతీయ సంస్కృతితో సంబంధముగలుగుటకు క్రిందిసంఘటనము కారణమాయెను. ఈమెకు రెండు సంవత్సరముల కుమార్తె యుండెను. ఆ బాలిక రోగముతో అపరిమితబాధ పడుచుండగా "భగవంతుడింత క్రూరుడా ? ఏ దోషము చేసినదని యీ పిల్ల నిట్లు బాధపెట్టుచున్నాడు ?" అని యామె చింతించి దాని సమాధానమునకై వివిధమతముల గ్రంథములను చదివెను. ఎక్కడను సమాధానము లభింపలేదు. తుదకు హిందూగ్రంథములలో సమాధానము దొరికెను. ఈ పిల్ల యేదియో చేయుటవలననే యీబాధ వచ్చినదనియు, పూర్వకర్మలేకుండ అనుభవము రాదనియు, అకృతాభ్యాగమము యుక్తివిరుద్ధమనియు, ఈ దేహములోనికి వచ్చుటకు పూర్వ మీబాలిక చేసికొన్న కర్మనే యిప్పుడు అనుభవించుచున్నదనియు, నీమెకు స్పష్టముగా తెలిసెను. ఇదివరకు చేయబడిన దిపుడనుభవింపబడునట్లే ఇప్పుడు చేసినది ముందనుభవింపబడుననియు, కృతప్రణాశమనునది తర్కవిరుద్ధమనియు నీమె హిందూశాస్త్రములవలన తెలిసికొని సంతృప్తి చెందుటయేకాక యీమె కదివరకుండిన నాస్తిక్యముకూడా పోయెను. దేహములు నశించి క్రొత్తవి వచ్చుచున్నను దేహాంతర్గతుడైన జీవుడు మారకుండుటచే కర్మచేసికొనువాడే అనుభవించుననియు, దీనివలన ఈశ్వరునకు వైషమ్య నైర్ఘృణ్యదోషములు నివారితములగుననియు నీమె గ్రహించి కర్మ, కర్మఫలసిద్ధాంతమును, జన్మాంతర సిద్ధాంతమును ప్రతిపాదించిన హిందూమతముమాత్రమే ఆధునిక విజ్ఞానసంపన్నులకు సంతృప్తినీయగల్గినదని లోకమునకు చాటెను.

హిందూపురాణములలోని లోకాంతరములనుగూర్చిన వర్ణన ననుకూడ డాక్టరు బిసెంటు సమర్థించెను. తాను సూక్ష్మశరీరముతో

పోయి లోకాంతరములను చూచితిననియు, పాపపుణ్యములకు ఫలములను కొంత లోకాంతరములలోను కొంత జన్మాంతరములలోను అనుభవింపవలసి యుండుననియు, నీమె చెప్పుచుండెను.

ప్రపంచములోని యే యితర భాగములోకంటె భారతదేశములో హెచ్చువ్యాప్తిలోనున్న శాకాహారము మానవ నాగరకతౌన్నత్యమునకు సూచకమని డాక్టర్ బిసెంటు తరచుగా చెప్పుచుండెను. అహింసా నియమములో శాకాహారనియమము అనివార్యమైన భాగమని యామె బోధించెను. ఆమె బోధనపద్ధతియే విలక్షణముగా నుండెను. ఆహారముకొరకు జంతువులను హింసించుట యెంతదోషమో తెలుపుటకై యామె తన యనుభవములోని యీ క్రింది యంశములు తెలియజేసినది:

"న్యూయార్కు పట్టణములో మాంసముకొరకై చేయబడునంత జంతుహింస మరి యే పట్టణములోను జరుగదు. నే నొకసారి ట్రెయినులో న్యూయార్కున కేగుచుండగా బండి నగరమును సమీపించి క్రమముగా శాఖానగరములలో (Suburbs) ప్రయాణము సాగించుచున్నను నేను నగర మెంతయో దూరమున నున్నదను అభిప్రాయములో నుంటిని. ఇంతలో హింసావాతావరణము నాకు పొడగట్టినది. ప్రాణములను కోల్పోవు జంతువుల దుఃఖతరంగములు వాతావరణములో నాకు పొడగట్టినవి. అప్పుడే న్యూయార్కు వచ్చినదా యని నేను చూడగా రైలు న్యూయార్కునకు చాల దూరము వచ్చియున్నది."

మంత్రోచ్చారణమువలన అలౌకికశక్తి పుట్టుననియు, పూజలలోను వివాహాదులలోను హిందువు లుపయోగించు మంత్రములలోని అర్థమును ఇతరపదములతో వెల్లడించి కర్మకలాపము నాచరించుకొనుచో సంపూర్ణప్రయోజనముండదనియు కూడ నీమె స్పష్టముగా ప్రతిపాదించి మంత్రాక్షరములయొక్కయు బీజాక్షరములయొక్కయు మహిమను చాటెను.

సాధారణముగా భారతీయ సంస్కృతిని ప్రశంసించువారు స్థూలాకారముగా సంస్కృతిని పరామర్శింతురేకాని లోతులోతులలోనికి వెళ్ళి సర్వతోముఖమైన సారమును ఆస్వాదింపరు. డాక్టరు బిసెంటుయొక్క భారతీయ సంస్కృతి పర్యాలోచనము సమగ్రమైనది.

## మనుల్యామక్

స్విట్జర్లండులోని జూరిచ్ పట్టణమున ఇండో జర్మానిక్ భాషలోను, సంస్కృతములోను ఆచార్యుడుగా కొలదికాలము క్రిందటివరకును (బహుశః నేటికినికూడ) ఉన్న మనుల్యామక్ అనువాతడు పూర్వజన్మలోనే భారతీయసంస్కారమును గల్గియుండెనా యనిపించును. అతడు తన కుమార్తెకు సీతాయని పేరు పెట్టినాడు! అతని పేరు అన్నింటికంటె ఆశ్చర్యమైనది. హిందూ ధర్మశాస్త్రకారుడైన మనువుయొక్క పేరే యాతనిది! అతని తండ్రి ఎర్నెస్టల్యూమక్ గొప్ప సంస్కృతవిద్వాంసుడు; జైనసాహిత్యపండితుడు. ఈ తండ్రికొడుకులు భారతీయవాతావరణమునే స్విట్జర్లండులో సృష్టించుకొనిరి. ఈవాతావరణ మచట మరి కొందరిపైకూడ విశేషప్రభావమును గల్గించినది. యునైటెడ్ నేషన్స్ సంస్థలో పనిచేయుచు గణ్యతనుగాంచియున్న జీన్ హెర్బర్ట్ అట్టివారిలో నొకడు. అతడు హిందూమతాచారములను కూడ పాటించును; గణేశుని పూజించును. సంస్కృతసాహిత్యము మీద 150 గ్రంథములను రచించెను. అందు చివరిది హిందూ పురాణములను గూర్చినది.

## ఎడ్విన్ ఆర్నాల్డ్

ఆంగ్ల పద్యకవితకు శాశ్వతాలంకారములై, ప్రపంచములో ఆంగ్లభాష నెరిగిన యెల్లరకును భారతీయసంస్కృతిని తెలుపగల్గిన రెండు మహాకావ్యములను రచించినవాడు సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్. ఈయన మధురాతి మధురమై ఆంగ్ల పద్యములలోనికి Song Celestial అను పేర భగవద్గీత ననువదించెను; అట్లే Light of Asia అను పేర బుద్ధచరిత్రను రచించెను; ఇంకను ఎన్నియో గ్రంథములను రచించెను. ఈయన పూనా డెక్కన్ కాలేజికి ప్రిన్సిపాలుగానుండెను. 1857నాటిమ్యూటినీలో భయభ్రాంతులైన భారతీయుల కీయన చాల సహాయముచేసెను. భారతీయుల విశాలహృదయమును దయామయత్వమును ఈయన బహుస్థలములలో కొనియాడెను; దానికి కారణ మీయనలోకూడ నాగుణములు మిక్కుటముగా నుండుటయే. భారతీయుల కళాదృష్టి నీయన హెచ్చుగా ప్రశంసించెను. భారతీయ పతివ్రతామతల్లుల చరిత్రలను ఆంగ్లములో రచించెను. ఈయన యనేక విధముల భారతీయాచారములనే యనుసరించెను. 1904 లో నీయన లండనులో చనిపోయెను. ఈయన వెల్లడించియున్న కోరిక ననుసరించి యీయన మృతదేహమునకు అగ్నిసంస్కారము చేయబడెను.

## రల్ఫ్ టి. హెచ్. గ్రిఫిత్

గ్రిఫిత్ ఆక్స్ఫర్డ్‌లో ప్రొఫెసర్ విల్సన్‌వద్ద సంస్కృతము నేర్చెను. కాశిలోని క్వీన్ మేరీ కాలేజిలో 20 సంవత్సరములు ప్రిన్సిపాలుగా పనిచేసెను. తరువాత సంయుక్త రాష్ట్రములలో (నేటి ఉత్తరప్రదేశ్ లో) విద్యాశాఖ డైరెక్టరుగా పనిచేసి 1885 లో విశ్రాంతి తీసికొనెను. ఈతడు రామాయణ మహాభారతాది గ్రంథములలోని భాగములకును, ఋగ్వేద యజుర్వేదమంత్రములకును ఆంగ్ల పద్యానువాదము గావించెను. ఈయన వస్త్రధారణములోను, కేశఖండనములోను కాశీపండితుల యాచారము నవలంబించుచుండెను. జీవితమంతను హిందూమతగ్రంథ పరిశోధనములో నే గడపెను.

## సర్ థామస్ మన్రో

కొందరు పాశ్చాత్యులు గ్రంథపఠనముద్వారా భారతీయ సంస్కృతి నలవఱచుకొనగా మరికొందరు భారతీయప్రకృతితోనే జన్మించిరి. ఇట్టివారిలో సర్ థామస్ మన్రో యొకడు. ఈ యాంగ్లేయుడు ఈస్టిండియా కంపెనీ దినములలో మద్రాసురాష్ట్రములో సత్పరిపాలకుడుగా ప్రజల యాదరమును పొందినవాడు. ఈయన పుణ్యక్షేత్రములకేగి భక్తితో హిందూదేవతల నారాధించెడివాడు. దేవాలయప్రవేశము పొందదగనివాడగుటచే దూరముననే యుండి నమస్కరించుటయేకాక యితర దేవోపచారములనుకూడ గావించెడి

వాడు. కడపజిల్లాలో పాపఘ్నినదియొడ్డుననున్న వాయింపల్లి గండి లోని ఆంజనేయస్వామియాలయమున కాయన కొన్ని దానములు చేసెను; ఇంకను ఎన్నో యాలయములకుకూడ చేసెను. ప్రజలీయనను మాంసివ్యవహారముతో వ్యవహరించుచుండిరి. ఈతడు స్వయముగా కూడ నా పేరును వాడుకొనుచుండెను.

సామాన్యముగా మానవులదృష్టికి కన్పట్టనివస్తువులు మన్రో దృష్టికి కన్పట్టుచుండెను. ఒకసారి యాయన పెల్లూరు సమీపములో గుఱ్ఱముపై నేగుచుండగా నేదో పెద్దజంతువు వచ్చి గుఱ్ఱముమీది కురుకుచున్నట్లాతనికి కన్పట్టెను. ఆ సంగతి నాతడు తన ప్రక్కనే వచ్చుచున్న వారితో చెప్పెను. వారి కా జంతువు కన్పట్టలేదు. ఉత్తరక్షణములోనే నెత్తురు దేహమునుండి స్రవింపగా గుఱ్ఱము క్రిందపడి చనిపోయెను. అంత మన్రో "అదిగో ఆ జంతువు కొట్టి పోవుచున్నది" అనెను. అప్పుడుకూడ వారి కాజంతువు కన్పట్టలేదు. ఇట్టి భౌతికాతీత దృష్టిని మన్రో అనేక సందర్భములలో కన్పఱచెను. ఒకనా డీతడు సముద్రపుటొడ్డున నిల్చుచుండగా నెదుట రత్నములు కన్పట్టెను. అవి తనతోనున్న యితరులకు కన్పట్టలేదు. తనకు మృత్యువు కొలది దినములలో నున్నదని ఈతడు దీనివలన గ్రహించెను. అట్లే జరిగెను. ఇట్టి యలౌకికశక్తు లాయన కపారముగా నుండెను. హిందూ దేవాలయములవద్దకూడ నాయనకు విచిత్రానుభవములు కల్గుచుండెను.

## సోదరి నివేదిత

సోదరి నివేదిత వివేకానందస్వామి శిష్యురాలుగా భారతదేశమునకు వచ్చి యిచ్చట స్థిరపడిపోయెను. 1867 లో ఇంగ్లండులో జన్మించి 1911 లో వంగరాష్ట్రములోని డార్జిలింగ్‌లో నీమె మరణించెను. ఈమె భారతీయాచారముల ననుసరించుటలో నించుమించు అనీబిసెంటుకోవకు చెందినది. ఆదిలో నీమె పేరు మిస్ మార్గరెట్ నోబెల్. పేరును, వేషమునుకూడ నీమె మార్చుకొనెను. భారతీయ జీవితమునుగురించి The Web of Indian Life, Cradle Tales of Hinduism మున్నగు గ్రంథముల నీమె రచించెను. భారతీయుల బాహ్యాచారములనే కాక పరమేశ్వరోపాసనామార్గములనుకూడ నీమె యనుసరించెను.

విగ్రహారాధనపద్ధతి నీమె సమర్థించుటయేకాక స్వయముగా హిందూ దేవతల నారాధించుచుండెను; శివవిష్ణు కాళికాది దేవతారూపముల యారాధనము అఖండపరమేశ్వరారాధనమునకు వ్యతిరిక్తము కాదనియు, పైగా అది పటిష్ఠమైన ఏకేశ్వరోపాసనాపద్ధతి యనియు నీమె నిరూపించెను. కాళీదేవ్యుపాసనముపట్ల పాశ్చాత్యులకే కాక కొందరు భారతీయులకు కూడ అపోహలుండుటచే నామె "Kali The Mother" అను గ్రంథములో కాళికోపాసనము నిట్లు సమర్థించెను:

"మనకు మంచిదనిపించు వస్తువుల నిచ్చు స్వరూపములో మాత్రమే భగవంతుని దర్శించి యారాధించుట తరచుగా లోకములో కన్పట్టును. కాని భారతీయులు పరమేశ్వరు డేదిచేసినను దాని నానందముతోనే గ్రహింపవలయునను తత్త్వములోనివారు. ఈతత్త్వము నుపాసనాపద్ధతిలో కూడ వారు చూపినారు. మనలను కబళించుట కుంకించుచు లేలిహాన జిహ్వాకరాళమైన కాళికారూపములో పరమేశ్వరు నారాధించుటకంటె భగవంతున కాత్మార్పణము గావించుకొను పద్ధతి మరి యేది యుండును?"

ఈరీతిగా నామె భారతీయాచారములను, సంప్రదాయములను సమర్థించెను. కాశీ రామేశ్వరాది పుణ్యక్షేత్రముల నీమె దర్శించెను; చాలభాగము కాలినడకనే ప్రయాణము చేయుచుండెను. ఈవిధముగా హిందువుల తీర్థక్షేత్రములను సేవించిన పాశ్చాత్యులు మిక్కిలి యరుదు.

## ఆంగ్ల సాహిత్యాదినేతలు

జీవితమంతయు సంస్కృత వాఙ్మయములో కృషిచేసిన పాశ్చాత్యులకు భారతీయ సంస్కృతి యంటుననుటది యెల్లరు నెఱిగియున్న విషయమే; కాని సాంస్కృతికులుగా కొంచమైనను విదితులుకాక కేవలము ఆంగ్ల రచయితలుగాను, కవులుగాను ప్రఖ్యాతులైన కొంతమందిపై కూడ భారతీయసంస్కృతి ప్రభావము పడియున్నదని మనము గుర్తింపవలసియున్నది. వృక్షమంతయు పైకి కన్పట్టుచున్నను దాని కాధారములైన వేళ్ళ రీతిగా ప్రచ్ఛన్నములై యున్నవో యారీతిగా ప్రసిద్ధాంగ్లరచయితలు కొందరిపై భారతీయ సంస్కృతి ప్రభావము ప్రచ్ఛన్నముగా నున్నది.

థామస్ కార్లైల్‌ను ఉన్నత శ్రేణికి చెందిన ఆంగ్ల పద్య రచయితగా గౌరవించువా రెందరో కలరు. విమర్శించి చూతుమేని యాతని రచనలలో భారతీయ వేదాంతదృష్టి కన్పట్టుచునే యుండును. ఆతడు "సార్టార్ రిజార్టస్" అను గ్రంథములో నిరూపించినది. భగవద్గీతలోని అనాసక్తి యోగమేయని యీ యుభయ గ్రంథములను సాదృశ్యపరిశీలనదృష్టితో పఠించినచో తెలియగలదు. ఏ తద్గ్రంథనామము గీతలోని "వాసాంసి జీర్ణాని"త్యాది శ్లోకభావములో సంబంధించినదని కొందరు విమర్శకులు వెల్లడించియే యున్నారు. భగవద్గీతను కార్లైల్ (ఆంగ్లానువాదములో) చదివి దానిచే ఉద్దీపితుడై నాడనుటకు మరొక ప్రబల సాక్ష్యము కలదు. రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్ అను అమెరికన్ రచయిత ఇంగ్లండుకు వచ్చినపుడు కార్లైల్ ఆతనికి భగవద్గీతాగ్రంథము నిచ్చి దానిని బాగుగా పఠింపగోరెను.

ఎమర్సన్ భగవద్గీతను శ్రద్ధతో పఠించెనని యాతని రచనలలోని హిందూవేదాంతవాసన తెలుపుటయేకాక ఆతడు ఆంగ్లభాషలో రచించిన Brahman అను పద్యమే సాక్ష్యమిచ్చుచున్నది.

సుప్రసిద్ధాంగ్లకవి షెల్లీ భారతీయభావములచే నుద్దీపితుడాయెనని యాతని రచనలును, జీవితమునుకూడ తెలుపుచున్నవి. Skylark అను పద్యములో నాతడు అద్వైతభావములను వెల్లడించి యున్నాడు. చిత్రవిచిత్ర వర్ణములుగల గాజుపెంకుచే నాచ్ఛాదింపబడినదీప మేరీతిగా నానాత్వవిలసితమై పైకి కన్పట్టుచున్నదో యట్లే ఏకసత్యవస్తువు ఉపాధిభేదముచే నానాత్వవిలసితమై కన్పట్టుచున్నదని యాతడు వర్ణించియున్నాడు. షెల్లీ 1822 లో ఇటలీదేశమున సముద్రములో మునిగి చనిపోయెను. అదివరకాతడు వెల్లడించియుండిన కోరికననుసరించి యాతని దేహమునకు దహనసంస్కారము జరుపబడెను.

## టి. ఇ. ఇలియట్

ఆధునికాంగ్ల కవులలో మేటియైనవాడు టి. ఇ. ఇలియట్. ఈతడు నోబెల్ బహుమానమునుకూడ పొందియున్నాడు. అట్టివాడు భారతీయసంస్కృతిచే ఉత్తేజితుడై తన కవితచే ప్రపంచమును మెప్పింపగల్గినాడనునది గమనింపదగినది. Waste Land అను కావ్యములో 5 వ భాగములో నాతడు సుమారు 40 పంక్తులు భారతీయ సంస్కృతి పరిభాషతోనే నింపినాడు. గంగా, హిమవన్తమున్నగు పదములను వాడుటయేకాక యాతడు మేఘముదకారాదు అయిన మూడు సందేశపదములను పల్కుచున్నదని వ్రాసినాడు. మేఘము డా, డా, డా (ద, ద, ద) అని పల్కుచున్నదట. మొదటి దకారమునకు "దత్త," రెండవదానికి "దయధ్వం", మూడవ దకారమునకు "దమ్యత" అర్థమని యాతడు వివరించి చెప్పినాడు. అనగా దానము, దయ, దమ్యత (నిగ్రహము) అనునవి దివ్య సందేశములుగా వినబడుచున్నవట. మేఘధ్వనియొక్క యీ యర్థము తాను బృహదారణ్యకోపనిషత్తునుండి (డుస్సేన్ భాషాంతరీకరణమునుండి) గ్రహించినానని ఇలియట్ గ్రంథాంతమందు వ్రాసికొన్నాడు. "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అను మాటలతో నాతడు ప్రకరణములను ముగించినాడు. ఒక నోబెల్ లారియట్ ఉపనిషద్విషయముల నీరీతిగా తీసికొని యంత గౌరవమును సంపాదించినాడని సాధారణముగా ప్రజ లూహింపరు. కాని ఇలియట్పై భారతీయ సంస్కృతిముద్ర సందేహమున కవకాశములేకుండగనే ప్రస్ఫుటమగుచున్నది.

ఇట్లే స్టీఫెన్ స్పెండర్, ఆడెన్, సోమర్ సెట్ మాఘం మున్నగు ఆంగ్ల రచయితలు భారతీయసంస్కృతిచే నుద్దీపితులై రచనలను సాగించుచున్నారు.



## ప్రశంసావచనములు

వివిధశాస్త్రములలో భారతీయులు సాధించిన విజ్ఞానమునకు ముగ్ధులైన పాశ్చాత్యులు వానిలో సాగించిన కృషినిగాని, వానిపై గావించిన ప్రశంసలనుగాని యిచట వివరించుట కవకాశము లేదు. కొందరు పాశ్చాత్యప్రముఖులు సుప్రసిద్ధ సంస్కృత గ్రంథముల మీదను, సామాన్యాకారముగా భారతీయసంస్కృతిపైనను వల్లడించిన ప్రశంసావాక్యముల నుల్లేఖించుచు నీ వ్యాసమును ముగించుచున్నాను.

యూరపియన్ సాంస్కృతికులకు పితామహుడైన సర్ విలియంజోన్సు భారతీయ సంస్కృతి సంగ్రహమునకు దర్పణమైన మనుస్మృతి నిట్లు ప్రశంసించియున్నాడు: "దివ్యమైన శ్రద్ధాభక్తులు, సర్వమానవులపట్లను సుహృద్భావము, సకలప్రాణులమీదను ప్రేమమార్దవములు మనుస్మృతిలో సర్వత్ర వ్యాపించియున్నవి. మనుస్మృతి శైలి శ్రీవిగలదై, ఉదాత్తమై, గంభీరమై యలరారుచుండును. మనువచనము రాజశాసనమువలె వినబడుచు భయభక్తులతో నాలకింపవలసినదిగా నుండును. భగవంతునిమీద తప్ప మరి దేనిమీదను ఆధారపడరాదను భావము నీగ్రంథము కల్గించును. రాజులనుకూడ మందలించు ఉదాత్తత మనువులో కన్పట్టును. మనుస్మృతిలోని గాయత్రీ స్తుతులను చూడుమేని మనువారాధించునది భౌతికదృగ్గోచరసూర్యుడు కాదనియు దివ్యము, అసదృశము, మహత్తమము, సృష్టిస్థితిలయస్థానము, సర్వప్రకాశకము, బుద్ధిప్రదీపకమునయిన మహాతేజస్సునే మనువారాధించెనని తెలియగలదు." (1794 లో జోన్సు ప్రకటించిన మనుస్మృత్యాంగ్లానువాదమునకు పీఠికనుండి గృహీతము.)

జగత్ప్రసిద్ధిచెందిన జర్మను విద్వాంసుడు గెటే శాకుంతలమును జర్మనుభాషలో చదివి పారవశ్యముతో నిట్లు పలికెను: "ఓ శకుంతలా, హృదయమును సమ్మోహింపచేసి, ఆనందపారవశ్యమును గల్గించి విందును వినోదమును కూర్చు పరవస్తువు నీవే; స్వర్గమర్త్యలోకముల రెండింటి సమ్మేళనము నీవే." (పద్యతాత్పర్యము.)

ఎ. ఎ. మాక్డొనెల్ ఇట్లు నుడివియున్నాడు: "18 వ శతాబ్దిలో యూరపుఖండము సంస్కృతముతో పరిచయమునుపొందెను. 15 వ శతాబ్దినాటి రినైజాన్స అనెడి వైజ్ఞానికపునరుజ్జీవనోద్యమమునకు తర్వాత ఇంత గొప్ప వైజ్ఞానికసంఘటనము యూరపులో జరుగలేదు."

యూరపుసంస్కృతికి మూలము భారతీయ సంస్కృతియే యని వింటర్ నిడ్జ్ యిట్లు వ్రాయుచ్చియున్నాడు: "మన సంస్కృతియొక్క మూలమును తెలిసికొన దలతుమేని, ప్రాచీనమైన ఇండో యూరపియన్ సంస్కృతిని గ్రహించుట కుపక్రమింతుమేని మనము భారతదేశమున కేగవలయును."

# పాలవాన

## శ్రీ శ్రీరంగం నారాయణబాబు

### పాత్రలు:

| | | |
|---|---|---|
| రఘునాథరావు | .... | కథానాయకుడు |
| శారద | .... | కథానాయిక |
| అవధానులు | .... | శారద తండ్రి |
| సౌభాగ్యమ్మ | .... | రఘునాథరావు తల్లి |
| సుభద్రమ్మ | .... | శారద తల్లి |
| రామన్న | .... | ముష్టివాడు |

[మేము ద్రావిడులము. ద్రావిడులు ద్రాక్షిణాత్య దేశానికి చెందిన వారు. ఏనాడో ఆంధ్రదేశం వలసవచ్చి, అనేక తెగలు ఆంధ్రులలో కలసి విలీనమైపోయినట్లు, వీరుకూడా ఆంధ్రులై పోయారు. అందులో మూడు తెగలు: ఒకటి పేరూరు ద్రావిడులు—వీరే పెద్ద ద్రావిడులు—దిమిల ద్రావిడులు, ఆరామ ద్రావిడులు అని. కడపటి రెండు తెగలవారిని చిన్న ద్రావిడులంటారు. అందుకు కారణం, గోదావరిదాటుతె అగ్నిహోత్రాలారిపోతాయని, అట్లు ఆరిపోవడం శిష్టత్వానికి నిష్కృతగ్గతుందని. నదిని దాటకుండా, బ్రాహ్మణ్యానికి భంగం వాటిల్లకుండా, పేరూరులో ఉండిపోయినవారు పెద్దద్రావిడులు. ఆరామంలో నివాస మేర్పచుకున్నవారు ఆరామ ద్రావిడులు. గోదావరి దాటి, ఎలమంచిలి ప్రాంతంలో దిమిలలో కాపురం ఏర్పరచుకున్నవారు దిమిలద్రావిడులు. పెద్ద ద్రావిడులు యీ మూడిని మాత్రం చులకనగ కుమ్ములను చూస్తారు. ఇచ్చిపుచ్చుకోడాల్లోకూడా మా ఆడుపిల్లలను వాళ్లు చేసుకుంటారు కాని, వారి పిల్లల్ని మా కివ్వరు......

మేము దక్షిణదేశంనుంచి రావడంనుంచి దాక్షిణాత్యుల ఆచారాలు, అలవాట్లు మాలో చూచాయగా కనబడతాయి. ముఖ్యంగా మాలో ఎవరైనా మరణిస్తే, వారికోసం ఆ పదిరోజులు, అహోరాత్రం విలపించడమే కాకుండా, మనిషి మరణించిన ఆరుమాసాలవరకు, దినోదయవేళ, దినసావసానవేళ, కుటుంబానికి చెందినవారు పెరట్లో కొబ్బరిచెట్లకింద, చెంబులతో నీరు తీసుకెళ్ళి, కళ్ళకు నీళ్ళు రాసుకుంటూ, ఓ ఘంటైనా ఏడవాలి. ఇది పెద్దద్రావిడులలో జరుగుతున్న ఆచారం.

పోయినవారికోసం ఏడవడం మా ఆడువారు యించుమించు ఒక కళగా తయారుచేశారు. అలా రోదించేవారిలో కొందరు ఖుషాపాటీలుంటారు. వారు ఏడుస్తూ ఉంటే, పరామర్శ కొచ్చినవాళ్లు కడపరాయి హృదయంకలిగినవారైనా, విలాపధ్వనులు వింటే, చంద్రోపలంలా ద్రవించక తప్పదట. నాకు తెలిసినంతమట్టుకు, మా అమ్మయ్య కాపీ సోమయాజుల అమ్మన గారు, ప్రతిభావంతంగా ఏడిచేవారు. మా బంధువుల్లో ఎవరైనా పోతే, ఆమెను తప్పక తీసికెళ్లి, ఏడిపించి మరీ పంపేవారు. ఒకప్పుడు ఆవిడకు దత్తపుత్రుడు మరణిస్తే ఆవిడ విలాపమాధురులు విందామని పేరి కాశీనాథశాస్త్రి, మహామహోపాధ్యాయ తాతా రాయుడు శాస్త్రివారు వచ్చి ఏడుపు విని, మెచ్చుకొని మరీ వెళ్ళారట.

ఈ యితివృత్తం, భారత జనసభాపాథ్యుడు పాంచజన్యం పూరించగా గాంధిమహాత్ముని సారధిత్వమున భారతావని సత్యాగ్రహ మహాసంగ్రామములో దూకి, విద్యాలయాలు న్యాయస్థానాలు బహిష్కరించి, శిబిప్రముఖులకు తుల్యమైన త్యాగాన్ని చూపించిన మహోదయ దినాలు. ఆనాటి ఉత్సాహం, భావోద్వేగం అనన్యసామాన్యం. ఇఖ చదవండి నాటిక.]

సుభ: రండి, రండి సౌభాగ్యమ్మగారు. ఎప్పుడు రావడం? ఏమిటి? ఊరకరారె పెద్దలు? పల్లెటూరివారు పట్నవాసం వెళతారు కాని, పట్నవాసంవారు పల్లెటూరు పనిలేకుండా రారే? చిత్రంగా ఉంది.

సౌభా: ఏం సుభద్రవదినా, కులాసాగా ఉన్నారా? ఎంతకాలమైంది మిమ్మల్ని చూచి? యింతకు పోమిడేవమ్మ వవబోతున్నావుగా? చూచిపోదామని.

సుభ: శారదా! అత్తయ్యకు మంచినీరు పట్టుకొచ్చియ్యి. ఏమిటో, వదినా! యజ్ఞం చెయ్యడమంటే ఎంత డబ్బుండాలి? మేము అసలు బీదవాళ్లం, వైదిక వృత్తికూడా యిప్పుడు పూర్వంలా లేదు. ఊళ్లోవాళ్లు సహాయం చేస్తానంటే ఏమాత్రంచేస్తారు? మీ అన్నయ్య చెబితే వినరు, పండ్లు పాకలు వేయించేస్తున్నారు.

శార: అత్తా! యిదిగో మంచినీళ్లు!

సౌభా: చిలకలా ఉన్నావే తల్లీ! అత్తా అనిపిలిస్తే ప్రాణం లేచొచ్చింది!

సుభ: దీని పెండ్లి యింకా ఒకటి ఉండనే ఉంది. చిటికొటి సంసారం. మీ అన్నయ్య వైదికమే చేస్తూ ఉన్నా, పద ముగ్గురుపిల్లల్ని కనిపెంచి, పెద్దవాళ్లను చేశాను. దీనికికూడా మూడు ముళ్లుపడిపోతే?

సౌభా: అందుకే వచ్చాను వదినా! ఈ రోజుల్లో, చిన్నా పెద్దా ఏమిటి? అంతా ద్రావిళ్లమే. దొంతపాదులాంటి నీసంసారం చూస్తే ముచ్చటేస్తుంది. వంశం, సంప్రదాయం, చెప్పేదేమిటి!

సుభ: మీ అన్నయ్య వప్పుకుంటే నా కభ్యంతరమేమిటి వదినా? గొంతి మరీ యిస్తాను—పిల్లని.

సౌభా : నీ దగ్గర దాపరికానికేముంది. నా మనస్సు నీకు చెబుతున్నా. మా వాడి పెళ్లి విషయంలో ముఖ్యంగా నాకు రెండు కోరికలున్నాయి. మీ పిల్లనిస్తే ఆ రెండు కోరికలు కూడా తీరుతాయి. పిల్లలు దొరకరనా ? కో అంటె కోటి మంది. ఏమిటా అంటె ? యింతవరకు మా పిల్లల్ని మీరు చేసుకోవటమెగాని, మీ పిల్లల్ని మా కివ్వడం లేదుగా ?

సుభ : ఏమిటో. ఆ రోజుల్లో పెద్దలు ఆచారం అల్లా పెట్టారు. కాని యీ రోజుల్లో యివన్నీ ఏమిటి వదినా. ఎందుకమ్మా, నేనేమైనా అంటె మీ అన్నయ్య నామీద విరుచుకు పడతారు.

సౌభా : మా అబ్బాయి దేశభక్తుడు. గాంధిగారి శిష్యుడు. స్వరాజ్యంకోసం చదువుకూడా మానేసి పనిచేస్తున్నాడు. ఏ రోజు జైలుకి వెళతాడో కూడా చెప్పలేము.

సుభ : అవునమ్మా. మా ఊరులాంటి కుగ్రామాల్లోకూడా, గాంధిగారంటె శ్రీమన్నారాయణుని అవతారం అని కొలుస్తున్నారు.

సౌభా : అందుకు సందేహమేమిటి. మా వాడికి పెద్ద ద్రావిడుల యింటి పిల్లను చేయడమె కాకుండా, అగ్గినిప్పులాంటి ఆహితాగ్నుల యింటి పిల్లను చేద్దామని మొదటి కోరిక. యిఖ రెండవదన్నావ ?

సుభ : పిల్ల రంభలా వుండాలి అంటేనా ? మా శారద కేమిటి లోటమ్మా ? పల్లెటూరి పిల్లకాబట్టి షోకులు వగలు తెలియవు. మడితడి ఆచారంలో నాకంటె ఎక్కువ. అందుకే వాళ్ల నాన్న కదంటె పంచప్రాణాలు.

సౌభా : రంభ. ఊర్వశి. నాకెందుకమ్మా. అన్నయ్య అందుకేకదా యజ్ఞం చేస్తున్నారు. నీలాంటిది కావాలి నాకు వదినా. పదముగ్గురు పిల్లల్ని కన్నావు. ఒక్క పిల్లకేనా గంటెడు పోతపాలుకాని, డబ్బాపాలుకాని ఎరుగవు. అది నాకు కావలసింది.

సుభ : మా పిల్లలకే సరిపోవడమే కాదు, అగ్రహారంలో తల్లిలేని బ్రాహ్మణ పిల్లల్ని ఎంతమందినో, పాలిచ్చి పెంచాను. తల్లి పాలు తాగని పిల్లలకి తల్లిదండ్రులమీద ఏమి అభిమానం వుంటుందమ్మా ?

సౌభా: నీ కడుపు చల్లగ నీవు వెయ్యేళ్ళు వర్ధిల్లాలి. తల్లిని ప్రేమించనివాడు దేశాన్నేమి ప్రేమిస్తాడు. తల్లులకు తల్లి దేశం.

సుభ : గవర్నమెంటు ఉద్యోగస్తులు పోలీసువాళ్ళు డబ్బాపాలు తాగినవాళ్లేనని నా నమ్మకం.

సౌభా: మా బాగా చెప్పేరు వదినా. మా అబ్బాయికి పుట్టే పిల్లలు దేశభక్తులు కావాలి. అంటె వాళ్లు తల్లిపాలు తాగిపెరగాలి. అందుకు నిన్ను మించినవాళ్ళు మన ద్రావిళ్ల జాతిలో లేరు. నీ కూతురు శారద, యీ విషయంలో తల్లిని పోల్తారు ఆడపిల్లలు. అదే నా రెండో కోరిక. అందుకె మీ సంబంధం కోసం పాకులాడుతున్నా.

సుభ : ఆడవాళ్ళం మనం ఎంత అభిమానాలు పడితె ఏం లాభం, మొగాళ్ళు వార్థించాలి. అందులోకి మీ అన్నయ్యకు రోజు రోజుకి చాదస్తం ఎక్కువైపోతున్నాది. యిఖ యజ్ఞంకూడా చేస్తె అడిగావ ?

సౌభా : అన్నయ్య నా కోరిక తీరిస్తె నన్ను ఏం చెయ్యమన్నా చేస్తాను.

సుభ : నాకు నమ్మకంలేదు. వచ్చేవేళయింది. కాస్త మంచినీళ్లు పుచ్చుకొని సేదదీరు. ఆమాటేదో, ఆయనచేతె అనిపించుకుని వెళుదువుగాని.

[అవధానులు ప్రవేశం]

అవధా: ఏమిటే, ఏం చేస్తున్నావు? కొంప మునిగింది. ఊళ్ళో కొద్దో గొప్పో తప్ప గాడిదకొడుకులు ఒక్కడు సహాయం చేసేట్టు కనపడలేదు. అన్ని ఊళ్లకు పత్రికలుకూడా పంపించేశాను. మనకి గంగాప్రవేశమె గతనుకుంటాను. శారద పెళ్ళికోసం అట్టేపెట్టిన పొలం ముక్కకూడా అమ్మేసినా ఒడ్డునిపడం. ఏమాత్రం వస్తుంది, మహావస్తే రెండువేలు. ఊరివాళ్ళ సహాయం ఒక వేయికంటె ఎక్కువ ఉండదు ఎంత తన్నుకుచచ్చినా. యిఖ ఏడువేలుండాలి? ఏం చెయ్యడం? ప్రాయోపవేశమే గతిలా కనపడుతున్నాది.

సుభ : ఏమిటండి ఆ కేకలు! బాగుండదు. పట్నంనుంచి సౌభాగ్యమ్మగారు వచ్చారు. ఆవిడవింటె, ఏమనుకుంటారు?

అవధా: ఏమిటి? వకాల్తీచేస్తూ చనిపోయాడు రఘునాథరావుగారు ఆయన భార్య? అబ్బ చిన్నద్రావిళ్ళుకదటె.

సుభ: ఆహా. అతిరాల ఆవిడె.

అవధా: ఎందుకొచ్చారేమిటి?

సుభ: సమ్మంధంకోసం.

అవధా: యీ ఊళ్ళో ఎవరు చిన్నద్రావిళ్లు లేర?

సుభ : యిస్తే మన శారదని చేసుకుందామని.

అవధా: ఛీ. ఏం దౌర్భాగ్యపు మాట్లాడావె. ఆచారంలేంద చిన్నద్రావిళ్ళ కివ్వడం. పెండ్లికాకపోతె నూతిలోనో, గోతిలోనో పారేస్తానుగాని ఆ శిషభిషలు పనికిరావు.

సుభ : పోనీ బావుండదు ఆవిడ వింటె. గట్టిగా అనకండి. ఆవిడ పెరట్లో శారదతో మాట్లాడుతున్నాది. అదిగో వస్తున్నది కూడా.

సౌభా: ఏం అన్నయ్య, కులాసాగా ఉన్నారా ?

అవధా: ఎప్పుడొచ్చావమ్మ. ఎన్నాళ్ళకెన్నాళ్ళకు. నీ భర్త మహా గొప్పవాడు. వకాల్తీచేసి రెండుచేతుల ఆర్జించేవాడు. వేద పండితులను పిలిపించి, పదస్సులుచేయించి, వాళ్ళకి పుష్కలంగా ముట్టచెప్పేవాడు. వైదికులకింద ఎంతడబ్బు ఖర్చుచేసేవాడు చెప్పలేంగద. ధర్మరాజనెవారు అంతమంది ఆయన్ని. నేనెప్పుడు పట్నంలో మా గురువుగారిదగ్గర వేదాధ్యయనం చేసేవాణ్ణి, ఎప్పుడు చూడ్డానికి వెళ్ళినా, తాంబూలంలో విచ్చురూపాయి పెట్టి యిచ్చేవాడు. ఆ రోజుల్లో రూపాయంటె ఎంత కిమ్మత్తో నీకు తెలుసు?

సౌభా : అవునన్నయ్య. రూపాయికి పదిమానికల బియ్యం యిచ్చేవారు. ఒక వారంపాటు సంసారమంతటికీ యథేచ్ఛగా సరిపోయివి.

అవధా : సౌభాగ్యమ్మా, పోయేసరికి ఓ రెండులక్ష లుంటుందా ఆయన ఆర్జన?

సౌభా : ఉంటుందిగాని మాకు మిగిలిన దేమీలేదు. అంతా దానాల కింద, ధర్మాలకింద ఖర్చు అయిపోయింది.

అవధా : అదేమిటమ్మా, విద్ద్వారంగా ఆర్జించాడే.

సౌభా : ఆర్జిస్తేనేం, రెండు చేతుల ఖర్చుచేశారు.

అవధా : అంతా వైదికులకింద ఖర్చుపెట్టాడమ్మా. మహారాజు!

సౌభా : ఆయన పోయేసరికి ఒక పాతికవేలు నగదు, లక్షరూపా యలు చేసె ఆ పెద్దయిల్లు మిగిలాయి.

అవధా : అయితేనేంలె ఒక్క కుఱ్ఱవాడుగా?

సౌభా : అబ్బాయి బి. ఏ. చదువుతూ, సత్యాగ్రహంకోసం గాంధి గారు మానేమన్నారు కదా అని చదువు మానేశాడు. దేశం కోసం పాటుపడుతున్నాడు. చిన్నవాడైనా వయస్సుకి, ఒల్లమాలిన కీర్తి, ప్రతిష్ఠ ఊళ్లో.

అవధా : గాంధిమహాత్ములు నారాయణాంశ సంభూతులు. దేశం కోసం మహ కష్టపడుతున్నారు. పరమేశ్వరుడు కరుణిస్తె స్వరాజ్యం లిప్తలో వస్తుంది. మీ అబ్బాయిపేరు తరుచు పత్రికల్లో పడుతూ ఉంటుంది. మరి ఎంతవాని కడుపున పుట్టాడు.

సౌభా : నే నొమాట చెప్పాలని ఉంది. మీరు కోపం తెచ్చుకో నంటె?

అవధా : చెప్పమ్మా, కోపమెందుకు.

సౌభా : మీ శారదను మావాడి కివ్వాలి. అడిగేందుకే వచ్చాను. మీ కేమన్నా సరె.

అవధా : ఆచారంలేదు. పెద్దదావిళ్ల పిల్లని చిన్నదావిళ్లకివ్వడం. అందులోకి యజ్ఞంకూడా తలబెట్టాను. సరెమిరా అన్నా వీల్లేదు.

సౌభా : మీరు చేయబోయె యజ్ఞానికి నన్ను ఏసహాయం చెయ్య మంటే అది చెయ్యడానికి సిద్ధంగావున్నాను.

అవధా : కుదరదమ్మా, కుదరదు. అదే నీవొచ్చిన పనైతే వెళ్లొచ్చు. ఈపూట యిక్కడ భోంచేసి మరీ వెళ్లాలి సుమా! కోపం తెచ్చుకోకు.

సుభ : వదినా, వేడినీళ్ళు కాగాయి స్నానానికి లెండి, వంట అయిపోవచ్చింది.

అవధా : లే అమ్మా! లే!

(సౌభాగ్యమ్మ వెళ్లాక)

సుభ : ఏమిటండి మీ మాటలు? ఎన్ని సంబంధాలు చూసినా ఒకటీ దొరకలేదు. పిల్లచూస్తే అగ్గజంగా కనిపిస్తున్నాది. తలపెట్టిన యజ్ఞం యాగం ఎల్లా అవతాయి. అన్నిటికీ అలా మూర్ఖత్వం వహిస్తే. యింతకు కులభ్రష్టులా ఏమిటి. కొంచెం ఆలోచించి మరీ మాటాడండి.

అవధా : అయితే పిల్లనమ్ముకోమంటావటే? ఆ సొమ్ము నేనొక్క గవ్వకూడా తిన్ను.

సుభ : మనం తింటామా ఏమిటండి. అంతాభగవంతునికి అర్పిస్తున్నాం. లేకపోతె యిప్పుడు యజ్ఞం ఎలా సాగుతుంది? యజ్ఞం చెయ్య లేకపోతె ఎంత రసాభాసో ఆలోచించి మరీ చెప్పండి. వాంతకె యిచ్చుకోవాలి పోలెక్షంత.

అవ : ఆచారం లేందె ఎల్లా ఒప్పుకోను? నన్ను పరమేశ్వరుడు వరి క్షిస్తున్నాడు.

సుభ : అయితే మన వృత్తికే భంగం వస్తుంది. ఒప్పుకుంటే పదివేలు ఆవిడచేత నే పెట్టిస్తా. పెళ్ళి అయిపోతుంది. మడిచెక్క మిగు ల్తుంది. ఊళ్లోవాళ్లిచ్చినది మిగుల్తుంది. మీ యిష్టం తరవాత.

అవ : ఆవిడ పదివేలు యిస్తుందంటావ?

సుభ : మనసంబంధం అంటె ఎంతో మొగ్గగా ఉంది. యింతకు యిస్తేనె.

అవ : అయితె నీ యిష్టం. పెళ్ళి ఎవ్వరికి తెలియకండా వాళ్ల ఊళ్లో దేవాలయంలో జరిగిపోవాలి. నేనిక యీ విషయం లోకి రాను. నువ్వు మాటాడు. పదివేలు మనకిచ్చాక పెళ్లి చేసి పారేదాం.

సుభ : మీరూరుకోండీ, నేను లోపటికెళ్లి మాటాడి చక్కా వస్తాను.

అవ : పదివేలకు కానీ తగ్గేందుకు వీల్లేదుసుమా.

సుభ : అల్లాగేలెండి.

(సుభద్రమ్మ లోపలికిపోయి కొద్దిసేపటిలో తిరిగి వస్తుంది.)

సుభ : మనం చెప్పిన ప్రతి విషయానికి ఒప్పుకుంది. వాళ్ల దగ్గర యిప్పుడు నగదులేదట. వాళ్ల కుఱ్ఱవాడికి తెలియకుండా కొంప తాకట్టుపెట్టి మూడు రోజుల్లో వచ్చి కరుకులు కుమ్మరిస్తానంది.

అవ : ఒసే, నీ యిల్లు బంగారంగాను! నీకు ఒకనగ, నాణెం, చేయిస్తానులే ఊళ్ళోవాళ్ళు యిచ్చినదాంతో. సోమయాజి నుంచి సోమిదేవి అవడంకాదే, సోమిదేవినుంచే సోమయాజి అవుతున్నాడు.

* * * *

సౌభా : యిదేమిటి అన్నయ్యా? అకాలవర్షంలా అనుకోకుండా వచ్చారు చల్లగ. యీరోజు మాకు పెద్దపండుగన్న మాటే. శారద కాపురానికొచ్చిన యీ రెండేళ్లలోను ఒక్కమారు కూడా మీరురాలేదు, మాయింట్లో విస్తరి వేసుకొ భోంచెయ్యలేదు. శారదా! మీ నాన్నగారు రాకరాక వచ్చారు. కాళ్లు కడుక్కొనేందుకు నీళ్లు తే అమ్మా.

అవ : ఎందుకమ్మా అక్కరలేదు, యీ అరుగుమీద కూర్చొని యిలాగ వెళతా.

సౌభా : యింట్లోకికూడా రారా? మేమేమంత నేరం చేశా మన్నయ్యా. అంటరానివాళ్ళమా! మీరు పిల్లనిచ్చుకున్నారు కద. దానిముఖం చూసేనా రండి యింట్లోకి ఓమారు.

శారద : యిదిగో నాన్నా కాళ్లు కడుక్కొనేందుకు నీళ్ళు.

అవ : అమ్మా కులాసాగా ఉన్నావ? మీ అమ్మ నిన్నెంతో అడిగింది.

శారద : ఏమిటోనాన్న, మోచేతి దెబ్బ మొగుడింటి కాపురం అన్నారు.

అవ : అల్లాగనకె తల్లీ! లోపలికి పద.

శోభా : ఏం పట్నంలో పనిమీదవచ్చి యిల్లా వచ్చార ?

అవ : నాకు పట్నంలో పనేమిటమ్మా? యిన్నాళ్లు గాంధిగారు మా గొప్పవారనుకున్నాం. యిప్పుడు తెలిసింది. వర్ణాశ్రమ ధర్మాలు మంటగలపడానికి పుట్టాడని. కాకపోతే పంచము లకు దేవాలయ ప్రవేశమేమిటమ్మా.

శోభా : దేము డందరికి ఒకటేగద అన్నయ్యా!

పళ : ఆమాత్రం తెలియకే, పెద్దలు శిష్టాచారమని పెట్టారా? ఏ జాతివాళ్లు ఎట్లావుండాలో ఎప్పుడో జరిగిపోయింది. అలా ఉండితీరవలసిందె.

శోభా : కాలంతోపాటు ఆచారాలుకూడా మారాలిగా ?

అవ : నీయంత వేదాంతం నాకు తెలియదుకాని ఒకేమాట కచ్చితంగా చెబుతున్నాను. నా మాటకు మరి తిరుగుండకూడదు. యీ ఊళ్లో ఏ దేవాలయంలో శారద పెళ్లయింద్రో, ఆ దేవాలయపు ధర్మకర్తలె నాకు ఉత్తరంరాశారు.

శోభా : ఏమని ?

అవ : నీ కొడుకు మాలమాదిగలను తీసుకొని యీ రోజు దేవాలయంలో ప్రవేశిస్తాడని, దాన్ని అరికట్టమని.

శోభా : ఎవరు అరికట్టగలరు ?

అవ : ఎవరు ఎల్లా చచ్చినా, నా అల్లుడుమాత్రం యిటువంటి పాడు పనికి పూనుకోకూడదు. అసలు చిన్న ద్రావిళ్లకు పిల్లనిచ్చినందుకె నలుగురూ నానోట్లో గడ్డిపెడుతున్నారు. యజ్ఞం చేసినవాడి అల్లుడు జాతిభ్రష్టుడై పోతూవుంటె చూస్తూ ఊరుకోమన్నావ. కులం చెడ్డవాడింట్లో కూతురెల్లా ఉంటుంది చెప్పు. ఉంటె నే నుండనిస్తాన? వీడికోసం బ్రతికుండగా కూతురితో తెగతెంపులు చేసుకోలేనుకద. అదేదో తేలాలిప్పుడు.

శోభా: సరే, అదంతా మీ అల్లుణ్ణె అడగండి. యిప్పుడె వస్తాడుగ?

అవ : ఉదయం అగ్నిహోత్రం చేసుకువచ్చాను. సాయంత్రం అగ్నిహోత్రం వేళకి యిల్లు చేరుకోవాలి. ఎక్కడా అచమనం అయినా చెయ్యను. అయిదు కోసులు నడిచివచ్చాను. మళ్ళా నడిచిపోవాలి.

శోభా: నడవడం ఏం ఖర్మం, బండి కట్టిస్తాను.

అవ : బండికూడా ఎక్కదలచుకోలేదు.

శోభా : అదిగో మీ అల్లుడె వస్తున్నాడు, అతన్నడగండి.

[ రఘునాథరావు ప్రవేశం ]

రఘు : ఓహో, మామయ్యగారొచ్చారె. ధర్మకర్తలు మీ పేర వ్రాశారా? లేకపోతె యిన్నాళ్లూ మా యింటి కొచ్చారు? నా పెళ్లితరువాత యిదే రావడం మళ్లా.

అవ : లోకమంతా కోడైకూస్తూఉంటె వాళ్లు వీళ్లు తెలియ చెయ్యడమెందుకు. పేపర్లోనె పడింది యీ సంగతి. నాఅల్లుడై వటువంటివాడు యిటువంటి దేవతాద్రోహానికి పూనుకోకూడదు. పిల్లానిచ్చామని అయినా కనికరించి, నామాట విని యిఖనైనా విరమించుకో.

రఘు : ఏ గాంధీగారు యిది చేయమని చెప్పారో, సాక్షాత్తు ఆ గాంధీమహాత్ముడొచ్చి, ఒరె అబ్బాయిలు, యిప్పుడు వద్దు యిది—అని చెప్పినా కూడదు. అటువంటప్పుడు మీరు చెబితె మానతాం? ఎంతమాత్రం మానం.

అవ : గాంధీగారు ఒట్టి అభాజనుడు, దరిద్రుడు. వాడిమాటంటె ఒళ్లు మండుకొస్తున్నాది, వాడి పేరెత్తకు.

రఘు : ఒకప్పుడు తమబోటి శిష్టులంతా, గాంధీగారంటె సాక్షాత్తు శ్రీమన్నారాయణమూర్తి అవతారమని రెండుచేతులు జోడించి మరీ దండంపెట్టారు. యీనాడు హరిజనులచేత దేవాలయప్రవేశం చేయించమంటె అభాజనుడని, దరిద్రుడని తిడుతున్నారు. దరిద్రుడుకాదు, దరిద్రనారాయణుడు. ఆయన శిష్యులం మేమంతా.

అవ : పండువంటి కాపురంసుమా, పాడైపోతుంది. తరవాత నీయిష్టం.

రఘు : పండువంటిదికాదు మేడిపండువంటి కాపురం. పాడైందు కేమిలేదు. ఏనాడో పాడైంది. మర్యాదకోసం బయటపెట్టలేదు.

అవ : అంటే నీవనేదేమిటి—నాకు అర్థం కాలేదు.

రఘు : కాపురానికి వచ్చిననాటినుండి నన్ను న్యూనతపరుస్తూనే ఉంది. భర్త యెడల ఉండవలసిన గౌరవం, ప్రేమ, స్నేహం ఏమీలేవు. నన్నెప్పుడు తక్కువగ నీచంగా చూస్తున్నాది. ఏదో పశువుల్లా మాత్రం బ్రతుకుతున్నాం, అంతే.

శోభా : అవునన్నయ్యా. ఒకనాడు వాడిసౌరక్షణ చేయడంగాని, వాడు తిన్నకంచంలో తినడంగాని యిప్పటికి చేయలేదు. కాపురమొచ్చి యిన్నాళ్ళయిందికాని, కోరి చేసుకున్నాను గనుక నోరుమెదపకుండా, నేనే చూస్తున్నాను, వాడి సుఖం, సౌరక్షణ; నేను మాత్రం ఎంతకాలం ఉంటాను. నా ఆరోగ్యం కూడా సమంగా లేదు.

అవ : అవునమ్మా, నాకన్ని తెలుసు. ప్రతిపింజారివాణ్ణి, యింటికి తీసుకొచ్చి, పక్కని కూచోపెట్టుకొని భోంచేస్తే, నా కూతురెకాదు, ఏ బ్రాహ్మణపిల్లయినా, అటువంటివాడి విస్తట్లో తింటుందా. నా కూతురు వంశం ఏమిటె, నేనేమిటి!

శారద : నేను చిన్నప్పటినుంచి మడి తడిలో పెరిగాను. నా కల్లాంటివి పనికిరావని, నేను ఆనాడె చెప్పాను నాన్నా. నామాట వింటెగా ?

అవ : అబ్బాయి, యిన్ని మాటలెందుకు ఆఖరిమాట చెబుతున్నా. నీవు యీ కార్యం విరమించుకోపోతే, నా కూతుర్ని నేను తీసుకెడుతున్నాను. నే బ్రతికుండా మళ్లా యీ గుమ్మం దాన్ని తొక్కనివ్వను. బాగా ఆలోచించుకో.

రఘు : తీసికెళ్లడమే మంచిదనుకోండి. నాకు ఏ అభ్యంతరం లేదు. కాని మాటవరసకు చెబుతున్నా: ఎల్లా తీసికెళ్లగలరు?

అవ : నా కూతుర్ని నే తీసుకెళతానంటే అడ్డేవాడెవడోయి?

రఘు : మీ కూతురవుతెగా ?

అవ : ఓరి అప్రాచ్యుడా! ఎంతమాటన్నావుర!

రఘు : మా అమ్మ నాకు తెలియకండా, యింటిమీద పదివేలరూపాయిలు అప్పుతెచ్చి మీకు యిస్తె మీరు మాకు పిల్లనిచ్చారు. పశువును కొనుక్కొన్నట్లు, కొనుకున్నాం. మీ పిల్లేమిటి ?

అన : నీతిమాలినవాడ, అందులోది ఒక కానికూడా నేను తిన లేదుర.

రఘు : మీరు తిన్నా నేను సంతోషిద్దును. దేశకాలోత్తు పొత్తు కోసం, కప్పంకింద కట్టారు. నేనా, మీరా నీతిమాలినవారు?

అన : నీ జిహ్వమీద పుండుపుడుతుంది.

రఘు : నాకు మాతండ్రి యిచ్చిన ఆస్తికింద, యీ యిల్లు ఒక్కటె మిగిలిందనుకున్నాను. యీ భాగంలో మేముండి, తక్కిన యిల్లంతా అద్దెకిచ్చి, ఆ అద్దెమీద మేము బ్రతుకుతున్నాం. మా బ్రతుకులో మన్నుకొట్టారు.

అన : మమ్మల్ని అడుగుతే లాభమేముంది? మీ తల్లి ఎదురుగుండా వుంది. మీ తల్లినే అడుగు.

రఘు : మా తల్లి అమాయకత్వాన్ని, మీరు దుర్వినియోగం చేశారు. నాకు చెప్పకపోవడంనుంచి, వడ్డీ తన్నుకొచ్చి, యీ మధ్య కొద్దిరోజులక్రితమే కోర్టులో వేలంవేస్తామని, నన్ను రమ్మనమని నోటీసు వచ్చింది.

అన : కోర్టుకు వెళ్ళి వేలం నిలుపుచేయించి అమ్మకానికి చూపుతె ఎంత డబ్బు వచ్చును?

రఘు : కోర్టులను కూడా బహిష్కరించమన్నారు గాంధిగారు. అందుచేత నేను కోర్టుకి వెళ్ళకపోవడంనుంచి తాకట్టు వాకట్టు అయిపోయింది. లక్షరూపాయిల యిల్లు యిరవై వేలకింద పోయింది. అన్నవస్త్ర దేవానాస్తి అయిపోయాం యింతోటి భార్యకోసం. మేమింక పొట్టపోసుకోనేందుకు దేశాలపాలవాలి.

అన : మిగిలిన ఎనభై వేలు గాంధిగారిని యిమ్మనమనర. తగిన శాస్తయింది.

రఘు : యింతవరకు మీకు మేకమాంసమె యివ్వమనుకున్నాను; నరమాంసం కూడా కావాలని నాకు తెలియదు.

శోభా : అయ్యో! మా కొంపమునిగింది! మా యిల్లు వేలం అయిపోయింది!

రఘు : మామయ్యా, ఒక్కమాట చెబుతున్నాను వినండి. స్వరాజ్యం కోసం యీ ఉద్యమం వచ్చాక, మేము యావన్మంది సర్వం త్యాగంచేసేందుకు సంకల్పించుకున్నాం. అవసరమొస్తే ప్రాణాలుకూడా తృణప్రాయంగా వదిలె తలచుకున్నాం. అహింసె మా సంసారం. కారాగృహమే మా గృహం. మాకు భార్య ముక్తికాంత. యింక తీసికెళ్లండి పిల్లని.

(రఘునాథరావుగారూ అని బయటనుంచి పిలుపు)

రఘు : పదండి, మీ వెంట వస్తున్నా.

అన : చూస్తున్నావ, మీవాడి వాలకం. నా యింటికొచ్చి, నాపాదాలు పట్టుకొని, నా పిల్లని చేసుకొని, నానామాటలు నీ కొడుకు అంటూఉంటే చూస్తూ ఊరుకుంటావ!

శోభా : మావాడన్నదాంట్లో సబబు లేకపోలేదు.

అన : అవును మరి మీ వాడిమాటంటావుగానీ మా మాట అంటావటమ్మ.

శోభా : ఒకవంక పక్క వేరొకవంక కడుపు. ఏమన్నా. కాని పిల్లనిమాత్రం తీసుకుని వెళ్లిపోవద్దని మీ పాదాలు పట్టుకుంటానన్నయ్యా.

అవ : చేతులు పట్టుకున్నా, కాళ్లు పట్టుకున్నా లాభంలేదు. ఆ మాలవాళ్లతో కలిసి దేవాలయ ప్రవేశంచేసి వచ్చేలోపునే మేము వెళ్ళాలికూడా. యిఖ ఒక్కనిమిషం యిక్కడ విలవ కూడదు. వచ్చేవరకు ఉంటే, అగ్నిహోత్రాలే మైలపడ తాయి. ప్రాయశ్చిత్తం చేయించుకున్నా ప్రయోజనం ఉండదు. శారద, నీ బట్టలు సర్దుకో, వేగం వెళ్ళాలి.

శారద : బట్టలంటూ ఏమున్నాయి నాన్న. పట్టుచీరల? బనారస్ చీరల? ముతక ఖద్దరు బట్టలేగా.

(తలుపు పిలిచిన చప్పుడు)

శోభా : ఎవరది ? వస్తున్నా. (వెళ్లి తలుపుతీసి) అయ్యో ! బాబు ! యీ దెబ్బలేమిటిర, యీ రక్తం ఏమిటిర, అనుకున్నంతపని జరిగిందే, వాళ్ల చేతులు పడిపోను. అమ్మ ! అమ్మ ! మా బాబుని చంపేశారే పోలీసు ముండాకొడుకులు. చూస్తావేం? శారద ! బట్టతో బాబు రక్తం తుడువు. నేను వెళ్ళి డాక్టర్ని తీసుకొస్తాను.

అవ : వాళ్లు పూనుకున్న పనికి కొట్టడమే? చంపేస్తే బాగుండును. పీడా వాడా కూడా పోవును. దొరల ప్రభుత్వం అంటూ ఉండబట్టి రక్షిస్తున్నారు. శారదా! మాలముండాకొడుకుల్ని ముట్టుకొని, జాతిభ్రష్టుడై వచ్చాడు. వాణ్ణి ముట్టుకున్నావ యిఖ నా గుమ్మం తొక్కనివ్వను. నీ చేతులు ఖండిస్తా, జాగ్రత్త ! ఆగు !

శోభా : నీవు మామగారివికావు, మారణదేవతవుకాని.

అవ : తొందరగా నడువు. ఒక క్షణంకూడా యిక్కడ ఆగేందుకు వీల్లేదు. ఏమిటా ఆలోచన ? రాకపోతే ఉండు ! నీకు బ్రతికుండగానే అక్కడికెళ్లాక ఘటశ్రాద్ధం చేస్తాను.

శారద : అదిగాదు నాన్న.

అవ : ఊఁ ! నడువు ! నడువు !

శారద : వెళతానత్తయ్యా ! మన్నించండి !

## 2

[స్వరాజ్యము సిద్ధించకుండానె, పరశురామప్రీతి అయిపోయిన భవనంలా, దేశం ఏవస్తా అయి ఏమీ తోచక, మూషికొల్లా త్యాగాలుచేసినవారు జైళ్ళలోంచి బయటబడి, జీవనాధారం కోసం, దిక్కులకు పరిభ్రమించి చీకువాలు దినాలు.

మైలాపురంలో ఓ సందు. అందులో పెద్దభవనం. అందులో అద్దె కున్న అనేక కుటుంబాలు. మేడ ముందుకు బాల్కని, అందులో వెనక రెండు గదుల్లో, రఘునాథరావు శారద కాపురం చేస్తూఉంటారు. శారదకు కొత్తగా ఒక శిసువుపుట్టి మరణిస్తాడు.

రాయలసీమ మహాక్షామము. తగిన ప్రచారం సహాయం జరగ లేదు కాబట్టి బంగదేశ క్షామమె పెద్దదనుకుంటాంగాని, రాయలసీమ క్షామము అంతుదొరకనంత హృదయ విదారకం కూడాను.]

(రఘునాథరావు, దొంగ ప్రవేశం)

శారద : ఛీ, యీ దొంగముండాకొడుకును ఎందుకు తీసుకొచ్చారు! వీడు పరమ పాపాత్ముడు.

రఘు : దొంగవడో, దొరవడో, తెలుసుకున్నాక కద, శిక్షించ డమో, గౌరవించడమో.

శారద : ఏమిటండి ? అన్నిటికి వెడమాటలు ! వెటకారాలు !

రఘు : అసలు జరిగిందేమిటి ?

శారద : మీరు మూడురోజులు ఆ రాయలసీమ వెళ్ళివస్తానన్నారు కద. మీరు వెళ్లాక...

రఘు : ఏంచెయ్యమన్నావు, రాయలసీమలో క్షామపరిస్థితి, నన్ను స్వయంగా చూచివచ్చి, మా పత్రికలో వ్రాయాలని, సంపాదకుల ఆజ్ఞ. బుద్ధిమ్మ్రొన్నాక వారు ఏం చెయ్యమంటె అదిచెయ్యాలి.

శారద : ఏమంటె ఏంలెండిగాని, మీరు వెళ్ళినాటిరాత్రి అబాల్కనిలో కూర్చుని బాబుకోసం ఏడవడం ప్రారంభించా. రోజు ఓగంటైనా నాదుఃఖం వెళ్ళబుచ్చుకోకపోతె ఎల్లా. తల్లిని కద.

రఘు : రోజూ అంతసేపు అల్లా ఏడుస్తూ కూర్చుంటె బాబు వింటాడా, బ్రతికొస్తాడా? భగవంతుడు చేసినదాన్ని దిగ మింగడమె.

శారద : అది మాలో ఆచారం అండి.

రఘు : పల్లెటూళ్లో అలాంటివి పనికొస్తాయిగాని, యింత మహా పట్నంలో, ఒకేయింట్లో ఎన్నోకుటుంబాలు నివసించేచోట, యిల్లా విలపిస్తె, ఒప్పుకోరు. సభ్యతకూడాకాదు.

శారద : అందుకే దుఃఖం దిగమింగుకొని రాత్రిపూట, వెక్కివెక్కి ఏడ్చానుగాని, నే నెవ్వరికి ఏ ఆటంకం కలిగించలేదు.

రఘు : అయితే ఏం జరిగింది ?

శారద : మెల్లగావచ్చి, వీధిగుమ్మంలో ఆ మెట్లమీద పండుకున్నట్టు పంకుకున్నాడు. సమంగా మన బాల్కనికి కిందగ. కొంత సేపుమాసి నే నెవరిని మందలిస్తె, మెల్లిగా ఆ చీకట్లో, సడిలేకండా వెళ్ళిపోయాడు.

రఘు : తలుపులన్నీ వేశాక వీధిమెట్లమీద ఎవరు పడుకుంటే మనకేమి ?

శారద : వీడు దొంగ. చీకటిమాటున యింట్లో ప్రవేశించి మేడెక్కితె, నే నొక్కత్తిని ఏం చేస్తే ఎవరడుగుతారు?

రఘు : పోనీ, పోయాడుగ.

శారద : ఆఁ.! పోయాడు! మర్నాడు అదే వేళకు అలాగ ఆ మెట్ల మీద కాచి ఉన్నాడు. నా శోకం వెళ్లబుచ్చుకుంటూ, నా పనేదో నేను చూసుకున్నాక, లోపలికి పోదామని కింద ఆ మెట్లమీదికి చూచెసరికల్లా, దొంగతనానికి కాకపోతే, ప్రతిరోజురాత్రి, ఎందు కక్కడొచ్చి అలా నక్కిఉండటం. అంచేత 'దొంగ' 'దొంగని' కేకలేశాను. యిరుగుపొరుగు వినెలోపునె పారిపోయాడు. మళ్లా మర్నాడు వస్తాడని నాకు తెలుసు. ఎదురుగుండా ఉన్న మన ఆంధ్రులతో చెప్పాను. వాళ్లు కాచి, మనింటిప్రాంతానికొచ్చెసరికి పట్టి

కాదు. పోలీసులను అప్పజెపితే, మీరు విడిపించి అతిథిలా, అల్లుడులా యింటికి తీసుకొచ్చారు. యిన్నాళ్లయి మీరు చేస్తున్న అవమానాలకు యివాళ శిఖరం కట్టారు. మావాళ్ల మీద నామీద ఉండె కార్పణ్యం యిలాతీర్చుకుంటున్నారు.

రఘు : పిచ్చిదాన, నీకు లోకం అంటె తెలియదు. మూర్ఖత్వం రోజురోజుకి పెరిగిపోతున్నాది. పల్లెటూరి పిల్లవుంటే అప నమ్మకాలన్నీ నీలో పేరుకున్నాయి. కాని యింట్లో కొంచెం అన్నం ఉందేమో చూడు.

శారద : ఎందుకు? నే చూడను!

రఘు : సరే, యిక నిజమేమిటో నీ ముందే చెప్పిస్తాను. నీ పేరేమిటి?

దొంగ : రామన్న.

రఘు : నీ దెక్కడినుంచి వచ్చావు?

రాము : రాయలసీమనుంచి.

రఘు : ఎందుకొచ్చావు?

రాము : అక్కడ కరవొచ్చింది బాబయ్య. నే నసలే పేదవాణ్ణండి. కరవులో అన్నం లేక నా భార్య, ముగ్గురు పిల్లలు చనిపోయారండి.

శారద : అయితే యిక్కడ ఉద్యోగం చేద్దామని వచ్చావ, ఏమిటి?

రఘు : దేశంకోసం సమస్తం త్యాగంచేసి కారాగారాల్లో బాధలు పడి, కట్టుగుడ్డతో పైకొచ్చిన మా బోంట్లకే ఉద్యోగాలు దొరకలేదు. ఆ పత్రికాధిపతి జాలిపడి నాకీ సహాయ సంపాదకుడివని యీయకపోతే, నేను వీడిలాగ తయారైయుందును. తరువాత సంధ్యా, నా అనే వాళ్లా?

శారద : మీరు చాలా అభిమానపడుతున్నారు, వీడు వారిజన దొంగా ఏమిటి?

రఘు : అయితే, ఎందుకొచ్చావు?

రాము : ఆకలితో నిలువెల్లమండిపోయి, యీ చెన్నపురి మహాపట్నంలో పెద్దపెద్ద పూటకూళ్లయిళ్లు ఉంటాయని; వాటిముందు నిలబడి, ఫుల్లిస్తరాకు విసిరేస్తె పొట్టనింపుకుందామని. మన ఊళ్లోలా యిస్తరాకులుకూడా పైని పారేరు. ఎక్కడో పారేసిన యిస్తరాకుని జిడ్డుకూడా తగల్లేదు.

రఘు : రామచంద్ర. దేశానికి యుద్ధం వచ్చినకంటె గొప్ప అనర్థం, కరువు కాటకాలొస్తె.

శారద : యిది హోటలుకాదె యిక్కడికెందుకొచ్చావు?

రాము : రావాలని రాలేదండి. పగలల్లా, ఊరల్లా తిరిగి ఎంగిలి మెతుకులుకూడా దొరక్క, ప్రాణం తటపటాయిస్తె, నడిచేందుకు శక్తిలేక మీ వీథి మెట్లమీద ఒరిగిపోయానండి.

రఘు : అయితే ఏం జరిగింది?

రాము : నోరెండిపోయి, నాలిక లాగేసిందండి. ఆ మేడమీంచి, ఆ గుమ్మటంలోంచి ఏదో ధారకురిసిందండి. నోరిప్పే ఉందండి. నా నోట్లో పాలవాన కురిసిందండి. ఏఅమ్మ కరుణించి కురిపించిందో, కడుపు నిండిపోయిందండి. యింతలో ఆ అమ్మగో రొచ్చి కేకలేశారండి. ఎల్లిపోయానండి. ఆ తల్లికి దండమెడుతా. లేకపోతె ఆరాత్రి ప్రాణాలె పోయుండునండి.

రఘు : మళ్లా మర్నాడుకూడా అందుకె వచ్చావ?

రాము : అవునండి. నా అదృష్టం, రెండోరోజుకూడా నా ఆకలి తీరింది. చనిపోయిన మా అమ్మ జ్ఞాపకం వచ్చిందండి. దొంగ దొంగని కేకలేశారండి. భయపడి పారిపోయానండి.

రఘు : పారిపోవడం ఎందుకు?

రాము : దొంగల్ని పట్టుకోలేని పోలీసులు బీదవాళ్ళనే దొంగలని కొట్లో పెట్టేస్తారండి.

రఘు : నేను రైలుదిగి వస్తూవుంటే మనవీధిలో వీణ్ణి పోలీసులు పడితే దొంగకాడని హామీయిచ్చి, యితనిమూలాన నీకు నిజం వినిపిద్దామని తీసుకొచ్చా. యిప్పటికైనా కారుణ్యంతో చూడు పాపం యీ బీదవాణ్ణి.

శారద : అయ్యో వీడి ముఖం మండించా. వీడు దొంగ అనుకున్నాను. అంతకంటె పరమ పాపాత్ముడు. నాకు వ్యభిచారదోషం కూడా అంటకట్టాడు!

రఘు : యిందులో వ్యభిచారదోష మేముంది?

శారద : ఛీ, ఛీ, మీకంటె దుర్మార్గులను నేను లోకంలో కనివిని ఎరగనండి. మీరుకాక యిదె మరొకరు భర్త అయితే వీడి ప్రాణాలు తీసెవాడె. నామీద పగ మీరిలా తీర్చుకుంటున్నారు. కానీండి ఊరికే పోదులెండి.

రఘు : పాపాత్మురాల! నావంటి భర్త నీకు పదిజన్మలెత్తినా దొరకడు. నీవు నీ తండ్రి నన్ను పెట్టిన బాధలకు గాంధిగారి శిష్యుణ్ణికాబట్టి, సహనమె మా లక్ష్యం కాబట్టి యింతవరకు ఓర్చుకుంటూ వస్తున్నాను.

శారద : చెప్పేదేమిటి మీ ఓర్పు! సద్వర్తన! అదినుంచి నే పడుతున్న బాధ పరమేశ్వరునికి తెలుసు. మాకంటె ఒక వాసి తక్కువవాణ్ణి కట్టుకోనేందుకు ఒప్పుకున్నాను. నా వంశం ఎటువంటిది. ఆహితాగ్నులింట పిల్లని. నా కొడుకు చనిపోయేందుకుకూడా కారణం మీరె.

రఘు : ఎల్లాగయ్యానో ?

శారద : ఆసుపత్రిలో పురుడు పోయడంనుంచే మా బాబు మరణించాడు. నేను ఆసుపత్రికెళ్లనని ఘోలుమని ఏడ్చినా మానారా ?

రఘు : నా తల్లి మరణించింది. బ్రతికున్న నీ తండ్రి నీవు మత భ్రష్టువని, గుమ్మం తొక్కనివ్వడు. మరెవ్వరు నాకు లేరు. మారుమూలల నుంచి సామంతులు మొదలుకొని నిరుపేదల వరకు ఆసుపత్రికి వెళతారు. పురుళ్లకు ఎంత జాగ్రత్త తీసుకుంటారు వారు; కాని ఖర్చుపెట్టకుండా.

శారద : చెప్పేదేమిటి? మాలకూడు, మంగలి నీళ్ళు, ఎంగిలిచిప్పలు, అక్కడ మైలగాలి తగలడంనుంచె బాబు పోయాడు.

రఘు : నీవు వట్టి ఆసుపత్రిలో ఉండవలసినదానివి.

శారద : భార్యకు మానభంగం జరిగి ఉండకపోదు. భార్యకు మానభంగం జరుగుతే, భర్త సంతోషించడం పురాణాల్లో కూడా లేదు. మీరుమాత్రం మహదానందం పొందుతున్నారు.

రఘు : ఆగు, ఏమంటున్నావ్. మాతృప్రేమకి, మానభంగానికి పొలిమేరలేనా తెలియని నీవు మనిషివికావు. ఆచారాల్లో మగ్గిపోతున్న దున్నపోతువి. నన్ను నా తల్లిని నానా మాటలాడి బ్రతికుండగా మా గుమ్మం తొక్కనివ్వనని పెద్దమాటలు చెప్పి, నిన్ను తీసుకెళ్ళి ఏడాదుంచుకొని ఊరివారిమాటలు పడలేక నిన్ను ఒదిలిపించుకుందామని నా మీద అభిమానం ఉన్నట్టు, యిక్కడకు నిన్ను పంపించేశాడు నీ తండ్రి. చనిపోయిన మా అమ్మకోసం అగ్నిహోత్రంసాక్షికంగా పెండ్లాడానని నిన్ను పోనీ అని ఏలుకుంటున్నాను.

శారద : నా యెదురుగుండా కొరతవేసినట్టు నీ వెందుకురా? వెళ్లు. నీ కడుపు నిండిందికదా? మా దాంపత్యానికి విడాకులిచ్చేవు!

రఘు : అతుడానివి, వాడి ఆకలి తీర్చినదానివి, నీకు వాడిమీద పుత్రవాత్సల్య ముండాలి. లేదుసరికద, సంసారానికి ఎసరు పెట్టాడని నిందించడం మంచిదా? నీకు ఒక్కమాట చెపుతున్నాను విను. మన చనిపోయిన బాబు, మమకారం తీరక వచ్చి మనల్ని చూచి, ఆకలి తీర్చుకొని వెళుతున్నట్టుంది నాకు. యీరోజు మన జీవితంలో మహోదయం. ఈరోజుల్లో యివె మనుధర్మసూత్రాలు.

శారద : భార్య శీలానికి అవమానం తెచ్చిన, ప్రతీ విరోధివాణ్ణి పుత్రునిగా చూచె భర్తతో నేను కాపురం చెయ్యను. నేను మా ఊరు వెళతా. నన్ను పంపించి మీరు మీ యిష్టం వొచ్చినట్లు వర్తించండి.

రఘు : నీ తండ్రి నిన్ను మరి గుమ్మం తొక్కనివ్వడు. నీకు ఊరెక్కడుంది? మా అమ్మముఖం చూచి, ధర్మానికి కట్టుపడి, నేనె నిన్ను భరించగలను. చిన్నపిల్లవు కావు. అన్నీ ఆలోచించుకొని మరి అను.

శారద : అన్నీ ఆలోచించుకొనె యీమాట అంటున్నాను.

రఘు : మళ్ళీ వస్తె నేను కూడా ఏలుకోను సుమా?

శారద : మా తండ్రి రానీకపోతె నుయ్యో గొయ్యో చూచుకుంటాను. కాని యిక్కడ మరి ఉండను.

రఘు : కొత్త స్త్రీమితవడి ఆలోచించుకు మరీ చెప్పు.

శారద : యీవాళ మెయిలుకి నన్ను పంపించకపోతో యిక్కడె ఆత్మహత్య చేసుకుంటాను.

# ప్రాచీన భారతములో గణ రాజ్యాలు

శ్రీ కావుటూరు వేంకటరామచంద్రరావు

ఇరువదవ శతాబ్దముయొక్క ఉత్తరార్థముతో ప్రారంభమయిన దశాబ్దము అన్నివిధముల గణయోగ మనదగియున్నది. ఈ దశాబ్దములో, ముఖ్యముగా ఆసియా ఖండమున, పెక్కు రాజరికములు రూపుమాసి వాని స్థానమున గణరాజ్యములు, ప్రజాప్రభుత్వములు నెలకొన్నవి. మెగస్తనీసు ప్రాచీన భారత రాజ్యములను గురించి క్రీస్తుపూర్వము నాల్గవ శతాబ్దమున నుడివిన "రాజరికము మాసి దాని స్థానమున ప్రజాప్రభుత్వములు నెలకొన్నవి." అను రాజకీయ సంప్రదాయము ఈ యుగమునకు సరిపోవుచున్నది. ఈమధ్య సంభవించిన మధ్య ప్రాచ్య క్లిష్ట పరిస్థితికి కారణము ఒకజాతి చిరకాలము నుండి వచ్చుచుండిన రాజరికమును దొంగద్రోసి దాని స్థానమున ప్రజాస్వామ్యమును నెలకొల్పవలయునను వాంఛయే గదా! నేడు ముఖ్యముగా ఆసియాఖండ ప్రజలలో వ్యాపించి వృద్ధినొందుచున్న ఈ ప్రజాస్వామ్య సంప్రదాయమునకు సుమారు అరువది సంవత్సరములు అహింసా మార్గమున బ్రిటిషు రాజరికముతో పోరాడి స్వాతంత్ర్యమును సంపాదించిన భారతదేశము మార్గదర్శకత్వము వహించినదనుట నిర్వివాదాంశము; ఈ మార్గదర్శకత్వములో భారతదేశము తన ప్రాచీన ప్రజాస్వామ్యపు సంప్రదాయములను నిరూపించుకొన్నది.

ప్రాచీన భారత రాజ్యాంగ చరిత్రలో ప్రాచీన భారత గణరాజ్యముల వర్ణన యొక ప్రధానాధ్యాయము గాగలదు. దీనినిగురించిన జ్ఞానము ప్రజాస్వామ్యము భారతీయ రాజనీతి ప్రతిభలకు అన్యమైనదిగాదని రుజువు చేయగలదు. కాని, ప్రాచీన భారతమున ప్రజాస్వామ్యము పాశ్చాత్యదేశములగు ఇటలీ, గ్రీసులలో అదేకాలమున వెలసిన ప్రజాస్వామ్యము లంత స్పష్టముగా రూపురేఖలను దిద్దుకొనలేకపోయినది. ఈ ప్రాచీన గణరాజ్యముల చరిత్ర నెఱుంగుటలో జిజ్ఞాసువును ముఖ్యముగా బాధించునది చరిత్రాత్మకమైన వస్త్వభావము. ఈ వస్త్వభావము యవన, రోమక గణతంత్రముల నెఱుంగుటకు గల చరిత్ర వస్తు సమృద్ధితో పోల్చిచూచిన నతోధికమై గన్పట్టగలదు. నేడు మనకు లభించుచున్న వీని చరిత్ర యంతయు అలెగ్జాండరును వెంబడించి వచ్చిన గ్రీకుచరిత్రకారులు వీనిని గురించి అరకొరగా వ్రాసిన వ్రాతలనుబట్టి, పాణిని, పతంజలి మొదలగు వైయాకరణుల సూత్రములనుండి, బౌద్ధ, జైనమత గ్రంథములనుండి మనకు లభించిన కొన్ని నాణెముల, ముద్రలమీది వ్రాతలనుబట్టి, పరోక్షముగా నెఱుగవలసి యున్నది. ఇన్నిలోపములతోను గత యాభైఏండ్లలో సుప్రసిద్ధ చరిత్రకారులు, పరిశోధకులగు డాక్టర్. జయస్వాల్, డి. ఆర్. భండార్కర్, ఆర్. సి. ముజుందార్, డాక్టర్. ఘోషాల్, ఎ. యస్. అల్తేకర్ ప్రభృతుల పరిశోధనలు భారత గణరాజ్యములకు సమగ్రము, సంపూర్ణమునగు చరిత్ర నొసంగినవి.

ఈ గణరాజ్యముల చరిత్రను చర్చించుటకు ముందు ఒక ముఖ్యాంశమును మనసునం దుంచుకొనవలెను. ఈ గణరాజ్యముల రాజ్యాంగ నిర్మాణ పద్ధతులయందు నేడు మనకు అనుభవ పూర్వకమైన ప్రజాస్వామ్య సూత్రములకై వెదకుట అసమంజసము. అట్లనిన ఇవి ప్రజాస్వామ్యములు గాకపోలేదు. ఏ లక్షణములను, నియమములను బట్టి, ప్రాచీన యవనరోమక దేశములందు వర్ధిల్లిన ప్రభుత్వములను ప్రజాస్వామ్యములని నిర్ణయించుచున్నామో అదే అర్థమున వీనిని ప్రజాస్వామ్యములని పిలువదగును. ఈ ప్రభుత్వములు రాజరహితములు లేక విరాటులు. (Non-monarchical or Kingless). వీనియందు అధికారము వ్యక్తిగతముగాక, సంఘగతమై యుండును. ఈ సంఘము ప్రజలు, ప్రజాప్రతినిధులు, నాగరకులు, నాగరక వృద్ధులు, కులపెద్దలు, జాతిపెద్దలు—వీరిలో నెవరిచేతనైనను ఏర్పడవచ్చును.

ప్రాచీన భారత గణరాజ్యములు వేదకాలమునకు (క్రీ. పూ. 1000) తర్వాత సమగ్ర స్వరూపము నొందినవి. వేదములలో మనకు గనపడు పరిపాలనా స్వరూపము రాజరికము మాత్రమే. కాని ఋగ్వేదమునందు అచ్చటచ్చట తర్వాతికాలమున గణరాజ్యములకు సంబంధించి వాడబడిన పదములు గానవచ్చును. ఉదాహరణమునకు గణము, గణపతియను పదములు. దీనినిబట్టి చరిత్రకారులు "బౌద్ధయుగములో మనకు గన్పట్టు గణరాజ్యముల బీజాంకురములు వేదకాలముననే వెలసియుండవచ్చును."[1] అని యభిప్రాయపడుచున్నారు.

హిందువులు తమ ప్రజాస్వామ్యములను "గణము" "సంఘము" అను పేర్లతో వ్యవహరించిరి. ఒకప్పుడు ఈ పదములు ప్రభుత్వపరముగాగాక జాతిపరముగా వాడబడినవను అభిప్రాయముండెడిది. కాని నేటి చరిత్రకారులు ఈ అభిప్రాయము నంగీకరించుటలేదు. డాక్టర్ ఎ. ఎస్. అల్తేకర్ ఇట్లని నుడివిరి. "మాళవులను, యౌధేయులను (ఈ రెండును గణతంత్రములు) జాతులుగా పరిగణించినను వారికి గణతంత్ర ప్రభుత్వము గలదనుటకు ఇతోధికమైన నిదర్శనము గలదు."[2]

పాణిని "సంఘ" "సంఘట" పదముల తారతమ్య భావమును విశదీకరించుచు, "సంఘ" "గణము"లకు గల అద్వైతత్వమును చెప్పినాడు. బౌద్ధుల గ్రంథమగు అవదాన శతకమున 'గణ' శబ్దము 'రాజ' శబ్దమునకు వ్యతిరేకార్థమున వాడబడినట్లు ఈ క్రింది కథవలన తెలియవగును. మధ్యదేశీయులగు వణిజులు కొందరు దక్షిణా

1. V. M. Apte; The History and Culture of the Indian People; page 352.

2. State and goverment in Ancient India PP: 109

పథమునకు వెళ్ళిరి. దక్షిణాపథపురాజు ప్రశ్నకు సమాధానముగా వీరు "దేవా, కొన్ని దేశములు గణాధీనములుగను. కొన్ని రాజాధీనములుగను ఉన్నవి" (దేవకేచిద్దేశా గణాధీనాః కేచిద్రాజాధీనాః ఇతి") అని నుడివిరి. ఆచారాంగ సూత్రమను జైనగ్రంథము జైన భిక్షువులు నివారింపవలసిన రాజ్యములలో గణరాజ్యములను పేర్కొనుచున్నది. (అరాయణి వా 'గణరాయణి' వా జువరాయణి వా దోరజ్జణి వా వేరజ్జణి వా విరుద్ధరజ్జణి వా) మహాభారతము నందలి శాంతిపర్వమున గణరాజ్యముల వృద్ధి, క్షయకారణముల చర్చించుచు భీష్మ యుధిష్ఠిరులమధ్య నొక సంవాదము గలదు. ఇట్లు ప్రాచీన గ్రంథములందు 'గణ' శబ్దమునకు రాజ రహితమైన, సంఘనిహితమైన అర్థమునిచ్చు నిదర్శనములు అపారముగనున్నవి. అలెగ్జాండరు వెంబడి వచ్చిన గ్రీకు చరిత్రకారులు ఈ గణతంత్రములను ప్రశంసించియున్నారు. ఒకప్పుడు గ్రీకుల భావనాశక్తి, వారిని ఈ దేశమందలి ప్రతిసంస్థయందును గ్రీకు సంస్థలను పోల్చుకొనునట్లు చేసినదియను వాద ముండెడిది. కాని నేడది నిలువజాలదు. ప్రజాస్వామ్య సంస్థలను ఉగ్గుబాలతో పెరిగిన గ్రీకు చరిత్రకారులు వివిధ సంస్థలను ప్రజాస్వామ్యసంస్థలని వర్ణించునంతటి విచక్షణ జ్ఞాన శూన్యులు గారు.

కౌటిల్యుని అర్థశాస్త్రమున గణరాజ్యములు రాజశబ్దోపజీవి సంఘములు, వార్తా శస్త్రోపజీవి సంఘములు అని రెండు విధములుగా విభజింపబడియున్నవి. (కాంభోజ సురాష్ట్ర క్షత్రియ శ్రేణ్యాదయో వార్తాశస్త్రోప జీవినః) ఈపదములయొక్క అర్థప్రతిపత్తిపై పండితులు భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చియున్నారు. ఈ భిన్నాభిప్రాయాలు తరచి డాక్టర్ ఘోషాల్ రాజశబ్దోపజీవిసంఘములు తమ పాలకవర్గమునకు 'రాజ' శబ్దమును వహించు రాజకీయ సంఘములుగను, వార్తాశస్త్రోపజీవి సంఘములు శాంతవృత్తులచేతను, యుద్ధవృత్తిచేతను జీవించు మానవ సమాజములుగను నిర్ణయించియున్నారు.3

ప్రాచీన భారతమున గణరాజ్యములు దేశముయొక్క ఈశాన్య వాయవ్య భాగములందు వెంపొందినవి. ముఖ్యముగా పంజాబు, సింధు లోయలు క్రీ. పూ. 500 మొదలు క్రీ. శ. 400 వరకు గణతంత్రముల కాటపట్టయినవి. దురదృష్టవశమున ఈ గణరాజ్యములలో కొన్ని వ్యాకరణ గ్రంథములందు నామావశిష్టములై మనకు మిగిలినవి. పాణిని చేత పేర్కొనబడిన వృక, దామని, పార్శ్వ, కాంభోజాదులును, 'త్రిగర్తషష్ఠ' మనబడు ఆరు గణతంత్రముల సముదాయమును ఈ తెగకు చెందినవి. పాణినికి సుమారు వేయి సంవత్సరముల తర్వాత రచియింపబడిన కాశికయందు ఈ త్రిగర్త షష్ఠము (1) కొండోపరథ (2) దాండకి (3) క్రోష్టకి (4) జాలమాని (5) బ్రహ్మగుప్త (6) జానకి రాజ్యములుగా పేర్కొనబడెను.

ఇట్లు నామావశిష్టము గాక కొంచెమో గొప్పో చరిత్ర మిగిలిన గణతంత్రములలో అర్జునాయనులు ఆగ్రా జయపూరు ప్రాంతములందు క్రీ. పూ. 200 మొదలు క్రీ. శ. 400 వరకు పరిపాలించినట్లు తెలియుచున్నది. క్రీ. పూ. 100 కాలమునకు చెందిన వీరి నాణెములు మనకు లభ్యమగుచున్నవి. ఇవి రాజ నామాంకితములు గాక, 'అర్జునాయనం జయః' 'అర్జునాయనులకు జయమగుగాక' అను అంకముతో గణ నామాంకితములుగా నున్నవి. అర్జునాయనులు తాము మహాభారత వీరుడగు అర్జునుని సంతతివారమని నమ్మిరి. వీరును ధర్మజుని సంతతి వారమను నమ్మకగల్గి వీరికి ఉత్తరముగా పరిపాలించుచుండిన యౌధేయులును అన్యోన్య సహకారముతో వర్ధిల్లిరి.

యౌధేయగణము, నాణెముల లభ్యస్థానమునుబట్టి సువిశాలమని ఊహించవచ్చును. యౌధేయులు తూర్పున సహరాన్‌పూరు, పశ్చిమమున భవహాల్‌పూరు, వాయవ్యమున లూధియానా, దక్షిణమున ఢిల్లీ మధ్యగల దేశమును పాలించిరి. ఉత్తమ నాగరక పరిపాలనము గల్గి, న్యాయ ధర్మములకు పేరువడసి, సారవంతమైన దేశమును, ఉత్సాహవంతులైన ప్రజలను గలరని గ్రీకు చరిత్రకారులచే వర్ణింపబడిన విపాశా (బియాస్) నదీతీరస్థమగు రాష్ట్రము యౌధేయగణమని చరిత్రకారుల నమ్మకము. వీరు మౌర్య, శుంగ సామ్రాజ్యముల యొక్కయు, శకక్షాత్రపుల, కుషాణుల యుధాటికి ఆగి నిల్చిరి. శకక్షాత్రప చక్రవర్తులలో ముఖ్యుడగు రుద్రదాముడు తనజునాఘడి శాసనమున (క్రీ శ. 150) వీరిని గురించి ఇట్లని వర్ణించియున్నాడు. "సర్వక్షత్రావిష్కృత వీరశబ్దజాతోత్సేకావిధేయానాం యౌధేయానాం"

"సర్వక్షత్రియుల చేతను గౌరవింపబడిన వీరశబ్దగర్వముచేత అవిధేయులగు యౌధేయులు" ఒకటవ కనిష్కుని కాలమున (క్రీ శ. 78—104) వీరి అధికారము సన్నగిల్లెను కాని కాలక్రమమున వీరు అధికారము మరల నిలద్రొక్కుకొని క్రీ శ. మూడవశతాబ్ది ప్రథమ భాగమున కుషాను సామ్రాజ్య పతన హేతుభూతులైరి. సముద్రగుప్తుని (క్రీ శ. 320-380) అలహాబాదు శాసనములో అర్జునాయనులతోబాటు, వీరు గుప్తరాజ్య సరిహద్దు రాజ్యములలో నొకరుగా పేర్కొనబడియున్నారు. వీరి గణసభలో 5000 మంది సభ్యులున్నట్లు తెలియుచున్నది. ప్రతిసభ్యుడును రాష్ట్రమున కొక ఏనుగును ఇవ్వవలయునను నియమముండెడిది. వీరి నాణెములు అనేకములు మనకు లభ్యమగు చున్నవి. వీనిలో కొన్ని దేవసేనాపతియగు కార్తికేయుని చిహ్నమును గలిగియున్నవి. దీనినిబట్టి వీరి అభిమానదైవము కార్తికేయుడని తెలియుచున్నది. అందుచే కుమారస్వామి వాహనమగు మయూరపరముగా వీరు మత్తమయూరులని పిలువబడెడివారు. వీరి శౌర్యసాహసముల కీర్తి అలెగ్జాండరు సైనికుల భీరువుల గావించివారి పురోగతిని తిరోగమింప జేసినది.

మద్రులు క్రీ. శ. నాల్గవశతాబ్దమున గణతంత్రముగానున్నట్లు తెలియుచున్నది. యౌధేయులతో బాటు వీరును 'గుప్త' శాసనము లందు గుప్తసామ్రాజ్యపు సరిహద్దు రాజ్యములలో నొకరుగా పేర్కొనబడియున్నారు. వీరు రావి, చీనాబ్ నదులమధ్య ప్రాంతమును శాకల, (సియాల్‌కోట) రాజధానిగా పరిపాలించిరి. గ్రీకు చరిత్రకారులచే, అలెగ్జాండరును శకటవ్యూహముపన్ని ఎదుర్కొనిరని చెప్పబడిన కథియనులు, మద్రులును, ఒకరేయని కొందరు చరిత్రకారుల నమ్మకము. మద్రులు అలెగ్జాండరును తుదివరకు ఎదిర్చిపోరిరి.

---

3. Studies in Indian History and Culture By U. N. Ghoshal, P. P. 363, 364.

అలెగ్జాండరును తీవ్రముగా ప్రతిఘటించిన గణతంత్రములలో మాళవులు, క్షుద్రకులు ముఖ్యముగా పేర్కొనదగినవారు. వీరిని 'గ్రీకు'లు 'మల్లాయ్', 'అక్సిడ్రకాయ్' అని వర్ణించిరి. మాళవులు చీనాబ్, రావి నదుల మధ్య ప్రాంతమును, దానికి దక్షిణముగా కొంత ప్రాంతమును పరిపాలించిరి. వీరికి దక్షిణ పార్శ్వమున క్షుద్రకులు పరిపాలించుచుండిరి. వీరు అలెగ్జాండరును ప్రతిఘటించుటకై యొక కూటమిగా నేర్పడిరి. కాని వారి సేనలు ఒకచోటికి చేరక పూర్వమే అలెగ్జాండరు మాళవులపై దాడిచేసెను. కడకు మాళవులు, క్షుద్రకులు అలెగ్జాండరుతో రాజీపడవలసి వచ్చెను. వీరు నూరుమంది గణ సభ్యులను సంధిషరతులు చర్చించుటకై అలెగ్జాండరు నొద్దకు రాయబారమంపిరి. మాళవుల ఓటమి తర్వాత క్షుద్రకులు 150 మంది పాలక ముఖ్యులతో బాటు, పుర ప్రముఖులను, రాష్ట్రపాలకులను సంధి ప్రయత్నముపై అలెగ్జాండరు వద్దకు పంపిరని గ్రీకు చరిత్రకారులవలన తెలియుచున్నాము. మాళవుల కోట నొకటి స్వాధీనము చేసుకొనుటలో అలెగ్జాండరు ప్రాణముపోవునంతపని యాయెను. కాలక్రమమున క్షుద్రకులు మాళవులతో ఐక్యమైపోయిరి. క్రీ. పూ. 100 ప్రాంతమున మాళవులు తూర్పు రాజస్థానమునకును, క్రీ. శ. మూడవ శతాబ్దమున మాళవ రాష్ట్రమునకును వలస బోయిరి. కొంతకాలము వారు శక క్షత్రపుల (క్రీ. శ. 150) ఏలుబడిలో నుండిరి. కాని క్రీ. శ. 225 ప్రాంతమున కోల్పోయిన స్వాతంత్ర్యమును తిరిగి సంపాదించిరి. వీరును గుప్త శాసనములలో గుప్త సామ్రాజ్య సరిహద్దురాజ్యములలో నొకరుగా పేర్కొనబడియున్నారు. మాళవగణ జయాంకములగు రాగి నాణెముఖానేకములు మనకు లభ్యమైనవి.

అలెగ్జాండరు దిగ్విజయకాలమున అగ్రశ్రేణి (Greek; Agisanal), శిబి (Greek: Siboi) గణములు మాళవులతోబాటు వర్ధిల్లెను. వీరి పరిపాలనలో నుండినప్రాంతము ఎట్టిదో తెలియలేదు. శైబ్యులు ఆదిలో రాజరికముగా నుండి కాలక్రమమున గణతంత్రముగా మారిరి. వీరు మాళవులతోబాటు క్రీ. పూ. 100 ప్రాంతమున తూర్పు రాజపుత్ర స్థానమునకు వలస బోయి, 'మాధ్యమిక' నగరము రాజధానిగా కొంతప్రాంతమును పరిపాలించినట్లు తెలియుచున్నది. వీరినాణెములు 'మాఝమిక శిబి జనపదస' 'మాఝమిక శిబి జనపదుల' అను అంకమును గలిగియున్నవి.

గ్రీకు చరిత్రకారులచే 'సంబస్తాయ్' 'అంబష్టనాయ్' అని పిలువబడిన అంబష్ఠులు క్షుద్రకులపొరుగున పాలించిరి. గ్రీకు చరిత్రకారుడగు 'కర్టియస్' వీరిప్రభుత్వము ప్రజాస్వామ్య (Democracy)మని స్పష్టముగా తెలిపియున్నాడు. పతంజలి మహాభాష్యమునను, మహాభారతమునందును వీరు పేర్కొనబడియున్నారు. వీరిసైన్యము 60,000 పదాతులు, 6,000 అశ్వదళము, 500 రథములను గలిగియుండెను. వీరు అలెగ్జాండరు నెదుర్కొనుటకై మూవురు సేనాపతుల నెన్నుకొనిరి. పరిస్థితులవైషమ్యమువలన, వయోవృద్ధులమాటననుసరించి, చివరకు అలెగ్జాండరునకు లొంగిపోయిరి. వీరి తరువాతి చరిత్ర తెలియుటలేదు.

అంధక, వృష్ణి, యాదవ, కుకుర,భోజసంఘములు ఒక కూటమిగా నేర్పడి అవతారపురుషుడగు శ్రీకృష్ణుని నాయకత్వమున వసించినట్లు మహాభారతమునుబట్టి తెలియదగును!

"యాదవాః కుక్కురా భోజాః సర్వే చాన్ధక వృష్ణయః,
త్వయ్యాసక్తా మహాబాహో లోకాలోకేశ్వరాశ్చ తే."

అంధక-వృష్ణికూటమియందు రెండువర్గము లుండెడివి. ఈ వర్గాధినేతలను రాజన్యులని పిలచెడివారు. అంధకవృష్ణిసంఘము నందు ఈ ఇద్దరు రాజన్యులకును పరిపాలనాధికారముండెడిది. మన సారస్వతమునుండి ఈ 'ద్వంద్వ' అధిపతుల నెరుగగలము. శిని—వాసుదేవ, స్వాఫాల్క - చైత్రకవర్గములు కాశికయందు చెప్పబడియున్నవి. కాత్యాయనుడు తన వార్తికయందు అక్రూర—వాసుదేవవర్గములను పేర్కొనియున్నాడు. మహాభారతమువలన వాసుదేవ, ఉగ్రసేనులు వర్గాధిపతులుగానున్నట్లు తెలియుచున్నది.

మహాభారతమునందలి శాంతిపర్వమున (అశ్వాసము 81) అంధక—వృష్ణి వ్యవహారములపై నారద, కృష్ణులమధ్య ఒక సంభాషణ గలదు. అందు శ్రీకృష్ణుడు అంధక-వృష్ణి సంఘనాయకత్వములో తా నెదుర్కొనవలసిన కష్టములను నారదునితో నే కరువుపెట్టును. ఈ సంభాషణవలన శ్రీకృష్ణునంతటి రాజకీయధురంధరునికిగూడా ఈ రెండువర్గములమధ్య సామరస్యభావము నేర్పరుచుట సులభసాధ్యములేదని తెలియుచున్నది. శ్రీకృష్ణుడు తన కష్టమును ఇద్దరు జూదరుల తల్లికష్టముతో పోల్చెను. (సోహం కితవమాతేవ ద్వయోరపి మహామునే') రాజన్యపరముగా 'వృష్ణిరాజన్య గణస్య జయః' అను అంకముతో గ డిన వీరి నాణెములు మనకు లభ్యములు.

గ్రీకుచరిత్రకారులు క్సత్‌రాయ్ (Xathroi?) ఆస్సడియాయ్ (Ossadioi) మూసికాని (Musicani) బ్రాక్‌మనాయ్ (Brachmanoi Brahmanaka) మొదలగు రాజ్యములనుగురించి వ్రాసియున్నారు. కాని వీని రాజ్యాంగచరిత్ర సమగ్రముగ తెలియుటకు వీలులేమిచే, వీనిని కచ్చితముగా గణరాజ్యములని చెప్పుటకు వీలులేక యున్నది. "డయడోరసు" అను గ్రీకు రచయిత పాటల (Greek: Patalene) రాజ్యమునుగురించి వ్రాసి యున్నాడు. పాటలరాజ్యాంగము నతడు స్పార్టసురాజ్యాంగముతో పోల్చినాడు. సైనికాధికారము వంశానుగతముగా వచ్చు ఇద్దరురాజులు వహించెడివారు. రాష్ట్రపరిపాలనాధికారము సర్వమును నాగరవృద్ధసంఘము వహించెడిది. (A council of Elders ruled the whole state with Parmount authority'—Diodorus).

గ్రీకురచయితల రచనలనుబట్టి సింధులోయ యందు విలసిల్లిన గణరాజ్యములు ఒక సామాన్యసభ (General Assembly), ఒక నాగరవృద్ధసభ (Council of Elders), ఎన్నికద్వారా అధికారమునకువచ్చు ఒక ముఖ్య పరిపాలకుని (Chief Magistrate) కలిగియుండినవని చెప్పవచ్చును.

బౌద్ధ, జైనమత గ్రంథములనుబట్టి ఉత్తరబిదర్భమునందును, ఉత్తరప్రదేశమునందలి గోరక్‌పూర్ మండలమునందును అనేక గణరాజ్యములు వెలసినట్లు తెలియుచున్నది. బౌద్ధగ్రంథములందు శాక్యులు, కోలియులు, లిచ్ఛవులు, విదేహులు, బూలియులు, మల్లులు, మోరియులు, బగ్గలు అను గణతంత్రములు పేర్కొనబడియున్నవి. ఈ గణతంత్రములన్నియు సిద్ధార్థుని జీవితముతో సంబంధము గలిగియున్నవి. వీనిలో భగ్గ, బూలియ, కోలియ,

కొరియ గణతంత్రములు మిగుల చిన్నవి. బౌద్ధగ్రంథములనుండి వీనినిగురించి తెలియదగు చరిత్ర స్వల్పాతిస్వల్పము. వైశాల్యమున వీనికన్నను విస్తృతములైన శాక్య, మల్ల, లిచ్ఛవి, విదేహ రాజ్యములు, తూర్పున దర్భాంగా, పశ్చిమమున గోరక్‌పూరు, దక్షిణమున గంగ, ఉత్తరమున హిమాలయముల మధ్యప్రదేశము నావరించియుండెను.

ఈ నాల్గింటిలో మిగుల చిన్నది శాక్య గణతంత్రము. ఒకప్పుడు శాక్యులు రాజరికముగానుండి కాలక్రమమున గణతంత్రముగా మారినట్లు కొన్ని సందర్భములనుబట్టి తెలియుచున్నది. శాక్యుల పరిపాలనపద్ధతినిగూర్చి రైస్ డేవిడ్స్ తమ 'బౌద్ధ భారతము' (Buddhist India, P. 19.) నందు ఇట్లని వ్రాసియున్నారు: 'కపిలవాస్తునందలి తమ సంతాగారము (Mote hall) నందు పిన్న పెద్దలు సమావేశమయిన ప్రజాసభయందు న్యాయ, పరిపాలనా విషయములు నిర్వహింపబడెడివి......సభాసమావేశములందు అధ్యక్షత వహించుటకును, రాష్ట్రాధ్యక్షునిగను ఒక ముఖ్యు నెన్నుకొనెడివారు. ఇతడు రోమన్ కాన్సల్ (Roman Consul) గ్రీకు ఆర్చన్ (Greek archon) ల బోలిన 'రాజు' బిరుదము వహించెడివాడు. లిచ్ఛవులయందు ఇదే అధికారమును వహించిన అధికారత్రయమును (Triumvirate) గాని, రాజులకుగల సర్వస్వతంత్ర రాజ్యాధికారమునుగాని ఇచ్చట కానము. ఒకప్పుడు బుద్ధుని సగోత్రుడగు భద్దియుడు రాజుగా నుండెను. ఒకచోట నాగరక మాత్రుడుగా చెప్పబడిన శుద్ధోదనశాక్యుడు మరియొక ప్రకరణమున రాజని పిలువబడెను. శాక్యుల రాజ్యాంగమును గురించి పండితులలో విభిన్నాభిప్రాయము లున్నవి. జయస్వాల్, ముజుందార్ రైస్ డేవిడ్స అభిప్రాయమును సమర్థించిరి. అల్తేకర్ గూడ శాక్యులను గణతంత్రములలో నొకదానిగా చర్చించిరి. కాని డి. ఆర్. భండార్కర్ శాక్యులు గణతంత్రముగాక వంశపారంపర్యమైన రాజరికమని అభిప్రాయపడిరి. వీని నన్నింటిని తరచి డాక్టర్ ఘోషాల్ శాక్యులు వంశానుగతముగా వచ్చు పాలకునితోబాటు గణసభనుగూడ గలిగిన మిశ్రమ రాజ్యాంగమును గలిగియుండిరని తీర్మానించిరి.4

బౌద్ధ, జైన, వైదిక గ్రంథములలో పేర్కొనబడ్డ ఈ గణసంఘములలో లిచ్ఛవులు చారిత్రకముగా ప్రథమస్థానమాక్రమించెదరు. జైనమత స్థాపకుడైన వర్ధమాన మహావీరుని జన్మస్థానమును, సిద్ధార్థుని పాదరజస్సుచే అనేకపర్యాయములు పవిత్రముగావింపబడినదియునగు వైశాలి వీరి ముఖ్యనగరము. మగధ, కోసల రాజరికముల ప్రతిఘటించుటకై వీరు విదేహులతో గలసి 'వజ్జియ'కూటముగా చేర్పడిరి. వజ్జియగణతంత్రము సిద్ధార్థుని ప్రేమను మిక్కిలిగా చూరగొన్నది. సిద్ధార్థుడు బౌద్ధసంఘమును వజ్జియ గణతంత్ర పద్ధతులపై నడచుకొమ్మని ఆదేశించినాడు. సిద్ధార్థుడు ఆనందునితో వజ్జియగణాభివృద్ధికి కారణభూతములైన అంశములను ఈ క్రిందివిగా పేర్కొనియున్నాడు.

1. సభ్యులందరు తరచుగా సమావేశమగుట.
2. సభ్యులలో అంగీకారభావము.
3. పురాతన వ్యవస్థలయందు గౌరవ భావము.
4. నగరవృద్ధులయందు గౌరవభావము.
5. స్త్రీలు, బాలికలయందు గౌరవభావము.
6. చైత్యారాధన (మతమునందు గౌరవము.)
7. అర్హతుల నాదరించుట.

క్రీ. పూ. 500 ప్రాంతమున విదేహులను మగధ సామ్రాజ్యము జయించిన తర్వాత వారి చరిత్ర మనకు తెలియదు. లిచ్ఛవులుగూడ మగధసామ్రాజ్యము ముందు తలవంచవలసి వచ్చెను. తిరిగి వారు క్రీ. పూ. 300 ప్రాంతమున తమ స్వాతంత్ర్యమును సంపాదించుకొనిరి. క్రీ. త. నాల్గవ శతాబ్దప్రారంభమున వారు మిగుల బలవంతులై యుండిరి. గుప్తరాజగు మొదటి చంద్రగుప్తుడు లిచ్ఛవిరాజ కన్యయగు కుమారదేవిని పెండ్లియాడి గుప్తసామ్రాజ్య స్థాపనకు దోహదం కారకుడాయెను.

లిచ్ఛవిగణసభలో 7707 సభ్యులున్నట్లు ఏకపన్న జాతకము వలన తెలియుచున్నది. వీరి గణసభను గురించి ఏకపన్న జాతక మిట్లని నుడువుచున్నది: "తత్త నిచ్చకాలమ్ రజ్జమ్ కారెత్వా వసంతానం యేవ రాజానమ్ సత్తసహస్సాని సత్తసతానిసత్తచ రాజానో హోంతి. తత్తకాయేవ ఉపరాజనో తత్తకాసేనాపతినో తత్తకా భాండాగారికా." "అచ్చట నిత్యము రాజకార్యమునకై 7707 రాజులు గలరు. అదేవిధముగా ఉపరాజులు, సేనాపతులు, భాండాగారికులు గలరు." ఈ వాక్యముల అర్థప్రతిపత్తిపై పరిశోధకులు భిన్నాభిప్రాయములనుగలిగియున్నారు. ఆర్.సి. ముజుందార్ లిచ్ఛవి రాష్ట్రం 7707 మండలములుగా విభజింపడియుండెననియు, లిచ్ఛవి గణసభ ఈ 7707 గ్రామమండలాధిపతులను సభ్యులుగా గలిగియుండినదనియు అభిప్రాయపడిరి. డి. ఆర్. భండార్కరు ఈ 7707 గురు సభ్యులను వివిధజాతుల అధినేతలుగా గ్రహించి, లిచ్ఛవిగణము వివిధ జాతులకూడికచే నేర్పడిన సంయుక్త రాష్ట్రముగా భావించినారు. ('A federation of Chiefs of tribal Clans'). జయస్వాల్ 7707 మంది పురవాసులు పరిపాలనార్హత గలిగియుండిరి అని భావించిరి. వీరు అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, సేనాపతులు, భాండాగారికులుగా నియమితులగుచుండిరి.5 అల్తేకర్, ఘోషాల్ ఈ 7707 మంది సభ్యులును, రాజబిరుదమున కర్హులైన, గణముయొక్క మూల స్థాపకుల వంశజులని అభిప్రాయపడిరి.

వజ్జియులు వ్యక్తిస్వాతంత్ర్యమునకు అసమాన గౌరవ మొసంగెడివారని తెలియుచున్నది. లలిత విస్తరమునందు వైశాలీయులయందు ఉత్తమ, మధ్యమ, వృద్ధ, జ్యేష్ఠభావము లేదనియు, ప్రతివాడు తన్ను తాను రాజుగా నెంచుకొనుననియు, ఒకరి నింకొక రనుసరింపరనియు పరిహాసముగా చెప్పబడియున్నది.

("ఉన్నోచ్చ మధ్యవృద్ధ జ్యేష్ఠానుపాలితా, ఏకైక
ఏవమన్యతే అహం రాజా అహం రాజేతి. న చ
కస్యచిచ్ఛిష్యత్వమను పగచ్ఛతి...").

వజ్జియుల న్యాయపరిపాలనను గురించి బుద్ధఘోషుడు తన 'మహాపరినిబ్బాన' సూత్రవ్యాఖ్యయందు చెప్పియున్నాడు. బుద్ధ

4. Studies in Indian History and Culture; P 398)
5 Hindu Polity P 45.

ఘోషుడు వజ్జియులకు ఎనిమిది శతాబ్దముల తరువాతివాడు. ఈ కాల తారతమ్యమునుబట్టి, ఇతరగ్రంథములలో ఈ ప్రసక్తి లేకుండు టనుబట్టి, బుద్ధఘోషుని వర్ణనయందలి యాథార్థ్యమును సరిగా తెలియుటకు వీలులేకయున్నది. బుద్ధఘోషుడు తాను చెల్పునది పురాణ వజ్జీ ధర్మమని నుడివినాడు. వజ్జియులలో దోషియగువాడు వినిశ్చియ మహామాత్రులు, వ్యవహారికులు, సూత్రధారులు, అష్టకుల కులు, సేనాపతి, ఉపరాజు, రాజు - ఆరోహణక్రమమున గల ఈ ఏడుగురు న్యాయాధిపతులలో నెవరివద్దనైనను తన నిర్దోషిత్వమును రుజువుపరచిన విముక్తుడుగాగలడు. కొందరు పండితులు (జయుస్వాల్, మజుందార్) దోషిదోషత్వము ఈ ఎనిమిది న్యాయ స్థానములయందును విధిగా బుజువుగాని యెడల అతడు శిక్షార్హుడను అర్థమును గ్రహించిరి.

మూల సర్వాస్తివాదశాఖకు చెందిన వినయపిటకములోని 'చీవరవస్తు'వునగల సేనాపతి ఖండుని యొక్కయు, దేవదాసియగు ఆమ్రపాలియొక్కయు కథలనుబట్టి లిచ్ఛవుల సంఘ మర్యాదలను, రాజమర్యాదలను కొన్నిటినెఱుగవచ్చును. వైశాలీనగర మాకాలమున ఉత్తమ, మధ్యమ, అధమ స్కంధములు (Wards)గా విభజింపబడి యుండెను. ఈ వివిధ స్కంధముల మధ్య వైవాహిక సంబంధములను గురించి యొక నియమముండెను. ఏ స్కంధములో కన్యనుగాని అంతకు తక్కువ స్కంధములో ఇచ్చి వివాహము చేయరాదు. తక్కువ స్కంధములోని కన్యను పై స్కంధములలో నేనియం దైనను యిచ్చి వివాహము గావింపవచ్చును. అసమాన రూపలావణ్యవతి యగు కన్య యే స్కంధములోని దైనను గణాధీనమగును. లిచ్ఛవులలో నొకడగు మహానుడు అసమాన రూపలావణ్యవతియగు తన తనయ ఆమ్రపాలి యనుదాని వివాహము చేయుటకు సంఘానుమతి వేడును. కాని గణసంఘము మహానుని పై నియమమునకు తల వొగ్గునట్లు చేయును.

విదేహ రాజామాత్యుడగు ఖండుడు తన స్వామిచే అవమానింపబడి వైశాలియందు తలదాచుకొనును. వైశాలీగణము ఖండుని కులీనతను బట్టి అతడు ప్రథమస్కంధమున నివసించుట కనుజ్ఞ యొసగును. కాలక్రమమున వైశాలీగణము ఖండుని, అతని తర్వాత అతని రెండవ కుమారుడగు సింహుని, వారి బుద్ధివైభవము గమనించి తమ సేనాధిపతిగా నెన్నుకొనిరి.

'చీవరవస్తు' నందు ఈ కథ గానవచ్చును. కోసలాధిపతి కపిలవాస్తు నగరమును ముట్టడించి, శాక్యులకు నగరము తన స్వాధీనము చేయుమని వర్తమాన మంపును. ఈ విషయము చర్చించుటకు శాక్యులందరు సమావేశమైరి. వారిలో కొందరు నగర ద్వారములు తెరువవలయునని, కొందరు తెఱువరాదని యభిప్రాయపడిరి. విభిన్నాభిప్రాయము లుండుటచే, అధిక సంఖ్యాకుల అభిప్రాయము (Will of the Majority) కనుగొందమని కడకు నిర్ణయించిరి. అంటనే వారు అభిప్రాయ సేకరణకు (Voting) గడంగిరి. ఈ కథ, పై ఖండుని కథ, గణ సమాలోచన పద్ధతులను గురించి కొన్ని విషయములు దెలుపుచున్నవి. గణసంఘములు సంపూర్ణ స్వాతంత్ర్యముతో క్లిష్టవిషయములను సమాలోచించెడివి. అభిప్రాయ భేదము వచ్చిన యెడల అధిక సంఖ్యాకుల అభీష్టమునను సరించిపోయెడివి. సంఘాధికారుల నెన్నుకొనుటకు గణ సభ్యులకు సంపూర్ణ స్వాతంత్ర్యముండెడిది.

గణతంత్రముల సమాలోచన పద్ధతుల (Delebarative procedure) నెఱుగుటకు తగిన చారిత్రకాధారములు లేవు. కాని, బౌద్ధమత గ్రంథములందు బౌద్ధభిక్షుక సంఘ సమాలోచన పద్ధతులగురించి విపులమైన సారస్వతము గలదు. బౌద్ధభిక్షుక సంఘములు గణసంఘములకు ప్రతిరూపములని పరిశోధకుల నమ్మిక. ఈ నమ్మికపై ఆధారపడి చారిత్రకులు గణసంఘముల సమాలోచన పద్ధతిని నిర్ణయించుచున్నారు.

గణసంఘములలో నేడు మన శాసనసభలో నున్నట్లే అల్ప సంఖ్యాక నియమము (Rule of Quorum) ఉండెడిది. సభ్యులు ఇరువదిమందికి తక్కువగాక వచ్చియుండవలెను. ఈ సంఖ్యను సాధించుటకు నేటి 'Whip'ను బోలిన 'గణపూరకు' డను నధికారి యుండెడివాడు. సమాలోచింపవలసిన విషయము 'కమ్మవాచనము.' దీనిని తీర్మానరూపమున సభాసభ్యుల ఎదుట ప్రవేశపెట్టుట 'జ్ఞప్తి' లేక 'నత్తి.' ఈ తీర్మానమును సభాసదుల ఎదుట చర్చార్థమై పఠించుట 'అనుశ్రవణము. తీర్మానము ఒకపర్యాయము మాత్రము సభాసదుల అంగీకారమును బొందిన, దానిని 'నత్తి దుతీయ'మని అనెడివారు. అట్లుగాక తీర్మానము మూడు పర్యాయములు సభాసదుల ఎదుటకు తేబడి వారి అంగీకారమును బొందిన అది 'నత్తి చతుర్థ' కర్మ యనబడెడిది. ఈ సభాకార్యక్రమ పద్ధతిలో ఎట్టి లోపమున్నను ఆ తీర్మానము చెల్లనేరదు. ప్రవేశపెట్టిన తీర్మానముతో ఏకీభవించిన సభ్యులు నిశ్శబ్దముగనుందురు. ఏకీభవింపని సభ్యులు తమ అనంగీకార కారణముల దెల్పవచ్చును. విభిన్నాభిప్రాయములుగల చోట అధికసంఖ్యాకుల అభీష్టము ననుసరించి సభ నడచుకొనెడిది. ఈ అభీష్టమును (Vote) 'ఛంద' మని అనెడివారు. ఈ అధిక సంఖ్యాకుల అభీష్టానుసారమును 'యేభుయ్యాసికము' (Voting by a majority) అని యనబడెడిది. సభకు హాజరుగాని సభ్యులుగూడ తమ అభీష్టమును దెల్పుట కవకాశముండెడిది. ఈ ఛందమును దెల్పు పత్రముల (Voting tickets) ను 'శలాకము' లనెడివారు. వీనిని సభ్యులయొద్దనుండి సేకరించుటకొక 'శలాకగ్రాహకు' డుండెడి వాడు. మూడు విధములైన ఓటింగు పద్ధతి యుండెడిది.

1. రహస్యపద్ధతి (Vote by bollot) దీనిని 'గూళ్హక' మనెడివారు.

2. బహిరంగ పద్ధతి (Open method) దీనిని 'వివటక' మనెడివారు.

3. శ్రవణపద్ధతి (Whispering method) దీనిని 'సకర్ణజాపక' మనెడివారు. అధ్యక్షునిచే నియమితుడైన వ్యక్తి ప్రతిసభ్యుని స్థానమునకుబోయి వాని అభిప్రాయము నెఱిగెడివాడు.

క్లిష్టసమస్యలను, క్రమశిక్షణచర్యలను సామాన్యముగా ప్రత్యేకమైన సభ్యుల సంఘమునకు నిర్ణయమునకై పంపెడివారు. ఈ సభ్యుల సంఘమును 'యుబ్బాహిక' మనెడివారు. వీరి నిర్ణయము 'అధికరణ సమతి' (వివాద నిర్ణయ చట్టము) అని పిలువ

బడెడిది. ఇట్లు సాంకేతికపదములతో గూడిన ఈ సభా కార్యక్రమ విధానము చాలవరకు నేటి, శాసనసభా విధానముల బోలియున్నది.

ఈ గణరాజ్యముల చరిత్ర ననుసరించిన యే పాఠకునకైనను ఒక అనుమాన మెుదవుట సహజము. నమారు వేయివత్సరములు, తక్కిన రాజరికములకు వేనికిని దీసిపోక, అసమాన సౌభాగ్య సంపదలతో వర్ధిల్లిన ఈ గణతంత్రములు తరువాతికాలమున నిశ్శేషముగ నంతరించుటకుగల కారణమేమి? ఒకప్పుడు సుప్రసిద్ధ చారిత్రకులైన విన్సెంట్ స్మిత్ గణసంప్రదాయము భారతీయుల రాజనీతి ప్రతిభల కన్యమనియు, భారతదేశమున గణతంత్రము లుండుటకు కారణము ఆకాలమున భారతదేశమునకు వలసవచ్చిన మంగోలు (టిబెట్టు) జాతులనియు, గణములు వారి పరిపాలనాచారములను దెలుపుననియు, బుద్ధుడు, మహావీరుడు మెుదలగు వారంతయు, ఈ మంగోలుజాతికి చెందినవారినియు ఒక వింతవాదమును ప్రచురించిరి. కాని డాక్టర్ జయస్వాల్, తమ 'హిందూ పాలిటి' యందు ఇది ఆధారరహితమైన వ్యర్థవాదమని సహేతుకముగ ఋజువుజేసిరి. ఈ గణరాజ్యముల పతనకారణముల దెలుపుటకు మనకు తగినంత చారిత్రకాధారమున్నది. మహాభారతము నందలి శాంతిపర్వమునందు గణతంత్రముల వృద్ధిక్షయ కారణములు బాగుగా దెల్పబడియున్నవి. గణములు నశించుటకు కారణము లోభము, అసూయ వీనివలన గలిగిన భేదభావము.

"లోభ మేకోహి వృణుతే తతోఽమర్ష మనన్తరమ్,
తే క్షయవ్యయ సంయుక్తా వన్యోన్యఞ్చ వినాశినా."

గణముల బలహీనత అంతః కలహములు. ఈ ఆభ్యంతర భయమునుగూర్చి శ్రద్ధవహించిన బాహ్యమగు శత్రుభయమునకు గణములు జంక నవసరము లేదు.

"అభ్యన్తర భయం రక్ష్య మసారం బాహ్యతో భయమ్,
అభ్యన్తరం భయం రాజన్ సద్యోమూలాని కృన్తతి.

అకస్మాత్ క్రోధమోహాభ్యాం లోభాద్వాపి స్వభావజాత్."

ఐకమత్యముగల సంఘములను సామదానోపాయములద్వారా సాధింపవలెనని తెలుపుచూ, అట్లు ఐకమత్యములేని కాని సంఘములపై భేదోపాయమును ప్రయోగింపవలెనని కౌటిల్యుడు అర్థశాస్త్రమున జెప్పినాడు. 'సంఘాభి సంహతత్వా దధృష్యాన్ పరేషాం తా నను గుణాన్ భుఞ్జీత సామదానాభ్యామ్. ద్విగుణాన్ భేదదణ్డాభ్యామ్.'

మౌర్యుల రాజనీతి ఈ సూత్రముపై నడచినది. ప్రాగ్భారతమున లిచ్ఛవీ గణరాజ్యములు తమ అంతః కలహములవల్లను, మగధ, కోసలాది రాజరికపు టొత్తిడికిని అణగారిపోయినవి. వాయవ్యమున గల క్షుద్రక, మాళవాది గణములు అలెగ్జాండరు దైత్రయాత్రాధాటి నెదుర్కొనలేక నశించినవి. క్రీస్తుశకారంభ ప్రాంతమున గల పారస్వతమునుబట్టి, ఈ కాలమునకు గణరాజ్యములలో అధికారము ఏ కొందరు వ్యక్తులయొక్కయో, కొన్ని సమయములందు ఒకే వ్యక్తియొక్కయో హస్తగతమై, కాలక్రమమున రాజరికమునకు త్రోవదిసినట్లు తెలియనగును. గుప్తులకాలమునకు లిచ్ఛవులు ఈ స్థితియందున్నట్లు తెలియనగును.

గమనింపవలసిన మరియొక ముఖ్యవిషయము—గణసంప్రదాయమునకు పూర్వమునుండి, వేదకాలమాదిగా, దేశమున రాజరికపు సంప్రదాయము వెలసియుండుట. తరువాతి కాలమున అర్థశాస్త్రకారులును, స్మృతికారులును తమ రచనలద్వారా రాజునకు దైవాంశ నొసగూర్చి ప్రజాహృదయములందొక ప్రత్యేకభక్తి గౌరవముల నేర్పరచిరి. ముఖ్యముగా గుప్తులవంటి సమర్థులును, ప్రజానురంజకులునగు రాజులతర్వాత ప్రజాసామాన్యము రాజరికము వైపు మెుగ్గుటలో ఆశ్చర్యమేమియును లేదు. ఈ విషయము క్రీ. పూ. ఒకటవ శతాబ్దము, క్రీ. త. పదునెనిమిదవ శతాబ్దముల మధ్యగల ఐరోపాఖండ చరిత్రను పరిశీలించిన సువిదితము గాగలదు. రోమను గణరాజ్య పతన మాదిగా పదునెనిమిదవ శతాబ్దమున ఫ్రెంచి విప్లవ గణస్థాపనకు మధ్యగల కాలమున యూరపునందు రాజరిక సంప్రదాయమే వర్ధిల్లినది. మధ్యయుగమున ఇటలీయందు వెలసిన గణ ప్రభుత్వముల అంతఃకలహములు, అనైక్యభావము, మనదేశమున కౌటిల్యునివలె, 'మాకియవెల్లిని' రాజరికమును నీతి రహితముగా గూడ ప్రపంచప్రఖ్యాతిగాంచిన 'ప్రిన్స్' అను గ్రంథమున సమర్థించునట్లు చేసినది. ఐరోపాఖండమును పరిపాలించిన నియంతలతో పోల్చిచూచిన భారతదేశమును పరిపాలించిన రాజరికములు ప్రజాహృదయములు చూరగొనుటలో ఆశ్చర్యపడవలసినదేమియును లేదు. భారతదేశమున గణసంప్రదాయము నిశ్శేషముగ నంతరించుటకు కారణము, చారిత్రకమైన పరిస్థితులప్రభావమేగాని, భారతీయుల రాజనీతి ప్రతిభల కన్యమగుట గాదు.

# విషపానము

శ్రీ పి. నారాయణరెడ్డి

(చిరకాలంనుంచి సుఖాలకు మరిగి వివశుడై ఉన్న ఒక అసామాన్యజీవి ఒక్కమాటు ప్రత్యపది చేసుకున్న ఆత్మవిమర్శ ఇది. దీనిలోని విషం జీవితపథంలో గిరుక్కున తిరిగేటందుకు, మార్పుకు సంకేతం మాత్రమే.)

నన్ను త్రాగనిందు విషము
నా కదియే జీవరసము.

కాకోలమ్మనుకొందురా
కాదు కాదు—గత్తులుగా
పండిన చీకట్ల పిండి
వడపోసిన రాగరసము.

తుమ్మెద సుల్తానుల పద
ధూళినైన నోచుకోని
పూచిన ఉమ్మెత్తపువ్వు
నా చషకము నా చషకము.

నాటి గరళకంఠునితో
పోటీ చేయుటకు గాదు.
సోక్రటీసు సరి బంతిని
చోటు గడించుటకు గాదు.

వింత మాధురులకు మరగి
వెన్నెల దిండ్ల పై ఒరిగి
జడీభవించిన బ్రతుకున
సన్నని మంటలు లేపగ—

నిప్పువోలె గుప్పున మం
డెడు బాధాపరిమళముల
తియ తియ్యని చురుకులు గుం
డియలో తీండ్రించి పోక—

మదిరాక్షుల పెదవుల గల
మధుశాలలలోన తిరిగి
మత్తిల్లిన చూపుల కసు
మంత చేదు రుచి చూపగ—

నన్ను త్రాగనిందు విషము
నా కదియే జీవరసము.

ఎల్లరికీ విషము మృత్యు
హేతు వనుట వైరిమాట.
గుండె గట్టిదైన కాల
కూట మమృతమైపోదా?

నా కెందుకు ముద్దగట్టి
నట్టి యీ పసిండి బ్రతుకు?
ప్రతిక్షణము దీపశిఖా
ప్రతినిధిగా జీవింతును.

క్షణమాత్రయమ్మున కా
ర్కంత మనసు మొగ్గతిలిన;
ఆత్మను మాత్ర మొక స్నే
హ ప్రపగా వెలయింతును.

సందెగద్దె పై గొండిలి
పలికెడు వెల్తురునీడల
భ్రూవల్లీ స్పందనముల
తో విశ్వస్థితి జూతును.

# బసవపురాణ ప్రయోగాల సమర్థన

శ్రీ నిడుదవోలు వేంకటరావు

తెలుగుభాషా సాహిత్య ప్రపంచమున దేశి సంప్రదాయముల నుద్ధరించిన శివకవిత్రయము (మల్లికార్జునపండిత, నన్నెచోడదేవ, పాల్కురికి సోమనాథులు) లోఁ ద్వితీయుఁడయ్యు నద్వితీయుఁడైన పాల్కురికి సోమనాథుని బసవపురాణమును క్రీ. శ. 1926 లో నాంధ్రగ్రంథమాలాధిపతులు ప్రకటించిరి. ఆ గ్రంథ ప్రకటనమువలన సోమనాథుని కవితావైదుష్యము, ప్రతిభా విశేషములు ప్రవ్యక్తమగుటయేగాక, శివకవుల భాషాచ్ఛందస్సంప్రదాయములు, సాహితీరీతులు సువ్యక్తములైనవి. గ్రంథ పరిష్కర్తలు ప్రసిద్ధకవి పండిత వతంసులు ప్రభాకరశాస్త్రిగారు.

బసవపురాణ ప్రథమ ముద్రణమైన వెనుక మఱి యిరువదియాఱేండ్ల (క్రీ. శ. 1952) కా గ్రంథమునకు ద్వితీయ ముద్రణావశ్యకత లభించినది. ఆ ద్వితీయ ముద్రణమును పరిష్కరించి, విపులమైన పీఠికాదులతో వెలయించు భాగ్యము, గ్రంథప్రకాశకులవమూలమున నాకు లభించినది. నేనును పాఠనిర్ణయ విషయమున, పూర్వ ముద్రణమునందలి పాఠములనే జాగరూకతతోఁ బరిశీలించి, యవి యట్లే యుండదగినవను నిశ్చితాభిప్రాయముతో యథాతథముగ నిలిపితిని.

బసవపురాణ మిట్లు ద్వితీయముద్రణమైన వెనుక నేను 1 ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము' అను బృహద్గ్రంథము 2 మాచుట తటస్థించినది. అది రెండు సంపుటములుగా విభక్తమై, అనుబంధములతోఁ గలిసి ౧౯౪౪ పుటలు గలిగియున్నది. ఇది పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్థమున వెలసిన పరవస్తు చిన్నయసూరి ప్రణీత బాలవ్యాకరణమునకు "మహాపెద్ద" 3 భాష్యగ్రంథము. కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యావహారికభాషా మహోద్యమము మూలమున ప్రాచీనాంధ్ర ప్రబంధ సాహిత్యమునకు మహాపకారము జరిగినదని తిరిగి గ్రాంథికభాషా స్థితిస్థాపనకై ప్రత్యేకముగ వ్రాయఁబడినదీ సంహితాగ్రంథము, నన్నయనాటినుండి చిన్నయ వఱకుగల సమస్తాంధ్ర గ్రాంథికభాషా సాహిత్యమంతయు, నన్నయాధర్వణీయ, చిన్నయసూరీయ సూత్రములకు లోబఱచి, గ్రాంథిక భాషను పునః ప్రతిష్ఠితము సేయు నభినివేశముతో వ్రాయఁబడిన కారణమున నిది ప్రత్యేక విమర్శకుఁ దావాసగుచున్నది. అట్టి విమర్శనమును కాలాంతరమున స్థలాంతరమున విపులముగా నొనర్చెదను. ప్రస్తుత మీ గ్రంథమునందున్న బసవపురాణ పాఠపరిశీలనకు సంబంధిన విషయములను మాత్రమే విమర్శించుచున్నాను.

సంహితాకర్తలు తమ గ్రంథమున, బసవపురాణములో ముఖ్యముగా మూఁడు విషయములను గూర్చి పాఠభేద విమర్శనము గావించిరి. 1 వైరిపదములు. 2 తద్భవములు. 3 సంధి. వీనిలో వా[illegible] క్రమముగా విమర్శింతును.

## వైరిపదము-వైరిసమాసము

బసవపురాణ ప్రథమ ముద్రణమున కీర్తిశేషులు ప్రభాకర శాస్త్రిలవారు "అసాధారణ ప్రయోగములు" అను శీర్షికక్రింద పై విషయములను గూర్చి యిట్లు వ్రాసిరి.

"కర్ణాటాంధ్ర లాక్షణికులు కావ్యదోషములలో గణించిన 'వైరిపద'మను శబ్దదోషము వీరికృతులలో, పెక్కుచోట్ల కానవచ్చుచున్నది. వైరిపదము దోషమని గర్హించిన ప్రాచీనకవులే కొందఱు వానిని తఱచుగాఁ బ్రయోగించుట వింతగా నున్నది. సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమున 'వైరిపదము'ను గర్హించెను. కవిజనాశ్రయము, ఆంధ్రభాషా భూషణము, కావ్యాలంకార చూడామణి, ఛందోదర్పణము మొదలగు గ్రంథము లీదోషమును పేర్కొన్నవి. అయినను, నన్నయాదుల కృతులలో గూడ నిట్టి వైరిపదములు కొన్ని గానవచ్చుచున్నవి. అర్వాచీన లాక్షణికులనింద్య గ్రామ్యములని యట్టివానిని గొన్నింటిని గణించిరి. ప్రాచీను లట్టివానిని వైరిపదములనియే పేర్కొనియు ప్రయోగించిరి. వైరిపదమనగా సంస్కృతాంధ్ర పదముల విరుద్ధ సమాసము. సోమనాథుఁడు బసవపురాణమున మాత్రము ప్రయోగించిన వైరిపదములఁ జూపుచున్నాఁడను.

"పుట. ౭. 'దీబగంథంబులు'. పు. ౧౫. 'చాదశాబ్జంబు.' పు. ౨౬. 'ముల్లోకవంద్య' పుట. ౩౦. 'ముల్లోకనుతుఁడు. పు ౭౪౦ 'ముల్లోకనాథుని' పుట. ౪౪ 'నిత్యనేమంబు.' పుట. ౫౫ 'నిత్యవడి' పు. ౧౩౫ 'నిత్య, (ఇట్టివి పెక్కుమార్లు) పు. ౫౫ 'పుడ

---

1. పాల్కురికి సోమనాథ కృత ద్విపద బసవపురాణమును క్రీ. శ. 1897 లో మామిడాకందుకూరి భూషణప్రసాదరావుగారు ఏలూరిలో ముద్రించిరి. అదిపూర్వపురీతి ముద్రణము. కాని యా గ్రంథమునకు వెనుక ఆంధ్ర శైవవాఙ్మయ పోషకులలో ప్రధానులగు కందుకూరి వారివంశ వృత్తాంతము పూర్తిగ నీయఁబడి యున్నది. అద్యతన కవి చరిత్రకారులకది యెంతయు నుపయుక్తము.

2 ఇది ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారిచే ప్రకటితమైనది. గ్రంథ కర్తలు కళాప్రపూర్ణ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు.

3 మహామంచివలె 'మహాపెద్ద'యను వ్యావహారికపదము చాలకాలము క్రిందటనే గ్రాంథికతావస్థ నందినది. క్రీ. శ. 1480 ప్రాంతము వాడగు కూచిరాజు యెఱ్ఱన (కొక్కోక రచయిత—అందఱు నెఱిఁగినకవియే) తన సకల నీతికథానిధానములో వీ...ఉరవుగ... కన్యల పెండ్లియాడిన "మహాపెద్ద" గాఁడె అని 2-68 లో ప్రయోగించియున్నాఁడు. దీనిని మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమువారు ప్రకటించిరి.

మీళ్ళు ౬౦-౬౨ 'సర్వాంగ కచ్ఛపము' పు. ౧౨౪ భక్తకూటవలు పు. ౧౩౭ మజ్జనబావి. పు. ౨౦౧. ఇతరవేల్పులు. పు. ౪౪-౨౦౫ శివనిధి పు. ౨౪౯ శివరాజా పు. ౧౫౫. శివరాజ వల్లభుఁడు. పు. ౨౦౧ నెరిమహాదేవాదిసురలు ౧౪౦. ధర్మకవిలె ఇత్యాదులు. పరిశోధింపఁగా నీపదములు సోమనాథుని కాలమున బాహాటముగా నాంధ్ర శైవకావ్యములయందు ప్రయోగింపఁ బడినట్లు కానవచ్చుచున్నది." ఆంధ్ర గ్రంథమాలా ముద్రణము. ౧౯౨౬. పీఠిక. పుట. ౯౩.

పై విషయమును విమర్శించుచు, సంహితాకర్త లిట్లు వ్రాసిరి. "సోమనారాధ్యుని వంటివాఁడు తాను నిరసించిన వైరిపదమును పలుచోటులఁ బ్రయోగించెననుట విశ్వసనీయము కాదు. పాల్కురికి సోమనారాధ్యుని వైదుష్యము వర్ణనాతీతము. అతఁడు నియమోల్లంఘనము చేయువాఁడని భ్రమింపరాదు. మఱి విషయము లందువలెనే భాషావిషయము నందును నాతని పోకడలు వింత వింతలుగా నుండును." ఆం. వ్యా. సం. స. (పుటలు ౧౧౭౦-౭౧.)

ఇట్లు వ్రాయుటయే గాక సోమనాథుడు చేసిన ప్రయోగము లన్నింటిని ఆంధ్రశబ్దచింతామణ్యథర్వణ కారికావళ్యప్పకవ్యహోబలపతులచేత ప్రతిపాదితమై, చిన్నయసూరి బాలవ్యాకరణముచేత సిద్ధాంతితము చేయఁబడిన, వైయాకరణ సంప్రదాయానుసారముగ సమన్వయించుటకుఁ బ్రయత్నించిరి. అంతటితో నాఁగలేదు. పైని వివరించిన ప్రయోగములన్నియుఁ జాలవరకు ముద్రణసంస్కార లోపకృతములని వ్రాయుటయే గాక, బాలవ్యాకరణానుసారముగ ముద్రిత పాఠములను, తమ యిచ్చవచ్చినట్లు మార్చిరి. కొన్నిచోట్ల నిట్లే యుండవలెనని యనుశాసించిరి. ఈ విమర్శన మెంత విమర్శనీయమో, విభ్రమ ప్రమాద కలితమో ముందు తెలుపుచున్నాడను.

పై విషయమును విమర్శించుటకు ముందుగా నీ వైరిపదమున కేమో, ప్రాచీనార్వాచీనలాక్షణికు లేవిధముగా దానిని నిరూపించిరో తెలిసికొనుట యావశ్యకము. తొలుత ప్రాచీనలాక్షణికాభిప్రాయములు తెలిపెదను.

## వైరిసమాసము-లాక్షణికాభిప్రాయము

కవి జనాశ్రయమున—మల్లియ రేచన— (క్రీ. 1100. ప్రాంతము)

క. తుద వేఱుసేసి మఱి చ
క్కదపుం దెనుఁగున నమర్చి కలవంబుజముల్
పదియు ననక కలవంబుజ
పది యని కృతిఁ జెప్ప వైరిపద మనఁ బరగున్.
దోషాధికారము. ౨౨ వ.

ఆంధ్రభాషా భూషణమున కేతన—(క్రీ. శ. 1260 ప్రాంతము.)

క. దినకర కొడుకును సరి
యనిమిష మొదవునకు సాటి యని యిబ్బంగిన్
దెనిగింప సంస్కృతములం
దెనుఁగులు సంధించిరేనిఁ దెగడుదు రార్యుల్. ౧౩౧ వ.

క. తెనుఁగు పదంబులపైఁ దెం
పొనరఁగ సంస్కృతముఁ జెల్లు నొక్కొక్కచోటన్
మును సుకవీంద్రులు కృతులన్
బనిగొని రచియించినట్టి పరిపాటి మెయిన్. ౧౩౨ వ.

క. వాఁడిమయూఖము లనఁగా
వేఁడిపయోధార లనఁగ వింజామర నా
మూఁడస్త్రంబు లనంగాఁ
బోఁడిమి కఱకంఠనామమున్ బోలి తగున్. ౧౩౩ వ.

కావ్యాలంకార చూడామణి—విన్నకోట పెద్దన—(క్రీ. శ. 1400 ప్రాంతము.)

క. క్షీరార్ణవకూఁతురు సం
సారార్ణవమోడ శుభ మొసఁగు మీ కనఁగా
వైరిపదం బగు తెనుఁగునఁ
గూరని సంస్కృతముఁ దెనుఁగుఁ గూర్చుటచేతన్
నవమోల్లాసము. ౧౩౫ వ.

క. సుమతి నికారోకారాం
తముపై సంస్కృతపదంబు తగుఁ గూర్పఁగ వేఁ
డి మరీచులు వాఁడిశరం
బమరు మనుష్యుండు పేర్చు నశ్వం బనఁగన్. ౧౩౯.

క. తగుఁ గూర్ప నికారాంతం
బగు సంస్కృతపదముమీఁద నచ్చతెనుఁగునన్
నిగుడారు దంతికొమ్ములు
జగమెఱుఁగు నరాతిపోరు చందం బనగన్ ౧౪౦.

ఛందోదర్పణము—అనంతుఁడు. (క్రీ. శ. 1480 ప్రాంతము.)

ఆ. వె. తుదలు తెలుఁగుఁ జేసి యదికి పుష్పపువిల్లు
పరగ భూరుహంపుఁ బండ్లు నాక
పుష్పవిల్లు నాఁగ భూరుహపండ్లు నా
వైరివర్గ మండ్రు వనజనాభ. ౪-౨౨.

ఆ. వె. సోమటేంద్రుఁ డనఁగ భూమితీరనఁ బలు
గ్రహము లనఁగ వానకాల మనఁగ
వైరి వర్గమైన వదలరిట్టివి లోక
రూఢిఁ జెల్లునని సరోజనాభ ! ౪-౨౩

కవి చింతామణి—తాతంభట్టు (క్రీ. శ. 1500 ప్రాంతము.)

గీ. కుమనకారాంతరూపప్రకాశితంబు
లైన పుల్లింగములకును నన్నిటికిని
బరగు సంబంధ షష్ఠికిఁ బ్రథమ యగుచు
దంతికన్నులు కవి పల్కు తరువుకొమ్మ.

గణపవరపు వేంకటకవి ఆంధ్రకౌముది (క్రీ. శ. 1650).

సీ. తెనుఁగు నుడుగుల రెండును మూఁడు నాలుగై
దాఱేడు నెనిమిది యక్షరముల
పయి సంస్కృతపదంబు పరగు లక్ష్యము లింక
కఱకంఠుఁ డన జాడి కొండము లన పుట ౨౦.

సంస్కృత వ్యాకరణోపజ్ఞములయిన పారిభాషికపదములను సిద్ధాంత కౌముది ననుసరించి, తెనుఁగు వ్యాకరణమున నెలకొల్పిన వారిలో చిన్నయసూరి ప్రథముఁడని కొందఱి యభిప్రాయము. కాని చిన్నయసూరికి రెండు శతాబ్దులకు పూర్వమే గణపవరపు వేంకటపతికవి (కాలము క్రీ. శ. 1654). 'ఆంధ్ర కౌముది' అను వ్యాకరణగ్రంథమును రచియించి యున్నాడు. గ్రంథకర్తయును

వేంకటపతి కాలము, సందిగ్ధముగాక నిశ్చితమైనదియే. 4. 5 ఆంధ్ర కౌముది వేయి చరణములు గల సీసమాలికా గ్రంథము. సర్వ లక్షణ శిరోమణి యను మహా లక్షణ గ్రంథమున తృతీయోల్లాసము. ఇందు— సంజ్ఞా, సంధి, కారక, సమాస, తిఙన్త ప్రకరణములు గలవు. ఇందు ద్విత్వవిధానము, ఇత్త్వ విధానము, స్త్రీప్రత్యయకారకములు, సప్తవిధ కర్మధారయములు. తిఙంతధాతు దశలకారములు, ఆచారార్థ క్విప్ప్రత్యయములు, స్వార్థహేత్వర్థములణిజర్థములు, మొదలగు సంస్కృత వ్యాకరణ ప్రక్రియ పూర్తిగ వివరింపబడినది. తెనుఁగు వ్యాకరణముసంప్రదాయములను గూర్చి పరిశ్రమ చేయు వారల కిది యెంతయేని యుపకరించును. మఱియును, సంస్కృత వ్యాకరణ పద్ధతులను తెనుగున వెంకటపతి కవి సమన్వయించుటకు చేసిన కృషి ప్రశంసాపాత్రమై యున్నది.

పైని చూపిన యుదాహరణములనుబట్టి వైరిసమాసములను గూర్చి ప్రాచీనలాక్షణికులీక్రింది నిర్ణయములు చేసినట్లు కానవచ్చుచున్నది.

౧. వైరిపదములు - సంస్కృతము + తెలుఁగు

| | |
|---|---|
| అంబుజ పది | అంబుజ (సం) + పది (తె) |
| అనిమిష మొదవు | అనిమిష (సం) + మొదవు (తె) |
| క్షీరార్ణవకూఁతురు | క్షీరార్ణవ(సం) + కూఁతురు (తె) |
| పుష్పవిల్లు | పుష్ప (సం) + విల్లు (తె) |
| భూరుహపండ్లు | భూరుహ (సం) + పండ్లు (తె) |
| సంసారార్ణవయోడ | సంసారార్ణవ(సం) + ఓడ (తె) |

పై రీతిని తెనుగు స్వసంస్కృతము కలిపి సమాసములు చేయరాదు. ఇవి వైరిపదములు. ప్రయోగానర్హములు.

| | |
|---|---|
| ౨. 1. అరాతి పోరు | అరాతి(సం) + పోరు(తె) |
| కవి పలుకు | కవి (సం) + పలుకు(తె) |
| తరువు కొమ్మ | తరువు(సం) + కొమ్మ(తె) |
| దంతి కొమ్ములు | దంతి (సం) + కొమ్ము(తె) |
| భూమి తీరు | భూమి(సం) + తీరు(తె) |

| | తెలుఁగు + సంస్కృతము |
|---|---|
| 2. అమరుమనుష్యుఁడు | అమరు (తె) + మనుష్యుఁడు (సం) |
| 3. కలకంఠుఁడు | కల (తె) + కంఠుఁడు (సం) |
| కోమటీంద్రుఁడు | కోమటి(తె) + ఇంద్రుఁడు (సం) |
| పలుగ్రహము | పలు (తె) + గ్రహము (సం) |
| కేర్పునశ్వము | కేర్పు (తె) + అశ్వము (సం) |
| మూఁడగ్నులు | మూఁడు(తె) + అగ్నులు (సం) |
| మూఁడస్త్రంబులు | మూఁడు(తె) + అస్త్రంబులు (సం) |
| వాఁడిమయూఖములు | వాఁడి (తె) + మయూఖములు(సం) |
| వాఁడిశరములు | వాఁడి (తె) + శరములు (సం) |
| వింజామర | విన్ (తె) + చామర (సం) |
| వేఁడిపయోధారలు | వేఁడి (తె) + పయోధారలు (సం) |
| వేఁడిమరీచులు | వేఁడి (తె) + మరీచులు (సం) |

పైన చూపిన 1, 2 సంఖ్యగల వర్గములలోని సమాసములు (సంస్కృతము + తెలుఁగు, తెలుఁగు + సంస్కృతము) వైరిపదములేయైనను నవి కవిప్రయోగాగోచరములు. వానికి వైరిపదదోషము పట్టదు. ప్రయోగార్హములు.

పైలాక్షణికులలో కేతనయుఁ దాతంభట్టును, 'వైరిపదము' 'వైరివర్గము' అను సాంకేతికముల నుపయోగింపలేదు. కావున ప్రాచీనలాక్షణికుల ననుసరించి, వైరిపదమునుగూర్చి యీ క్రింది విషయములు నిర్దిష్టము లగుచున్నవి.

౧. పూర్వపదము సంస్కృతసమమై, ఉత్తరపదము తెనుఁగు పదమై నప్పు డది వైరిపదము. అంబుజపతి, అనిమిషమొదవు, క్షీరార్ణవకూఁతురు మొదలగునవి. ఇవి లక్షణవిరుద్ధములు. ప్రయోగానర్హములు.

౨. సంస్కృతసమము పూర్వపదమై ఉత్తరపదము తెనుఁగు పదమైయున్న కతిపయసమాసములు వైరిపదములేయైయున్నను నవి కవిప్రయోగారూఢములగుటచేత గ్రాహ్యములు. అరాతిపోరు, కవిపల్కు, భూమితీరు మొదలగునవి. ఇవి వైరిపదములక్రింద పరిగణితములు కావు.

3. పూర్వపదము తెనుఁగుపదమై ఉత్తర పదము సంస్కృత పదమైయున్న కతిపయసమాసములు. వైరిపదములైనను నవియు కవిప్రయోగారూఢములు. కలకంఠుఁడు అమరు మనుష్యుఁడు, వాడి మయూఖములు, వేడిపయోధారలు మొదలగునవి. ఇవియు వైరిపదములు కావు.

పైని ప్రదర్శించిన పట్టికలోని తెనుఁగు పదములను పరిశీలింపుఁడు. పది, మొదవు, కూఁతురు, విల్లు, పండ్లు, ఓడ పోరు, పలుకు, కొమ్మ, కొమ్ము, తీరు, కల, మూఁడు, వాఁడి, వేఁడి అనుపదములన్నియు నచ్చతెనుఁగుపదములు. సజాతీయములైన తమిళ, కన్నడ భాషలలో పై పదములకు సమానములైన పదము లున్నవి. పత్తు - పది, మూన్రు - మూఁడు, కొంబు - కొమ్మ మొదలగునవి. 6

కాబట్టి ప్రాచీన లాక్షణికులు అచ్చతెనుగు లేక దేశిపదము సంస్కృతము సమసించిన "వైరిపదము" అని నిర్వచించిరే కాని ఆర్వాచీన లాక్షణికమతానుసారముగ అచ్చతెనుఁగు వర్గములో చేరిన తద్భవపదములతో సమసించిన సంస్కృతపదమును, వైరిపదమని నిర్వచింపలేదు. ఆంధ్ర లాక్షణికులలో ప్రథముఁడగు కేతనకు ముందే నన్నెచోడుని కుమారసంభవమును పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్యచరిత్రములు వెలసినవి.

---

4. ఈ గ్రంథమాంధ్ర సాహిత్యపరిషత్తువారిచే క్రీ. శ. ౧౯౩౫ లో ముద్రితమై ప్రకటితమైనది. ప్రకటిత గ్రంథ సంఖ్య ౩౬.

5. చూడుఁడు. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము. పుట. ౬౨౦. వేంకటపతి కవి మధుర నాయకుఁడగు చొక్కనాథనాయని వారి సోదరుఁడగు ముద్దళగిరికి విద్యావతీ దండకము కృతినిచ్చెను. ముద్దళగిరి క్రీ. శ. 167౮ లో తంజావూరిని వశము చేసికొని యొక సంవత్సర మచట పాలించెను.

6 ఇదియొక పట్టికవలె నీయఁదలఁచితిని గాని గ్రంథవిస్తృతిని విరమించితిని.

కేతన, నన్నయ భారతభాగముతోపాటు పై శివకవుల గ్రంథము లను పరిశీలించియే, నన్నయ సంప్రదాయము శివకవి సంప్రదాయము సమన్వయించి యాంధ్రభాషా భూషణము రచించి యున్నాడు.

నన్నెచోడని కుమార సంభవమున అమరలేమ, అరదాళ్వ భటతతి, వృషమివృదు మున్నగు సమాసములు—తద్భవపదమును సంస్కృత పదమును సమసించినవి గలవు. కేతన వానిని లక్షణ యుక్తములుగానే పరిగణించెను. అతని ననుసరించి, తక్కిన లాక్షణికులును, నిట్టి సమాసముల నంగీకరించిరే కాని నిషేధించి వైరివర్గములో చేర్పలేదు. కావున ప్రాచీన లాక్షణిక మతమున అచ్చతెనుఁగు—సంస్కృతము సమసించిన నది వైరిపదమనియు, తద్భవము—సంస్కృతము సమసించినది వైరిపదము కాదనియు, కవిప్రయోగారూఢమనియు సలక్షణమనియు, సిద్ధాంతము.

ప్రాచీన లాక్షణికులు తెనుగునకు సంస్కృతమునకుగల యవినాభావసంబంధమును గుర్తించి, పైసమాసములయందు సంస్కృతాంధ్ర పదసమ్మేళనమును చక్కఁగ నిరూపించియున్నారు. తెలుఁగువారికి సంస్కృతపదములు కేవలము గ్రంథస్థములుగాక, నిత్యవ్యవహార ములో నున్నవి. కావున నిత్యవ్యవహారమున కొన్ని దేశీయములైన పదములకు సంస్కృతపదములకు సమాసఘటన తప్పనిసరి యగు చున్నది. ఈ సన్నివేశమును పరిశీలించియే, ప్రాచీన లాక్షణికులు కఱకంఠుడు మొదలగు గ్రంథస్థపదములకేగాక, "భూమిఱేఁడు", "వాన కాలము" (వానాకాలము అని వాడుక) మొదలగు వ్యావహారిక పద ములకు గ్రాంథికతను ప్రసాదించియున్నారు.

అర్వాచీన లాక్షణికులగు నాంధ్రశబ్దచింతామణికర్త, అథర్వణకారికావళికర్త, అప్పకవి, అహోబలపతి, వారి ననుసరించి చిన్నయసూరియు "వైరిపదము" అనుమాటయే యెత్తుకొనలేదు. అయిన భాషావిభాగమునగూడ ప్రాచీన లాక్షణికులకన్న విలక్షణముగ పథకముఁ ద్రొక్కిరి. ముందునే తెల్పిన ప్రాచీనులు—ఆంధ్రపదము లన్ను, తత్సమము, తద్భవము, దేశితెలుఁగు అచ్చతెలుఁగు, గ్రామ్యము అని యైదువిధములుగా విభజింపఁగా, పై యర్వాచీన లాక్షణికులు తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యములని నాలుగు విధములుగా విభజించిరి. (చూడుఁడు. చింతామణి సంజ్ఞా ౧౭, బాలవ్యాకరణము సంజ్ఞా ౧౯. ౨౦. ౨౧. ౨౨) ఈ చతుర్విధ విభాగమువలన ముఖ్య ముగా ప్రాచీన లాక్షణికులు దేశి తెనుఁగు, అచ్చతెనుఁగు అనువానిని చేర్చిన సూక్ష్మవిభాగము మఱుఁగుపడినది. దేశ్య విభాగముననే నివి రెండు నిముడుకొన్నవి. చిన్నయసూరి సంస్కృత సమేతరంబగు భాష 'అచ్ఛ' అని అచ్చ తెనుఁగునకు నిర్వచనము చేసియున్నాడు. (చూ. అచ్చిక పరిచ్ఛేదము—౧ సూ) ఈ నిర్వచనమువలన, తత్సమ పదములకన్న—అనగా సంస్కృతపదములకన్న భిన్నము లైన తెనుగు పదములన్నియు—తద్భవములైనను, అచ్చతెనుగు పదములైనను, దేశితెలుగు పదములైనను నొకే "అచ్ఛతెనుగు" అను వర్గముక్రింద పరిగణితములైనవి. ప్రాచీన లాక్షణికుల మతము ననుస రించి తద్భవములు, అచ్చతెలుఁగు, దేశితెలుఁగు, వేఱువేఱుగా పరిగణితములు కాగా, అర్వాచీన లాక్షణికుల దృష్టిలో నవి యొకే వర్గముక్రిందకు వచ్చినవి. ఈ ప్రాచీన లాక్షణికుల మతము ననుస రించి తద్భవపదములతో సమసించిన సంస్కృత సమాసము లక్షణ యుక్తమును, కవిప్రయోగసిద్ధము కాగా, అర్వాచీన లాక్షణిక దృష్టిలో—తద్భవపదములతో సమసించిన సంస్కృతపదములు దిన వెచ్చము, అంచయాన, కప్పురగంధి మొదలైనవి లక్షణవిరుద్ధములై వైరిపదములైనవి. కాబట్టి పైని వివరించిన వైరి సమాస పరిశీలన సంద ర్భమున ప్రాచీన లాక్షణికాభిప్రాయము ముఖ్యాతి ముఖ్యమైనది. వారిచ్చిన యుదాహరణలలో అచ్చతెనుగు దేశితెనుఁగు పదములే తప్ప తద్భవపదములు లేవన్న తెల్పితిని. కొడుకు, మొదవు, కఱి, మూడు, మొదలైనవి ప్రాచీన లాక్షణికులే కాదు. అరాచీన లాక్షణికు లెవ్వరును కూడ తద్భవములుగా పరిగణింప లేదుగదా! కాబట్టి, తద్భవపదము సంస్కృతపదముతో సమసించినది వైరి సమాసదోష మునకు పాల్పడదని యీవఱకు చేసిననిర్ణయము ననుసరించి నేఁడు వైరిపదసమాసములుగా విమర్శకులచే పరిగణితములై నన్నెచోడ మహాకవి కుమారసంభవమున ప్రయోగించిన యీక్రింది సమాసములు లాక్షణికములై దోషరహితములైనవి.

## అమరలేమ

తే. సర్వలక్షణ సంపూర్ణ చంద్రవదన
నిండు వెన్నెలలో నోర్తు నిలిచి పొలిచె
నమృతమథనావసరమున నమరలేమ
పాలకడలిలో నిల్చిన భంగివోలె.

కుమారసంభవము ౭-౧౨౩.

అమరలేమ యనునది వైరిసమాసముగా భావించి తొలి పరిష్కర్తలు 'అమరకాంత' అని దిద్దిరి. (చూ. 1914 ప్రతి పుట౧3 రెండవ భాగము) కాని తంజావూరి ప్రతిలో 'అమరలేమ' యని యుండుటచే తరువాతి పరిష్కర్తలు దీనిని 'అమరలేమ' అనియే నిల్పిరి. పై సమాసమున—'అమర' శబ్దము సంస్కృతము - లేమ శబ్దము తెనుఁగు—అందుచే నది వైరి సమాసమైనదని విమర్శకుల తలంపు. కాని 'లేమ' శబ్దము 'అచ్చ తెనుగు' గాదు. 'దేశి' కాదు—తద్భవము — సంస్కృతమునగల ఆకారాంత 'రామా' శబ్దము 'మాగధీ' ప్రాకృతమున "లామ" యైనది[7] తెనుఁగున 'లేమ' యైనది. సంస్కృతమగు 'అమరశబ్దమును' తద్భవమగు 'లేమ' శబ్ద మును సమసించినది గాన 'అమరలేమ' సరియైనది. లేమశబ్దమును దేశ్యముగ సాధింపవచ్చును. ఎలమై లేఁత యగు శరీరముగలది—ఎల-లే-మై-మయి-మ.

---

7. ఏయే ప్రాకృతములనుండి యేయే తద్భవము లేర్పడినవో వానిని యాంధ్ర దీపిక (అముద్రితము. మామిడి వెంకయ కృతము) యందు చూడనగును. ఆంధ్ర దీపిక ననుసరించి F. W. Ellis దొర వారు తమ "తెలుఁగుభాషాతత్త్వ వివేచనము"న (Dissertation on the Telugu Language by Ellis (1816) రామా శబ్దభవము 'లామ' అని, దానినుండి లేమ వచ్చినదని తెలిపినారు (చూ. పుట10) ఇల్లిసుదొరవారిపై యాంగ్లేయగ్రంథము నాచే తిరిగి ముద్రితమైనది. (Journal of the Oriental Institute Madras University Vol xiv & xv).

## అరదాశ్వభటతతి

శా. అతుంగద్విరదారదాశ్వభట దేహత్రాణ భూషామణి ౧౧.౭౪.

అ. వె. అనఁగఁ గరులు తథము నరదాశ్వభటతతి ౧౧.౩౩.

ఇచట అరదము సంస్కృత రథశబ్ద తద్భవము. కావున నిది సంస్కృతముతో సమసించినది.

## పుడమిపుఁడు

ఉ. పుడమిపుఁడున్ ధనాఢ్యుఁడును—౧౧.౪౪.

ఇచట, పుడమి+ప-అని పదచ్ఛేదము. పృథ్వీపతి—అని యర్థము.

పుడమి శబ్దము పృథ్వీశబ్ద తద్భవము కావున సమాసము సరియైనది.

## మరుప్రసవాస్త్రహతి

ఉ. అలకలఁ జిన్నిపూ వలికినంతఁ జెమర్చు...

...విజమంత కోమలి మరుప్రసవాస్త్రహతిం జలింపదే— ౫.౧౩౩

దీనిపై కుమార సంభవము (యూ.ను) వ్యాఖ్య(48.A పుట)లో నిట్లు గలదు. "మరుప్రసవాస్త్రహతిన్—మరుశబ్దము మన్మథార్థమునఁ బ్రసిద్ధముకాదు. స్మరశబ్దభవమై యుండును. ఇట్టి వైరిసమాసముల నీతఁడు తఱచుఁ బ్రయోగించుచుండును. పుడమిపుఁడు. అరదాశ్వభటతతి......."

పైని వివరించిన రీతిని మరుప్రసవాస్త్రహతి అను సమాసమున మరుశబ్దము స్మరశబ్దభవమగుటచేత, నది తద్భవమై ప్రసవాస్త్రహతితో సమసించినది కావున వైరిపదముకాదు.

ఇఁక పాల్కురికి సోమనాథుని వైరిపద సమాసములను గూర్చి విచారింతము. సోమనాథుఁడే 'వైరిపదమును' దోషముగాఁ బరిగణించియున్నాఁడు.

"ద్వి. కావ్యార్థం బసంగతి విరసంబు
వైకల్య మత్యుక్తి వైరిపదంబు
తలవిఱుప సమగ్రత శిథిలబంధము"

పండితారాధ్యచరిత్ర ౧-౪

కావున సోమనాథుని రచనలలో వైరిపదములు లేవనుట స్పష్టము. అందుచే ప్రథమ ముద్రణ పీఠికనుండి పూర్వోక్తమైన భాగమున చూపిన సోమనాథుని ప్రయోగములు వైరిపదదోషదూషితములు కావనుటయు స్పష్టమే. అందుచూపిన వైరిపదములన్నియు, ప్రాచీనలాక్షణికాభిప్రాయము ననుసరించి సమర్థనీయములే యగుచున్నవి.

౧. పుడమీశుఁడు మొదలగునవి తద్భవము సంస్కృతముతో సమసించినవి. ౨. ఇతర వేల్పులు—మొదలగునవి కఱకంఠాది సమాసములవలె, అచ్చతెనుఁగు సంస్కృతము సమసించినవి. కవి ప్రయోగ రూఢములైనవి. సంహితాకర్తలు, ప్రాచీనలాక్షణికాభిప్రాయములను పరకుగొని, సమన్వయింపక, అర్వాచీనలాక్షణిక దృష్టితో పై సమాసములను సమన్వయించుటకుఁ బ్రయత్నించుటచే నది విమర్శనకుఁ బాల్పడినది. వాని నొక్కొక్కదానిని పరిశీలింతము.

## తవనిధి

తద్భవపదముతో సమసించిన సమాసములు. సం. తపోనిధి. తె. తవనిధి.

ద్వి భువిజనులెల్లనుఁ బొగడుచునుండ
తవనిధి దేవరదాసయ్య కీడె. బస పుట ౧౩౭.

దీనిపై వ్యా. సం. స. (178 పుట)యందిట్లు వ్యాఖ్యయున్నది. "ఇచట 'తవనిధి' అను వర్గచతుర్థమును నిలిపి వైరిపదదోషము నారోపించుట సరికాదు." అని పై పాదమును తవనిధి అనుచోట 'తవనిది' అని సవరించి యుదాహరించిరి. కాని తవనిది యను సవరణ యనావశ్యము. తపశ్శబ్దభవము తవ. ఇది తద్భవము. నిధి శబ్దము సంస్కృతము (తత్సమము) కావున నిది సరియైనదియే-ఇందు పూర్వపదము తద్భవము. ఉత్తరపదము తత్సమము అనుచో, 'అంచయాన' అను సమానము రుక్మాంగద చరిత్రలో ప్రౌఢకవి మల్లన ప్రయోగించినది యున్నది. ఇందు పూర్వపదము హంస శబ్దభవము. తవ శబ్దమునకు కన్నడమున క్షీణింపని అని అర్థముకూడ నున్నది. కనుక అక్షీణ నిధి అని యనవచ్చునని కొందరు వాదించవచ్చును. కాని తవనిధి అనుదానిని తపోనిధి శబ్దభవముగానే కన్నడ వైయాకరణులు గ్రహించిరి. కిట్టెల్ కూడనట్లే పేర్కొనెను.

## తవరాజు

ఇట్లే తపోరాజ శబ్ద భవము తవరాజు
ద్వి. వావిరితవరాజువల్లభుచేత బస 3 ఆ.

తెనుగున తపశ్శబ్దము అదంతముగా మహాకవులచే ప్రయుక్తమైనది!

'తనుజ ఘోర తపోగ్రతలఁ గలఁగడి మాడ్కి' నృసింహ పురాణము ౨.౨౧. 'తప+ఉగ్రత'= తపోగ్రత అని యెఱ్ఱన ప్రయోగించి యున్నాఁడు. ఇట్లే యరణ్యపర్వ శేషమున ౬.౯౬.౨లో సాంతపదమైన యశశ్శబ్దమును, యశశాలి—సమగ్రయశశాలి యని అదంతముగా నుపయోగించియున్నాఁడు. తత్సమపరిచ్ఛేద వివరణమున వ్యా. సం. స. ములో పై ప్రయోగములేవియు నుదాహరింపఁబడి యుండలేదు.

## పుడమీశుఁడు

ద్వి. పుడమీశ మాఘనంబునకుఁ జే సాప
నొడయుల కిచ్చితి నొడయుల ఘనము. బసవ. 3. ఆ. ౨౪. పం.

(పుడమీశుఁడు అనునది తద్భవము సంస్కృతము కలిసిన సమాసము. పుడమి-'పృథివి' శబ్ద తద్భవము-ఈశుఁడు సంస్కృత పదము-ప్రాచీన సంప్రదాయము ననుసరించి యిది సరియైనది.)

'పుడమి' 'పృథివి' శబ్దతద్భవమని కావ్యాలంకార చూడామణి (నవమోల్లాసము ౧౫. ప.) లో తద్భవలక్షణములను వివరించు సందర్భమున నిట్లు చెప్పఁబడినది.

సీ. రోధులు రోదులు, రోగులు రోగులు
భేదంబు బిందంబు పృథివి పుడమి.

కవి సంశయ విచ్ఛేదమున తృతీయమగు తద్భవతరంగమున త, థ, ధ, ట లకు డత్వాదేశము వచ్చునని—పృథివికి పుడమి తద్భవముగాఁ జెప్పఁబడియున్నది. (8-8) మఱియు పుడమి శబ్దములోని 'పు' అనునది—సంస్కృతమున 'పృ' అనునది తెలుఁగు సంప్రదాయము ననుసరించి, 'ప్రు' అను ఉకారోచ్చారణతో వెలయుచుండెడిదని, పదాదియందు సంయుక్తాక్షరము, తెలుఁగువారు పలుకలేరు గాన, పృథివి—పుడమియైనదని చెప్పుట కిది తోడ్పడుచున్నది.

ఇట్లు తెలుఁగున లాక్షణికులు స్పష్టముగా 'పుడమి' 'పృథివి' శబ్దభవమని, అది తద్భవము అని చెప్పుచుండగా, "ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము" (మొదటి సంపుటము) 158 పుటలో 'పుడమి' శబ్దమును, సంస్కృతశబ్దముగా తత్కర్త లిట్లు సాధించిరి. వారు వ్రాసిన భాగము నిం దుదాహరించుచున్నాను. "పుడమీశుఁడు వై. వి. గ్రా. రాజు (శ. ర.) ఇట పుడమీసుఁడు అను తద్భవ రూపము నంగీకరించుట యుచితము కాన "ద్విపద" 'పుడమీశ! మీ ధనంబునకు చేసాప నొడలి కిచ్చితి...8 (బసవ. 8 ఆ. 24 ప) అనుచో సంబోధనమున సంస్కృతేతరములకు 'డు' లోపము రాదు గాన "పుడమి" శబ్దముసంస్కృతమే యని గ్రహింపకతీరదు." పుడ. ఉత్సర్గే అను ధాతువుమీఁద "పచాద్యచ్" అను చొప్పున 'అచ్' ప్రత్యయము రాఁగా, 'పుడ' శబ్ద మేర్పడును. పిదప "పుడం మనోతీతి=పుడమిః. అను ప్రక్రియ చొప్పున "పుడమి" అను సంస్కృత శబ్దము సిద్ధించును. "మిక్షేపే" అను స్వాదిధాతువుపైని "క్విప్"—ప్రత్యయము నిల్పి పై రూపమును సాధించునది. సస్యాదులను విరజల్లునని వ్యుత్పత్త్యర్థము సెన్నునది."

కాని క్రీ. శ. 1987 లో నాంధ్ర విశ్వకళాపరిషత్పక్షమున సంహితాకర్తలు వెలయించిన, వైయాకరణ పారిజాతము (నన్నయాథర్వణీయము) 90,91 పుటలలో పృథివి శబ్దమునకు 'పుడమి' తద్భవరూపమని స్పష్టముగా నిట్లు వ్రాసియున్నారు.

"పుట 90. V ఋ వర్ణము అ, ఇ, ఉ, ఎ, రి-రు అనువానిలో నొకదాని రూపము నొందును. ఋ స్వరూపము తద్భవత్వమున నిలువదని యెన్నునది.

ఉదా: అ. మృత్తిక—మట్టియ
ఇ. శృంగారము—సింగారము
ఉ. పృథివి—పుడమి
ఎ. హృది—ఎద
రి. ఋక్షము—రిక్క
రు. ఋషి—రుసి.

పుట. 91. ప్రాకృతమునందును నిట్టి వికృతిగలదు. 'ఋతుగా' (47 పుట. షడ్భాషాచంద్రిక) ఋతు ప్రభృతి శబ్దములలోని ఋ వర్ణము ఉ వర్ణముగా మారును పృథివీ=పుహవీ ఇదు."

ఇట్లు కంఠోక్తిగా 'పుడమి' తద్భవమని, వికృతియని వైయాకరణ పారిజాతమున నా రంగీకరించి, వ్రాసియు, క్రీ. శ. 1951 వ సంవత్సరమున నాంధ్రవ్యాకరణసంహితాసర్వస్వమున, 'పుడమి' శబ్దము సంస్కృతముగా సాధింపఁబడుచుట, వింతయే కాక, వారి సిద్ధాంతములలో పరస్పరవైరుధ్య మున్నదని విశదీకరించుచున్నది.

నన్నెచోడకవిరాజు, పాల్కురికి సోమనాథుఁడే కాక పుడమీశ పుడమిపతి శబ్దములు లితరకవు లుపయోగించినట్లు, మడికి సింగన సకలనీతిసమ్మతమునుండి యీ క్రింది ప్రయోగములవలన దెలియవచ్చుచున్నది.

1. క. పుడమిపతు లర్థులర్థం
బడిగిన నది నృపులు కయ్య మడిగినఁ గడుఁ.
క. పుడమిపతిచేత జీతము...(పురుషార్థసారము 161 వ.)

పురుషార్థసారము శివదేవయ్య కృతము—క్రీ. శ. 1250 ప్రాంతము.

2. క. కడునభ్యంతర వర్తిం
బుడమీశుకుఁ గాఁగఁ బ్రాణములు విడిచిన
(పంచతంత్రము) 482 ప.

పంచతంత్రము. క్రీ. శ. 1260 నాటి ప్రాచీన కృతి.

మఱికొన్ని యితరప్రయోగములు :

క. పుడమిసుతఁ బాసి లక్ష్మణ—యొడదవ్వల...
భాస్కరరామాయణము. అర ౨.౨౭౬. ప.
3. పుడమినాయక మా వారి నడిగి వత్తు.
ఎఱ్ఱన—సకలనీతి కథానిధానము. 1-136
4. పుడమీశ సత్యవాక్యము నడపుము—2 ఆశ్వాసము
ఎలకూచి రామభద్రకవి సకలకథా సారసంగ్రహము
దీనిని శబ్దరత్నాకరకారు లుదాహరించిరి (పుట 499)
5. పుడమీశ! కానము పోఁబోలు రాత్రి
విడిదింట...చొక్కనాథ చరిత్ర 7. ఆ. 211. పుట.

## నిత్యనేమము

ద్వి. నిత్యనేమం బది నేఁటి ప్రొద్దునకు
ముత్యాలపాడి మాకు ముక్కుప వలయు. బస ౨.

ఆ. వ్యా. సం. స. వ్యాఖ్య (పుట (461).

"కన్నియ=కన్నె = కన్య - కన్యకాశబ్దభవము లైనట్లే - "నిత్తియము "నిత్యము-నిత్య" అనునవి నిత్యాశబ్దభవములగుట వింతకాదు. "సీ. ధృతిఁ గుంతి మద్రభూపతుల నెయ్యపుఁ గన్యకలన" అని రాఘవపాండవీయమున కన్యయను వైకృతపదము ప్రయోగింపఁ బడెను. ఇట్టి తద్భవ స్త్రీసమశబ్దముగ 'నిత్య' అనుదాని నంగీకరించి బసవపురాణములోని నిత్యపడి నిత్యనేమము మున్నగువానిని సమర్థించుకొనుట యుక్తము. కాని బసవపురాణ టీకాకర్త వ్రాసినట్లు సోమనారాధ్యుఁడు వైరిపదమునుఁ బ్రయోగించెననుట సరికాదు. ఇట్టియెడల "నిత్య" అనునది చరిత్రాదులలోని దగుటచేఁ దత్సమమును సూ. రా. నిఘంటు మార్గమును సరికాదు. దాని తత్సమత్వమునకుఁ బ్రమాణాంతరము గన్పట్టలేదు."

ఆంధ్రలాక్షణికులందఱు నైక్యకంఠముతో తద్భవమని చెప్పిన పుడమి శబ్దమును సంస్కృతముగ సాధించుటకుఁ బ్రయత్నించిన సంహితాకర్తలు—ఆంధ్ర మహాకవులందఱు తత్సమముగ నంగీకరించిన 'నిత్య' శబ్దమును తద్భవముగ నిరూపించుటకుఁ బ్రయ

---

8. ఇచట ముద్రితప్రతి పాఠము "పుడమీశ మీ ధనం బునకుఁ జేసాప నొడయుల కిచ్చితి" అనునది కాని 'నొడలికిచ్చితి' కాదు.

ద్వి. శ్రీ మహాదేవుఁడ న్నామంబు లున్న
వే మహి నిటువంటి యితర వేల్పులకు   బస. ౭-౨౫౩

దీనిపై ఆ. వ్యా. సం. శ. వ్యాఖ్య పుట ౧౧౮౦. "ఇతర వేల్పునకు అనుచో ఇతరు వేల్పునకు" అనినయెడల వైరిపదదోషము తొలఁగును. ఇతర మతములవాని వేల్పునకని యర్థము. "కాన కర్తల కర్తమానీలగళుఁడు" (బసవ. ౭ ఆ. ౪౪౪ ప.) అని యిట్లు "తన వేల్పు—యితరుని వేల్పు" అని వాడుట కవి కభిమతము."

బసవపురాణ ముద్రిత ప్రతియందు "యితరవేల్పులకు" అని బహువచనము కన్పట్టుచుండఁగా సంహితాకర్తలు యితరవేల్పునకు అని ఏకవచనముగ నుదాహరించుట సరికాదు—మరియు నిచట, ప్రకరణార్థము ననుసరించిన శివునితో నితరదేవతలు సరికారు అని కవి నిరూపించుచున్నాఁడే గాని, "యితరమతముల" ప్రసక్తియే లేదు.

ద్వి. అప్రతిమాకారుఁ డగు లింగమూర్తి
కప్రతిమాకారులే సమానంబు.
చావుబుట్టువులేని దేవదేవునకు
చావుబుట్టువుగల దేవతల్ సరియె
ప్రళయంబుఁ బొందించు ప్రళయరుద్రునకు
ప్రళయంబుఁ బొందెడు పలువేల్పు లెనయె
అదిర్భవింపని యభవున కరయ
దేవకీపుత్రాది దేవతల్ సరియె.
సొడ్డలదేవుతో సోమేసుతోడ
సడ్డల దైవముల్ సర్పింప సరియె
హరుఁడు సర్వేశ్వరుం డభవుండు శివుఁడు
పరముఁడు పసుపతి పరమేశ్వరుండు
శ్రీమహాదేవుఁ డన్నామంబులున్న
వే మహి నిటువంటి వితరవేల్పులకు.

పై యుదాహృత భాగము ననుసరించిన, దేవతల్ దైవముల్ వేల్పులు అని బహువచనమే యుండుటచే, సంహితాకర్త లూహించివ్రాసిన వేల్పునకు అనుపాఠ మచ్చట నుండుట కవకాశమే లేదు. ఇచ్చట శివుఁడు—శివేతరులైన దేవతలు (వేల్పులు) తక్కువేలుభావన లేకపోవుటయే "ఇతర మతములు" అనుట కేవలము ప్రామాదికము.

ఇంతకును "ఇతర వేల్పులు" అనునది వైరిసమాసముగా వారు భావించుటచే వింతయైనది; వింతపాఠ మేర్పడినది.

"ఇతరవేల్పులు"అనునది కేతన మతము ననుసరించి కఱకంఠాది సమాసములవలె గ్రామ్యము వేల్పు శబ్దము సంస్కృతముతో సమసించిన యీ క్రింది ప్రయోగము. పై యభిప్రాయమునకుఁ దోడుచున్నది.

సీ. గీ.      కల్పిశాఖిలలోకైక వేల్పు
వేల్పు పెద్ద......      ౧.౬

అని ఉత్తర నారసింహపురాణమున హరిభట్టు ప్రయోగించి యున్నాఁడు. ఈతడు—శ్రీ కృష్ణదేవరాయలకాలమునాటివాఁడు. ఈ గ్రంథ మాంధ్ర సాహిత్య పరిషత్తువారిచేఁ బ్రకటితమైనది.

**కంభకట్లు :**

ద్వి. కంభకట్లను మేలు కట్లను బోలుచు
గంభీర పుష్పకాగారంబునందు.   బస. ౩.౧౨౪ పం.

దీనిపై ఆ. వ్యా. సం. శ. వ్యాఖ్య. పుట 159. "సోమనాథుఁడు స్థలాంతరమునఁ బ్రయోగించిన "కంభకట్లను మేలుకట్లను బోలుచు" అను పద్యమునందలి 'కంభకట్ల'ను పాఠము ప్రామాదికము. 'కంభకోట్లను మేలుకట్లను బోలుచు గంభీర పుష్పకాగారమునందు' అనుచో కంభకోట్లను పాఠము కవి ప్రయుక్తము కానోపు. అచట కట్టుశబ్దము సుసంగతము కాదు. కోటిశబ్దము సమర్థమయి యున్నది."

"కంభకట్లు "అను పదముయొక్క అర్థమును సంహితాకర్తలు గ్రహించి యుండిన పై రీతిని పాఠము మార్చియుండరు. ఈ పదమును నన్నెచోడ కవి కుమారసంభవమున వాడియున్నాడు.

సీ. కనకాచలము సెలకట్టయ్యె నవరత్న
వర్గంబు లవి రంగవల్లు లయ్యెఁ
గల్పకుజంబులుఁ గంభంబులుగ మీఁదఁ
గల్పలతాతతిఁ గలయఁబర్వి
సుందరంబగు పచ్చపందిరియును తోర
ణంబులు నయ్యె దివ్యాంబరములు
10 కంభకట్టులు మేలు కట్టులు నయ్యెఁ దా
రకములు మణి విలంబకము లయ్యె
ఆ. వె. నమృత రసరసాయనాబ్ధులు పూర్ణకుం
భంబు లయ్యె నిందు భానుమంట
లాలి దర్పణమ్ములయ్యె సర్వేశు ను
ద్వాహమంటపమునఁ దమకుఁ దార.      (౯. ౩)

పై పద్యమున పరమేశ్వరుని వివాహసమయమున వివాహమండపము వర్ణితమయినది. సృష్టిలోగల పదార్థము లామంటపము నలంకరించుటకుఁ బూనుకొన్నవి. ఆ సమయమున కనకాచలము—

1. బంగారు పర్వతము - సెలకట్టు - శిలారత్నములచే నిబద్ధమైన వేదిక - (భూమి).
2. నవరత్నవర్గములు - రంగవల్లులు - ముగ్గులు -
3. కల్పవృక్షములు - స్తంభములు -
4. కల్ప లతలు - స్తంభములమీఁది—లతలు పచ్చపందిరి - పచ్చతోరణములు -
5. దివ్యాంబరములు - కంభకట్లు స్తంభమునకు - చుట్టును చుట్టియలంకరించిన వస్త్రములు - మేలుకట్లు వేదికపై నున్న వితానము.
6. తారకములు- చుక్కలు- మణి విలంబకములు వ్రేలాడు హారములు - (పూసలు గ్రుచ్చినవి)
7. అమృతరస రసాయనాబ్ధులు - సుధాసముద్రము నిండనైనవి- పూర్ణకుంభములు

---

10. కంభ కట్టులు మేలుకట్టులు - అను కుమారసంభవ ముద్రిత పాఠము సరికాదు. 'కంభ కట్లు' వైరి సమాసమని 'కంబ కట్లు'గా ముద్రించిరి. మఱియు ముద్రితమున సెస్సుగీతి 'గీ' అని యున్నది. ఇది ఆటవెలఁది.

8. ఇంటి ఖానా మండప సూర్యచంద్ర - దర్పణములు లములుమండల ములులద్దములు-

పాల్కురికి సోమనాథుడు నన్నెచోడ మహాకవి పలుకు బడిని, యథాతథముగా పెక్కుపట్టుల గ్రహించియున్నాడు. 11 ఇప్పటుకు - పై ఎత్తుగీతి పద్యములోని, "కంభకట్టులు-మేలుకట్లును వర్యొ" అనుదాని వట్లనే. కంభకట్లును, మేలుకట్లును బోలుచు అని గ్రహించి యున్నాడు. కల్యాణ మహోత్సవ సమయముల స్తంభములకు వస్త్రములుచుట్టి యలంకరింతురు - అట్టి యలంకరణము నకు 'కంభకట్టు'12 అని పేరు. పందిళ్లు వేయుట, తోరణములు కట్టుట, వేదికను, ముగ్గులచే నలంకరించుట - జాలకములు - పూర్ణ కుంభములు నిల్పుట, నిల్వుటద్దము లెత్తుట మున్నగు వివాహాలంకర ణోపకరణముల సందర్భమున చెప్పఁబడిన కంభకట్లు స్తంభాలంక రణముగాక వే రేమగును ?

ఇట్టి పట్టున, సంహితాకర్తలు చెప్పిన "కంభకోట్లు" అను పదము సంగతమగునా ! కంభకోట్లు - అనగా స్తంభముల సమూహ మని కదా యర్థము. ఆ యర్థ మీ సందర్భమున నెట్లు పొసగునో, మఱియు నది "కవిప్రయుక్త పాఠమెట్లగునో" దురూహ్యము.

## కలకంఠుఁడు :

మెఱటదవంకయ్య మున్నొక్కనాఁడు
కలకంఠభక్తుఁ డొక్కరుఁ డర్ధరాత్రి
నరుదేర............(బసవ ౨ ఆ ౪౪౯ ప)

దీనిపై వ్యాఖ్య పుట ౧౯౫ "ద్వి. కలకంఠ భక్తుఁడొక్కరుఁ డర్ధరాత్రినరుదేర.........(బసవ ౨. ౪౩౭) అను పాఠము ముద్రణసంస్కర్తృప్రమాదకృతము. "మెఱటద వంకయ్య...... కలకంటుభక్తుఁడు......అని కవిప్రయుక్తము కానోపు."

"కలకంఠ భక్తుఁడు" అనుదానిలో కలకంఠ శబ్ద మెంత మాత్రమును ముద్రణ సంస్కర్తృప్రమాదకృతము కాదు. కలకంటు అనుపాఠ మేతాళపత్రప్రతియందును లేదు. బసవపురాణమున సంస్కర్తలు చూపిన యొక్కచోటనేకాక పలుస్థలములలో కల కంఠ శబ్దము ప్రయుక్తమైనది.

కలకంఠుగుడి బస ౨ ఆ. ౪౧౬
కలకంఠ ! యడబాల " ౪౯౩
కలకంఠ ! యిదియేమి " ౫౧౯
కలకంఠ ! మా పల్లె ౩-౬౫౬
కలకంఠు కంటిపై ౭౬౪

బసవపురాణమునందే కాక పండితారాధ్యచరిత్రమునను కలకంఠశబ్దము ప్రయుక్తమైనది.

కలకంఠ గద్దెనగరు, పండి. దీక్షా. ౧౧౪
కలకంఠు భక్తుఁడు ౧౫౦

శివకవుల రచనలలో కలకంఠుఁడు పలుతావులలు ప్రత్యక్ష మగుచుండును.

కలకంఠుని భక్తులకని - శివతత్త్వసారము. ౧౯౩ వ.
కలకంఠు భక్తి వలిగా ౧౯౩
అకలుకంఠుఁ దొడ్డొకని. కుమార ౬.౨౭

అతిముడి సంపెసు కలకంఠగణమని ౧౨.౧౦౩

శివకవులేకాక, నన్నయనుండి చిన్నయవఱకు నీ కలకంఠ శబ్దమును లాక్షణికు లెఱుఁగుదురు. నన్నయ తిక్కన నాచన సోమనాథాదు లీపదమూను బ్రయోగించిరి. చిన్నయసూరి యనిందగ్రామ్య ముగా నీ పదమును బాలవ్యాకరణమున సంజ్ఞా. ౨౩ వ సూత్రమున నిచ్చియున్నాఁడు. 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రామ్యంబు' పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యంబయిన గ్రహింపఁదగునని తాత్పర్యము. కలకంఠుఁడు, ప్రాణగొడ్డము అని యీ పదమున కల కంఠుఁడు గానే యిచ్చియున్నాడు.

కేతన యాంధ్రభాషాభూషణములో 'తెనుఁగు పదంబులపై నింపానరఁగ సంస్కృతము చెల్లు నొక్కకచో' అని 'కలకంఠ నామమున్ బోలి తగున్' అని స్పష్టముగా పేర్కొన్నప్పుడు, కల యను తెనుఁగు పదముపై కంఠ అనునది సంస్కృతపదమే అయి యుండవలెను గాని, 'కంట' అను పద ముండుట కవకాశ మున్నదా? గణపవరపు వెంకటకవియు కలకంఠ పాఠము నిచ్చి యున్నాఁడు. శివకవుల గ్రంథములయందేమి, నన్నయాది కవుల ప్రయోగమందేమి, కలకంఠ అనుపాఠముతప్ప 'కలకంట' పాఠము తాళపత్రప్రతుల యందైన కన్పట్టలేదు.

ఇట్లు కలకంఠశబ్దము కానవచ్చిన యన్నిచోట్లను, కలకంఠ అనియేగాని, కలకంట అని యొంతమాత్రము కన్పట్టులేదు. తాళపత్ర మాతృకలయందును కలకంఠ అని 'ఠ' కారయుక్త పాఠమే యుండఁగా, తాళపత్ర మాతృకలు తప్పుల కుప్పలనియు, 'ఠ' కార పాఠము ముద్రణసంస్కర్తలోపకృతమనియు, సంహితాకర్తలు (పుటలు ౧౭౧...౧౭౭) వ్రాయుట సాహసమేకాక, ప్రాచీ నాంధ్రలాక్షణిక సంప్రదాయ లక్ష్య లక్షణ విరుద్ధమును నైయున్నది.

## కట్టుగ్రము :

ద్వి. కట్టుగ్రమునఁగూడ ముట్టుకొనుచు బస. ౩ ఆ
బిట్టుల్కిపడి మది కట్టుగ్రుఁ డగుచు బస. ౪.

దీనిపై వ్యాఖ్య. పుట ౨౫౯.

"సంస్కృత శబ్దపరకత్వమున 'కటు' శబ్ద 'ఠ' కారమునకు ద్విరుక్త ట కారము వచ్చుట బసవపురాణమున గన్పట్టుచున్నది. కట్టు గ్రముగఁగూడ ముట్టుకు మున్ను (బసవ. ౩ ఆ ౪౬౪), బిట్టుల్కిపడి మది కట్టుగ్రుఁ డగుచు (బసవ. ౪ ఆ. ౧౩౫) సోమనారాధ్యుఁడు వింతవింత తద్భవములను బ్రయోగించువాఁడు గావఁ (౬౦. iii) బయిస్థలములందు, "కట్టుగ్రముగ, కట్టుగ్రుడగుచు" అని ప్రయోగించె నేమో ?"

అర్వాచీనలాక్షణిక సంప్రదాయము ననుసరించి, ప్రాచీన భాషను సంస్కరించుటకుఁ బ్రయత్నించుట హాస్యాస్పదము. కట్టు

---

11. చూడుఁడు. నా తెలుఁగు కవుల చరిత్ర - తృతీయ ఖండము - శివకవి యుగము - నన్నెచోడ కవి.

12. ఈనాఁడును వివాహకాలమున, స్తంభములకు వరటి జోడు లనుచేర్చి వానికొక యలంకారము గావింతురు.

గము-సంస్కృతాంధ్రపద మిశ్రసమాసము. వ్యాకరణమున కసు శబ్దముపై తెనుఁగుపదములే చెప్పబడినవి. ఇచ్చట సంస్కృతపద మున్నది. అందుచే, పండ్రెండవశతాబ్దినాటి పాల్కురికి సోమనాథుని రచన, బాలవ్యాకరణము ననుసరించి, "ప్రయోగించెనేమో" అని శంకించిరి. ఇట్టి సందేహమున కవకాశమేలేదు. 'కట్టుగ్ర' శబ్దమును సోమనాథుఁడు బసవపురాణములో నీ క్రిందిరీతిని సమాసములో మార్పుటకు వీలులేకుండ బిగించియున్నాఁడు.

కట్టుగ్రలీల శంకరదాసమయ్య.

యిట్టు వర్తింపగ......................బసవ 3౯౮ పుట.

పై సమాసమున- కట్టుగ్గలీల యని యగునా ? ఇట్లే పండితారాధ్య చరిత్రలోను

కట్టుగ్రలీల జన్పొట్టు గొగ్గవ్వ. దీక్షా ౨3౨

అని కలదు. ఇచ్చటను పైవిధముగ మార్చవచ్చునా, చిన్నయసూరి సూత్రమును సోమనాథుని ప్రయోగము ననుసరించి సంస్కరింప వలయును.

## ధర్మకవిలె :

ద్వి. మీదత్తి మీ ప్రాఁత మీ ధర్మకవిలె
మీదాసి నను గావరే దయతోడ—"

బస. ౮. ౧౦౨౧ పం.

ద్వి. అవుదలల్ వంచుచు నయ్య మీధర్మ
కవిపల మంచును గశుదైన్యపశుచు. బస. ౩. ౩౯౬ పం.

దీనిపై ఆం. వ్యా. సం. స. వ్యాఖ్య (పుట 161.) "బసవ పురాణ పీఠికాకర్తగా రిచట రెండుపద్యములందును "ధర్మకవిలె" అని నిల్పిరి. సూ. రా. నిఘంటుకారులట్టి పాఠమునే స్వీకరించిరి.. ఈ పాఠములు ప్రామాదికములు (౬3. 111 లి.) (2) (పుట 198) సోమనారాధ్యుఁడు ధర్మకపిల-దీని తద్భవము-దమ్మకవిల అని ప్రయోగించి యుండఁగా ముద్రణ సంస్కర్తగారు "ధర్మకవిలె"అను దానిని నిల్పి వైరిపదమును ప్రయోగించెనని తలంచిరి.వీరి తలంపు చొప్పునని సూ. రా. నిఘంటుకారులును నుదాహరించిరి. ధర్మకవిలె. మి. వి. (ధర్మము+కవిలె) ధర్మముల పుస్తకముల లోని దానముల ననుభవించువాఁడు. ద్వి. మీదత్తి మీ ప్రాఁత మీ ధర్మకవిలె మీ దాసు నను గావరే దయతోడ (బసపు ౮ ఆ. ౧౦౨౨ పద్య) ద్వి. అవుదలల్ వంచుచు నయ్య మీ ధమ్మకవిలెల మనుచును గశుదైన్యపడుచు (బసపు ౩ ఆ. ౩౯౩ పద్య) (సూ.రా.ని) కవిలె (లియ) వి. ౨. లెక్కపుస్తకము...(సూ.రా.ని.) ఈ యర్థముపై బసవపురాణ పద్యముల కెట్లు పొసంగునని వీరు తలంచిరో తెలియకున్నది. సోమనారాధ్యుఁ డచట "ధర్మకపిల-దీని తద్భవము దమ్మకవిల" అను శబ్దములఁ బ్రయోగించెను. ధర్మార్థముగ విడువఁబడిన కపిలధేనువు అనియర్థము—ఎవ్వరికిని హింసింపరానిదని భావము. ఇట్లు మిక్కిలి ప్రౌఢముగను సుసంగతముగను నట సోమనారాధ్యుఁడు ప్రయోగించెను. ౩. (పుట 1180) ధర్మకవిలె అనునది ముద్రణసంస్కారలోపకృతము. ధర్మకపిల" అని కవిప్రయుక్తమనందగును. మీదత్తి మీప్రాఁత మీ ధర్మకపిల బసవ. ౮ ఆ. ౧౦౨౩ ప.) ధర్మార్థము విడిచిన (వృషోత్సర్జనము) కపిలధేనువు. దీని తద్భవ రూపము దమ్మకపిల. అవుదలల్వంచుచు నయ్య విూదమ్మ కవిలమంచు చుఁ గడు దైన్యపశుచు (బస. ౩ ఆ. ౩౯౩). ధర్మకపిల నెవ్వరును హింసింపరు. "దమ్మకవిలె"అని చెప్పి ధర్మముల చిట్టా పుస్తకము అనుటయు సుసంగతముగానుండదు. (విస్తర IV ౬3 111 విమ.)"

పైరీతిగా నొకసారి చెప్పఁదగిన విషయమును మూఁడుచోట్ల మూఁడుమూఱు లుద్ఘాటించుటచే, సంహితాకర్తలకు నిది నిశ్చితాభిప్రాయమని యూహింపవచ్చును. ధర్మకవిలె శబ్దమును 'దమ్మకవిల'గా మార్పుచేయుటయేగాక, 'ధర్మకవిలె' శబ్దమును స్వీకరించిన సూర్యరాయాంధ్రనిఘంటుకారులనుకూడ విమర్శించిరి. ఈ పట్టున సంహితాకర్తల వ్యాఖ్యానవైఖరి యెట్టిదో తెలుపుచున్నాము.

'ధర్మకవిలె' అని ముద్రితపాఠ మున్నప్పుడు, పరిష్కర్తలు దాని నట్లే నిలిపినప్పుడు, తాళపత్రమాతృకలయం దా పాఠ మెట్లున్నదో సంహితాకర్తలు తెలుపలేదు. తాళపత్రమాతృకలలో దమ్మకపిల అనునట్టి పాఠమే లేదు. క్రీ. శ. పదునాఱవ శతాబ్దినాటి పద్య బసవపురాణమున (ఇది పాల్కురికి సోమనాథుని ద్విపద బసవ పురాణమునకు పద్యానువాదము) నీ సందర్భమున "వ. పెండియు మీదూఁత మీబంట మీ డింగరీఁడ మీ బిడ్డ మీపన్న మీ లెంకవాఁడ మీదత్తి మీ ధర్మకవిలె" అని 'ఎ' కారయుక్తపాఠమే యున్నది.

ధర్మకవిలె అను 'ఎ' త్వఘటిత పాఠమును తిరస్కరించిన సంహితాకర్తలు వా రుదాహరించిన బసవపురాణ పంక్తులలో — "దాసి"-అను ఇకారఘటితపాఠమునకు 'దాసు' అను ఉత్వఘటిత పాఠ మేల స్వీకరించిరో తెలియుటలేదు, ముద్రిత ప్రతిలో 'మీ దాసి' అని యుండఁగా నది సరికాదని కాఁబోలు 'దాసు' రూపముతో నా పదమును గ్రహించిరి. శివకవులు పురుషులకుఁగూడ స్త్రీలింగరూపము నుపయోగించియున్నారు. బసవన్న "జంగము కోటికి పడిసన్నదాసి" (బసవపురాణము)

ఇక 'దాసి' యను ఇత్వఘటిత రూపమునకు నిర్ధారకముగా పండితారాధ్యచరిత్రమున నీ క్రింది ప్రయోగమును చూడుఁడు.)

ద్వి. చెన్నారఁ గాలి దాసియు శివుచేతఁ
గొన్న యా ముద్యోడు గన్నులలోన—

మహిమప్రకరణము ౨౩3 పు.

నన్నెచోడకవియు, "పరమున కేను 'దాసి' నని పల్కఁగ" (౩.౧3౩)అని దాసిశబ్దమును దాసుఁ డనునర్థమున వాడియున్నాఁడు.

ధర్మకవిలెశబ్దమునకు ధర్మముల పుస్తకములలోనిదానముల ననుభవించువాఁడు అనునదియే సరియైన యర్థము సాధారణముగ దాన ధర్మాదులు చేయునపు డా దానధర్మముల నిచ్చినవారి పేళ్ళను వేఱుగా కవిలెలమీఁద వ్రాసియుంచెదరు, ఫలానావారి కింతధర్మము. అని యందుండునుఇట్టి పద్దులను వ్రాయు తాటియాకులకు కవిలెలు అనిపేరు.

కవిలె రూపాంతరము—కవిలియ—౧. ఘట్టించిన నీలి పటపువర్గు లెక్కపుస్తకము కడితము—తాటాకు లెక్కపుస్తకము. శ. ర. ధనాగమ వ్యయాదులను నానాఁడు వ్రాసి చేర్చిన పత్రముల కట్ట (చి. ని.) చి. ని. యనఁగా చిన్నయసూరి యముద్రిత నిఘం

టువు. (ఆని. సూ. ని. 8 వ సంపుటము 210 పుటలో కవిలె శబ్దము కొద్ద నున్నది.)

గీ. "కవిలెను లిఖింప నేర్చిన కరణికంబు ఘటికా. ౧.౨౨.

సీ. కవిలెలోనున్న ప్రకారంబు ప్రజ పాపపుణ్యముల్ చిత్ర గుప్తుండుఁ దెలుపు ఉ. రా. ౩.౩౧౬

చ. కవిలియ విప్పిచూచి యనఘా యితఁడు భోజరా. ౩.౫౫

అని కవిలె, కవిలియ శబ్దములకు ప్రయోగములు గలవు. పై కవిలియ అను రూపమే—ధర్మకవిలెయందు 'ఏ'త్వరూపమే కాని, అత్వ రూపము లేదని తెల్పుచున్నది.

బసవపురాణమున నీ ధర్మకవిలె శబ్దము 'కవిలె' సంబంధమును బట్టియే ప్రయుక్తమైనది మీద త్తి - మీబంటమీధర్మకవిలె-అనఁగా మీ ధర్మమునకు పాత్రుఁడను-అనగా మీరు వ్రాయించెడుధర్మముల కవిలెలలో చేరుట కర్హుఁడను. అని అర్థముభక్తులీవిధముగ కవిలె కెక్కుట యనునది శైవవాఙ్మయమున గానవచ్చును.

క. దూకే మీ భక్తులకని
చేకొక శివాజ్ఞ మీఁతి చెనవఁచిన నీ
లోకమున మాన్యులగుదురు
గా కెక్కుదురయ్య శివుని కవిలియ వతగుల్.

అని మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారమున గలదు. (౨౧౫ప.) కవిలియ ప్రస్తావము పండితారాధ్య చరిత్రమునను గలదు.

నరసరగీత బంపెరు కవిలియలు
వరయుఁడు శోధింపుఁ డవ్వచనములు. పండిత. దీక్షా ౨౩౫

ఇచట బసవన్న కొల్వుకూటములో యోగనిద్రాముద్రితుఁడైయుం డుటచూచి, అచ్చటివారు "బసవన్న యట్లుండుటకు కారణ మేమి? అతని భాండాగారమున కవిలెల (ధర్మకవిలెల) శోధిం పుఁడు—ఆ ధర్మకవిలె కెక్కనవానిఁగూర్చి యోగనిమగ్నుఁడై వాఁడా?" అని యనుకొన్న సందర్భమునఁ జెప్పబడినది.

మొదట నీ 'ధర్మకవిలె' శబ్దము బసవపురాణములో మాత్రమే ప్రయుక్తమైనదని సూ. ని. ననుసరించి, సంహితాకర్త సిద్ధాంతము చేయుట సమంజససుము కాదు. సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున నీపదము నుపయోగించి యున్నాఁడు చూడుఁడు సంబెన్నకథలో

ద్వి. నంబి సంబెన్న యానందీస్వరూప!
నంబి సంబెన్న యున్నతి జగద్దీప!
కతలేల మీ ధర్మకవిలెల మేము
గతియును మతియు నేర్గడయు నీవన్న
దాన మొక్కటి వేఁడఁ దనకు సత్పాత్ర
దాన మిచ్చితి మహాదాని మహాత్మ.

మహిమా ప్రకరణ. ౧౭౫ పా.

కవిలెలలో కెక్కి ధర్మము చేకొన్నవ్యక్తి చనిపోయినచో వారని పేరందుండి తీసివేయుదురు. ఇట్లు తీసివేయు సందర్భము కూడ పండితారాధ్య చరిత్రమున నున్నది. బసవని మహత్త్వమునకు వనూయజెంది బిజ్జలు డాతనిపై యల్లయ్య, మధుపయ్య, యను వారలను బంపినపుడు

అతనిలోఁ జాళుక్య లను పేరు వారని
కవిలియఁ దుడిపించి కల్యాణ కటక
మీడిత భక్తి మహిష్ఠత పేర్మిఁ
వాడుగా శపియించె బసవన మంత్రి. మహిమ. ౧౯౦ పా.

కవిలెలలో మనుజులపేర్లు వ్రాయుదు రనుటకు బసవ పురాణ మున నీ క్రింది పంక్తులు చాలును.

ద్వి. కొట్టరువునఁ బళ్లు కోటానగోట్లు
పెట్టియు మనుజులపేర్పు వ్రాయందు
కదియ పంచాక్షరి కవిలియవ్రాసి
చదువు లెక్కలు వరసది దప్పకుంక. బస. ౬.౭౫౩ పం.

శంకరదాసుమయ్య యను భక్తుఁడు, జగదేకమల్లుని యొద్ద కవిలెలు వ్రాయుకొలువుకుఁ గుదురుకొని, అందు మనుజుల పేర్లువ్రాయు టకు బదులు పంచాక్షరి వ్రాసెడివాఁడు. ఇంతయేల? కవిలెలలో పేరు వ్రాయించుటను గూర్చి మల్లికార్జున పండితుఁడే, తాను లింగైక్యముఁ జెందుటకుముం దిట్లు చెప్పియున్నాఁడు.

ద్వి. పరసమయంబుల భంగించి కీర్తి
వరియించి లోకపావనము గావించి
భవదీయసమయంబు పాలించి ఘోర
భవములు వాటించి పంచిన పనులు
భర్గ! నిన్ మెప్పించి పంచిన ప్రమథ
వర్గంబు కవిలియ వ్రాయించి మించి
నీలోన లీనమై నిలిచి నీయాజ్ఞ
బాలించి...............
యుండెంగఁ గోరెద నో పర్వతేశ.

పర్వత. ౫౮౬. పా.

కవిలెగూర్చి యింత గ్రంథముండఁగా, వ్యాకరణసంహితాకర్త లీపద మను 'కపిల' శబ్దభవమగు కవిలగా మార్చుట యెట్టి సాహసమో యోజింపుఁడు!

ధర్మకపిల—దమ్మకవిల పాఠములు మార్చిన వెనుక తమపాఠము యొక్క యర్థమును సమర్థించుటకు, "ధర్మకపిల ధర్మార్థము విడిచిన (వృషోత్సర్జనము) కపిలధేనువు. దీని తద్భవము దమ్మకవిల. ధర్మకపిల నెవ్వరు హింసింపరు—ధర్మకవిలె అని చెప్పి ధర్మముల చిట్టా పుస్తకము అనుటయు సుసంగతముగా నుండదు" అని వ్రాసినారు.

కాని 'ధర్మకవిలె' సందర్భమున నింతకంటె యసంగతముగు వ్రాత వేఱొకటి యుండబోదు సంహితాకర్తలకు సంప్రదాయిక దృష్టిలేదు. ఆ మతసాంప్రదాయముల నెఱుంగక, పదముల స్వరూపము మార్చి, వానికి యపార్థములు గల్పించుట యెంతమాత్రము సమం జసము గాదు.

శైవమత సంప్రదాయమున వృషోత్సర్జనము అనఁగా గోవును విడుచుట, గోదానము చేయుట మొదలగు నాచరణవిధానము లేనే లేదు. అసలు కర్మకాండయే లేని శైవమతమున వృషోత్సర్జన మేమి? వీరశైవమత సిద్ధాంతములకు నాధారమగు పాల్కురికి సోమనాథుని బసవపురాణమున నిట్టిది యుండుట సంభవమా? సంహితాకర్తలు మతసంప్రదాయము నెఱుఁగక నిట్టి యర్థము చెప్పిరి.

మఱియు నిచ్చట బసవపురాణమున నీ ధర్మకవిలె శబ్దము ప్రయుక్తమైన సందర్భమున ప్రకరణమునుబట్టి చూచిన సంహితాకర్తలు చెప్పిన యర్థమున కెంతమాత్రము సరిపోదు. ఆసందర్భ మిది.

"అంబన్న యను నొక భక్తుఁడు కైలాసమున కేఁగినప్పుడు శివుడు భక్తుల మహిమ అంబన్నకుఁ దెల్పి వారివలనే (భక్తుల వలననే) భక్తిపథము తెలియుఁగును – అని భూలోకమునకుఁ బంపి వేసెను. అంబన్న అనేక భక్తుల చరిత్రమును పాటలరూపమున కీర్తించి, ప్రతి భక్తునికథ ముగిసినప్పు డా భక్తునికి తాను బంటును, అని చెప్పుకొనును."

13 అరియాళున యసారి యనుఁగు భృత్యుండ

..................

జనుకర యారి చోడని బంటు బంట

పటుతరంబుగఁ గాంచు భక్తుల బంట.

అనుచు పాటలు పాడుచు, చివర నొక్కమాఱుగా నందరినిసంబోధించి—మీబంటు మీదూత మీడింగరీడ

మీద త్తి మీప్రాంత మీధర్మకవిలె

మీదాసి !.........

......నసుఁగావలె దయతోడ

అని వేడుకొనుచున్నాడు. ఇట్లు భక్తులందఱను వేడుకొనుటఅనునది పై ద్విపదలవలన దెలియుచున్నది. అంబన్న భక్తులతో "ఓ భక్తులారా! మీవలె నన్నును శివభక్తుల 'ధర్మకవిలె'లో చేర్చుకొనుడు" అని వేడుచున్నాఁడని యర్థము. ఇచట భక్తితో వేడుకొనుటయే ప్రసక్తిగాని సంహితాకర్తలూహించిన హింసాప్రసక్తి లేనేలేదని పై కథాసందర్భము తెలుపుచున్నది. సంహితాకర్తలు, పాఠకలోకమును, పండితలోకమును తమ పరిష్కరణముచే నవసరముగా హింసించినారు. ధర్మకవిలె ముద్రణ సంస్కారలోపమెంతమాత్రమును కాదనినవిణఁగొట్టి పల్కవచ్చును.

కన్నడదేశమున 'కవిలబసవ' అనునది శాస్త్రోక్తముగా ఉత్సర్జనముచేసిన వృషభమునకు వ్యవహరించుట కలదు. కవిలబసవ శబ్దాన్ని కిట్టెల్ కూడా గ్రహించి యీ అర్థమే చెప్పినాడు. కాని ధర్మకవిలె శబ్దమును పేర్కొనలేదు.

## ముల్లోకవంద్యుఁడు

ముల్లోకవంద్యుఁడు — నల్లవో బసవయ్య! ముల్లోకవంద్య
బస. ౧. ౬౧౩.

ముల్లోకనుతుఁడు — మొన్నఁ బల్కించిన ముల్లోకనుతుడు
౨. ౯౦

ముల్లోకనాథుఁడు — ముల్లోకనాథుని మ్రొక్కుపిల్పియును
౩. ౭౭

ఇట్టి సమాసములు పాల్కురికి సోమనాథుఁడే గాక ఆ కాలమున వెలసిన నవఁగా క్రీ. శ. 1224 నాటి, ఓపిలిసిద్ధి శాసనము (పద్యమయము)న శాసనరచయితయుఁ బ్రయోగించియున్నాడు—ముల్లోకవిభుండు నక్రి.

శ్రీనాథ, చిన్నకోట పెద్దన పై సమాసములను గూర్చి తెలిపిన మగు నభిప్రాయము వ్యక్తపఱుపకపోవుటచే నివి వారికి సమ్మతములే యని ఊహించుటకు మెవని చెప్పవచ్చును. క్రీ. శ. 1480 ప్రాంతము

వాఁడగు వనంతుఁడు మాత్ర మిట్టి సమాసము లుపయోగింపరాదని, యిట్లు చెప్పినాఁడు.

గీ. మొదలి తెలుఁగుపై సంస్కృతపద మొకండు
జరుగు లోకరాధిని సమాసంబు జొరదు
పూని ముజ్జగంబులు వనఁబోలుగాని
యతఁడు ముజ్జగద్వందితుఁ డనఁగఁ జొనదు. (4-24)

అయినను నీ క్రింది ప్రయోగములు కానఁబడుచు న్నయున్నవి.

| | |
|---|---|
| ముచ్చెలువు జలము | ఉత్తర నారసింహ పురాణము.౨ |
| ముజ్జగన్నాథ | చొక్కనాథ చరిత్ర |
| ముల్లోకార్చితుఁడు | కపిల గోసంవాదము (అముద్రితము) |

ఆం. వ్యా. సం. న. ద్విగుసమాసమును గూర్చి వివరించు సందర్భమున (1225-31 పుటలు) పైని చూపిన సోమనాథుని ప్రయోగములను గూర్చి చర్చలేదు. బసవపురాణ టీకాకారులు దీనిని పైరి పదముక్రింద పరిగణించినను శాస్త్రులవారి సమాసమును (పుట 1181) నిట్లు సమర్థించిరి.

"ఇంక చౌదరాబ్జము – ముల్లోకవంద్య – ముల్లోకనుతుఁడు – ముల్లోకనాథుని, సిరి మహాదేవాది సురలు మున్నగు వానిలోని చౌ, సిరి మున్నగునవి చతుర్ – శ్రీ మున్నగువాని వికృతిరూపములు. మూఁడు అనునది దేశ్యము. ఇవి సాధ్య సమానాధికరణ సమాసగతములై సిద్ధసమాస పూర్వావయవములో నన్వయించుచున్నవి. కావున వైరిపద దోషమునకు ప్రసక్తిలేదు." మఱియు పై గ్రాఁతను పురస్కరించుకొని వారు (1228 పుట) ద్విగుసమాస విధానమున ముల్లోకవంద్య అను ప్రయోగమును, ముల్లోకములు, ముత్తునియ, ముప్పూట అను ప్రయోగములతో నుదాహరించిరి.

కాని 'ముల్లోకవంద్య' అను ద్విగుసమాసము చిన్నయసూరి మతమున సాధువగునా? బాలవ్యాకరణమున సమాస పరిచ్ఛేదము ౧౭ వ సూత్రమున "సమానాధికరణంబున నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డుఙ్వర్ణంబున లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబు నగు." మూఁడు + జగములు = ముజ్జగములు, మూఁడు + లోకములు ముల్లోకములు" అని కలదు.

ఇచట సూరి 'ఉత్తరపదంబు' అని ఒక్క పదమును మాత్రమే నిర్దేశించినట్లుగా, జగములు, లోకములు అను నుదాహరణములను బట్టి స్పష్టమగుచున్నది. అప్పుడు 'ముల్లోకవంద్య' అనునది యెట్లు సాధ్యమగును? ఇంతకుముందు నే నుదాహరించినరీతిని, శ్రీనాథ, పెద్దన లీ విషయమై యేకాభిప్రాయులై యున్నను, వారి తరువాతి వాఁడగు వనంతుఁడు 'ముజ్జగద్వందితుఁడు' అను ప్రయోగము వాడరాదని చెప్పియున్నాఁడు. శాస్త్రులవారీ సందర్భమున అనం

---

18. "వీరశైవమునగాని, ఆరాధ్య శైవమునగాని, యిట్టి సంప్రదాయమే లేదని, మఱియు, వృషోత్సర్జన మనఁగా, ఆఁబోతును విడుచుట సంప్రదాయముగాని గోవును విడుచుట అనునది లేదనియు, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార పండితులు శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు తెలిపిరి. ఇంతేకాక ధర్మకవిలెలవలె, "శివ్యకవిలెలు" తమ యింటిలో వంశపారంపర్యముగా నున్నవని తెలిపిరి. వారికి నా కృతజ్ఞత.

కుని యభిప్రాయమును పురస్కరించుకొని బాలవ్యాకరణమున గల పై సూత్రమునొద్ద (1225-81 పుటలలో) యీవిషయము చర్చింప వలసియుండెను. వారట్లు చేయలేదు సరికదా! 'ముల్లోకవంద్య' అను పది చిన్నయసూరి సూత్రమునకు లోబడి యున్నట్లుగ నుదాహరించిరి. ఇది శాస్త్రీయమైన పద్ధతి కాదని మనవి.

## తథ్య—తద్దె

బసవ పురాణమున నేటి ముద్రిత ప్రతులలో నున్న 'తథ్య' పాఠమును గూర్చి ౧౬౦ పుటలో నిట్లు గలదు.

"అలి సేయుచుఁ బల్కునది తద్దె కాఁగ (బసవ3 అ ౫౯ ప). సం. తథ్య (తద్భ) తద్దె...పై పద్యములో తద్దె కాఁగ" అని ముద్రించుట సరికాదు."

"అలిసేయుచుఁ బల్కునది తథ్య కాఁగ" అని, వ్రాతప్రతు లన్నింటియం దుండుటచేత, 'తథ్య' యను పాఠమే మూలమున చూపఁబడినది. 'తథ్య' అను పాఠమునకు 'తద్దె' అను పాఠాంతర మున్నచో, నది పుట యడుగున చూపఁబడియే యుండును. కాఁబట్టి 'తద్దె' యను పాఠము సంహితాకర్తల కల్పితపాఠమనుట స్పష్టము.

సంహితాకర్తలకు తామొకచోట వ్రాసిన విషయమును, మఱియొకచోట విస్మరించుట పరిపాటియైనది. ఈ 'తథ్య'శబ్దమును గూర్చి, తత్సమ పరిచ్ఛేదము ౫౯ సూత్రమున (౧౬౨-౧౬౩ వి. కల్ప) వారేమి వ్రాసిరో చూడుఁడు.

"వ్యావహారికాంధ్రమున మువర్ణకలోపము మిక్కిలిగ విస్తరించు చున్నది. అట్టి వ్యవహారమునుండి వచ్చినవానిని గ్రహించి కవులు ప్రయోగించుచున్నారు. ఇట్లగుటచే చరిత్రాదిగణము కాల క్రమమున పెరుఁగుచున్నది. కావున మహాకవిప్రయోగప్రామాణ్యమున వీనిని నిర్ణయించుకొనవలయును.......................... గాణపత వివరణకర్త ప్రయోగసిద్ధము లనుచుఁ గొన్నిటిని జూపెను. ఉష్మ, హార.౬ అ ౭౨. అను శాసనకర్త మఱి కొన్నింటిని జూపెను. నిష్కర్ష-సర్గ (ఆం. భా. అ. శబ్ద. ౪౯ సూ). ఇంకను ప్రయోగములు: మేలనగీతి గలము రెండు నగణములును గలసి ప్రాప మెఱయు (కావ్యాలం. ౭ ఉల్లా ౨౪ పు) క. యరలవలును, శషసహలును వరయఁగ నంతస్థ లూష్మ లనఁగా జెల్లున్. (ఆం. భూ. ౧౬ పద్య. కేతన) ద్విపద...'ఎసపక నిత్య వేయేని ముట్టింప' (బసవ. ౪ అ. ౭౭౪ ప.) ద్వి. అలిసేయుచుఁ బల్కునది తథ్యకాఁగ. (బసవ. ౩ అ.౫౯) ప్రశ్న (బసవ ౬ అ ౩౩౨. ౩౪౯), స్పర్శ (బసవ ౫ అ ౩౬౩), చిహ్న (నన్ని. కు. ౨ అ. ౧౫౭ ప) మొ."

ఇట్లు తత్సమ పరిచ్ఛేదమున, కంఠోక్తిగా 'ము' వర్ణలోపమునకు, "అలిసేయుచుఁ బల్కునది తథ్య కాఁగ" అను పాఠమునే యుదాహరించి ౧౬౦ పుటలో తద్భవములను గూర్చి చెప్పునపుడు సంహితాకర్తలు 'తద్దె' అని ముద్రించుట సరికాదు" అని వ్రాయుట సరియగునా?

సంహితాకర్తలే తమ గ్రంథమున పాఠముల నొకచోట యొక విధముగాను, మఱియొకచోట మఱియొకవిధముగాను పరిశీలింపక పరిష్కర్తలపై నిందమోపుట సరియగునా?

## దాసు - దాసి:

ద్వి. జంగమకోటికి సడిసన్న దాసి బస ౧.౬౦ ప
శంకర నీబంటు శంకర దాసి బస ౨.౪౬ ప

"కాక - కాకి అను రీతిని 'దాస - దాసి' అని యేర్పడవలెను. 'శంకర దాసి' అను సమాసము 'కృష్ణరాయఁడు' అను దానివంటిది కానోపును. లేదా శంకరదాస శబ్దభవము 'సంకరదాసి' కావచ్చును." ఆం. వ్యా. సం. ఖ. పుట ౧౬౦.

సంజ్ఞా పరిచ్ఛేదమున ౨౦ వ సూత్ర వివరణమున పై రీతిని లిఖించిన సంహితాకర్తలు, సమాస పరిచ్ఛేదమున (౧౧౭౬ పుట) నీ దాస - దాసి శబ్దమును గూర్చి యెట్లు వ్రాసిరో చూడుఁడు.

"ద్వి. సడిసన్న శరణుండు శంకర దాసి(బసవ ౪.౨౬౩). కాక శబ్దభవము కాకి యైనట్లు 'దాస' శబ్దభవము 'దాసి' కానోపును. పిదప శంకర+సు+డు+దాసి+సు=శంకరదాసి అను రీతిని సమాసము చెన్నగును, లేదా 'కాళిదాసు' అనురీతిని శంకరదాసు అను తత్సమ రూపమునే (వృద్ధు వంటిదే దాసు) యంగీకరింపవచ్చును."

ఒక విషయమును గూర్చియే, పైరీతిని విరుద్ధముగ వ్రాయఁబడి యుండుట నీ గ్రంథమున పరిపాటియే. ఒకచోట శంకరదాసి శబ్దము కృష్ణరాయఁడు వంటిది. అందు దాసశబ్దతద్భవము దాసి. వేఱొకచో దాసి అనునది. తత్సమము కాళిదాసు రీతిని శంకరదాసు అని యుండును.

శివకవులు పుల్లింగవాచకముగ దాసి శబ్ద ముపయోగించిరని యీవఱకుఁ దెల్పితిని. పాల్కురికి సోమనాథుఁడే కాళిదాస శబ్దమును- "చెచ్చెరఁ గాళిదాసికిని" అని మూర్ఖరాని యతిస్థానమున వాడి యున్నాఁడని చూపితిని. అట్టిచో నిన్ని తికమక లేల? ఇంకనుఁ జూడుఁడు. 'శంకరదాసి' శబ్దభవము 'సంకరదాసి' కావచ్చునట! చింతామణి గ్రంథము వీరి పాలి చింతామణి! దాని ననుసరించి శంకరాచార్యుఁడును సంకరాచార్యుఁ డగును! ఇట్టి వ్రాత వ్రాయనపుడు.

"యద్యపి బహు నాధీషే తథాపి పఠపుత్ర వ్యాకరణం,
స్వజనశ్శ్వజనోమా భూత్సకలం శకలం సకృత్ శకృత్"

అను సూక్తిని యాంధ్ర వైయాకరణసార్వభౌములు మఱచి యుందురు!

## అనుకరణ సంధి :

బాలవ్యాకరణమున సంధి పరిచ్ఛేదము ౫౩-౫౪ సూత్రములను విమర్శించు సందర్భమున సంహితాకర్తలు ౪౩౩ పుటలో నిట్లు వ్రాసియున్నారు.

"పై రీతిగల ప్రమాదభూయిష్ఠమగు సూరి సూత్రమునకు నీ క్రింది బసవ పురాణ ప్రామాదిక పాఠము కాకతాళీన్యాయమున చేయూఁత యగుచున్నది."విను'యథా శివమయో విష్ణు' వన్మాట ——లును.........బసవ ౬ అ. ౯౧౭ ప. (ఆంధ్రపత్రికా ముద్రణాలయ ముద్రితము) ఇట "ధర్మోజయ తనుచు" (భీష్మ ౧ అ. ౭ గద్య) అనుదానివలెను 'విను యథా శివ మయో విష్ణను మాటలును .........అనునది కవిప్రయుక్త పాఠమై యుండును. శివమయః +

విష్ణ + వు అను రీతిగల ప్రయోగము లక్ష్యలక్షణవిరుద్ధమని ముద్రణ సంస్కర్తకుఁ దోచకుండుట వింత. ఈయనకు సంకీర్ణత దుష్టమని స్థలాంతరములందును దోచలేదు. 'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానంబు' అనెడుమాట, అటు కృతంకర్మ శుభాశుభం బనెడు (బసవ ౬ ఆ. ౩౩౨(కృతకర్మ శుభాశుభంబు' అనెను).

"ప్రకృతము యథా శివమయో విష్ణను మాట అనునది తాళపత్ర మాతృకలలో నెట్లున్నదో యని పరిశీలింపఁబడెను. బ్రహ్మశ్రీ జటుండి వెంకట శాస్త్రులవారు కాకినాడ పరిషత్పుస్తక భాండాగారములోని మాతృకలో నీ క్రింది రీతి నున్నదని వ్రాసిరి.

"విను యథా శివమయ యం విష్ణుఁ డన్మాటలును"

రెండవ మాతృకలో "విను యథా శివ మయో విష్ణుఁ డన్మాటలును" మద్రాసులో నేలటూరి వేంకటరమణయ్యగారి తాళపత్ర మాతృక నుండి తీసి తమిళ వాఙ్మయ పరిశోధనోపన్యాసకులు విద్వాన్ శ్రీ వేంకటరాజులు రెడ్డిగారు వ్రాసిన పాఠము. 'విను యథా శివ మయో విష్ణుడన్మాటలును' తిరుపతి పుస్తక భాండాగారములోని మాతృకను చూచి బ్రహ్మశ్రీ 'ఉభయభాషాప్రవీణ' చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మగారు వ్రాసినవి:

| | | |
|---|---|---|
| D. No. | ౯౬౪ | విను యథా శివమయం విష్ణుడన్మాట |
| | ౯౬౫ | విను యథా శివమయం విష్ణుడన్మాట |
| | ౯౬౩ | విను యథా శివమయం విష్ణుడన్మాట |
| | ౯౬౭ | విను యథా శివమయం విష్ణుడన్మాట |
| | ౯౩౦ | విను యథా శివమయం విష్ణుడను మాటలును |
| | ౯౩౧ | విను యథా శివమయం విష్ణుడను మాటలును |
| | ౪౭౪ | ...................విష్ణుడనుమాటలును |

ఇట్లు మాతృకలం దన్నిటను "విష్ణుఁడు" అనియే యున్నది. బాలవ్యాకరణాభ్యాసవశమున ముద్రణ సంస్కర్తగారు 'విష్ణ + వు' అను పాఠమును నిల్పి సంస్కారము చేసిరని తోచుచున్నది. అది యట్లుండె "శివమయం విష్ణుఁడు" అను పాఠమునందును లక్షణశాస్త్రవిరుద్ధమగు సంస్కృతాంధ్ర విభక్త్యంత సంకీర్ణత తప్పలేదు. కావున నీ పాఠము లేఖకప్రమాదకృతమనియు వర్జనీయ మనియు, 'విను యథా శివమయో విష్ణను మాటలును' అను పాఠమే కవిప్రయుక్త మనియు విశ్వసింపవగును."

సంహితాకర్తలు, తొమ్మిది తాళపత్ర ప్రతులలో గల పాఠము. "విష్ణుఁడన్మాట" అను పాఠము స్పష్టముగా కనఁబడుచున్నప్పుడు - ఇది లేఖక ప్రమాదమనుట సరియా? ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రతులలోకూడ 'విష్ణుంషన్మాట' అనియే యున్నది. పరిష్కర్తలు 'విష్ణువన్మాట' అను నూతన పాఠము నెలకొల్పుట ప్రామాదికమే కాని, ఏ తాళపత్ర ప్రతిలో లేని 'విను యథా శివమయం విష్ణను మాట' కవిప్రయుక్తమని సంహితాకర్తలు సిద్ధాంతీకరించుట సాహసము కాదా? మఱియు ప్రాచీనాంధ్ర భాషాసంప్రదాయములుగాని, శివకవుల భాషాసంప్రదాయములుగాని యవగాహన చేసికొనకపోవుటచేత పైని వివరించిన స్థలమున అనుకరణసంధిలో—"లక్షణశాస్త్ర విరుద్ధమగు సంస్కృతాంధ్ర విభక్త్యంత సంకీర్ణత తప్పలేదు" అని సంహితాకర్తలు నిర్ధారణ చేసిరి. ఇచ్చట "విను యథాశివమయో విష్ణుఁడన్మాటలును" అను "యథా శివమయో విష్ణువ"ను వ్రాతప్రతులపాఠములోను బసవపురాణ ముద్రిత ప్రతిపాఠములోను సంహితాకర్త చూపిన దోషమిది.

"యథాశివమయోవిష్ణు అను సంస్కృతవాక్యము ననుకరణ సంధిచేయునపుడు తెనుగున—యథాశివమయోవిష్ణుః - విష్ణు-అను సంస్కృత విభక్తితో వాడవలయును. కాని యిచ్చట విష్ణువు విష్ణుఁడు అను తెనుగు విభక్తివాడబడినది"

కాని యిచట సంపాదకుల సిద్ధాంతమెంతమాత్రము సమంజసముకాదు. సంస్కృతవాక్యమైనను అనుకరణసంధియందు తెనుఁగు విభక్తితోనుండుటయే ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయము. మల్లికార్జున పండితుని శివతత్త్వసారమునందలి యీ క్రింది ప్రయోగమును చూడుఁడు.

క. కొనునది భక్తునిచేతన
ధన మతనిక యిచ్చునదియు "తస్మైదేయం"
బనియును "తస్మాద్గ్రాహ్యం"
బనియు గల దనిరి వేదభక్తి విధిజ్ఞుల్.

కొందటిచోట తస్మైదేయంబనియు ననుచోట. తస్మైదేయమ్మనియు, ననవచ్చును గాని రెండవచోట తస్మాద్గ్రాహ్యంబనియు గలదనిరి వేద భక్తి విధిజ్ఞుల్ అనిచో "తస్మాద్గ్రాహ్యంబు" అనుచో.నది తెనుఁగు విభక్త్యంతమగుట స్పష్టము. "తస్మాద్గ్రాహ్యంబనియనుచో, "తస్మాద్గ్రాహ్యమ్మని" మార్చిన, "వేద-భక్తి విధిజ్ఞుల్"అను చోయతి తప్పును కావున అనుకరణమున 'సంస్కృత విభక్తి నిలువదనియు తెనుగు విభక్తియే నిలుచుననియు సిద్ధాంతము. పండితారాధ్యులకృతియం దిట్టి ప్రయోగమును గమనించియే, సోమనాథుఁడు—"కృతకర్మంబుశాశుభంబు"అనునిట్టి ప్రయోగములను గావించియున్నాఁడు.

## యావత్తు ధనము:

"ద్వి. తనయింటి యావత్తుధనమును మున్న (బసవ. 3ఆ. ౪౫౫).
ఇందలి 'యావత్తు' అనునది ముద్రణ సంస్కర్తృప్రమాదమునఁబడినది తాళపత్రమాతృకలో "తన యింటి యాతుర ధనమును మున్న" అనియున్నది. కాన నిట "తనయింటి యాతతగనమును మున్న" కవిప్రయుక్తపాఠ మనుట యుక్తము. యావత్తావచ్ఛబ్దములకును తత్సమరూపములు కవిప్రయుక్తములు కాలేదు." (పుట 692)

తాళపత్రమాతృకలోనిదని చూపఁబడిన "తనయింటి యాతుర ధనమును మున్న" అనునది బసవపురాణ ముద్రితగ్రంథములో 74 పుటలో (1952 ముద్రణము 64 పుట) నిచ్చినదియే. దీనినిబట్టి తాళపత్రమాతృకలను సంపాదకులు పరిశీలింపలేదనుట స్పష్టము. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండారమున వ్రాఁతప్రతులలో (బ్రౌను దొరవారు సేకరించినవి) పై ద్విపదపాద మిట్లున్నది.

సంఖ్య 964 తనయింటి యావత్తు ధనమును మున్న
969 తనయింటి యావత్తు ధనమును మున్న
970 తనయింటి యార్తువ ధనమును మున్న

రెండు ప్రతులలో స్పష్టముగా యావత్తు అను పాఠ ముండుటచే నదియే మూలమున నిల్పి, పుటయడుగున సందిగ్ధముగానున్న పాఠము పరిష్కర్తలు సూచించిరి. కావున 'యాతత' ధనము అను పాఠము కవిప్రయుక్తము కానేకాదు. యావత్ శబ్దమునకు తత్సమరూపము 'యావత్తు' సోమనాథుఁడు ప్రయోగించెనని సిద్ధాంతము.

సంపాదకులు బసవపురాణమును కేవలము వ్యాకరణ దృష్టితోడనే పరిశీలించిరి కాని, పాల్కురికి సోమనాథుని గ్రంథములు వీరశైవమత ప్రచారముకొఱకు, మతవ్యాప్తికొఱకు వ్రాయఁబడినవన్నమాట మఱచినారు. మఱియు బసవపురాణాది గ్రంథములు. భారతాది గ్రంథములవలె, పాఠభేదములకుఁ బాల్పడినవని భావించి, వానిని సంస్కరించుటకుఁ బ్రయత్నించినారు. కాని యట్టి పరిస్థితి పాల్కురికి గ్రంథములకుఁ బట్టలేదు. పైని నేను సూచించిన ప్రకారము, పాల్కురికి సోమనాథుని గ్రంథము లన్నియు, వీరశైవమత సంప్రదాయమునకు సర్వస్వములై వెలయుచున్నవి. శైవేతరులకు శ్రుతిస్మృతులెట్లో, శైవులకు పాల్కురికి గ్రంథము లట్టివి. కావున, నా గ్రంథములను వ్రాసికొనినవారు, తూచా తప్పక వ్రాసికొనెడివారు—అందును నవి గురువాక్య సంకలితము లగుటచేత పాఠభేదములకుఁ జోటేలేదు. అవి వారికి వేదములు—వానిని వేదములవలె, స్వరములు తప్పక భక్తులు పఠించువారు. పండితారాధ్య చరిత్రలో నీ విషయ మిట్లు తెలుపఁబడినది.

"ద్వి. చరితంబులును శ్రీ బసవ పురాణంబు
చేలలు వెట్టుచు నింపు సొంపార
శైలిపై గ్రాలుచుఁ జదివెడివారు". పర్వతప్రకరణము.

వేదములవలె ద్విపదలు స్వరయుక్తముగా పఠించువారు కావున నిందు పాఠభేదములకు నాస్కారములేదు. ఇట్టి స్వరవిశిష్టతను గమనించియే సోమనాథుఁడు, తన ద్విపదగ్రంథములను "వేదముల కొలఁదియుకాఁ జూచుఁడు" అని తెలిపియున్నాఁడు! బసవపురాణమునకు, మతవిషయికముగా నెంత గౌరవము కలదో ప్రథమ ముద్రణ పీఠికనుండి యీ క్రింది పంక్తు లుదాహరించుచున్నాను.

"సోమనాథోపజ్ఞముగా వెలసిన దైనను శైవులలో మత గ్రంథముగా బహుప్రఖ్యాతి బడసెను...తన ఘనకృతులు తెనుఁగుననే వలయించిన వాఁడైనను సోమనాథుఁడుగూడ, కర్ణాటదేశమున నెచ్చుగా గౌరవముబడసెను.ఆంధ్రదేశమునగూడ,ఆరాధ్యబ్రాహ్మణులకంటె వీరశైవులగు జంగములు లింగబలిజెలు మొదలగువారు దీనిని మిక్కిలి గౌరవముతో నారాధింతురు. శుభాశుభసమయములం దీగ్రంథమును వారు పారాయణము చేయుచుందురు." (పుట 80).

వీరశైవుల కిట్టి పవిత్రగ్రంథము, వీరశైవమతమున కిట్టి యాధారభూతగ్రంథము, కావుననే తెనుఁగులో వెలసిన బసవపురాణము ననుసరించి, కన్నడమున, తమిళమున భాషాంతరీకరణములు వెలసినవి. మతగ్రంథములన్నియు సంస్కృతములోనే యుండవలయునను భావనచే నర్వాచీన శైవపండితులు దీనిని సంస్కృత భాషలోని కనువదించిరి. అది దేశమెల్లెడ వ్యాప్తమగుటకు నాగరాక్షరములతో ముద్రితమైనది.

అనాఁడు కేవలము మతగ్రంథములైన పాల్కురికి గ్రంథములు కావ్యకళా విశిష్టత కలిగియుండుటచే, సాహితీ విషయమునగూడ ప్రామాణికములై వెలసినవి. కేతన, విన్నకోట పెద్దన అనంతుఁడు మున్నగు ప్రాచీన లాక్షణికులు సోమనాథుని గ్రంథములను పరిశీలించియే లక్షణములను గావించిరి. కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు నిగమార్థసారసంగ్రహమగు పండితారాధ్య చరిత్రను, పద్యకావ్యముగ రచియించియున్నాఁడు.

కావున, బసవపురాణాది శైవగ్రంథపాఠ పరిశీలనము సందర్భమున, మనము కడుజాగరూకులమై యుండవలయును. తెనుగు సాహిత్యమున నొక ప్రత్యేక భాషాచ్ఛందస్సాహితీరీతులకు ప్రవర్తకులైనవారు శివకవులనియు, వారి గ్రంథములను నర్వాచీన లాక్షణిక సంప్రదాయము ననుసరించి సంస్కరించుట శాస్త్రీయమైన విమర్శ పద్ధతి కాదనియు, శివకవికృతగ్రంథ పరిష్కరణ విధానము భారతాదిగ్రంథ పరిష్కరణమువంటిది కాదనియు మనవి.

ఆంధ్రగ్రంథమాలాధిపతులు ప్రకాశన మొనర్చిన, బసవపురాణ ద్వితీయ ముద్రణమున (1952) గల పాఠములు, ఆం. వ్యా. సం. సర్వస్వకర్తల విమర్శనమువలన మార్చవలసిన యావశ్యకత యెంతమాత్రము లేదని విమర్శక లోకమునకు విన్నవించుచున్నాను.

# ప్రేమ కథ

బెంగాలీమూలం:
**శ్రీ వన్‌ఫూల్**



అనువాదం:
**శ్రీ దండమూడి మహీధర్**

"బోల్ హరి, హరిబోల్!"*

నిశ్శబ్దంగా ఉన్న నిశీథంలో మేమంతా ముందుకు సాగిపోతున్నాం. నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ రమేశ్ బాబు నన్ను ఉద్దేశించి అన్నారు.

"మీరు లోలోపల నన్ను తిట్టుకుంటున్నారు కదూ!"

నేనన్నాను—"అబ్బే! అలాంటిదేమీ లేదండీ!"

"అయితే మంచిదేలెండి!" అంటూ ఆయన చెప్పుకపోయారు.

"మీరు అతిథిగా మా ఇంటికి రావటమేమిటి, వచ్చినవ్యక్తిని శవయాత్రలో సహాయ పడవలసిందిగా అడగటమేమిటి—అంతా ఆశ్చర్యమైన విషయం! నా అతిథిసత్కార మిలా ఉంది!... కాని మీకు శ్రమఇవ్వక తప్పలేదు! మనుష్యుల్ని పిలిస్తే ఎవరూ రాలేదు!...ఏం చెయ్యమంటారు చెప్పండి!"

"ఇంత చిన్నవిషయానికి మీరిలా బాధపడాలా! నేను కాలేజీలో చదువుకునేరోజుల్లో శవాల్ని చాలాసార్లు మోశాను; అది మా కోర్సులో ఉందిలెండి! కనుక నాకిదేమీ కొత్తకాదు!"

హరీంద్రబాబు మధ్యలోనే అందుకున్నారు—"సరేలెండి, ఏదో శిష్టాచారంకోసం పలుకుతున్నారు, మీరీ మాటలు!... సరేగాని—కాలక్షేపంకోసం ఏదైనా ప్రేమకబుర్లు చెప్పండి! ఇంకా శ్మశానం చాలాదూరం ఉంది! శ్యామ్‌బాబూ!...మీరే మయినా చెప్పండి!"

మా అందరిలో—శ్యామ్‌బాబుగారే కొంచెం వయస్సు మళ్లిన మనిషి! ఆయనన్నారు—"నా జీవితంలో ప్రేమఘట్టాలు లేకపోలేదు; కాని అవన్నీ నాకిప్పుడు సరిగా స్మరణకు రావటం లేదు! అయినా నా దృష్టిలో ప్రేమకూ, అల్‌జీబ్రాకు భేదంఅట్టే లేదు. వయస్సులో ఉండగా చాలా చాలా చేశాను; వాటిలో ఒకటీ ఇప్పుడు గుర్తుకు రావటంలేదు...మీరు ప్రేమగొడవలు ఎత్తుతూంటే కొంపదీసి—ఆ జబ్బు మళ్లీ నాకు అంటుకుంటుందేమోనని భయపడుతున్నాను!"

"బోల్ హరి, హరిబోల్!"

హరీంద్రబాబు శ్యామ్‌బాబును వదిలేసి చంద్రబాబును పట్టుకున్నారు. "ఇదుగో చందర్ దా! ఏదో ఒకటి మాకు విన్పించాల్సిందే! పైలాపచ్చీసుగా తిరిగినవ్యక్తి మీరు! కానివ్వండి. శ్మశానం ఇంకా చాలాదూరం ఉంది!"

"బోల్ హరి, హరిబోల్"

చందర్ బాబు చెప్పటం సాగించాడు—"నేను పైలా పచ్చీసుగా తిరిగినమాట నిజమేగాని—నేను నా ప్రేమ ఉదంతాలు మాత్రం మీకు వినిపించలేను! కారణ మేమిటంటే: నేను ప్రేమను డబ్బూ, బహుమానాలూ ఇచ్చి ఖరీదుచేశాను. కనుక నా మనస్సు మీద ఎలాంటి ప్రేమప్రభావమూ పడలేదు! నాకు రాణీ, రోజీ, వినోదిని, నయనతార—అంతా ఒకేరీతిగా కన్పించారు. నన్ను వదిలెయ్యండి!"

"బోల్ హరి, హరిబోల్!"

అప్పుడు హరీంద్రగారు రమేశ్ బాబుగారిని ప్రశ్నించారు—"ఏమండీ! మీ స్టాకులో ఏమైనా ప్రేమకథ లున్నాయా? ఉంటే బయటికి లాగండి!:"

"స్టాకు చెయ్యటానికి నాకు అవకాశం చిక్కితే గదండీ?... క్లాసు పుస్తకాలు కంఠస్థం చేసి చేసి పరీక్షలో ప్యాసయ్యేను. నా విద్యార్థి జీవితంలో పరీక్షలకోసం చదువుకోవటం వినా మరో పని చేయలేదు. అయితే పెళ్లి చేసుకున్నాక మాత్రం మా ఆవిడను ప్రేమించాను. దాని ఫలితంగా నాకు నలుగు రాడపిల్లలు! ఇదీ నా కథ" అన్నారు రమేశ్ బాబు.

"బోల్ హరి, హరిబోల్!"

కొన్ని క్షణాలు గడిచాక రమేశ్‌బాబు అన్నారు—"ఇప్పుడిప్పుడే మళ్లీ నాకు ప్రేమించాలనే కోరిక పుడుతోంది. కాని టైమెక్కడండీ? ఉదయం లేచినదగ్గర్నుంచి ఆఫీసుకు వెళ్లే హడావిడిలో ఉంటాను; సాయంత్రం ఇంటికి రావటంతోటే నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని వెంటనే కాళ్లుచాచుకొని పడుకో బుద్ధి వేస్తుంది! మరి మీ స్టాకులో ఏమీ లేవంటారా?"

"బోల్ హరి, హరిబోల్!"

హరీంద్రబాబు 'హు హు' అంటూ బిగ్గరగా నవ్వారు—"డాక్టరు నన్ను పరీక్షచేసి 'నీ గుండెలో ఏదో దోషముంది' అని చెప్పినప్పటినుంచీ—ఎవరితోనూ సంబంధం పెట్టుకోకూడదనే నిర్ణయానికి వచ్చాను. పైగా నా మొహంమీద స్ఫోటకపుమచ్చలున్నాయి! ఇలాంటివాణ్ణి ఏ పిల్ల ప్రేమిస్తుందయ్యా? అయితే ప్రేమకలాపాలకు సంబంధించిన కబుర్లంటేమటుకు చెవి కోసుకుంటాను! ఏదీ ఎవరైనా విన్పించండి!"

"బోల్ హరి, హరిబోల్!"

ఉన్నట్టుండి హరీంద్రబాబుగారు నావేపుతిరిగి నాతో అన్నారు—"ఇదుగో చూడండి—మీతో నాకట్టే పరిచయం లేదనుకోండి. మీ జీవితంలో ఏవైనా మధుర ఘట్టాలుంటే—దయచేసి మాకు విన్పించండి! ఏదో కాలక్షేపంకోసం!"

---

* బెంగాలులో శవయాత్ర సందర్భంలో ఇలా అంటూ నడుస్తారు.

"బోల్ హరి, హరిబోల్!"

జీవితంలో నాకు స్త్రీలతో పరిచయం కలగలేదని నేననుగాని ఆ పరిచయాలను గురించి చెప్పడం అంటే ఎందుకో సిగ్గనిపించింది! ఏదో ప్రసంగం దాటవేయాలనే ఉద్దేశ్యంతో నే నన్నాను. "ఈ సందర్భంలో ఇలాంటి కబుర్లు విన్పించటం ఏమి బావుంటుం దండీ! ప్రేమకథలకంటే — దయ్యంకథలు చెప్పుకుంటే బావుంటుంది!"

మా అందరిలోకీ పెద్దవాడైన శ్యామ్‌బాబుగారు నాకు సమాధానంగా పలికారు. "నా దృష్టిలోమాత్రం ఈ రెండూ సమానమే! అయినా మీరు విన్పించే దేదో ప్రేమకథే విన్పించండి!"

ఇక నాకు తప్పిందికాదు—"నేను యం. ఏ. పూర్తిచేసిన రోజులవి! తిరిగివచ్చామని మా మామగారి ఊరెళ్ళాను. వాళ్ళింట్లో ఒక చదువురాని పనిపిల్ల ఉంది. దాన్ని నేను ప్రేమించాను. ఆ అమ్మాయికి వయస్సు అట్టేలేదు; చూట్టానికి అప్సరసలావుండేది! పేరు కుసుమ. కుసుమ బాలవితంతువని తరువాత తెలిసింది. అలాంటి నిష్కళంకమైన ప్రతిమను నే నెక్కడా చూడలేదు!"

"బోల్ హరి, హరి బోల్"



"ఒకరోజున అవకాశంచూసి నా మనస్సులోని మాట వెలువరించాను! నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పాను. 'అయితే ఏమిటి?' అంది. అర్ధరూపాయి బిళ్ల ఒకటి ఆమెచేతిలో ఉంచబోయాను; తిరస్కరించింది."

"బోల్ హరి, హరిబోల్!"

"మరికొన్ని రోజులు గడిచాయి! ఆ పిల్లచుట్టూ చక్కర్లు కొట్టాను. అయితే మా మామ, అత్త ఉన్నప్పుడుమాత్రం కొంచెం జాగ్రత్తగా మసులుకొనేవాణ్ణి! ఒకరోజున వాళ్ళింటికి వెళ్ళాను. ఇంట్లో ఆ పిల్ల ముసలిపినతల్లిమాత్రం వుంది. అతిలేమి అనుభవిస్తున్నారు. మరోరోజుకూడా వెళ్లాను. మా మామ, అత్తా—ముఖర్జీగారింటికి వెళ్ళారు. ఇంట్లో ఎవరూ లేరు. ఒంటరిగా కుసుమ మాత్రం ఉంది!"

హరీంద్రబాబు గొంతెత్తి పలికారు—

"బోల్ హరి, హరి బోల్."

"—ఆరోజున తెలుసుకున్నాను. ఆమెకూడా నన్ను ప్రేమిస్తోందని! ఆమె చకిత నయనాలు, కంపిస్తున్న పెదవులూ చూసి, నా స్వప్నం సఫలమయిందని భావించాను! ఆ సమయంలో నేను తలుచుకున్న విధంగా కావటానికి అవకాశం వుంది; కాని నే నా అవకాశాన్ని ఎందుకో వినియోగించుకోలేక పోయాను. ఆమె కంపిస్తున్న పెదవుల్ని కోమలంగా ముద్దుకొని ఊరుకొన్నాను."

"బోల్ హరి, హరి బోల్!"

అంతటితో నే నా కథను నిలిపివేశాను. కాని హరీంద్రబాబు ఊరుకోలేదు, "ఆతరువాత ఏం జరిగింది?" అని ప్రశ్నించారు.

"ఆతరువాత ఏమీ జరుగలేదు. ఈ రహస్యం బయటపడుతుందేమో నని భయపడి అక్కడినుంచి నేను వచ్చేశాను. కుసుమను నేను మళ్ళీ చూడలేదు. అయితే తరువాత తెలిసిన విషయ మేమిటంటే, నేనువచ్చాక ఆ అమ్మాయి మా మామగారింట్లో పని మానేసిందట!"

"బోల్ హరి, హరి బోల్!"

శ్మశానం దగ్గరైంది. శవాన్ని కిందికి దించాం. అంతా చితి పేరుస్తున్నాం. శవం మొహంమీద ఉన్న గుడ్డను తొలగించి చితిమీద పెట్టబోతూ ఉండగా చూసి "కొంచెం ఆగండి, ఆగండి!" అన్నాను నేను. రమేశ్ బాబుగారివేపు తిరిగి—"ఈ అమ్మాయి మీ ఇంటి కెందుకు వచ్చిందండీ?" అని అడిగాను ఆదుర్దాగా!

"రెండురోజులకు పూర్వం ఈ పిల్ల మా పశువులచావిట్లో కన్పించింది. ఎవరినో వెదుక్కుంటున్నదట! ఇతర వివరాలు అడిగి తెలుసుకునేలోపల ఆ అమ్మాయి శాశ్వతనిద్రలో నిమగ్నమై పోయింది. ఏమిటి సంగతి?"—అన్నారు రమేశ్ బాబు!

వాడి నేను శిలావిగ్రహంలా ఉండిపోయాను.

# నవల పుట్టుపూర్వోత్తరాలు

**శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ**

మనమెంత వాస్తవికవాదులమో, అంత యాదర్శ వాదులము గూడ నగుట మన ప్రకృతి. కించిదూనముగ ఉన్న జీవితము నున్నరీతిగా గాని, ఉండవలసిన రీతిగా గాని, యెట్లు చిత్రించి నను మనకుఁ గలుగు సంతోషము సరిసమమే యగుట, పైనిఁజెప్పిన మన ద్వంద్వ ప్రవృత్తికిఁ గారణము.

ఆదర్శతా వాస్తవికతలను నీ రెండు మానవ ప్రవృత్తులును, పోనుపోను పాశ్చాత్య కథాసాహిత్య ప్రపంచమున రెండు విభిన్న దర్శన విధములు గల కావ్యశాఖలకు మూలాధారములై కాల్పనిక రచనలు, వాస్తవిక రచనలు అను ఫలములను పండించినవి.

ఫ్రెంచి మున్నగు భాషలలోనుండి యనువదింపఁబడినట్టి గాని, గ్రీకు రోమను సాహిత్యముల నుండి గ్రహింపఁబడినట్టి గాని, స్వయముగ నాంగ్లాది వాఙ్మయములలో సృజింపఁబడినట్టి గాని, పద్యాఖ్యానములను (అద్భుతావహ) కాల్పనికములు అని క్రీస్తు శకము పదునాల్గవ శతాబ్ది పర్యంతము పాశ్చాత్యులు అనుచు వచ్చిరి. అట్లే యిూర్ష్యాద్వేషాదిగత వాస్తవిక జీవిత చిత్రణమున్న పద్యాఖ్యానములకు 'నోవస్' అనియు, గద్యాత్మకాఖ్యానములకు 'నోవెల్ల' యనియు వ్యవహారముండెడిది.1 ప్రత్యేక మాంగ్లభాషలో పదునాల్గవ శతాబ్దియందు దిట్టి వాస్తవిక జీవితమును చిత్రించుచు, వెల్వడిన పెక్కు గద్య రచనలను కథలనియే ('టేల్స్') వ్యవహరించిరి. వారియందీ 'కథ' యను పదము బహ్వర్థ గర్భితము.

క్రీస్తుశకము పదునైదు, పదునారు శతాబ్దులలో నిటాలియనులు నవలల2 పెక్కుగ నిర్మించిరి. కాని యెలిజబెత్ రాణి కాలమునాఁటినుండియు నాంగ్లేయులు చరిత్ర (History, Chronicle) యను పదమునకే ప్రాధాన్య మధికముగ నిచ్చుచున్నను, క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దిలో కాల్పనికరచనలు పెచ్చు పెరుగుటయేగాక, గ్రంథ నామముగను కథాపీఠమునను నెన్నడును లేనిదే కూడ 'కాల్పనికములు' అని వ్రాయుటకై నాఁటి రచయితలు పాల్పడుటచేతను గూడ, నింగ్లాండు దేశములో 'నవలా' శబ్ద మీ చరిత్ర, కాల్పనికము మొదలగు బహు శత్రుకృత సంకులసమర ముందు తన యునికిని నిల్వఁద్రొక్కుకొని తాను క్రమముగ వేళ్లూనుటకు నాల్గుఁవందల యేండ్లకంటె తక్కువ కాలము పోరాడ లేదన్నచో నదియొక యతిశయోక్తి కాదు.

## నిర్వచనము

'నవలా' పదము స్థితి అస్తినాస్తిత నొందిన దినాలలో 'క్లారీవ్'3 మనోహరమగు తన కొన్ని సంవాదములయందు 'నవలా కల్పనముల' పోరాటము నిట్లు తేల్చివేసినది:—"రచనా కాలమునందలి వాస్తవిక(ములగు) జీవితాచార వ్యవహారములను చిత్రించునది నవల. ఉదాత్త శైలిలో నసంభవములను, నసంభావ్యములను వర్ణించునది 'కాల్పనిక రచనము.' నవలయన్నచో నిత్యము మన కనులయెదుట జరుగు విషయములు మన యెడలనో లేక మన హితుల యెడలనో నిజములు గావచ్చు నన్నట్లుండును. మిక్కిలి సులభ సాధ్యములుగను, సహజములుగను సన్నివేశముల నెల్ల చిత్రించి, వానిని పరమసత్యములని నమ్మునంతటి ప్రాయోభావ జనిత భ్రమాన్వితులనుగా మనల నొనర్పవలెను. సహృదయులమగు మనలో పూర్వజన్మ సంస్కారవశమున గలుగు సాధారణీకరణ శక్తిచే మనలను భావప్రతిభావంతులనుఁగా జేసి, తన్మూలమున దశ దోహలులనుగ నొనర్చుటయే నవలకు పరాకాష్ఠ."

గద్యరూప కథాసాహిత్యమునకు స్థూలముగ 'నవల' యను పేరింగ్లాండులో స్కాటునాఁటికి దిటవైనది. 'క్లారీవ్' ము స్మృతించిన 'నవలా కాల్పనికముల' సూక్ష్మ భేదములు క్రమ క్రమముగా సమసిపోఁజొచ్చినవి. యథార్థ జీవితవిషయముల వాస్తవిక చిత్రణము గల [ఆదర్శ చిత్రణము గాని] గద్యరూప కథన సాహిత్యమే 'నవల' యని సర్వ సర్వత్ర పాశ్చాత్యులలో నంగీకరింపఁబడినది.

ఇఁక మన యాంధ్ర వాఙ్మయములో 'నవల' యను పదముపు ప్రయోగమునుబట్టి విచారించి దాని నిర్వచనమును నిర్ణయించుట మఱియు దుస్సాధ్యము. ఉత్తమమీఁద నొక విధమగు కథాసాహిత్యమును సూచించు నర్థమునందే నవలాపదము వాడుక చేయఁబడుచున్నది.

కాని పెద్దలను కొందఱిచే నిది 'చిత్ర కథాఽఖ్యానము'ని చెప్పబడుచున్నది. నవల యందలి వస్తువంతయు యథార్థము కాకపోయినను కేవల కల్పితమును గాదు. ఒకవేళ అయథార్థమైనను, మిథ్యాకృతమతిచేత, నది యథార్థమే యనెడి భ్రాంతిఁ గల్గించు అయథార్థము. అదియే యీ కథా వస్తువునందలి వైచిత్రి. కావుననే దీనిని చిత్ర కథాఖ్యానమనుట యుచితమంటిని. ఇంచుమించుగ బహు మనోహరం చితాద్భుతావహ కార్య విశేషములకు సంబంధించిన కాల్పనికముల కంటె నవల భిన్నమని

---

(1) 'The development of The English Novel' by Wiiltam L. Cross, Introduction, PP, XIII-Lines 22-28.

(2) నవలాశబ్ద వ్యుత్పత్తి:—(Latin) Novellus, Novus; (French) Nouveau; (Italian.) Novella; (English) Novel; (Telugu.) Navala—నవల. సంస్కృతమున దీనికి 'నవం లాతీతి నవలా' యనియు వ్యుత్పత్తిఁ జెప్పి చమత్కరింపవచ్చును.

3 "The Progrces of Romance" 1785.

చెప్పుటయే ప్రాయికముగ 'చిత్ర కథాఖ్యాన' మనుటలోగల భావమైయుండును. కావున, మనోరంజకము, నతివిచిత్రము నైన జీవితచిత్రణము 'నవల' యనుట పిండితార్థము. ఆ వైచిత్రి లేనిదే మనోరంజకత సిద్ధింపదనుట.

స్థూలదృష్టికి కల్పిత కథనము, యథార్థకథనము అనునవి భిన్నములుగా నగపడును. యథార్థ కథనమునకు జన్మించిన యథార్థసంతానము కల్పితకథనమనినవారు గూడ నున్నారు. కాని పర్యాలోచింపఁగా నదియు నొక భ్రమ. మన మాధునిక మనుకొను విమానములు వాల్మీకమునందు పుష్పకాది నామములచే చెప్పఁబడినవి. అట్లే నేఁడు జలాంతర్గాములను పాశ్చాత్యులు కనుఁగొనక పూర్వమే హెచ్. జి. వెల్సు పండితుఁడు వానిని యూహించి తన కథా వాఙ్మయమున ముందుగ ప్రయాణింపఁ జేసినాడు. అందుచే మున్ముందు యథార్థముగాగలది, నవలలో కల్పితము, అనిఁనచో నొప్పుదుముకి ఇంతకు బీజాంకుర న్యాయము నొప్పనగు నీ కల్పిత కథనము, యథార్థకథనము ననువాని విషయము నింకొక రీతిగఁ గూడ సూచితముగఁ బరిష్కరింపఁ దగును.

ప్రాచీన యుగము నాఁటినుండి యథార్థకథనమునకు అనుబంధముగను, లేకా ప్రాయముగను గూడ కల్పితకథనమునది నిరవడి యున్నది. మతియుఁ గడు ప్రాచీనతమమగుటచేత మన యూహాప్రభవమున కందరాని యథార్థవిషయమునకు కల్పిత విషయమని పేరుపెట్టి సంతోషించుకొనుచు వచ్చుచున్నామన్నను తప్పులేదు. అనఁగా, బహుప్రాచీన చారిత్రక విషయమగు [పౌరాణిక] యథార్థము నేఁడు మనకు కల్పితముఁగా దోఁచుచున్నది.

లేదా, పామరులకు యథార్థ విషయబోధన సాధనముగా ముందు కల్పిత మాచరణలోనికి వచ్చినదనియు, అట్లు కాక ఆ పామరజనమునకు యథార్థమును యథార్థముగా బోధింపఁ జూచినచో, నది బోధపడదు సరిగదా, అపాయకరముగఁ గూడ పరిణమింప వచ్చుననియు చెప్పఁగాని కల్పిత యథార్థకథ లాని విషయముయొక్క పూర్వోత్తర దశావిశేషములని సంగ్రహింపఁ బడవచ్చును.

పోను పోను తమ నిత్యజీవనమునకుఁ జెందిన సంక్లిష్ట సమస్యలచే విసిగి వేసారియుండి విశ్రాంతి నొందఁగోరు సాధారణ జనమునకై కల్పింపఁబడిన దగుటచే గూడా యథార్థము వంటి చిత్రమైన కల్పన నవలలో నావశ్యక మగుచున్న దనుకొందును. అయా కారణములచే నవలను చిత్ర కథాఖ్యాన విశేషముగ నుల్లేఖించుట సమంజసమనక తీరదు.

దీని గుణముల పుట్టు పూర్వోత్తరములబట్టి యాలోచించినను (1) ఇతిహాసము; (2) భావగీతము; (3) రూపకము ననునవి, తమ ఆస్తి తాము పంచుకొని యేనాఁడో తమదారి తామైపోయిన [illegible] ల్లి కొనాళ్ళవలె తోచును. పైమూఁడింటి యందును [illegible] ఇతిహాసిక రచనాసంతతికి జెందినది. ఇది కథన ప్రధాన [illegible]యు యిట్టి వర్గీకరణమునకు కారణము. అయ్యును, ఇతిహాసము కంటె నొక విధముగా మూల నవల భిన్నము. ఎట్లన, ఇతిహాసము తాను శబ్ద ప్రాముఖ్యమును వహించి, యాఖ్యానము యొక్క సాహాయ్యమును గౌణముగా గ్రహించినది.

## నవల : ప్రబంధము:

సత్యాదేవి లేనమమువలె పారిజాతాపహరణమునందలి కథావస్తు వస్తినాస్తి విచికిత్సఁ గొల్పుచున్నదని మాటవరుసకందుమే గాని, నిజమూహింప మన మేప్రబంధమునైన కథకొఱకై చదువము; కవితాంశముకొఱకై చదువుదుము. మతి నవలలో [ప్రాథమిక దశయందు మాత్రమే యని కొందఱనవచ్చును గాక!] కథయే ప్రధానము. ఆ కథను చెప్పుటకు శబ్దమిచ్చుట నుపస్కారక మైనది. అందుచే స్థూలదృష్టిఁ బోల్చిచూచినచో నొక విధముగ నవల ప్రబంధమునకు పూర్తిగా విరుద్ధమగు రచన.

ముందుగ దీని యుత్పత్తికిఁ గారణమేమి?—యని పరిశీలింతము. యోజింప నిదియునుఁ బ్రాక్తన మానవుని దైనదిన సాంఘిక జీవితమునుండి యుత్పన్నమైనదే! మానవుఁడు తాను పడునట్టి శ్రమాపనయార్థము వినోదములయందు కాలయాపనముఁ జేయఁ గోరుచుండును. ప్రారంభదశలో నృత్త నర్తనాదులన్నియు ప్రాథమిక మానవుని శ్రమాపనోదనార్థ ముద్దిష్టములైన వినోద క్రీడా కలాపములే గదా! అదే తీరుగా నే చలికాలమందునో, యే గడ్డిమంటల యొద్దనో కూర్చుండిన జనములో నుబుసుపోకకై కథలు బయలుదేరి యుండవచ్చును.

నర్తకికి గానము సహజమైన శక్తిసంపద. అట్లే కథకునకు కథఁజెప్పుటయు స్వతోరమణీయచాతుర్యము. అది యతని నేర్పు!

లోకములో జరిగిన విషయములను విన నింపుగా చిలవలు పలవలుగా గూర్చి చెప్పుటతో కథాజీవితమునఁ బ్రథమదశ ప్రారంభించిన దనవచ్చును. అప్పటిలో శ్రోతల కానందము నిచ్చినది తత్కథాగత సౌందర్యము మాత్రమే! కథయిత ప్రయోగించు శాబ్దికప్రకర్ష గాని, ప్రదర్శించు వాక్చమత్కృతిగాని కాదు. అట్లే నృత్యమునందును బ్రథమదశలో నానందమునిచ్చునది కేవలము నృత్యమేగాని సంగీతము గాదు.

లిపి యేర్పడినతరువాతఁ జదువ నేర్చిన వ్యక్తి యీ కథలను వ్రాయ నారంభించినాడు. మనలో నట్లుపుట్టినవే కాశీమజిలీలు. లోకమున యాత్రా పశుపక్ష్యాది కథలు మొదలగునవన్నియు నీ తెగలో జేరినవే! బేతాళ పంచవింశతి, సింహాసన ద్వాత్రింశిక, శుకసప్తతి మున్నగు పెక్కు కట్టుకథలయు, పిట్టకథలయు కావ్యములు మనభాషలో వెలసిన యిది రెండవదశ యనదగును. పిన్నలకు పెద్దలకుఁగూడ నుద్దేశింపఁబడిన 'రాజాజీ కట్టుకథలు' ఇటీవలనే తెలుఁగులోని కనువదింపఁబడినవి.

అటుతరువాతిది మూడవదశ. ఈ దశావిశేషములో రచనా సౌందర్యసంపాదన ప్రయత్నములు జరిగినవి. ఏత ద్రచనా సౌందర్య గుణ సంపాదన ప్రయోజనసాధనకు భాషాభివృద్ధి తోడ్పడినది.

అపిమ్మట దశ నాల్గవది. ఇందులో నవలను ప్రబంధముతో పోటీ పడునట్లుగా నిర్మించుటకు ప్రయత్నములు సాగినవి. ఒక్క

అశేష ప్రజానీకానికి

మా ఉగాది అభినందనలు అందజేస్తున్నాము.

# "ఉగాది"

## పండుగకు

## చేనేత వస్త్రములను ధరించండి

రిబేటు రూపాయి 1 కి 0-6 నయాపైసలు

చొప్పున యింకను యివ్వబడుచున్నది.

మా విక్రయశాలలు ఆంధ్రప్రదేశమంతటనూ, మరియు

మద్రాసు, బెంగుళూరు, బరంపురం మరియు కటక్

నగరములలో గలవు.

## ఆంధ్ర చేనేత సహకారసంఘము,

గవర్నరుపేట, విజయవాడ-2.

—NVKR Advtg

ఛందస్సువినా యావత్కావ్యగుణముల సాపాదించి గద్యమునకు కావ్యతా గౌరవము సంపాదించిరి. సంస్కృతమున కాదంబర్యాది గద్యకావ్యము లీకోవవే!

నవల దశలో, కావ్యత్వమున స్వయంసంపూర్ణతను సంపాదించుటచే నిక మిగిలిన సాహిత్యప్రక్రియయగు నాటకమును గయాళించుటకై స్పర్థించినది నవల. అందుచేత నే సంవాదపోషణములకెక్కువ ప్రాముఖ్యము నవల యొసంగినది. దీనికింగాను జరిగినదే పాత్రచిత్రణము, సన్నివేశ నిర్వహణము మున్నగు శిల్ప భాండార సంభూతి. ఇది యెట్లున్నను కథన సౌందర్యమును మాత్రము నవల కోల్పోవ రాదనుట రూఢము. ఈ సుందరతా పరిస్పందము వలననే నవలను గూర్చి ప్రదర్శనములేని నాటకమనియు, శబ్ద చిత్రణములేని మహా కావ్యమనియు నొక్క మాటలో జెప్పనొప్పును.

కావ్యతాగుణ శోభితములగుటచేత మనలో నేడు మహోముగ్ధ కారియగు సాహిత్యాంగముగం గొన్ని నవలలు వెలయుచున్నవి. ఆధునిక విమర్శకులు వీనినిం బ్రబంధదృష్టితోం గూడం బరిశీలింపవలెనన్న యంశమును విస్మరించుచున్నారు. ఇదియొక లోపము.

ప్రబంధమునందే యీ నవలా లక్షణములనుం జూపించిన వారిలో పింగళి సూరనార్యునివంటి మహాకవులు మనలో పూర్వము నుండి యేకొలదిమందియో లేకపోలేదు. ఈ లక్షణమునకుం బూర్వులలోం 'మహనీయ కథా సంవిధానము'గల సూరనార్యుని కళాపూర్ణోదయమును, నాధునికులలో కవిసార్వభౌమ, ఆంధ్రప్రదేశాస్థాన కవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి 'మధుకర విజయము'ను నుత్తమ లక్ష్యములు. ఇందు కళాపూర్ణోదయము నొకవిధముగ పద్యగత చిత్ర కథాఖ్యానము (Pseudo Mythological Fiction) అనందగును. క్వాచిత్కముగ గద్య సమ్మిశ్రణములున్నను, ప్రాయికముగ పద్యసమాశ్రితములే యగుటవలన 'కవితారూప నవలల'ని యల్పరచనలలో నేడు పేర్కొందగినవి శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల 'కావ్య కుసుమావళి'[4] సంపుటములు.

వినచో, ప్రబంధమునకు మాత్రము వస్తు వివరణము దుర్ఘటము; నవలకిది సుకరము. కాంగా ప్రబంధేతివృత్తము నవల యితివృత్తముకంటె నెల్లపుడు నసుదాత్తమే. కాని, యీ నవలా ప్రబంధ సాంకర్యములు క్వాచిత్కములని మఱవరాదు.

మొత్తముమీంద ఇవాన్స చెప్పినట్లుగ అతీతానుభవములకు నవల యొక్కటియే వ్యక్తీకరణ సాధనము!

అగుచో నాటకేతి వృత్తములను నవలలుగా బరివర్తనముం జేయవచ్చునా? అన్నిటినిగాదు;[6] పురాణేతివృత్తములుగల 'శాకుంతలా'దు లున్నవున్నట్లు కుదురవు; సులభముగ వీలులేదు.[7] మృచ్ఛకటికవంటి కేవల కల్పిత సాంఘికేతివృత్తముగల ప్రకరణాదులం గొన్నిటిని నవలలుగా మార్పుటకు వీలున్నది.

కాని యెల్ల యితివృత్తములను మనకు కావలసిన రీతిగా భిన్నభిన్న కావ్యరూపములలో వ్రాయుట కుదురదు. అది బుద్ధిమంతుడైన కవి యూహించుకొని, యితివృత్తౌచిత్యము నెఱింగి చేయవలసిన కావ్యస్వరూప స్వీకరణము. కానిచో నితివృత్తమే తనకుందగిన కావ్యస్వరూపమును నిర్ణయించుకొనంగలదు గూడ. (It Chooses Its Own form.)

## నవల : నాటకము

నవలా నాటకములనుగూర్చి యాలోచించినచో మనకు పెక్కు విధములగు విభేదములు గానవగును. వీనినే నవలా నాటకముల ప్రత్యేక లక్షణములుగా గూడం జెప్పందగును.

(1) నవల నాటకమునకు తరువాతం బుట్టినది. అనంగా జ్యేష్ఠత లేదు.

(2) నవల రంగస్థల నియమ విరహితము, నాటకము రంగ నిబంధ యుక్తము. అనంగా, నవలవలె నాటకము కేవల గ్రంథగత సాహిత్యము గాదు; రంగమును దృష్టియందుంచుకొని వ్రాయంబడినది. నవలకన్ననో, రంగస్థలాపేక్ష లేదు. నవలాకారునకు రంగ నియమ పరిధియావశ్యకమును లేదు.

(3) నవలకైన రంగము నవలయందే గలదు. నాటకమున రంగస్థలము కృతిగతము కాదు; కావ్యమునుండి విభక్తము. [నేటి నాటికలలో రంగస్థల విన్యాసమును పేరిట కొంతగా రంగప్రసంగము నిమిడ్చుచుండుట వేఱుమాట.] నవలయందు వర్ణనల మూలమున చిత్రములు మన మనస్సున నిల్పునే గాని, రూపకమునందువలె పాత్రలు ప్రత్యక్షము కానక్కఱలేదు. తన దృశ్య ప్రసాధనాది రంగస్థలోపకరణములు నవలకు తనయందే గలవు గావున చదువరులకు జేబులో నవలయున్నచో రంగస్థలి యున్నట్లే! ఈ కారణముచే నాటకములపై వ్యామోహము నవలల చదువరులకు తగ్గుచున్నదన్ననుం దప్పు గాదు. నాటకముల క్షీణతకు నవలల యభ్యుదయము ప్రత్యక్షకారణము గాదు గాని, నాటకములకు నవలలు ప్రత్యామ్నాయములగుట మాత్రము నిజము.

(4) నవలకు కాలవ్యవధి యని లేదు. ఎంత కాలమైనం జెప్పవచ్చును; వినవచ్చును. అందువలననే నవలారచనమునకును, పఠనమునకును గూడ క్షమ యావశ్యకమనుట. రూపకమునందు కాల నియతి యున్నది. మూండు, నాల్గు, లేదా, కొన్ని గంటలకు మించి మాత్రము ప్రదర్శన ముండదు. వస్తుసార సంగ్రహమే నాటకమునందు ప్రదర్శింపంబడును. కాని, నటులకు గాని, ప్రేక్షకులకు గాని, నవలా కర్తృ పఠితృల కుండవలసినంత క్షమ యావశ్యకమనంజాలము.

---

(4) 'కావ్యకుసుమావళి' ఆఱు సంపుటములు; రెండువందల యేబది యంశములు; పండ్రెండు వందల పుటలు; గద్య, పద్య సమ్మిశ్రితము—చాలవఱకు కవితారూప నవలలబీజ మాధునిక యుగములో నిందు గోచరించుచున్నదనవచ్చును.

(5) 'It is the only outlet to a large experience.'

(6) ఒకే ఇతివృత్తమును భిన్నసాహిత్య ప్రక్రియలుగా గూడం బరివర్తనం జేయవచ్చునని నిరూపించుటకు కన్నడమున నేడు ప్రయోగము జరుగుచున్నది. దాని ఫలితముగ నొక సంపుటము త్వరలో రానున్నది.

(7) పౌరాణికేతివృత్తములనుంగూడ నవలారూపమున బంధించుటకు నేడు భారతీయ భాషలలో ప్రయోగములు జరుగుచున్నవి. అవి విజయవంతములగుటయు వినబడుచున్నది.

(5) వర్తమాన విషయమును నవల వృత్త [భూత] విషయముగా మార్చి చెప్పును. ప్రత్యక్షీకరణశీలము గలదగుటచేత రూపకము భూతకాల విషయమును వర్తమాన విషయముగాఁ జూపఁగలదు. ఈ శక్తి యస లాపంవాదశైలియందే కలదు. 8

(6) శ్రవ్య కావ్యమగుటచే నవలలో జీవకళాచ్ఛాయ యుండదు. దృశ్య కావ్యమగుటచే రూపకమునందు సజీవత్వమును, ప్రత్యక్షానుభూతి చ్ఛాయయుఁ గలవు.

(7) నవల కావ్యముయొక్క సరళరూపము. అందుచేత నల్ప ప్రయాస గ్రాహ్యము. నాటకమో, కావ్యజటిల రూపము. అది యతిగుంఫితమైన సాహిత్యమును, సుదృఢబంధమును గలది. అనఁగా, మాటల కూర్పునకు రూపకమునఁ బ్రాధాన్యము. అట్లే, కథా వస్తువునందు దేనిని వదలివేయవలయునో, దేనిని వదలరాదో కూడ నాటకకర్తయే నిర్ణయించుకొనవలయుననుట. నవలను వలె నాటకము నల్ప ప్రయాస గ్రాహ్యమనలేము.

(8) పాత్రలను గూర్చియు, పాత్రల పక్షమువను కూడ, నవల యందు రచయిత పలుకఁగలడు. అనఁగా నతనికి వ్యక్తిగతాభిప్రాయమును వెలువరింప వీలున్నది. నాటక కవి పాత్రల ముఖముననే పలుకఁగలఁడు. స్వయముగ నేమి చెప్పుటకు నవకాశము తక్కువ; బాహాటముగా కుదురదు. కవికిట్టి శృంఖలఁ గల్పించుటచేతనుఁ గూడ నాటకము, పైనఁ జెప్పినట్లు [నవలవలె] కావ్యసరళరూపము కాజాలకున్నది.

(9) నవల క్షేత్ర విస్తృతి గలది; విశదీకరణ ప్రధానమైనదనుట. తత్కర్త యిందు సర్వవిషయములను వివేకింపఁ గలడు. కావున విస్తారము నిస్సీమము నైన కావ్యరూపమిది.

నాటకమట్టిది గాదు. అభినయము పైననే దాని దృష్టి. కాన, సంక్షేప ప్రధానమైనది.

(10) నవలలో భాషా కాఠిన్యమున్నను నంతగా ప్రతిబంధకము కాదు. సంవాదములయందు పాత్రోచితభాష నాటకములలో సమర్థనీయము. ఇఁక కవి తానై మాటాడు ఘట్టములలో నవలయందు వస్తుగౌరవమును బట్టియు, భావ వైభవమును బట్టియు, శైలి యించుక యుదాత్తమైనను విషయ గ్రహణమున కడ్డు తగులదు. నాటకమందు శైలీ భారము కారాదు. ఏలన నిందు విషయ వైపుల్య ముండదు. విషయ సంగ్రహతవలనఁ గలుగు శ్రమకు భాషా ప్రచండ తాండవ భ్రమణము గూడ తోడు పడరాదు.

ఈ చెప్పిన దశవిధ నవలానాటక విభేదములలో ముఖ్యమైన వానినిఁ గొన్నింటిని జతపఱచి మఱల భిన్న శీర్షికల క్రింద నీ దిగువ రీతిని సూక్ష్మముగఁ బరిశీలింపవచ్చును.

## స్వయం సంపూర్ణత :

భూత పూర్వవిషయమునుఁ గూడ నాటకము వర్తమాన మట్లు ప్రదర్శించు నంటిమి. అట్లు ప్రదర్శింపబడకఁ కేవలము పఠన మాత్ర యోగ్యమైన నాటకము స్వయంసంపూర్ణము గాదు. రంగప్రసాధనాభినయములు లేని యట్టి నాటక పఠన మెప్పుడును అసంపూర్ణమే యగును. ఇట్టి ప్రదర్శనరహిత నాటకములయందు పాఠకుని బుద్ధి యెక్కువగ శ్రమపడవలసియున్నది.

అట్లే వర్తమానమును గూడ వృత్తవిషయము [భూతము] గా నవల చెప్పునంటిమి. ఇందు రంగప్రసాధనమును, సూక్ష్మాతిసూక్ష్మాంశములను వర్ణింప వీలున్నది. ఈ ప్రసాధనాదిని నాటకములో నైనచో రంగమునందుఁ బ్రదర్శింతురు. మఱి యీ ప్రదర్శనములేని నాటకము వట్టి యస్థిపంజరమేఁగదా! పాత్రోచిత వేషధారణాది ప్రదర్శనముల యాధార మక్కఱలేని హేతువుచే నవల కేవల కావ్యముగా స్వయం సంపూర్ణము. "నవల జేబులోనున్న నాటక రంగము" 9 అనియు, "నవలదైన రంగప్రసాధనాదులు నవల యందే యున్నవి" 10 అనియు, ననుట యీ యర్థమునే సూచించును. కావున, కావ్యతా గుణమున నాటకము స్వయంసంపూర్ణము గాదని విదితము. 11.

ఇంతేగాక కథాసన్నివేశ కల్పనములో నాటక కర్తకున్న విధినిషేధము లేవియు నవలాకర్తకు లేవు. నవలలోఁ బ్రతి సూక్ష్మాంశము గనఁబడవలెను. అందుచే రంగమును, నాటకమును రెంటినిఁ గలిపినపుడే యది నవల యగుచున్నది. కావ్యత్వమున స్వయంసంపూర్ణత నవలకు గలదనుట కిదియే ముఖ్యకారణము.

## కథాసన్నివేశ కల్పనము :

వస్తుసన్నివేశము నాటకములో కఠోర వ్రతము. ఈ సన్నివేశము రంగనియమానుసారముగ నుండవలెను. ఇట్టి నిర్బంధము నవలకు లేదు.

కాని, వేఁడు నవల కేవల మాఖ్యానమువలె నున్నదనియు ననలేము. 'అనఁగా ననఁగా'నని శుద్ధాఖ్యానములో కథ ప్రారంభింపఁబడును. నవల వర్తమానకాలములో చాలవఱకు నాటకముతో పాటి రాదగిన దశను బ్రాపించినది. ఇందులోఁ గూడ కథాసన్నివేశ మొక శిల్పధర్మముగనే పాటింపఁబడుచున్నది. కాని, యిట్లు పాటింపఁబడుట, నవలలో పరోచనార్థము. నాటకము నందన్ననో, ప్రదర్శనార్థము. అనఁగా, నాటకమునందు కథాసన్నివేశము ధర్మముగా పాటింపబడుట ప్రదర్శనశక్తి చెడకుండుటకొఱకై యున్నది. నవల యందన్ననో ప్రరోచన [ప్రస్తావన] శక్తి చెడకుండుటకొఱకై యున్నది. ప్రదర్శన శక్త్యపేక్షిత యా నాటకమునందును, ప్రరోచన శక్త్యపేక్షిత యా నవలయందును, కథా సన్నివేశమును శిల్ప ధర్మముగాఁ భావించుచున్నామనుటయే యిందలి భేదము.

## సంక్షేపము :

నాటక రచనమున నేకథను స్వీకరించినను, దానికి సంక్షిప్తత యావశ్యకము. నవలలో కథకు వైపుల్యము ధర్మము. ఇందు సంగ్రహత పనికిరాదు.

---

8. In dialogue, the stilted speech...was replaced by the blunt parlance of the present period (page 38, lines 34 to 37 of Writing Modern Fiction).

9. 'Novel is a pocket-theatre' (Marion Crawford)

10. 'Novel has its stage in itself'.

11. Novel is self-contained and drama, as a piece of Literature, is not self-containd.

అయ్యును, నాటకమునందు కథను సంక్షేపించుటలో దాని ప్రాధాన్యము చెడకూడదు. నవలయందును కథను విపులీకరించుటలో దాని నిబిడత్వమును చెడరాదు.

నవలలో నప్రధాన విషయము లెన్నియేని యుండవచ్చును; అనఁగా ననేక ప్రాసంగికములు చేరనగును; తప్పక చేరియే తీరవలె నని నియమము లేదు. చేరినచో మాత్ర మా ప్రాస్తావిక విషయములు ప్రధానకథతో నవలయందు సూత్రింపఁబడుట యావశ్యకము. ఏకతః సూత్రింపఁబడని సప్రాసంగికము నవల నిరర్థకము.

## ఇతివృత్తము :

నవలా నాటకములలో నితివృత్త పరిగ్రహణమునందు చాల భేదమున్నది. నవల చారిత్రకమో, సాంఘికమో లేక యొక్కొక్కప్పుడు రాజకీయమైనదిగూడ నగును గాని పౌరాణికముగాదు. అనఁగా నతిలోకవిషయ ప్రతిపాదకమగుట యసాధారణము, కాఁగా లాక్షణికులదృష్ట్యా పరిశీలించినచో నవల యుత్పాద్యవస్తుక మగును; చాలవఱకు లోకాశ్రయమునుగూడ గావచ్చును. అంతియేగాదు. అసలు తన లక్ష్యసాధన కనుగుణముగాగాని, తనకు సుపరిచితము, విశిష్టమునగు ప్రాతిపదికయొక్క ప్రేరణవలనఁగాని, నవలాకర్త యొకానొక పథకమును నిర్ణయించుకొనవలెను. అప్పు డా పథకమును బట్టి ఇతివృత్త సంవరణము సార్వకాలికమును యథార్థ ప్రయోజనకరమునుఁ గావలయునన్నచో, నవలేతివృత్తము, గతానుగతికమగు బాహిరప్రేరణఁ గలదిగా నుండరాదు. అది పరిసర పరిశీలన ప్రభావజన్యమైన యాంతరప్రేరణఁ గలదిగా నుండవలయును. అనఁగా నవల, యాంతర కారణ చోదితముగాని, బాహిరకారణ చోదితముగాదు. రచయిత శిల్పియు, వస్తువాంతర ప్రచోదితము నగుచో, నవల తన్నుఁ దానే రచించుకొనఁ గలదు. 12.

నాటకమువలె ప్రసిద్ధేతివృత్తమనెడి సిద్ధాన్నమును నవల యపేక్షింపదు. నవలది కష్టాన్నము. ఇందువలననే, ఇతివృత్త కల్పనకు నాఁటి ప్రపంచ పరిశీలనమును, లోకుల మనోగత పరిజ్ఞానమును బహుదేశ సంచార సంపాదిత భౌగోళికజ్ఞానమును, నానా నవ్య నాగరకతల పరిచితియు, నవలారచయితకు గావలసి యున్నవి. మఱి, నాటక కవికన్నను యివి యంతగ నక్కఱపడవు. కాని, నవలాకారున కివి లేకున్నచో నతని రచన రాణింపనే రాణింపదు. అతీతానుభవములకు నవల యొక్కటియే సులభవ్యక్తీకరణ సాధన మని పెక్కుమంది విమర్శకు లిందువలననే నవలను పొగడిరి.

## పాత్రోన్మీలనము ;

శుద్ధాఖ్యానమునందు పాత్రచిత్రణము లేదు. కాని చిత్రాఖ్యానము (Novel) లో నిది యావశ్యకము. అందుచేతనే నవల నాటకముతో పోటీగా నిల్చినది. కాని నాటకకర్తవలె పరోక్ష పద్ధతి నే పాత్రచిత్రణము చేయవలెననెడి బాధ నవలాకర్తకు లేదు. అనఁగా పాత్రలను నవలాకారుఁడు తానై వర్ణింపనుగూడఁ జెల్లును. కాని, పాత్రలు చక్కఁగ క్రమోన్మీలనముఁ జెందవలెనన్న ధర్మమునందు మాత్రము నవలా నాటకములు రెండును తుల్యములే! అట్లున్నను, నవలలోని కథ పెంపుగలది. కావున నా యున్మీలనమును బహు మందగతిలో నిర్వహింపవలసిన శ్రమ నవలాకారున కున్నది.13.

అసలు రచయిత కథలోని తన ప్రధాన పథకమును గూర్చి భావింపగనే సహజముగను, క్రమక్రమముగను తదావశ్యక పాత్రలు కావ్యరంగముపై రూపొందును. దూరమునుండి చూడబడిన వస్తువు వలె తొలుత నించుకించుక మసకమసకగ దోచినను, కథాగమనములో సన్నివేశము లేర్పడుచున్న కొలదియు నా పాత్రలు రక్తమాంసములతో తొణికిసలాడు వ్యక్తులవలె సుస్పష్టవదనాంచల రేఖలతో మనకు సన్నిహితములై తమ విద్యుక్తములను నిర్వహించుచుండును. అంతట రచయిత చదువరుల కాయాపాత్రల భౌతిక మానసిక శక్తుల నిర్దుష్టదర్శన మిప్పించుటయేగాక తానే పాత్రల జీవిత చరిత్రను పొందుపఱచుచున్నాఁడో యా యా పాత్రలతో తాదాత్మ్యము నొందును.

ఇట్టి యాదర్శక తాదాత్మ్యము సిద్ధించినపుడు నవలాకర్త నవలాకర్తగా మిగిలిపోఁడు. అతఁడొక ఛాయాగ్రహణ యంత్రమై పోవును. అతని కలమొక శబ్దగ్రాహక యంత్రము. కవియు, కలమును, ఛాయాగ్రాహక శబ్దగ్రాహక యంత్రములైనపుడు వెలువడు చలనచిత్రమే నవల. అనఁగా దృశ్యములు, సంవాదములు, వర్ణనలు, మున్నగువానికొఱకై వినియోగింపవలసిన స్థలనిర్ణయాదిక విషయములలో నవలా రచయితకు స్వాతంత్ర్యము లేదనుటకాదు. చెప్పబోవు ప్రధానాంశమేమనగా వస్తూన్మీలనము కథక కృతప్రయత్నమువలన గాక, పాత్రోన్మీలనమువలననే నిర్ణయింపబడవలెననుట. నవలా కారు లంగీకరింప గలిగినను లేకపోయినను నుత్తమ నవలా నిర్మాణ విషయమున, రచయితకును పాత్రలకును నేర్పడు సంబంధము మాత్ర మింత యవినాభావమైన దనక తీరదు.

## నవల, నాటకాఖ్యానధర్మముల సమాహారము:

ఆఖ్యాన నాటక ధర్మముల రెంటిని నిముడ్చికొనినది నవల యని చెప్పబడినది. అగుచో నవలయందు పై రెంటికిని గల స్థానములను నిర్ణయించు టెట్లు? అనెడిది సమస్య. ఈ ధర్మముల సీమాభూమి నిర్ణీతి కేమియు ప్రమాణములని లేవు. ఆ శిల్పిదైన నైపుణ్యమే గీటురాయి. కాని వృద్ధాచార పరంపరనుబట్టి పరిశీలించి యిట్లు విభాగింపవచ్చును. పాత్ర ప్రవేశాత్పూర్వమును, నిష్క్రమణాంతరమును మాత్రమే నవలలో నాఖ్యాన పద్ధతి యుండదగును. పాత్రలు ప్రవేశించి రంగమున [పుటలలో] నున్నంత కాలమును సంవాదమే సాగును. అనఁగా పాత్రల నట్లే కూర్చుండబెట్టి నవలాకర్త తాను కథ చెప్పుకొనిపోవుట యుత్తమపద్ధతి గాదు. ప్రథమశ్రేణి నవలలో యిట్టిది యుండదు. ఇది పెక్కుమంది విమర్శకు లామోదించిన విషయము.

గ్రీకుల నాటకములలోని 'కోరస్' మన నాటకములలోని విష్కంభాదులును, వీధినాటకములలోని సూత్రధారుడును నిర్వహించు ధర్మము లేవిగలవో వానిని నవలలో కథకుఁడే నిర్వర్తించును.

---

**12. if a writer has the gift of his art. and the story is one he is impelled to tackle, it will write itself' ('Writing Modern Fiction', by Leslie Beresford, Page 41, 42).**

**13. The slow shaping of the Character is the problem of the Novel.**

ఇందుకు తగినట్లు, సంవాదములందా త్రశైలిలోను, కథనము మాత్ర మిశ్రగ్రాంథ్యముగను నుండుట సమంజసము.

నవల పురాణేతిహాస కావ్యములవలె బుద్ధిశ్రమకోర్చి చదువ వలసినది,గాదు గావునను, ఉత్తమాధికారులకు మాత్రమేగాక సర్వులకు జదువదగినది గావునను, నిందలి భాషావినియోగము, నాటక శైలికి, పామరవ్యవహారమునకు మధ్యేమార్గము నవలంబించుట యుక్తమేమో విమర్శకులే నిశ్చయింపదగును.

కాని దీనికి నపవాదములు లేకపోలేదు. మహాకవి రచితములైన వచనకావ్యముల వంటి నవలలును గలవు. కాన, వానివాని శైలీ నిర్ణయము తత్కర్తల శిల్పదృష్టి వైశిత్యమునకే వదలివేయవలెను. మనమిచట స్థూలముగఁగూడ నిర్ణయింపఁజాలము. అటుల చేయను రాదు.

## నవల మూలతత్త్వములు (షట్తత్త్వములు):

ఆఱు ముఖ్య14. తత్త్వములు నవలా నిర్మాణమున కాధార ములు: (1) వస్తువు (2) పాత్రలు, లేక పాత్రచిత్రణము (3) సంవాదములు [పాత్రపోషణమునకును, పాత్రల సంవాదము (లేక కథోపకథనము)నకును ఘనిష్ఠ సంబంధమున్నది. పాత్రల స్వభావాదర్శ సిద్ధాంతములు వారి వారి సంవాదములవలనఁ దెలియఁగలవు]. (4) దేశ కాల పరిస్థితులు లేక వాతావరణము; (5) శైలి (6) ఉద్దేశ్యము.

[రచయిత ప్రకటింపఁదలచిన జీవిత వ్యాఖ్యయే యీ యుద్దేశ్యము.]

నవలా ప్రాశస్త్యమును నిర్ణయించునవి రెండు ప్రధానాంశములు. మొదటిది వస్తువు; రెండవది వస్తుపోషణ విధానము.

ఇందు నవలలోని వస్తువునుగూర్చి ముందుగ విచారింతము. అసలు నవలయందలి యితివృత్త మౌచితీశోభితమా? యనుటకు అష్టవిధ పరీక్షలు గలవు.

14. పాత్రలు వేఱు, పాత్రచిత్రణము వేఱునని ఈ తత్త్వముల వేఱుగా విభజించువారు నుండవచ్చును. తిర్యక్కులుగాని, రూపాయి నాణెము, తపాలా బిళ్ళలవంటివి గాని, పాత్రలై కథ నడుపుచున్నపుడు పాత్రచిత్రణ పోషణములు లేవనుకొనువారి వాద మిది. కాని, యాయా పాత్రలకుఁగూడ ప్రాణిసర్మ మారోపింపఁ బడుటచేత, ముఖ్యతత్త్వము లాఱనుట నిర్బాధకము.

(1) ఇందలి వస్తువు సంపూర్ణమా లేక యెచటనైన విరోధ మున్నదా?

(2) ఇందన్ని విషయములలోను సమీచీనత్వమును, ముఖ్యముగ [అంగాంగి సంబంధమును] సమానత్వమునుఁ గలదా?

(3) ఇందలి వర్ణితాంశము లన్నియు సుసంఘటితములా? [మూల వస్తువునుండి మాలా పరంపరితములా? యిందలి యంశము లనుట.]

(4) అతి సాధారణ విషయమును గూడ నసాధారణముగ చిత్రించుటలో రచయిత సఫలుఁడయ్యెనా?

(5) ఘటనాక్రమ [సన్నివేశ రచన] మలౌకికము, నిసంగతము, నస్వాభావికమును నై యుండలేదు గదా? [సంఘటనము

కెంత యసాధారణములైనను పై మూడు దోషములు నుండరాదు. Abnormal may be depicted, but not the unnatural. అనఁగా ప్రాయోభావము జీవగల్గి.]

(6) కథావస్త్వంతము, వర్ణిత సన్నివేశముల కనుకూలమా? వస్తువున వాని పూర్వాఽపర సంబంధ మెచటనుఁ జెడలేదు గదా?

(7) అందు సుగమత్వమునకును, స్వాభావికతకును, మనోముగ్ధకారిత్వమునకును, లోపము రాలేదుకదా?

(8) శైలిలో శైథిల్య మెచటనైని గలదా? శైలీ కాలమున్నదిగదా?

## నవలా విభాగము

తొలుతఁ జెప్పినట్లు నవలా ప్రాశస్త్యమును నిర్ణయించు రెండవ ప్రధానాంశము, వస్తుపోషణము. దీనినిఁ బట్టి నవలను మూఁడు వర్గములుగా విభజింపవచ్చును.

1. ఐతిహాసిక పద్ధతి.

2. స్వీయచరిత్ర విధానము [నాయక ముఖమున, నన(గా నుత్తమ పురుషలో నిట్టి రచన సాగును.]

3. ఒక విధమగు నుత్తరప్రత్యుత్తర రూపమున కథావస్తూద్ఘాటనము [ఇట్టిది మన యాంధ్రమున కేవలము మృగ్యముగాదు. శ్రీ ఉప్పలవారి 'అతఁడు - ఆమె' వంటివాని నుదాహరింపవచ్చును.]

## నవల : పాత్రలు

1. పాత్రల కలౌకికత్వము నాపాదింపరాదు.

2. ఇవి చిరపరిచితములై [బాగుగ నెఱిఁగి] నట్లుగా నుండవలెను.

3. పాత్రల సాంఘిక శారీరకాధ్యాత్మిక శక్తుల తియాననీయములుగా నుండరాదు.

అతిలోక శక్తులచే సాధారణీకరణము లోపించును. అందువలన మనోరంజకత్వ మేర్పడదు. మఱియు నవలయందలి పాత్రలు లోకాతీతములైనచో నవి రచయిత చెప్పుచేతలలో నుండవు. ఒక చైతన్య మొసఁగి సృష్టికర్త మనలను లోకమునం దెట్లు వదలెనో, యట్లే నవలాకర్తయుఁ దన పాత్రలకు చైతన్యము [జీవసంస్ఫుటి] నొసఁగి, సన్నివేశములయందు వదలివేయవలెనే కాని, తా నడుగడుగునకును, జోక్యముఁ గలిగించు కొనరాదు. ఆయా పాత్రలాయా సన్నివేశములలో నుచితరీతిగ మెలఁగును. ఏరచయితగాని, తాను తానుగా నన్నపుడు పలుకనిమాటలు పాత్రల ముఖమునఁ బలుకును. అందుచేతనే కవి తన్నుఁ దానుమించిన యొకానొక దశలో సన్నివేశౌచిత్యము నెఱిఁగి, స్వేచ్ఛగా బలికించు పాత్రల పలుకులును, చేయించు పాత్రలచేతలును కవి శబ్దశక్తి భావనాశక్తినిఁ బరాకాష్ఠ లనఁబడుచున్నవి.

## నవల : పాత్రపోషణము

నవలయందు పాత్రపోషణము నాటకమునందుకంటె కఠినము. నవలాకారుని పాత్రపోషణ సాఫల్యమునకు నతిశయమైన వర్ణనశక్తి యావశ్యకము. ఇది నాటకకర్త కావశ్యకముగాదు. అట్లే కథానికతో బోల్చిచూచినను దాని క్షేత్రము సంకుచితము. కాన కథానికలో పాత్రోన్మీలనము నిష్కృష్టముగా నుండవలయును. విస్తృతక్షేత్రముగల నవలయందు మందోన్మీలనము ముఖ్యము. అనఁగా, నవలలో పాత్రలను క్రమవికాస మొందించుట యొకవిధమైన కష్టము.

ఈ పాత్రపోషణము ప్రధానముగా ద్వివిధము. మొదటిది విమర్శనాత్మకము. రెండవది యభినయాత్మకము. మొదటిదానిలో రచయిత పాత్రలయందే ప్రవేశించి, భావములను, స్వభావములను రాగద్వేషములను వెల్లడించి వానిని వ్యాఖ్యానించి, కారణముఁ దెల్పి పిమ్మట తన విమర్శనము నభిప్రాయమునుగూడ వెల్లడించును.

ఇఁక రెండవదానిలో రచయిత పాత్రలకు దూరముగనుండి వానివాని సంభాషణ వ్యాపారమువలననే యాయా పాత్రల గుణశీలములనుఁ బ్రస్ఫుటితముచేయును. ఇది యుత్తమకోటి శిల్పజ్ఞత.

## పాత్ర కథావస్తువుల స్థూలసంబంధము

(1) కొన్ని నవలలలో పాత్రలు ప్రధానములై సంఘటన లప్రధానములుగానుండును. ఇట్టిపాత్ర ప్రధాననవలలను నాటకీయము లందుము. పాత్రల దత్తశీలములే కథాపర్యవసానము నిందు నిర్ణయించును. శ్రవ్యకావ్యములలో మహోత్కృష్టములగు నిట్టి నవలలను దృశ్యకావ్యములలో విషాదాంతము లనఁబడువానితో పోలిక కుదురఁగలదు. (2) మఱి కొన్ని నవలలలో కథాసంవిధానము ప్రధానమై యుండును. శ్రవ్యకావ్యములలో మహోదారములగు నిట్టి నవలలను దృశ్యకావ్యములలో శుభాంతములనఁబడువానితో పోల్తుము.

మొత్తముమీఁద పాత్ర [లేక - శీల] ప్రాముఖ్యముగల నవలలుత్తమశ్రేణికిఁ జెందినవి. 15.

15. నీచమైన త్వగింద్రియ సౌశిత్యమునుఁగూడ మోక్షప్రాప్తికి సాధనఁగాఁజేసి చూపఁగల్గిన శ్రీ విశ్వనాథవారి 'ఏకవీర - చెలియలికట్ట' రాజు'లవంటినవలల యుత్తమత్వము నిచట సోపపత్తికముగ నిర్ణయింపమికి హేతువు, లక్ష్యలక్షణసమన్వయ మీ వ్యాసరచనోద్దేశము గామియే. ఏలన వీనియందు సన్నివేశముచే గల్గిన ప్రభావము పాఠకునియందు స్థిరముగా నెలకొనదు. నవల సన్నివేశ ప్రధానమైనచో కాతూహల వర్ధకమయ్యును గూడ జీవనతత్త్వ సంబంధియగు ప్రభావముద్రను పఠితృహృదయమున గంభీరముగ కుదురుకొననీయదు.

పాత్రప్రధాన రచనమం దట్లుగాక పాత్రల శీలప్రభావమధికమగుటవలన పాఠకునియందు వాని శాశ్వతప్రభావము ముద్రితమగును. కావుననే పాత్ర [లేక-శీల] ప్రధాననవల లుత్తమములుగా నెన్నఁబడుట.

వస్తుశీలములఁ బరీక్షించినచో సాధారణముగా వీనికి పరస్పర విరోధమున్నట్లుగా నగపడును. వస్తువుపై నధిక ధ్యానముంచినచో పాత్రల శీలములయం దశ్రద్ధ యేర్పడవచ్చును. అట్లే శీలచిత్రణమునందె లక్ష్య మధికముగా నిల్పినచో కథాసన్నివేశ సంవిధానము సుదృఢబంధముఁగలది గాకపోవచ్చును. కుశలులైన కలాశిల్పులీ రెండు తత్త్వములను మేళవించి సామంజస్యమును గూర్చుటకుఁ బ్రయత్నింతురు.

ఇన్ని వేళ (సంఘటన)ము లన్నిటికిని సరియగు కారణములను దెల్పుచుఁ బాత్రలకు సంబంధించిన భూమికలో వాని వాని క్రమ వికాసమునుఁ దెల్పుచుపోవుట నవలాకారుని కర్తవ్యము. ఎచటనుఁ గాని యసంగతము, నస్వాభావికము, లోక విపరీతమునగు సంఘటనము లుండరాదు.

## నవల : సంవాదములు-వీని ప్రయోజనములు

సంవాదమునందు భూతకాలవిషయమును వర్తమానకాలము వలెఁ దోపింపఁగల సామర్థ్యమున్నదని మున్నే చెప్పితిమి. కథావస్తువునందలి యాకర్షణము నినుమడింపఁజేసి, పాత్రలయందు చైతన్యమునుఁ గూర్చుటయే సంవాదముల ప్రయోజనము. సంవాదములు పాత్రల మనో ముకురములు. వీనివలననే పాఠకులకు పాత్రల గుణశీల స్వభావములతోడి పరిచితి యేర్పడుచున్నది. వీని నిర్వహణమే నవలాకారుని నైపుణ్యమునకు నికషోపలము.

## సంవాదముల ప్రధానోద్దేశము :—

వస్తూన్మీలనమే సంవాదముల ప్రధానోద్దేశము. సంభాషణముల యందు రూపకోచితవిధానము వన్నెఁగూర్చును. రూపకములయందువలె నీ పద్ధతిలో నివి కానరావు.

ప్రశస్తమైన సంభాషణముల కాఱు శ్రేష్ఠగుణము లుండు ననవచ్చును. (1) స్వాభావికముగను ; (2) నుపయుక్తముగను ; (3) విషయానుకూలముగను ; (4) ఇతివృత్తముతో సరిగ తులఁదూఁగినట్లుగను ; (5) సరసముగను ; (6) సుబోధకముగను సంభాషణలుండుట యావశ్యకము.

కావ్య మతిలౌకికానందదాయి. నేఁటి సాహిత్య వివిధాంగములయందు నవల కవిరళప్రచారమున్నది. అందుచే నది రసాత్మకముగూడ నైనచో నత్యంత ప్రభావశాలిగా నుండగలదు.

దేశ కాల పరిస్థితుల చిత్రణమును నవలలో వాతావరణమందురు. ఇది ద్వివిధము. ఒకటి సాంఘికము ; రెండు ఐతిహాసికము.

జీవన వ్యాఖ్యయే దీని ముఖ్యోద్దేశము. రూపక పద్ధతియు స్వతంత్ర పద్ధతియు నని రెండు పద్ధతులుగా నవలలో జీవితమును వ్యాఖ్యానింపవచ్చును.

## నవల : సత్యమునకు స్థానము :—

ఇందలి సత్య మలౌకికమైనది. లౌకిక యథార్థమే, కావ్యమందు అలౌకిక యథార్థముగా మారును. అదియే సత్యము. అనఁగా నలౌకిక యథార్థము కావ్యసత్యము. లోకమందలి సత్యము విజ్ఞానపరకము. కాని, కావ్యసత్యము భావనాప్రసూతము, ననిర్వచనీయమును. నిత్యము జరుగునదియే కేవలము సత్యముకాదు. ఏది కాఁగలదో యదియుఁగూడ [వృత్తము, వర్తమానమునుఁగాక వర్తిష్యమాణముఁగూడ] సత్యమే! జుగుప్సాకరమైన మానవజీవితముఁగూడ కావ్యనాటకనవలాది సాహిత్యప్రక్రియలలో నాదర్శముపై నాధార

బడి, యాదరణీయమును, సార్వకాలీనమును, సార్వదేశికమును, నిత్య నూతనమునునై యింద్రజాలమువలె నత్యంతాకర్షకముగుచున్నది.

## నవల: అందలి వాస్తవికత

వాస్తవికతకు నవలయం దుచితస్థానమున్నది. నవలయందలి సత్యపరత వాస్తవికతకును, సంభావ్యతకును [ప్రాయోభావమునకును] సంబంధించినది. జరుగఁగలవియు, నిత్యమును లోకసమ్మతమై ప్రవర్తిల్లినవియు, మాత్రమే నవలయందు స్థానమునకర్హములు. నవలయందలి సంఘటనములు నిత్యలోకజీవిత సంబద్ధములగుటచే వాస్తవికములు; కాని వానికి నిజమైన యస్తిత్వము లేకపోవుటచే కల్పితములు.

## నవల : నీతిబోధ

భావములయు నుద్దేశములయు స్ఫూర్తికి [మెఱుఁగునకు] నీతిబోధ యావశ్యకము. కాని, నీతిని, కథావస్తువులో క్షీరమునందు శర్కరవలె, మేళవమొనర్పుటయందే నవలాకారుని ప్రావీణ్యము గోచరించును.

## నవలయందలి తెగలు

ప్రధానముగా నవలలాఱు తెఁగులు :

(1) ఘటనా ప్రధానములు (2) కౌతూహల ప్రధానములు [లేక ఆసక్తిజనకములు, లేదా, కాల్పనికములు] (3) శీల ప్రధానములు, (4) సంఘ చిత్రణ ప్రధానములు (5) ఇతిహాస ప్రధానములు (6) మనః ప్రవృత్తి నిరూపణ ప్రధానములు.

రాజకీయ వస్తు ప్రాధాన్యమునుబట్టి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి', శ్రీ ఉప్పల లక్ష్మణరావుగారి 'అతడు-ఆమె' మున్నగువానివంటియు; నిర్దిష్ట ప్రయోజనమునుబట్టి కేవలము పాఠశాలా విద్యార్థుల కుద్దేశింపఁబడిన శ్రీ విశ్వనాథవారి 'పరీక్ష', 'స్నేహఫలము', శ్రీ హనుమదింద్రగంటివారి 'మహామంత్రి' మున్నగువానివంటివియు నేగాఁక, నింక క్రొత్త విధములగు నవలలు పెక్కు వెల్వడుచున్నవి.

పూర్వపు పురాణేతిహాసములలోని యాఖ్యానోపాఖ్యానములను నేఁడు, నవలలుగఁ గొందఱు వ్రాయుచున్నారు. 16. వీనిని పౌరాణిక నవల లన్నను విరోధము రానట్లుగ పదమైత్రిఁ గుదుర్చుకొనవచ్చును. మఱికొందఱు 'మనుచరిత్ర', 'వసుచరిత్రా'ది ప్రబంధములను నవలీకరించుచున్నారు. ఇవి ప్రబంధ నవలలు. చలనచిత్ర నిర్మాణమునఁ దోడ్పడు సూచ్య సంకేతాదుల పరిభాషగల నవలలు వేఱొకమాదిరివి. వీనిని చలనచిత్ర పారిభాషిక నవలలందము. ఏదో యిట్టిదాని నొకటి శ్రీ శ్రీ గారు వ్రాయుచున్నారనియో, వ్రాయనున్నారనియో యొక వదంతి. అట్టివి యిట్లుండఁగలవేమోయని నే నూహించుచున్నాను.

16. శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు 1908 నాఁటికే, నన్నపార్యుని శకుంతలోపాఖ్యానమును 'చిత్రశాకుంతల'మని, 800 పుటలలో నవలీకరింప నెంచి, 100 పుటలు వ్రాసి, యా నాఁటికి దేశకాల పరిస్థితులు అనుకూలింపమిచేతను, నేఁటి శిల్పసామగ్రి నాఁడు కూడిరామిచేతను, నుపసంహరించుకొనిరి. కాన నదియొక యసంపూర్ణము, నముద్రితము నగు నవలగా మిగిలినది.

ఇది కేవలము నా యూహము; పొరపాటునుఁ గావచ్చును. ఆవేశోహాలవలన తల దిరదిరఁ దిరుగు నొక పాత్ర, కుర్చీలో కూర్చుండి, లేచి, మఱల కూర్చుండి, లేచిపోవు ననుకొందము. అదియే చలనచిత్రమునం దగుచో, నా కుర్చీని కొంత సేపు పాత్ర నిష్క్రమించిన పిమ్మటఁ గూడ గిరగిరఁ దిరుగుచున్నట్లే చూపుదుము. ఊహాల వలనను, నూహాల వలనను, తల తిరిగిపోవుట కట్లు కుర్చీ తిరుగుట సంకేతము. ఈ విషయమును నిరూపించుటకు నవలాకర్త యగుచో నా పరిభ్రమణమును వర్ణించి దాని సాంకేతికార్థమునుఁ గూడ సూచింపవలెనేమో! ఏది యేమైనను, నిది నా యూహామంటిని గదా! కనుక నిట్టి నవలలకై సంభావ్య భవిష్యములోని కన్నులు సాచి, లేచి చూతము.

ముందు ముందునకు తొంగిచూచిన కొలఁది నొక విచిత్రము తోఁచుచున్నది. రచయితకును, పాత్రలకును, అవినాభావ సంబంధము లేకపోవుటయే గాక, సుదృఢబంధము నేని లేని నవలలు వెలువడఁగల వనుటకు పైఁజెప్పిన పౌరాణిక నవలలు, ప్రబంధ నవలలే, సాక్ష్యము. ఇది దక్షతతో నిర్వహింపఁబడినచో నన్న నా మాట లేదు. నేఁడు మన యాంధ్రభాష యందే కాదు, పాశ్చాత్య భాషల యందునుఁ గొందఱు నవలాకారులున్నారు; వారి మతమునఁ గడు పెద్దదియు, వదులు వదులైనదియు నగు నొకరకపు పీలికలసంచి వంటిది నవల. అందు చిత్ర విచిత్ర పరిశీలనలు. అపరిష్కృతాభిప్రాయములు ననదగు ప్రేలాడు పీలికలనుఁ గూడ దూర్పవచ్చును. గద్యాత్మకమైన ప్రతికథయు నవలయగు దినములు వచ్చినను వింత గాదు. కాని, శిల్పసామగ్రి వినియోగమునుఁబట్టియే దానిస్థాయి స్థిరీకరింపఁబడునను సార్వకాలిక సత్యము.

# తియ్యని తలపు

శ్రీ కుంటిమద్ది శేషశర్మ

అంద మొలుకుచున్న బృందావనోద్యాన
కుంజ చంద్రకాంత కుట్టిమమున
నింపు సొంపు గులుకు నిందీవరాక్షితో
సరస మాడుచున్న తరుణు డొకడు;
"రమణి యాంధ్రప్రదేశపు రాజధాని
హైదరాబాదు గాంచినా వందు నెందు
నయన సుభగ మీ బృందావనమును బోలు
పార్కు గనుగొంటివేమె? శంపాలతాంగి!

"ఒక చోట జలయంత్రికోన్నున్న వాఃపూర
ములు వసంతము లట్లు ముదము సూపు;
నొకవైపు మెటికల నురలి పారెడు నీరు
బాల తృణంబుల లీల మెరయు;
నొక క్రేవ సాచిగా నుమియు శంబరధార
కదలని మెరపునాఁ గానిపించు;
నొకచెన నొండొంటి నొరసెడి జలయష్టు
లిరులేన్గు దంతాల యింపునింపుఁ;
బలుతెరంగుల మెరపు దీపాల మహిమ
ముచ్చటలు గొల్పు నారామమునఁ బ్రశాంతి
మసృణ శీతల శశికాంతి మణివితర్దు
లందు నున్నారు దంపతు లందునందు.

"పొదరిల్లు పుష్పించి నదివోలె రంగు రం
గుల బల్బుదీపాలు వెలుగుచుండ,
కందు డిందొనరించి చందమామల నిల్పి
నట్లుగా మెర్క్యురీ లైట్లు వెలుఁగ,
పసిని గొట్టులు చేతి పసిడి బల్మరు దీసి
మూసినట్టుల గొన్ని పులపరింప
మండలాకృతి దీపమాలికల్ గిర గిర
భ్రమియింపగా సుదర్శనము వోలె
కీలు బొమ్మలు నర్తనకేలి సలుప
వీను దోయికి రేడియో విందొనర్ప

గుబ్బెతలతోడ తరుణులు కూడి యాడి
పొందుచున్నారు హాయి పూబోదరుటిండ్ల.

"సిగ్గు దొంతరతోడి చిన్నారి యాల్మొగల్
ముసి ముసి నగవుల ముద మొసంగ,
జనవు బలసిన ముగ్ధ జంపతు లలపోక
సంభాషణలతోడ సంభ్రమింప,
బిగువు ప్రాయముతోడ జిగిదేరు దంపతుల్
కలగి పుక్కిటబంటి వలుకుచుండ,
వత తొంగిచూచినకురుల జాయాపతుల్
వాదోప వాదాల మూదలింప,
కేళ గంగేలు గదియించి వాలుచూపు
వలపుకత్తెల తోడ నవాళ్ళు సేయు
తరుణు లుసికొన సారాయ మొరపు మిగిలె
చెరిరి చూపుల గురియింత విరహి గుములు."

అనగ, "మైసూరి వారి భాగ్యంపు రాశి
కెల్లువలుగట్టి పారు కావేరి తల్లి,
పరమ దయనిచ్చె విద్యుత్తు వరముగాను
బరపిసా రింద్రజాల మపారముగను.

"చింతపలదు ప్రధాని సంజీవరెడ్డి
శక్తి శక్తి సాగార్జున సాగరమున
చింతకెంచెను కోటి మహేంద్ర జాల
ములును దిద్దించు" నటంచు నా మోహనాంగి.

# వామనభట్టబాణుని భావరూపకము

శ్రీ కనగవ నరసింహస్వామి

భట్టబాణు డన్నంతనే సహృదయుల తలపుపాలమున మొదట విహరించు వాడు, కాదంబరీ కావ్యరసకుంభ నిర్మాత. అతడు వాత్స్యాయన వంశసంభవుడు. పార్వతీపరిణయ రూపక కర్త బాణుడుకూడ వత్సాన్వయ జలధి సంభవుడు. ఏవం విధమైన యైక్యమే, యిరువురు నొక్కరే యను నిర్ధారణమునకు దారి తీయించినది. కాని, శ్రద్ధాళువులైన రూపకపఠితలు కొందఱు రీతి వైలక్షణ్యము నుపలక్షించి, నాటకము ప్రసిద్ధ బాణభట్ట కృతము కాదేమోయని స్వగతముగా, ప్రకాశముగా సందేహించిరి; బాణకవి 'నూనూగు మీసాల నూత్న యౌవనము' నాటి కృతియని సమాధాన పడిరి. ప్రాచీనాలంకారికు లెవరును 'పార్వతీ పరిణయము' పేరెత్తలేదు. మఱి, కాళిదాసునికుమారసంభవమున కీకృతి అనుకృతి. 'బాణోచ్ఛిష్ట మిదం జగత్' అని ప్రథితుడైన భట్టబాణు డనోచ్ఛిష్టమున కాసపడునా యని విమర్శకులు కించపడిరి. రెడ్డిరాజుల యశఃకోకిలము వామనభట్టబాణు డనుకరణప్రియుడగుట, నాతని కావ్యములన్నియు నా యా పూర్వకవుల కావ్యముల కనుకరణ రచనములగుట, కుమారసంభవమునకు రూపాంతరకృతియైన పార్వతీ పరిణయ నాటకము వామన భట్ట బాణ కృతియే యని నిశ్చయించిరి. 'వత్సవంశ శిఖామణి' యైన యీ కవి, తన గ్రంథముల యందును, రూపకమును స్మరింపలేదు. ఇతర కృతులందువలె గాక, నాటకమున బాణుడని మాత్రమే కలదు. ఇది 'నామైకదేశే నామగ్రహణం'గా గ్రాహ్యము. కొందఱు తలచినట్లు, భట్టబాణు డనునది కవికి బిరుద మనరాదు.

వామనభట్టబాణుడు వేదభాష్యాది కర్తలగు విద్యారణ్యుల శిష్యుడు. తండ్రి కోమటి యజ్వ. పితామహుడు వరద యజ్వ. వీర నారాయణ చరితము (వేమభూపాలచరిత్రము: గద్యకావ్యము), నలాభ్యుదయము (పద్యకావ్యము: 8 సర్గలు), హంసదూతము (ఖండకావ్యము), రఘునాథచరితము (పద్యకావ్యము: 30 సర్గలు), శృంగార భూషణము(భాణము), శబ్దచంద్రికాకోశము(నిఘంటువు: ర సర్గలు), శబ్దరత్నాకరము (నిఘంటువు: మూడు కాండములు) వామనబాణుని యితర సంస్కృత కృతులు. కాలము పదునైదవ శతాబ్ది (క్రీ. శ.). ఆంధ్రకవి శ్రీనాథుడు, గీర్వాణకవి యీ బాణుడు సమకాలికులు; కొండవీడు రాజధానిగా, తెనుగుదేశము నేలిన వీరనారాయణ, సర్వజ్ఞ చక్రవర్తి, పెదకోమటి వేమారెడ్డి విద్వదాస్థానమునకు సూర్య చంద్రులవంటివారు. ఆస్థాన సంస్కృతకవి బాణుడు. విద్యాధికారి శ్రీనాథుడు. ఇరువురు నాంధ్రదేశీయులు. ఉద్దండులైన పండితకవులు. నాడు కవి సార్వభౌముడు శ్రీనాథుడే కాదు; ఈ వామన భట్టబాణుడును.

"అస్తి కవిసార్వభౌమో వత్సాన్వయ జలధి సంభవో బాణః,
నృత్యతి యద్రసనాయాం వేధోముఖ లాసికా వాణీ." పా. ప.

పార్వతీ పరిణయ నాటకము, కాళిదాసకుమార సంభవ కావ్యమునకు ప్రతిబింబము. పంచమాంక పరిచ్ఛిన్నము. కుమార సంభవమున నేడు సర్గలలో ప్రవృత్తమైన కథ, నాటకమునకు గథావస్తువు. శ్రవ్యదృశ్య కావ్యముల నిసర్గభేదమునుబట్టి, రూపకమున మార్పులును, చేర్పులును లేకపోలేదు. కవికుల గురువు కుమార సంభవమును నాటకీయముగా నిర్మించెను. రహస్యము నెఱిగి వామనుడు నాటకీకరించెను.

ప్రథమాంకమున, మేనాద్వితీయుడైన హిమవంతుని కడకు నారదుడరుదెంచి ఉమాదేవిని శంకర పరిచర్యార్థము నియోగింపించును. ద్వితీయాంకమున, మహేంద్రప్రేరితుడైన కాముడు రతి వసంతులతో, శివతపోభంజనార్థము కుబేరాశ్రమమునకు నడలును. తృతీయాంకమున, నారదుడు ప్రవేశించి, మహేంద్రునకు మన్మథ దాహవృత్తాంతము వినిపించును. రంభ, పార్వతీ తపశ్చరణ ప్రస్తావనము చెవివేయును. చతుర్థాంకమున, పరమేశ్వరుడు మాయాబ్రహ్మచారివేషమునవచ్చి, శివనిష్ఠమైన పార్వతీ ప్రణయమును పరీక్షించును. పంచమాంకమున, పార్వతీ పరమేశ్వరుల పరిణయము, మన్మథ పునరుజ్జీవనము జరుగుటతో తెరవ్రాలును. సంగ్రహముగా కథ యిది.

నాటకమంతయు నారదునిమీద నడచును. అతడు లేనిదే నాటకమే లేదు. 'పార్వతీ పరిణయము'నకు పరమప్రయోజనము తారకాసుర సంహారము. తారకాసుర సంహారమువలని లాభము దేవతాక్షేమము. అజన్మము అమరకార్యఘటనాకుతూహలితా సంవలితుడైన నారదుడింత కథాసూత్రమునకు సంధాత.

"ఉపక్షిప్తం బీజమ్. కర్తవ్యం చ సామాన్యవృత్త్యా నివేదితమ్. తద్యథాగతం గమిష్యామి." అను స్వగతముతో, నారదుడు హిమవత్సన్నిధానమునుండి వెడలును.

తనవలెనే, దేవకార్యార్థము కుబేరాశ్రమమున కరిగిన మన్మథుని, తిరస్కరిణీ విద్యాప్రభావమున ననుసరించిపోయి, తిరిగి వచ్చి, మహేంద్రునకు మన్మథదాహము వివరించి, శోకాకుడైన మహేంద్రునకు; "ఉద్భవిష్యతి పునశ్చ తే పతిః పార్వతీ పరిణయే పినాకినః."—అని రతినోదార్చిన ఆకాశవాణి అవాణి వినిపించి, ఆశ్వాసము గలిగించును.

పంచమాంకమున, పార్వతీ పరిణయ సందర్భమున హిమవంతుని సమీపించి, "హిమవన్, అభ్యుదయః ఖలు తత్రభవతః.—"అని యనగా, కృతజ్ఞుడైన హిమవంతుడు, "భవదుపక్షిప్తస్య ఫల మిదం బీజస్య" అని సవినయముగా విన్నవించును. పరిణయానంతరము, "భగవన్, దేవకార్యహేతోః కృతావతారం కందర్పం పునః గృహీత వపుషం వదకముల నేడినంత భవాన్ అనుగృహ్ణాతు." అని

శంకరుని కంఠసీ బంధమునట్టి, అభ్యుదయాంత విఘ్నతిమిరమైన నిజ ప్రయత్నమును ఫలోన్ముఖముగా కొనసాగించి, వీణాముని విస్మయింపించును.

నాటకమున ప్రతిపాత్ర ప్రవేశమునకు ప్రయోజనము చూపక తప్పదు. వేదకాదుల సంప్రదాయమునకు అనువర్తుడు కాడతడు. వాని కవి అంతియ.

"గురో ర్నిదేశాగా ర్వ నగేంద్ర కన్యా
స్థాణుం తపస్యంత ముపేత్య కాయాన్,
అస్యాం త్ర ఇత్యప్సరసాం ముఖేభ్యః
శ్రుతం మయా మత్ప్రణిధిః సవర్గః"

అను కుమారసంభవమందలి శ్లోక మాధారముగా, రంభాపాత్ర మీ రూపకమున సృష్టింపబడినది. తారకాసుర బందిగ్రహణ బాధ్యసపరిశంకితమైన అప్సరోజనమునకు ప్రతినిధిగా నీమె ప్రవేశము ద్వితీయాంక ప్రారంభ విష్కంభకమున చూపబడినది.

మదనకోదండ నిరంతర నిస్సరచ్ఛరనికరజర్జరిత హృదయురాలై, తపోవనము వంచించి కుబేరవనమునకున్న నలకూబరుని అభిసరించిన రంభ, తృతీయాంకమున—"మన్మథదాహేన దగ్ధమనసో తథా పార్వతీ పరమేశ్వరేణ తతి ముఖిలఖంతీ కతిపైః తపస్సరణైః అత్మనోభిలాషం పూరయితు మిచ్ఛతీతి"—అని విన్నవించి, మహేంద్రునకు పార్వతీ పరమేశ్వర పరిణయ ప్రాప్త్యాశ కల్పించును.

చతుర్థాంకమున, నంది నీలలోహితు నానతి మేరకు మునివేషము గ్రహించి గౌరీశిఖర నామక హిమశిఖరమున శివనిబద్ధభావమున బహుకాలమునుండి తపము చేయుచున్న పార్వతీదేవి నియమాఖిలాభిబంధములు తన్ముఖమున జయావిజయుల ముఖమున తెలిసికొని మరలిపోయి పరమేశ్వరునకు నివేదించును. ప్రియాప్రణయపరోక్ష పరీక్ష, ప్రత్యక్ష పరీక్షకంటె రసికులైన ప్రియులకు కడు మనోజ్ఞముగదా! ఈ సందర్భము వామనభట్టబాణుని స్వయంసృష్టి అనవచ్చును.

## మూలములు :

రామాయణమందలి కుమారసంభవకథ ఆధారముగా, కాళిదాసు భువనమనోహరమైన కుమారసంభవకావ్యము రచించెనని విమర్శకు లనుచున్నారు. కుమారసంభవము అను నామకరణమే రామాయణమునుండి స్వీకరించెనట.

"ఏష తే రామ గంగాయా విస్తరోఽభిహితో మయా,
కుమారసంభవశ్చైవ ధన్యః పుణ్యస్తథైవ చ."

కుమారసంభవము అనగా నే కావ్యమందు కుమారస్వామి సంబంధించిన గాథ వర్ణింపబడునో అది. నిజమునకు, రామాయణమున పార్వతీపరిణయమునకు సంబంధించిన కథ లేదు. కుమారస్వామి జన్మకథ మాత్రము విపులముగ కలదు. ప్రాస్తావిక ప్రసంగమున, అనంగవిషయము సూచింపబడినది. అందు, హిమవంతుని భార్య పేరు మనోరమ, మేనాదేవి కాదు. వారికి తనయ లిద్దఱు. గంగానది సముద్రగత కాగా, ఉమను శివున కొసగిరి. ఈ కథయే కాళిదాసు కుమారసంభవ కావ్యమునకు మూలమైనచో, కవికులగురుని కథా నిర్మాణ చాతుర్యమునకు విలగట్టగలమా!

కాని కుమారసంభవకథ శివపురాణమునందు గలదు. అందలి కథనే గ్రహించి, కాళిదాసు కావ్యగ్రథనము చేసెనను వారు గలరు. శ్రుతిస్మృతి పురాణేతిహాస కావ్యనాటకాలంకార—ఇత్యాది రచన క్రమమును విశ్వసించినవారిమాట అది. పురాణమనుట కది పురాతనరచనమే కానక్కర లేదనుటకు, పురాణలక్షణము చాలును. 'కుమారసంభవము'నకు శివపురాణము నందలి పార్వతీచరిత్రమునకు కథా సాదృశ్యము సమగ్రముగ, కవితాసాదృశ్య మల్పముగనుండుట గమనార్హము.

శివపురాణమునగూడ, పార్వతీచరిత్రము 'అస్త్యుత్తరస్యాం' అను కుమారసంభవ ప్రథమ శ్లోకభాగముతోనే, ప్రారంభించును. కథావస్తువు క్రమమునుబట్టిచూడగా కుమారసంభవమునందు వలె సుసంస్కృతముగాలేక, సంకీర్ణముగా నున్నది. అందు పార్వతి, శివుడు మన్మథుని దగ్ధముజేసి, తన్ను విరహసాగరమున ముంచెనని విచారించి, భక్తవత్సలుడైన పరమేశ్వరుడు తపశ్చరణమాత్ర సాధ్యుడని నారదు డుపదేశించిన శివపంచాక్షరీ మహామంత్రమును జపించుచు, తపోనిమగ్నయగును. సప్తర్షులు ముందుగా గౌరీ నియమబంధము పరీక్షింతురు. పిదప శివుడే వృద్ధయతి వేషమునవచ్చి పార్వతీ తపోగాంభీర్యమును పరీక్షించును. పతివియుక్తయైన రతి, పరమేశ్వరుని వెంటనే పరిపరివిధముల ప్రార్థింపగా, నతడు 'నీ భర్త నీకు సశరీరుడుగా, నన్యుల కశరీరుడుగా శుభంకరుడగుగాత'మని వర మొసగును. ఏ కథ దేని కాధారమో దీనినిబట్టి స్పష్టముగాకున్నను, కాళిదాసు నిజకావ్య కథావస్తువులను పురాణములనుండి స్వీకరించుట చేత, పల్లవిల్లిగ నల్లుకొనిన శివపురాణగాథను సంస్కరించి గావ్యముగా వ్రాసెనని పురాణభక్తులు నమ్మవచ్చును. నమ్మకుందుమా, కాళిదాసు కావ్యకథావస్తువులు స్వకపోలకల్పితములనియు, నవియే పురాణముల కెక్కినవనియు సాహసించి నమ్మవలసియుండును. సత్యము భగవంతుని కెరుక. ఇక, వామనభట్టబాణుని పార్వతీపరిణయ నాటకమందుమా, కుమారసంభవమును సర్వథా అనుసరించిన రచనము, పైపుడైన అతండీతకవి శివపురాణమునుగూడ చూచెననుట స్పష్టము.

## అనుకరణములు

వామనభట్టబాణుడు, 'కుమారసంభవము'నందలి శ్లోకముల భావములను గ్రహించి, గద్యముగా మార్చి, మార్చి శ్లోకము లల్లి నాటకమున గూర్చెను. భావము కాళిదాసీయముగా, పాఠము వామనీయముగా చెక్కుచోట్ల గాన్పించును. అంతంత స్వీయభావసాహిత్యమైన మధురపద్యములను చేయలేదు. యథాక్రమముగా గాకపోయినను, పార్వతీపరిణయమునందలి ప్రతివాక్యమునకు, కుమారసంభవమున మూలము చూపవచ్చుననుట విస్మయజనకము గాదే! కవికుల గురుని భావములను వ్యాఖ్యాప్రాయముగా రచింపబడిన శ్లోకములును కొన్ని గలవు. ఇట్టి ప్రయత్నములలో మూలకారుని శ్లోకములకు వన్నెపెట్టుటతోపాటు, వామనుడు కొన్ని శ్లోకముల భావములను మార్చి, ఉన్న అందము చెడగొట్టుటయు జరిగినది.

"లాంగూల విక్షేప విసర్పిశోభై
ఇత స్తత శ్చంద్రమరీచిగౌరైః,
యస్యార్థయుక్తం గిరిరాజ శబ్దం
కుర్వంతి వాలవ్యజనైః చమర్యః"

అను శ్లోకము నర్థభాగ భావమును గ్రహించి, హిమవద్వర్ణన ప్రకరణమున, "అహో మధునా చమరీబాలవాల విక్షేపవిరచితా శిశిర చంద్రోదయ విలాసేన కటకవర్త్మనా ప్రవిశామి యావన్నోదధి ప్రస్థమ్।"—అను నారద ముఖవచనముగా రూపకకర్త చమత్కారముగా లిఖించెను.

మహేంద్ర సన్నిధానమున నారదుడు వర్ణించిన అకాల వసంతోదయమునకు, బాణుని స్వీయ శ్లోకములు దోహదక్రియ నెఱపినవి.

"అసూత సద్యః కుసుమాన్యశోకః
స్కంధాత్ ప్రభృత్యేవ సపల్లవాని,
పాదేన నాపైక్షత సుందరీణాం
సంపర్క మాశింజిత నూపురేణ."

అను 'కుమారసంభవ' శ్లోకము, సంప్రదాయబద్ధముగా పెంచబడినది.

"చూతాః కోరకితా వినాపి సుదృశాం హస్తాంబుజామర్శనాత్
తత్పాదాంబుజ తాడనై రపి వినా కంకేలయః పుష్పితాః,
తత్సంగీతక మంతరేణ హసితా రమ్యాః ప్రియాలద్రుమా
ముక్త్వా తద్వదనాసవం ముకులితా గంధోత్తరాః కేసరాః."

కుమారసంభవము నందలి,

"మధుద్విరేఫః కుసుమైక పాత్రే
పపౌ ప్రియాం స్వామ్ అనువర్తమానః,
శృంగేణ సంస్పర్శ నిమీలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః."

అను శ్లోకమునకు సహోదరముగా,

"వక్త్రం ప్రియాభిః బహుమానపూర్వం
ఆపాద్య మాత్తాసవ మన్యపుష్టాః,
ఆమోదిభిః పంచమరాగ భేదైః
ప్రాబోధయన్ పంచశరావలేపమ్."

అను శ్లోకము రచింపబడినది.

"అథాజినాషాఢధరః ప్రగల్భవాగ్
జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా,
వివేశ కశ్చిత్ జటిల స్తపోవనం
శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా."

ఈ శ్లోకమునకు, వ్యాఖ్యాప్రాయమైన ఈ క్రింది రచనము.

"అంసే కృష్ణాజినశ్రీః త్రిగుణవిరచితా మేఖలా శ్రోణిభాగే
పాణౌ ఆషాఢదండో ధసిత విరచితం పుండ్రకం ఫాలదేశే,
వక్త్రే ఫుల్లస్మితం పవిత్రం శ్రవసి పరిణమన్మానసం గే పిశంగే
మాలేవం కైటజానాం జయవలయమివం స్ఫాటికంచ ప్రకోష్ఠే."

"మంగల మజ్జనవేళా కర్పూరక్షోద పాండురమ్ తనుమ్,
పార్వతీ మవధారాత్ స్మారిత శరదిందు చంద్రికోద్భవమ్."

వామనుడు వ్రాసిన పై శ్లోకము కుమారసంభవ కావ్యకర్త వ్రాసిన యీ క్రింది శ్లోకమున కనుసరణము.

"సా మంగలస్నాన విశుద్ధగాత్రీ
గృహీత ప్రత్యుద్గమనీయవస్త్రా,
నిర్వృత్త పర్జన్య జలాభిషేకా
ప్రఫుల్లకాశా వసుధేవ రేజే."

మూలకర్త 'వసుధ' అనగా, అనుకర్త 'గగనము' అనెను. ఆయన 'ప్రఫుల్లకాశా'కు ఈయన 'శరదిందు చంద్రికోద్భవమ్' ప్రతికల్పనము. ఈ చిన్నమార్పువలన ఉన్న అందము చెడలేదా?

నిజరూపమును చూపిన శంకరుడు, పార్వతితో, "అద్య ప్రభృత్యవనతాంగి తవాస్మి దాసః క్రీతః తపోభిః"—అని కుమారసంభవమున పలుకుచుండగా, రూపకమున శంకరుడు,

"పరిణాహి స్తనయుగలం కృశ మవలగ్నం చ కేన కిం గిరిజే,
తవ మా స్తదాన చతురః తపసాహి కృతోఽయమస్మి దాసజనః"

అని పార్వతిని భ్రమపెట్టుచున్నాడు. మార్పు చేర్పులందము రసికులు గమనింపుడు.

"అన్యోన్యస్య సముత్సుకతయోః అన్యోన్యస్య ప్రరూఢ ప్రేమ్ణోః,
కోఽయత్నే నిశాకరయోః యువయో ర్భవతు కోఽప్యనురాగః"

శంకరుని భవిష్యదర్ధనారీశ్వరత్వమునకు సూచకమైన శ్లోకమిది. పతివల్లభతా ప్రాచుర్య మెఱిగిన పురంధ్రుల ఆశీర్వచనమున వివాహ సందర్భమున లౌకికముగానే ఉన్నది. కవి ఆశించి ప్రయోజనమో చేకూరినది. కుమారసంభవమున నీ శ్లోకమునకు మూలము లేకపోవునా!

"అఖండితం ప్రేమ లభస్వ పత్యుః
ఇత్యుచ్యతే తాభి రుమాస్మ నమ్రా,
తయా తు తస్యార్ధశరీరభాజా
పశ్చాత్ కృతాః స్నిగ్ధజనాశిషోఽపి."

"తానర్ఘ్య మర్ఘ్య మాదాయ, దూరాత్ ప్రత్యుద్యయౌ గిరిః,
నమయన్ సారగురుభిః పాదన్యాసైః వసుంధరామ్"

అను కాళిదాసవాణికి వన్నెపెట్టుచు, స్నిగ్ధగంభీర నిర్ఘోషముతో వామన బాణుడు శంకరుని నోట నెట్లు పలుకుచున్నాడో!

"అతి గురుచరణక్రమైః వితన్వన్
అవనమితోన్నమితస్థలా మివోర్వీమ్,
వినయ ముపదిశన్నివ ఆత్మభాజామ్
అయ ముపసర్పతి మామ్ అగాధిరాజః."

ప్రథమాంకమున నారదాకాశగమనవర్ణనము కాళిదాసు నభిజ్ఞాన శాకుంతల రూపకమున సప్తమాంకగతమైన దుష్యంతుని రథయాన వర్ణనము ననుకరించుచున్నది.

అభిజ్ఞాన శాకుంతలము:—

"దుష్యం:—మాతలే, తస్మాత్ కథయ కతమస్మిన్ మరుతాం పథి వర్తామహే.

మాతలి:—"వాయో రిమం పరివహస్య వదంతిమార్గమ్"

దుష్యంతః:—మాతలే వేగావతరణాత్ ఆశ్చర్యదర్శనః సంలక్ష్యతే మనుష్యలోకః

"శైలానా మవరోహతీవ శిఖరా దున్మజ్జతాం మేదినీ
పర్ణాభ్యంతర లీనతాం విజహాతి స్కంధోదయాత్ పాదపాః,
సంతానైః తనుభావనష్ట సలిలా వ్యక్తిం వ్రజం త్యాపగాః
కేనాఽప్యుత్క్షిపతేవ మర్త్యభువనం మత్పార్శ్వ మానీయతే."

పార్వతీ పరిణయము:—

నారదః:—పరివహాన్నాన్ముః పవనస్య సంతానం ప్రాప్తా నస్మి.....అయే, మధ్యమలోకస్య నేదీయాంసం ప్రదేశముప ప్రాప్తోఽస్మి. యతః-

ఉద్యద్భిః శిఖరై రమీ కలితన వ్యజ్యంత ఏతాచలా
వైమల్యా దనుమీయతే చ సరితాం స్రోతస్వినీ సంతతిః,
మూచ్యంతే పరిమండలేన తరవో నీలాంబుదశ్రీముషో
మందం మంద ముపైతి లోచనపథగ్రాహ్యాం దశాం మేదినీ.
గిరివరతటినీ సుశైత్యైః దర్శనపదవీం క్రమాదుపాగతైః,
అవరోహతి మయి రభసా ద్భూరియమారోహతీవ గగనతలమ్."

"ఆరా దంజలిపేయ మత్ర వికసన్మందార పుష్పోద్ధితమ్
సౌరభ్యం పవనోపనీత మభితో ధావం త్యమీ షట్పదాః"

అను శ్లోకములోని భావమునకు వాల్మీకి రామాయణములోని,

"మేఘోదర వినిర్ముక్తాః కహ్లారసుఖ శీతలాః,
శక్య మంజలిభిః పాతుం వాతాః కేతకి గంధినః."

అను శ్లోకభావముతో సంవాదము సులభము గదా.
రామాయణమున

"ప్రకీర్ణ హంసాకులమేఖలా నాం"
"మీనోప సందర్శిత మేఖలానాం"

అనుచు నదీవర్ణనము గలదు. ఈ భావమును స్వీకరించని కావ్యము కాళిదాసీయ మొకటి కలదా? ఏతంవిధమనోజ్ఞ వర్ణనములకు రామాయణమే మొదటి భాండాగారము. ('పరంకవీనాం ఆధారం')

"బద్ధా మణిమయకాంచీ తస్యాః పరిణాహశాలిని నితంబే,
వంక్తిరివ పారసానాం సురసరితః పులినమండలాభోగే."

రూపకములోని ఈశ్లోకము, రామాయణ ప్రభృతి నెఱిగిన దేకదా.

ఈ అనుకరణము లిట్లుండగా, నన్నెచోడుని కుమారసంభవము (తెనుగు కబ్బము)లోని పద్యములకు నీడలనదగిన శ్లోకములు పార్వతీ పరిణయ నాటకమున నగపడుచున్నవి.

"అలులకునులుక మంథరములయ్యాని యీడని భయమ్ము నొందు నో
యిలలకు వెగ్గలించు గడు సేచిన మానిడి నూతనోరు దా
చిలుకలకల్కు గాముడని చెప్పిన తల్లడ మందు నిందు వ
న్నెలగని పొమ్ము బోవు ధరణీధరనందన గాముతేదనన్" కు. సం.

"శక్యాత్ వ్యావృతచండ నాత్రి పవనస్పర్శం న సంమన్యతే
శయ్యాం పల్లవకల్పితాం న సహతే చంద్రాతపం నిందతి,
సోఽహా పద్మపలాశనిర్మిత తను త్రాణాత ముత్సృజ్యతే
పా నీహార శిలాతలే ప్రణుపరం తాపాకులా వర్తతే" పా.ప.

విరహిణీదశను వర్ణించు నుపరిపద్యద్వయము అలంకార శాస్త్ర సంప్రదాయసిద్ధమే గావున ఈ భావతౌల్యము యాదృచ్ఛిక మందురా, క్రింది సామ్యమును త్రోసిరాజనలేము.

"తొడవులు తదవయవములకు
తొడవులొ సతి యవయవములు తొడవుల కమరం
దొడవులొ యని తర్కించుచు
బడతులు గైసేసి రచలపతి సుత కెలమిన్." కు. సం.

"అంగం భూషణనికరో భూషయతి శ్యేమరోలికో వాదః,
అంగాని భూషణానాం కామపి సుషమా మజీజనం స్తస్యాః."

వాయి పద్యములకు కాళిదాస కుమారసంభవ కావ్యమున మాతృకలు మృగ్యములు. లేదా

"క్రమమున నుద్భటుడు గవి
త్వము మెఱయ గుమారసంభవమ్ము నలంకా
రము గూఢ వస్తుమయకా
వ్యముగా హరులీల చెప్పి హరు మెచ్చించెన్."

అని కవిరాజ శిఖామణి పరిచయించిన ఉద్భట కుమార సంభవమే యిరువురకు నిట మూలమా! వామనుడు 'ఆంధ్ర కుమార సంభవము' చదివియుండు నందుమా!

## కొన్ని వెలుగులు:

వామనభట్ట బాణుడు సర్వథా కవికులగురువు నడుగుజాడలలో నడచుట స్వయము ప్రతిభాశాలి గాక కాదు. అట్లు చేయుటకూడ నా కవిదేవుని గౌరవించుటయే యని భావించెను. రహస్యము గుఱ్ఱెంచిన రసికులకు నీ రూపక మింపు నింపుటకు గారణ మెల్లెడ బాణుని శక్తి యద్వితీయము గానో ఆకర్షకమగుటయే. కొన్ని వెలుగులు మాత్రము చూపెద.

మంచుకొండ కొమ్ములచెంత విశ్రమించిన మబ్బులలో, ఔషధి ప్రస్థనగరస్థమణిభవనములు హాస్సు లింద్రచాపమును సృజించెనట! మందాకినీ పాథశ్శీకరములచేత మహతీ తంత్రీమండల మార్ద్రమైనది. జగట సైతము దేహప్రభా చంద్రికలచేత దిక్కుల వెలిగించుచు, నారదముని రెండవ చంద్రునివలె దివమారోహించుచున్నాడు! అంజలి పేయముగా పవనము మోసికొనివచ్చిన మందార పుష్ప సౌరభమును వలచి షట్పదము లంతట పరువులెత్తుచున్నవి. మరందము కొఱకు తుమ్మెదలు పూలచెట్ల నాశ్రయించుట ప్రసిద్ధము. అవి గాలిలోని తావికోసమే మూగుచున్నవని బాణుడు, కవిగా తెగించి భావించును.

వజ్రమునందు గొన్ని చూపులు, అమరసుందరీ ముఖములగొన్ని చూపులు, సేవకులయందు గొన్ని చూపులు బఱపిన సహస్రాక్షుడు, చిత్రచింతాపరునివలె బృహస్పతికి గనిపించుచున్నాడు. పార్వతి, అసేచనక తనుశ్రీ అట! రతిముఖ ముదిత విలాసములు గాంచుచు మన్మథుడు మహేంద్రునకు వచ్చెను. సురలోకసుందరీ కటాక్ష శృంఖలలచేత మన్మథుడు శంకరాదులను బంధించునట! గౌరి, శృంగారిత దహాఽతిజేవతబలె సఖులతోగూడి, పరమేశ్వర పరిచర్యార్థము వచ్చెను. పశుపతి విరహాగ్రహముచేత పాండుచ్ఛాయ కలితముగా శోభించిన పార్వతి నలిని నమద్యమున నుతసిరుహ యటు!

పార్వతీ పరిణయ మహోత్సవసమయమున, అలంకృతమైన నగరమునందు, నానావధూన మంతరాత్మా ప్రాదుర్భవమ్మాతన బల

దాగమునకు స్ఫురదున్నద్ధతోరణమణి ప్రభలు శతమన్యు శరాసన శ్రీ నైనవట!

"భవనాంగణమేదికాః రసాంగ్యా రపి రామా రచయంతి రంగవల్లీః,
కుచయోర్యుగళేన పూర్ణకుంభా నుపరుక్తా నివ పార్వతీ
మృగాక్ష్యః."

భవన ప్రాంగణములం దెలనాగలు ఎఱుపు, నలుపు, తెలుపు కడగంటిచూపులతో రంగురంగుల పెండ్లి ముగ్గులు తీర్చుచుండగా, ఆ మృగాక్షుల కుచయుగళములు పూర్ణకుంభములకు పొనరుక్త్యము ఘటించుచుండెనట!

భూపంకేరుహ కర్ణికాయిత తనువైన మేరుపర్వతము, దూర్వత్రిభూత భుజంగ రాజ కషణస్నిగ్ధోపలమైన మందరగిరి, కులాచల చక్రవర్తి కొమరితపెండ్లికి వేంచేసినవి. మేరువు భూమికి కుక్షిగానున్నదని పురాణములు. విద్యుద్వల్లీ వితానవ్యతికర సుషమము లాకసమున విస్తరించుచు, నీలోత్పల శ్రీలవంటినయన కాంతులు దిఙ్ముఖముల బ్రకటించుచు, దివమునందు గూడ స్మితరుచివిసరములచేత జ్యోత్స్నా లక్ష్మి నుత్పాదించుచు స్వర్వారయోషలు పార్వతీ పరిణయమునకు విచ్చేసిరి.

"ముక్తాతాటంక యుగమ్ ప్రతిముక్తమ్ కర్ణపార్శ్వయోరస్యాః,
ముఖకమల మివ నిషేవితుం ఆగతమ్ అమృతాంశు బింబయుగమ్."

ఉమాదేవి కర్ణపార్శ్వముల ధరించిన ముత్తెపు గమ్మలజో డామె ముఖకమలమును గొల్చుటకు దివినుండి దిగివచ్చిన జాబిలి జంటవలె నున్నదట!

## తెలుగు నీడలు:

పార్వతీ పరిణయదినమున, శిలాధరుడు (కంచుకి) వర్ణించిన ఓషధిప్రస్థ నగరమహోత్సవమునందు, తెలుగువారి యింటి పెండ్లి చందములు నీడగట్టును. "పటీరద్రవ భరితములగు జలములు వీథు లందు చిమ్మబడినవి. నవ చూత ప్రవాళములచేత చందనమాలికలు విరచింపబడినవి. భవనద్వారములందు పరిష్కృతములైన రంభాస్తంభములు కనబడుచున్నవి. మురజలు అమంద్ర ధ్వనులుసేయ, తంత్రీ స్వరములు మూర్ఛితముగా, వారాంగన లిందునందు నృత్యము సేయుచున్నారు. కొందఱు రాములు రంగవల్లులు రచింపగా, మఱికొందఱు పూర్ణకుంభములు దీర్చుచున్నారు, సౌధ ప్రాంగణములందు. —ఇత్యాది వర్ణనమునందు సర్వ సాధారణము, సార్వకాలికములైన భారతదేశస్థ వివాహ మహోత్సవ పరిష్కృత సంప్రదాయములే సుగోచరములైనను, కవి తెలుగువాడగుట, తెలుగు వారియింటి పెండ్లివలపులే గుబాళించె ననుట నిశ్చితము.

## అనౌచిత్య దోషములు:

కవి మన్నించిన అనౌచిత్య మీ రూపకమున ప్రచురము. 'ఆ కాలమున నది గుణమే. అప్పటి ప్రజ దాని నాదరించె' ననుట నాటి రసికసాధువుల నధఃకరించుట. దోష మెప్పుడును దోషమే. అనౌచితి నాదల ధరించు నతిసహృదయు లిప్పుడును మిక్కిలి.

ప్రథమాంకమున, హిమవంతుడు మేనాదేవి దగ్గఱ పార్వతీ ప్రత్యంగ వర్ణనము సేయును.

"ఆభోగశాలి కుచకుట్మల మాయతాక్ష్యా
వక్షోఽవకాశ మభివాంఛతి సంనిరోద్ధుమ్,
అప్యస్తి నాస్తి వచనా విషయేఽవలగ్నే
తన్వీ సముల్లసతి కాచన రోమరేఖా"
కుచయుగలం పరిణద్ధం యథాయథా వృద్ధిమేతి తన్వంగ్యాః,
వరచింతా వ్యాకులమనసః తథాతథా కార్శ్యమేతి మే గాత్రమ్."

సకల కులాచల చక్రవర్తి, వృద్ధుడునైన హిమవంతుడు పరకీయంబులె స్వీయతనూజ నిట్లు వర్ణించుట, దృశ్యకావ్యమునకు తీరని కళంకము. సహృదయ ప్రేక్షకులకు దుస్సహాతమము. శ్రవ్యకావ్యమైన 'కుమార సంభవము'న నీ సందర్భ మొకవిధముగా సమర్థనీయమైనను, ఆలంకారిక లోకము కవికులగురువును నిందింపక విడువలేదు. పయిగా, నాటకమున దేవతారూపమును కుచారంభముగా వర్ణించుట శాస్త్రవిరుద్ధము.

పంచమాంకమున, వృద్ధ కాశికి, హిమవన్నియోగమున పార్వతీ పరిణయ పరిష్కారము నివేదించును.

"హిమవాన్—కి మలంకృతా వత్సా?
కాశికీ—భగవన్, కథయామి. శ్రూయతామ్.
హిమవాన్—అవహితోఽస్మి!"

అని, యెడనెడ 'తతస్తతః'లతో హిమవంతు డవసరించును. పాపము, సమీపముననున్న నారదుడు మాత్రము వీనులు విచ్చి వినును. కనులువిచ్చి కనును.

"సన్నని వలిపముగట్టి, అలతినగలతోడి యొడలి నిండుగ వలపునూనె బూసికొని, పార్వతి మజ్జన మాచరించెనట! తెగబారెడు తలవెంట్రుకలు పిక్కల నంటుచున్నవట. నుదుటిపై మేనదీర్చిన గందపుబొట్టు, వలరాచవాని కత్తిన వెల్లగొడుగువలె నున్నదట! నికుదపిఱుదుల జుట్టిన మానికపు టొడ్డాణము మిన్నేటి యిసుకతిప్ప యందలి నెగ్గురుపిట్టల వరుసవలె నున్నదట! కరతలయుగపరిణద్ధముగా విజృంభించిన కుచకలశములు, కుంకుమముచేత నెట్టబడి కరిపతి సిందూరిత కుంభనక్షత్రమాలవలె నున్నవట!"

ఇత్యాదివర్ణనముల బరువుమోసిన పన్నెండు మృదుశ్లోకములను, వృద్ధురాలు తేకరువుపెట్టును, తుదకు హిమవంతుడు, "యద్యేవం తత్సమ్యగలంకృతా వత్సా. తద్భవత్యా సంనిధి విశేషేణ" అని యామెను బహూకరించును. హిమవన్నారదుల సన్నిధానమున నభ్యంగసేవనక్రియ మాద్యంతము వృద్ధకాశికి యింతగా తెగించి వర్ణించుట ఉచితమా? లేదా, ప్రథమాంకమున మామునట్లు వర్ణించిన తండ్రికీవర్ణనము కర్ణపేయమని యామె తలచినదో! కుమారసంభవకావ్యమున పార్వతీపరిణయ పరిష్కార ప్రకటన మింతకంటె మెఱుగు. ఉమాసౌందర్య నిరూపణమే యేవంవిధ వర్ణనా ప్రయోజనముగా, నాటకకర్త భావించియుండునా? రూపకమున స్నానాదులు ప్రత్యక్షముగా నిర్దేశింపరాదు గావున నిట్లు కల్పించినను, ఇంతగా వివరించుటకంటె నలంకారశాస్త్ర సమ్మతముగా ప్రవేశకాది సాహాయ్యమున సఖీముఖమున సూచించుట లెస్స.

పార్వతీ పరిణయ నాటకమున, బృహస్పతి పాత్ర చిత్రణము చిత్రముగ నున్నది. అతడిం దభిమానరహిత పాత్రము. మహేంద్రు డాయనను జూచి, వందనము గూడ జేయడు. బుద్ధికి బృహస్పతి యని ఖ్యాతిబడసిన ఈ అర్థ శాస్త్రవేత్త, యీ రూపకమున శాంతిక పౌష్టికకరణము వినా, అన్య విషయముల కంధుడు. పయిగా, నతడు మహేంద్రుని 'భగవాన్' అని రెండుసారులు సంబోధించి సన్మానించును.

"మహేంద్రః—............భగవతః చంద్రమౌళేః కిముద్వశీకరణం గౌరీపరిచరణమ్?

బృహస్పతిః—భగవన్, అన్యయువతిసామాన్యమేవ తాంత మన్యేథాః. యతః

అసేచనకతనుశ్రీ రంతఃకరణస్య కిమపి సంవననమ్,
సా ఖలు గిరిరాజసుతా సంమోహన మస్త్ర మేవ పుష్పేషోః.

మహేంద్రః—(సహర్షమ్) పుష్పేషో రిత్యుపోద్ఘాతేన స్మారితో౽స్మి స ఏవ తయోః గిరిజాగిరిశయోః ఘటనే పటీయానితి.

బృహస్పతిః—(సహర్షమ్)

త్రైలోక్య శాసనే దక్షా తావకీ మతి రూర్జితా,
శాంతికం పౌష్టికం కర్తుం శక్తా నః కేవలం మతిః.
యతో మదీయాపి బుద్ధి రిమాం వితర్కపదవీం నావతీర్ణా"
..............(ద్వితీయాంకము).

మహేంద్రాది సకల దేవతా చక్రమునకు నాచార్యస్థానము వహించు బృహస్పతి యంతవానిని పొట్టకోసము రాజును జేరి, మొగమిచ్చకములాడు తననాటి కేవల పురోహితుని గతి నాటక కర్త ప్రవర్తింపజేయుట ఔచితీసహము కాదు.

## రూపక నిర్మాణ నైపుణ్యము

పార్వతీపరిణయ రూపక కథావస్తు నిర్మాణము పటిష్ఠమే. "అథావమానేన పితుః ప్రయుక్తా" అను కుమారసంభవ కావ్యము నందలి శ్లోకమునకు ప్రతినిధియైన "దక్షాల్లబ్ధ సముద్భవా తదను తం త్యక్త్వా పతిద్రోహిణం" అను శ్లోకముచేత, నారద ముఖమున పూర్వగాథ పరిచయింపబడినది. పార్వతీ పరమేశ్వర పరిణయానంతరము, కుమారోదయ శుభోదర్కముగా,

"సకలజగతాం సవిత్రోః అనన్య సామాన్యమస్తు వాంప్రేమ,
భువన భయభంగదక్షో భవతు కుమారో౽పి తారకధ్వంసీ".

అని, సృష్టికర్తచేత నాశీర్వదనము పలికించి, 'ప్రజాయై గృహమేధినామ్' పరమ సత్యముగా, రసపరవశులయిన సహృదయ ప్రేక్షకులకు మఱొకసారి పార్వతీ పరిణయ పరమార్థమును జ్ఞప్తి కెలయించుచు; 'పార్వతీ పరిణయము' అను నామము సార్థకముగా వామనభట్టబాణుడు రూపకము నందముగా ముగించెను.

కుమారసంభవమునుండి స్వీకరించుటచేత, వస్తువు ప్రఖ్యాతము. అంగిరసము విప్రలంభ శృంగారము. అంగరస మద్భుతము. కుమారసంభవమున, మాయావటు వేషధారి శంకరుడేయని ప్రేక్షకులకు మొదట తెలియదు. "వివక్షి కశ్చిత్" అని మాత్రమే కాళిదాసు చెప్పెను. ఏతాదృక్సంవిధాన మద్భుతరస జనకము. వటువు శంకరుడుగా ప్రత్యక్షమైనపుడు, పార్వతితోపాటు, జయావిజయలతో సయితము, పఠితలుగూడ చకితు లగుదురు. రూపకమున, నీ సందర్భము వాచ్యము చేయబడినది. ప్రయోజనము, ప్రేక్షక ప్రపంచ కౌతూహల ద్విగుణీకరణము.

అలంకార శాస్త్రమున జెప్పబడిన నాటకలక్షణములు కించిదూనముగా పార్వతీ పరిణయమునకు బట్టకపోవు. ప్రత్యంకమున నేకదిన వృత్తాంతమే స్వీకరింపబడినది. ఇరువది పాత్రముల వరకు గలవు. ప్రముఖ పాత్రములు పదికి మించవు. సగము స్త్రీ పాత్రములే, అందు నాటకమునకు మంచి చలనముగలదు. విదూషకపాత్ర లేకపోవుట విచిత్రము. హాస్యమునకు, రూపకకర్తకు చుక్కెదురనవచ్చును. నాటకమున వ్యర్థప్రలాపములు కనిపింపవు. వచన రచనము గంభీరము; సరసాలాప పేశలము.

పార్వతీ పరిణయనాటక నాందీశ్లోకమొకటి మన్మథ పరముగ నున్నది. అది నాటకవస్తు సూచకమేగాక, తద్గత మన్మథదాహా వర్ణనశ్రవణ పాపపరిహారకము గూడ.

"సంపద మతరళలభ్యా మనన్యసామాన్యబహుళ దర్పనిధేః,
పుష్ణాతు చిత్తయోనేః అఘటితఘటనాపటీయసీ విభుతా".

ఆంధ్రకుమార సంభవకర్త నన్నెచోడుడును కావ్యాదిని మన్మథస్తుతి జేసెను. నిజదహనము వర్ణించిన వీరికి, పంచబాణుడు కోపించి ప్రవాసశిక్ష విధించునని, భయపడిరో! ఇరువురు తెనుగువారగుట గమనార్హము. గీర్వాణకవులలో త్రివిక్రమభట్టు రాజశేఖరాదులు కావ్యాది మన్మథస్తుతి జేసినను, ఈ యాచితి వారికి చెందదు.

ఇందు ప్రస్తావన, రత్నావళీనాటికా ప్రస్తావన ననుసరించి నిర్మింపబడినది. కాని అది కథోద్ఘాతరూపకము. ఇది ప్రయోగాతిశయ రూపకము. కొన్ని సంస్కృత నాటకములందువలెగాక, యిందలి భరతవాక్యపరమైన శ్లోకమునందును కావ్యపరమార్థము సూచ్యమైనది, "వర్ధంతాంవితః విఘ్నాః స్ఫురదుపకృతయః సంపదః సజ్జనానాం" అని. అంగవ్యయమునుగూడ గణింపకమన్మథు డమరకార్యము సంఘటించెను. నిరంతరపరోపకారశీలశాలియైన నారదర్షి కథ క్రమముగా నడిపించి దేవతాశ్రేయోలాభము సంధించెను. ప్రేక్షకులలో పరోపకారగుణము నుజ్జీవింపజేయుటగూడ నొక ప్రయోజనముగా రూపకకర్త తలచి, ప్రయోగానుకూలముగా నాటకము రచియించెను.

## కొన్ని అందములు

వామనభట్టబాణు డీ రూపకమున కొన్ని అందములు సాధించెను. మహేంద్రుడు చంద్రమౌళికి గౌరీపరిచరణ మెపాటి వశీకరణమని పలుకగా, బృహస్పతి అసేచనకతనుశ్రీయగు గిరిరాజసుత, పుష్పేషునకు సంమోహనాస్త్రమే కాగల్గునని పలుకును. పుష్పేశరో పోద్ఘాతముచేత మహేంద్రు డతడే గిరిజా గిరిశ ఘటనమునకు పటువగునని నిశ్చయించి పంపించును. పార్వతి, పరమేశ్వరుని పూజార్థము సమీపించినపుడు సంమోహనాస్త్రముచేతనే కాముడు శివుని ప్రహరించును. మన్మథుడు మహేంద్రసభలో,

"స్వజ స్యాస్యామి కార్యాయ ప్రాణాన్ ప్రియతమా నపి,
[illegible] లభంతే హి [illegible]."

అని పలుకును. చివఱ కత డనంగుడే అయినాడు. అతను పునర్జీవితుడని చెప్పుట యశశ్శరీరమును బట్టి అని ఊహించుట కలదు.

పరిణయసమయమున శివు డుమను గాంచి,

"ఏషా విశేషరమ్యా వివాహవేషేణ మోహనేన దృశా,
ప్రతిభాతి మానసే మే మదన సహస్రాణి కల్పయంతీవ."

అని భావించును. ఈ భావమే పరమేశ్వరుడు మదన పునరుజ్జీవనమునకు సుముఖు డగుచుండుటను చమత్కారముగా సూచించును.

తృతీయాంకము నంతముననున్న వైతాళిక సంధ్యాగీతము భావి గౌరి తపశ్చరణప్రకాశకము. రూపకమునకే కిరీటప్రాయమైన శ్లోకమది.

"అధాయ ప్రణయం వివస్వతి గతే దేశాంతరే పద్మినీ
బోధుం తస్య వియోగ ముత్సుకతయా మ్లాయత్సరోజాననా,
సంధ్యా వల్కలినీ ద్విరేఫపరిషద్రుద్రాక్షమాలావతీ
తత్ప్రాప్తిస్పృహయేవ సంప్రతి తపస్సక్తా సమాలక్ష్యతే."

నిత్యనూతన సౌందర్య ధుర్యారంభ, మహేంద్రునే

"సంచారిణీవ వల్లీ విద్యుల్లతికేవ చాపలా న్ముక్తా.
మోహన కలేవ మూర్తా కాప్యేదియం కమలపత్రాక్షీ."

అని భ్రాంతి గొలుపుచున్నది.

ఈ నాటకకర్త, అచ్చటచట మన్మథుని మాధుర్యముగల విల్లు గలవాడనియు (ఇక్షు; న్వి), సౌరభముగల అమ్ములు గలవాడనియు (పుష్పశరుడు) వినువారి నోరూర త్రిప్పి చెప్పును.

"క్వాయం సుగంధివిశిఖః స్వదమానచాపః"

"మాధుర్యసౌరభతరంగిత చాపబాణః"

"పాంసుక్ఖామ సరీరా" అను ప్రాకృత పద్యమునందును, ఛాయయందును "పర్వత నలినీ" అనియు "పార్వతినలినీ" అనియు ననుట విచార్యము. శ్రీనాథుడు వ్యామగ్రాహ పయోధరములన, బాణుడు కరతలయుగ పరిణద్ధకుచము లనుచు గ్రుక్కిళ్ళు మ్రింగును. (మూలము 'మురారి' కానిండు).

శివపురాణమున పార్వతీ పరిణయమును జరిపించినది హిమవంతుని పురోహితుడు గర్గమహాముని. కాళిదాసు 'గురుః', అని వ్రాసెను. నన్నెచోడుడు, వామనుడు బృహస్పతి గా స్వీకరించిరి. మల్లినాథుండీ యర్థము స్వీకరించినట్లు తోచదు.

ప్రస్తావనయందు వామనభట్ట బాణు డీరూపకమును 'అభినవ రూపకమనియు', 'విచిత్ర సంవిధాన వస్తుక' మనియు పేర్కొని యున్నాడు.

"సంవిధానస్య సౌమగ్ర్యం రసానాం పరిపుష్టతా,
సందర్భం సౌకుమార్యంచ సభ్యానాం రంజకే తుమునీ
తతవిహాఽహం గుణగ్రాహితయాత్ర ప్రవృత్తః" అని సూత్రధార వచనము. ఈ నాలుగు గుణముల కలిమి విచిత్రసంవిధానము. ఇన్నియు నేకత్రదుర్లభములు. కావుననే అన్యనాటకము లుండగా, గుణగ్రాహితచేత సూత్రధారు డీరూపకము గైకొన్నాడు. అందుచేతనే దీని అభినవరూపక మైనది. వామనభట్టబాణ కవిసార్వభౌముడు విజ

ప్రతిజ్ఞను కించిదూనముగా నెఱవేర్చుకొనెననుటలో శంకావకాశము లేదు. పార్వతీ పరిణయము ప్రదర్శన యోగ్యమైన గీర్వాణభాష రూపకము.

పార్వతీపరిణయ నాటకమునందు శ్లోకరచనము మధురాతి మధురము. అలవోకగా నే శ్లోకమునుబట్టి చూచినను హాయి అనిపించును. అప్రయత్న నిర్గతమైనవాణి వామనుని సొమ్ము. ఆయనకు దీర్ఘసమాస నిర్మాణమన్న కంటగింపు. ఆయన పద్యములేమి, గద్యములేమి అలతిమాటల కూర్పు లీనాటకమున సాధారణముగా. ఆంధ్రజాతి సంస్కృతకవులకు సమాసదైర్ఘ్య మనగా సరదా. ప్రదర్శన యోగ్యత్వమునకు అల్పసమాసకల్పనము గూడ నొక గుణమే. ఈ విషయమున నీ కవి వంద్యుడు. ఆద్యంతము, కవికుల గురువు వడుగుజాడలలో నడచినను రూపకశిల్పమున నేమి, కవితావిలసనమున నేమి బాణుడు స్వీయప్రతిభ జూపించెను. కాళిదాసుని మేలితలపుల రతనాలబాటలలో నీయన గడుసుపలుకుల మానికములు క్షీరనీర న్యాయమున గలిసి వలపులు జిమ్ముచున్నను, సాహితీ సాధుపథికులకు వాని పృథక్ప్రతిభాలోకములు కనుదగులక మానవు. ప్రౌఢభాషా కైవల్యోపజీవకులైన పండితపంచాననుల పాఠప్రవచన పరితృప్తి కొఱకుగాదు భట్టబాణుని కావ్యనిర్మాణము. ఆయన పండితకవి. ఆయన హృదయ మెంత రసమయమో, ఆయనరసన యెంత సుమనో మనోజ్ఞమో గ్రహించుటకీ చిన్న నాటకము చాలును. నాటకము నాటకముగానే రచించెనుగాని, వట్టి శ్రవ్యకావ్యముగ మాత్రమే చేయలేదు. అయినప్పటికి, నధిక సంఖ్యాక శ్లోక భారము చేత లిపి రౌక్ష్యమైన దనిపించును. విష్కంభములవంటివి ఇందలి అంకములు. ఇట్టి ఐదంకములందుగల శ్లోకములు వందదాటినవి. సంస్కృత నాటకముల కిది క్రొత్తగాదు.

సంస్కృత రూపక రచనమునకొక కష్ట మున్నది. నాటక కర్తకు ప్రాకృత భాషా విశిష్ట జ్ఞాన మపరిహార్యము. వామనభట్ట బాణుడు ప్రాకృత భాషా విషయమునగూడ గట్టివాడే. (నాడు ప్రాకృతమును వెలిచెట్టిన గీర్వాణమునకు గౌరవము లొచ్చు. వేమక చక్రవర్తి గాథా సప్తశతీ సారమునకు వ్యాఖ్య నిర్మింపగా, శ్రీనాథుడు తెనిగించెను.) ఇంత చిన్న నాటకమున ప్రాకృతపద్యము లేడున్నవి. అవి భావనామృదువులు. "చచ్చవ్వాపిద చందణద్ది పవణప్పస్సం ణ సంమణ్ణాఏ (కిశ్చిద్ వ్యాపృత చందనాద్రి పవనస్పర్శం న సంమన్యతే) అను శార్దూల విక్రీడితము పఠించునది.

వామనభట్ట బాణుని పార్వతీ పరిణయమునకు కొంచెము ముందుగా సర్వజ్ఞ సింగభూపాలుడు కువలయావలీ (రత్నపాంచాలికా) నాటిక రచించెను. సింగభూపాలుని 'రసార్ణవసుధాకరము'ను సమకాలికుడైన మల్లినాథసూరి ప్రమాణముగా గ్రహించెను. శ్రీనాథుడు, వామనభట్టబాణుడు, సర్వజ్ఞసింగభూపాలుడు, మల్లినాథసూరి, పెదకోమటి వేమారెడ్డి నాడు రసరాజ్య సమ్రాట్టులు. బాల్యమున విజయనగరములో విద్యారణ్య గురుపాదులయొద్ద పాఠము చెప్పికొన్న పంచకావ్యములు; బాణుని భావి సాహిత్య జీవితమును బహుముఖ సుందరముగా దిద్దినవి. అతడు చేబట్టని సాహిత్య ప్రక్రియ లేదు. పంచకావ్యములలో చేరిన రఘువంశము ననుసరించి రఘునాథ చరిత్రము, మేఘదూతము ననుసరించి హంసదూతము, కుమారసంభవము ననుకరించి పార్వతీ పరిణయరూపకము వామనుడు నిర్మించెను. పంచకావ్యముల కనుబద్ధములైన నైషధీయ చరిత్రమునకు మాఱుగా నలాభ్యుదయము, కాదంబరి హర్ష చరిత్రమునకు మాఱుగా వేమభూపాలచరితము రచియించెను. భాణము విరచించెను. నిఘంటువులు నిబంధించెను. పంచకావ్య మధురస్మృతి, ప్రత్యర్థి భూపతి కువలయావలీ ప్రసిద్ధి, మల్లినాథ సూరి పంచకావ్య వ్యాఖ్యాన ప్రారంభము, వామన భట్టబాణుని పార్వతీ పరిణయ నాటక నిర్మాణమునకు పురిగొల్పినవని తలపనగు. కవి, కవిసార్వభౌముడైన తరువాత రచియించిన రూపకమునందు వేమభూపాల ప్రసక్తి లేకపోవుట విచిత్రము. వామన భట్టబాణుని పార్వతీ పరిణయము, శ్రీనాథుని హరవిలాసము (గౌరీకల్యాణము: తృతీయ చతుర్థాశ్వాసములు—కాళిదాస కుమారసంభవమున కాంధ్రీకరణము), పెదకోమటి వేమభూపతి సప్తశతీసారటీక, శ్రీనాథుని శాలివాహన సప్తశతి తెనిగింపు, బాణుని నలాభ్యుదయము, శ్రీనాథుని హర్ష నైషధాంధ్రీకరణము—ఈ సమకాలిక, సమదేశిక గ్రంథ రచనముల మధ్యగల రహస్యము సహృదయ హృదయ వేద్యము.

"సౌభాగ్యస్యనిధిః శ్రుతస్యవసతిః, విద్యావధూనాం వరః
లక్ష్మ్యాః కేళిగృహం, ప్రమూతి భవనం శీలస్య, కీర్తేఃపదమ్,
నిస్సామాన్య వికాసయా కవితయా జాగర్తి యత్సాన్వయః
శ్రీమాన్ వామన భట్టబాణ సుకవిః సాహిత్య చూడామణిః."

—శృంగార భూషణ భాణము

# రాజధర్ముఁడు

## శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

[రాజధర్ముఁడు-ఒకానొక మహాబకము. విరూపాక్షుఁడను దానవరాజు వానికి పరమమిత్రుఁడు. నీతి చెడి పేదవడి తన యాశ్రయమునకు వచ్చిన ఒకానొక విప్రునకు రాజధర్ముఁడు తన మిత్రుడైన విరూపాక్షుని వలన కొంతంత సాయము చేయించి సత్కరించెను. దానిని మఱచి, ఆ విప్రుఁడు చేసిన దురంతములకు మహాబకము చూపిన ప్రతిఫలమే యీ ఘట్టము.]

శ్రీలకగా వదాన్యుఁడు మదిం దనవానిగ వానిఁ జూచి ప్రే
మాన నపారదివ్యధన మాతని కిచ్చె నమూల్య రత్నముల్
గోరను జేతఁగాని వివిగోనని చక్కఁగ మూటగట్టి యిం
పారఁగ నెత్తికెత్తె; నిఁక నాతఁడు మోయఁగరాని భారమై:

నడకకు నడుమ్ము వొద్దికగఁ గైకొని యాశకు నంతులేక తాఁ
గుడిచిన కళేబరం బది యకుంఠిత హర్షముతోడ మూటలో
ముడిచియు వాని యాజ్ఞగొని మోదము-భారము రెండు మెండుగా
మెడయును వీఁపు మూఁపులును మిక్కిలి నొవ్వఁగఁబోయె నవ్విధిన్.

తన యాపన్నతకు రాజధర్ముఁగని వృత్తాంతంబు సర్వంబుతో
డ నెవిన్పించిన వాఁడు సంబరముతోడన్ సాయ మీరీతిఁ గ
గ్గెను బోనిమ్మని మెచ్చి యాతని తను క్లేశంబుఁబోకార్చ వి
వసగా తెక్కులు విచ్చి పీఁచ మది శాప్యాయంబు సంధిల్లగాన్.

వదనడి భోజనాదిక సపర్యలు సర్వము నిర్వహించి దు
ర్మదుఁడగు బ్రాహ్మణబ్రువుని రాజునుఁబోలె నతండు గౌరవా
న్పదునిగఁ గొల్చి మేలయిన శయ్యను గూరిచి నాఁటిరేయి స
ద్మునకమునఁ బండఁబెట్టి సుఖముం గలిగించియు నిద్రవుచ్చెనన్.

అద్దమరేయి విప్రుఁడు ప్రయాణము మాట తలంచి దారిలోఁ
బ్రొద్దుటి తిండికోస మొక వ్యూహము నిట్టులు పన్నె: నిచ్చటి
నిద్దురలో మునుంగు నితనిం బరిమార్చియు మూటగట్టి నా
యొద్దకు తెచ్చుకొందు నితఁడెంతయుఁ గ్రొవ్వినటంచు నెంచియున్:

గబగబ లేచి గుడ్డసరిగా బిగియించి కృతఘ్నచిత్తుఁడౌ
కఱ్ఱ బడిత చేతఁబట్టి యుపకారము మాటయె యెత్తుకోకఁ దా
దఁ బడి యుదేవిధంబున యథాయథమై యొడలెల్ల వ్రీలఁగ్రుం
గఁజూడిచి యాబకంబును బొకారిచి స్వస్థతఁ గూరి యావలన్.

ఈఁకలు సర్వమూడ్చి యొక యెత్తున బొందువు ద్రచ్చి ప్రేవులన్
దోఁకయు లాగి పీఁకి తెగదూసియు కంఠము వ్రచ్చి మాటగాఁ
గైకొని వేఁగఁ బోక కనకంబెసఁగంగ వెలింగి తా నదే
పోకగఁ బోవుచుండెఁ బరిపూర్ణ దురాకృతజన్ముఁ డత్తఱిన్.

అక్కడ దానవప్రభున కప్పుడు చిత్తము విహ్వలించి, నా
కక్కట! యేదొ కీడగునటంచు స్ఫురించుచు నుండెఁ గారణం
బొక్కఁడుఁ దోఁపదంచు దనయున్న పరిస్థితి ప్రక్కవారితోఁ
బొక్కుఁచుఁ బల్కెఁ బెద్దయును బ్రొద్దు గతించె నదే విధంబుగా.

అదియునుగాక మిత్రమగు నా బక మింతకు రాఁడు నిచ్చలిం
పొదవఁగ వచ్చి నా మదికి నూఱట గొల్పెడుఁగాదె! పైగ దు
ర్మదుఁడగు విప్రుఁ డెవ్వఁడొ యమాంతము మిత్రుని రీతివచ్చి నా
పద యొదవింపనుం దగిన వాఁడని తోఁచెను జూచినప్పుడే.

అని బహుధా విచారపడి యాతఁడు చేష్టలు దక్కి మిత్రునిం
గనక మఱెట్టు లింక బ్రదుకంగలనంచుఁ దపించి భృత్యులన్
బనిచెఁ దదీయ వార్త కొనివచ్చుట; కప్పుడు వారు వైళమే
చని, కనిరొక్క డొక్కను విషాదము గూర్చెడిదాని నక్కడన్.

అడలియు సందియంపడియు నందఱు గొందలమంది వేగ న
ల్గడలకుఁ బాఱి త్రోవల నకాయెకి శోధన చేసి చూచి యొ
క్కెడఁ గని పట్టి, వానిఁ బొలియింపఁ గడంగియు నాఁగి యమ్మెయిన్
వడిఁ బెడ గేలుగట్టి తెగబాఁదియుఁ దెచ్చిరి స్వామి మ్రోలకున్.

జరిగినదాని నా యసుర సాంత మెఱింగి స్వకీయ భృత్యుల
త్తెఱఁగున వాని నయ్యెడకుఁ దెచ్చినదానికిఁ గోపగించి యి
ప్పరమకిరాతు నిట్లుగొనివత్తురె మిత్తునె? యీ కృతఘ్ను నిం
బొరిగొని వేఁ తినుం డిఁకను బొందని వారిని మందలించినన్.

హరి హరి! మేము మాత్ర మొక యల్పులమే! యితఁ డెంత నీచుఁడో
యెఱిఁగియుఁ బైగ వీని భుజియించుట దోసముగాదె యో ప్రభూ!
దురితము లంటనేల యని దూరముగా నిలువంగ, దానవుం
డుఱిమియు వీని నిట్టు లిఁక నుంతురె ఛీ! యని పల్కి వెండియున్.

తినవలె లేనిచో నిఁక విదల్చియుఁ జీల్చియు నీ కృతఘ్ను 'మా
రణము'ను జేసిగాని మఱి రావలదంచును ఘోరశాసనం
బును బ్రకటింప దైత్యులును బోకడ మాలిన యా దురాత్మునిం
గొని నగరోపకంఠమునకుం జని యత్తఱిఁ గత్తిమొత్తియున్:

కఱవఱఁగోసి నెత్తురులు పాఱఁగఁ దుత్తుమురుల్ పొనర్చి ముం
దఱఁబడఁ ద్రొబ్బఁ గుక్కలొక తండము వచ్చియు మూతిపెట్ట వ
క్కఱపడి డొక్కలున్ జకనకల్ పడ వెన్కకు జాఱిపోయి బి
త్తఱపడి చూచు, శాఁవని కృతఘ్నత యిట్టిది యయ్యొ నక్కటా!

పదపడి దైత్యవల్లభుఁడు ప్రాణసఖుండిట నింతలోన చె
ట్టిదముగ మాయమాటకుఁగడిందిగ బెగ్గిలి వాని డొక్కన
య్యదనునఁ దెచ్చి నెయ్యురు సహాయులు మెచ్చఁగ నగ్నికార్య ము
ప్పిదముగఁ జేసిపోయె విలపించుచునింటికి నింతలోపలన్.

సురభి యొకండు పాల్ కుడువుచున్ దనలేఁగను బుజ్జగించు న
త్తఱి సురగాలి వీవఁగ నదాటున ఫేనము దూలిపోయి చె
చ్చెర సొదలోనఁ జొచ్చిన విశేషము కల్మిని రాజధర్ముఁడ
బ్బురమును గొల్పుచున్ బ్రదికెఁ బోరన నింగిన మ్రోఁగె దుందుభుల్.

సురలును బ్రహ్మ వచ్చి యది చూచిరి మెచ్చిరి; రాజధర్మ వై
ఖరి విని గంతువైచి మమకారము పెల్లయి దానవుండు చె
చ్చెరఁ జనుదెంచి దేవతలచేఁ బొగడొంది వెలుంగు వాని న
బ్బురమునఁ గాంచి చిత్తరువు పోలె మెలంగి కలంగి పిమ్మటన్.

అంతయుఁ బాఱఁజూచి సఖుఁడా! యని యాదటఁ గౌఁగిలించి కా
లాంతకమూర్తివయ్య! కననాయెను నిన్ను; నదృష్టవంతుఁగా
నెంతు నటంచుఁ బల్కి భరియింపఁగరాని ముదంబుతోడ వృ
త్తాంతమెఱుంగఁ గోరిన-సురాధిపుఁడిట్లని పల్కెనయ్యెడన్.

ఇతఁడు మహాత్ముఁడోయి దనుజేశ్వర! నీ సఖుఁడంచు మాత్రమే
యితనిని గూర్చి యెంచకు; మహీనగుణోత్తరు నీతనిం బ్రజా
పతి కడు మెచ్చి నిచ్చలు శుభంబును గూర్చుచునుండు; లోకమం
దితనికి శత్రువంచు నొకఁడేనియు లేఁడని నీ వెఱుంగవే!

అనుదిన మీతనిం బిలువనంపుచు ముచ్చటలాడుఁ బ్రొద్దువో
వనియుపుడెల్ల బ్రహ్మ; పరివారములో నొకఁడీతఁడై చిరం
తన సఖుఁడై యనుక్షణము దగ్గఱ నుండనుగోరు నాప్తుఁడై
పనుపడియుండు; నిట్టిగుణవంతుని ప్రాణము తీసె విప్రుఁడే.

పలుమఱు వీనికోసమని బ్రహ్మయుఁ గన్నులు వాచి వేచి వ్యా
కులపడి నిన్న చూడఁగ సఖుం డిటులౌటయుఁ దేలె—దావ నిం
తలు తుది కైనదన్న నిది దైవము చూపిన మేలుగాదె; కా
వలసినదెల్ల దక్కెనని వానికిఁ జెప్పి ముదంబు గూర్చినన్.

పదపడి యా కృతఘ్నుఁడగు పాపిని బాఁపనిఁ బాశబద్ధుఁగాఁ
గదియఁగఁ జేసి బ్రహ్మయధికారమునన్ సురరాజు యాతనా
ప్రదమగు నారకంబునకుఁ బంపినమాట బకోత్తముండు న
య్యెదనున విన్నవాఁడయి హతాశుఁడునై వగఁ గూరి యిట్లనెన్

అక్కట! నాదుమూలమున నాతఁడు యాతన లొందునాఁడు నా
కెక్కడిదయ్య స్వాస్థ్య మది యెట్లుసహింతును? బ్రాహ్మణుండు నే
డిక్కడఁ దొంటియట్లు మది కింపగురీతిని గానరానిచో
నిక్కడ నేను మాత్రమిఁక నేల! యటంచు సురేంద్రు వేఁడినన్:

పలువురు విభ్రమంపడ సుపర్వవరుం డది గాంచి యెల్ల వా
రలకును వంద్యుఁడై గుణవిరాజితుఁడైన బకుండు పల్కు ప
ల్కులు కడుమెచ్చి యాతఁడిటు కోరినదాని నొసంగి తీఱఁగా
వలయునటంచు బ్రాహ్మణుని వైళమ పిల్చియుఁ జూపె నయ్యెడన్.

వానిని గాంచి తద్దయు శుభంబుగనెంచియు రాజధర్ముఁ డ
వ్వానికిఁ దొంటి యా ధన మపారముగాఁ గురియించి చక్కఁగా
వానిని సత్కరించి పరివారము నిచ్చియుఁ గొంతదూర మ
వ్వానిని బంపె నియ్యదియె వాని చరిత్రగఁ బేరు మోసెడిన్.

# గుప్తరాజవంశం క్రీస్తుకు పూర్వందా?

శ్రీ మంత్రా సూర్యనారాయణ

ఆంధ్ర పత్రిక విలంబ సంవత్సరాది సంచికలో శ్రీ పోచుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "ప్రాచీన హిందూదేశ చరిత్రకొన్ని సంస్కరణ"లన్న శీర్షిక క్రింద, చరిత్రలో మౌర్య చక్రవర్తులు కనీసం క్రీ. పూ. 11 వ శతాబ్దిలోని వారని, క్రీ. పూ. 326 నాటికే గుప్త వంశపు చక్రవర్తి అయిన సముద్ర గుప్తుని పాలన ఉన్నదని, ఆ విధముగా చరిత్రను సంస్కరించుకోవలసినదని, ఒక దీర్ఘమయిన వ్యాసము రచించినారు. ఇందులకు వారికి క్రీ. శ. 40 సంవత్సరము వాడయిన రూఫస్ అనే పాశ్చాత్య చారిత్రకుని రచనములు, 'కలియుగ రాజవృత్తాంత'మనే భారతీయగ్రంథమున్నూ ప్రమాణములుగా ఉన్నవి. శాస్త్రిగారు ప్రాచీన హిందూ శాసనములను ప్రమాణముగా తీసుకున్నట్లు కానరాదు. శ్రీవారు నెలకొల్పిన సిద్ధాంతము ఎంతమట్టుకు నిలువగలదో పరిశీలించవలసియున్నది.

మౌర్యుల కాలమును తెలుపుటకు భారతీయ గ్రంథములలో ఎందులోను వారికాలమును పేర్కొనకపోయినను, వారి సమకాలికులయిన గ్రీకు రాజులను తెలుసుకొని వారి కాల నిర్ధారణ చేయవచ్చును. అశోకుని శాసనములలో తేదీలు ఎక్కడా యివ్వలేదు. కాని ఒక శాసములో తన రాజ్య పశ్చిమ సరిహద్దునందున్న సిరియా దేశపు రాజయిన యాంటియోకసు రాజ్యమునకు రాయబారులను పంపినట్టు తెలియచేసినాడు. ఈ అంటియోకసు క్రీ. పూ. 3 వ శతాబ్ది వాడు కాన అశోకుడు క్రీ. పూ. మూడవ శతాబ్దివాడని చెప్పవచ్చును.

కళింగదేశపు రాజయిన ఖారవేలుడు హాథిగుంఫా శాసనములో తాను మగధరాజ్యము పైకి దండెత్తిపోయినట్లు, మగధరాజయిన బృహస్పతి మిత్రుని ఓడించి, చాలకాలము క్రిందట మౌర్యులు తీసుకొనిపోయిన "జిన" విగ్రహమును తిరిగి తీసుకొనివచ్చితిననియు, గ్రీకురాజయిన డిమిట్రియసును మధురనుండి పారద్రోలితిననియు చెప్పియున్నాడు. ఈ డిమిట్రియసు ఎప్పటివాడు? ఈతడు క్రీ. పూ. 180 ప్రాంతమున ఇండియామీదికి దండయాత్రలు సలిపి మధురను ఆక్రమించుకొనినట్టు గ్రీకు చరిత్రకారులవల్ల తెలియుచున్నది. ఖారవేలుడు కూడా అప్పటివాడే అనగా క్రీ. పూ. రెండవ శతాబ్దివాడని స్పష్టము. అప్పటికి మౌర్యరాజవంశము అంతరించినది. కావుననే మగధరాజ్యములో మౌర్యవంశపు రాజు కాక బృహస్పతి మిత్రుడనే రాజు పాలించుచుండెను. ఈ బృహస్పతి మిత్రుడు పుష్యమిత్రుడో లేక, మిత్రవంశము రాజులలో మరెవ్వడో అయిన అగుగాక. కాని మౌర్యవంశీయుడు మాత్రము కాదు. ఖారవేలుడు నందరాజ్యవత్సరములు 300 అయిన తరువాత, తను రాజ్యమునకు వచ్చుటయున్నూ, దండయాత్రలు చేయుటయున్నూ జరిగినదని తన శాసనములోనే చెప్పుచున్నాడు. హిందూ పురాణముల ప్రకారము మౌర్యులు 187 సంవత్సరాలు పరిపాలించిరి. క్రీ. పూ. 180 సం. ఖారవేలుని కాలమునాటికి మౌర్యరాజ్య వంశ మంతరించినది. మౌర్యుల వెనువెంట రాజ్యమునకు వచ్చినవాడు పుష్యమిత్రుడు. ఈతడే ఖారవేలుని సమకాలికుడయిన, క్రీ. పూ. 180 కి పూర్వము 187 సం. క్రితము మౌర్యరాజ్య సంస్థాపన జరిగిన దనవలయును. అనగా 180+187=క్రీ.పూ.317. సుమారు ఇదేకాలములో అలెగ్జాండరు ఇండియాపైకి దండయాత్రలు సాగించెను. అలెగ్జాండరును కలుసుకొనినవాడు సముద్రగుప్తుడైనా, చంద్రగుప్తుడైనా మౌర్యరాజవంశము అలెగ్జాండరు తిరిగిపోయినతర్వాత కొద్దికాలములోనే ప్రారంభమయినది. అలెగ్జాండరును కలుసుకొనిన సంద్రకొత్తూస్ మౌర్యరాజవంశమూల పురుషుడని చారిత్రకుల అనుమానము. కాని నికరమయిన ప్రమాణములులేవు. అలెగ్జాండరుని కలుసుకొనిన సముద్రగుప్తుడు పంజాబు ప్రాంతమువాడయి తరువాత అంతర్ధానమయిపోయిన పోవచ్చును. అతడే మౌర్యరాజవంశమునకు గాని, గుప్త రాజవంశమునకు గాని మూలపురుషుడని చెప్పుటకును స్పష్టమయిన సాధనములు లేవు. ఏది ఎటులయినను, అశోకుని శాసనములను, ఖారవేలుని శాసన సంవత్సరములను, పురాణములలో నిచ్చిన మౌర్యరాజవంశ పూర్తికాలమును, మనము అన్వయించుకొని చూచిన, మౌర్యరాజవంశము క్రీ. పూ. 4 వ శతాబ్ది ప్రథమ భాగములో ఆరంభమయినదవి చెప్పక తప్పదు.

ఇక గుప్తరాజ వంశముగురించి పరిశీలించెదము. గుప్తరాజులు, గుప్తరాజవత్సరములతో ఒక శకమును నెలకొల్పినారు. దీనినే గుప్తా ఈరా అందురు. ఇది రెండవ చంద్రగుప్తుడు, తన పితామహుడు మొదటి చంద్రగుప్తుడు సింహాసనమునకు వచ్చిన సంవత్సరము ప్రారంభించుకొని లెక్కపెట్టబడినదని పండితుల అభిప్రాయము. ఈ సంవత్సరము క్రీ. శ. 319 కి సరిపోయినది. కాబట్టి గుప్త రాజుల రాజ్యపాలనము క్రీ. శ. నాల్గవ శతాబ్ది కాని క్రీ. పూ. 4 వ శతాబ్దిని కాదు. గుప్తవంశపు చంద్రగుప్తుని కుమారుడయిన సముద్రగుప్తుడు సింహళదేశపు రాజయిన మేఘవర్ణుని సమకాలికుడు. ఈ మేఘవర్ణుడు క్రీస్తుతరువాత 352 మొదలు 379వరకు రాజ్యపాలన చేసెను. సముద్రగుప్తుని అనుమతిపొంది బుద్ధగయలో బౌద్ధమఠమును కట్టించినట్లు మహావంశములోనున్నది. సముద్రగుప్తుని కుమారుడయిన రెండవ చంద్రగుప్తుడు క్రీ. శ. 5.వ శతాబ్దిలో పశ్చిమదక్కను దేశమును పరిపాలించుచున్న క్షాత్రపులను జయించి వారిరాజ్యమును, గుప్తసామ్రాజ్యములో కలిపివేసెను. ఈ క్షాత్రపులు క్రీ. శ. 1 వ శతాబ్దినుంచి, గుజరాతు, మాళవదేశములను వశపరచుకొని సుమారు 5 వ శతాబ్ది ప్రారంభమువరకు పాలించిరి. వీరు నిశ్చయముగా

క్రీస్తు తరువాతివారుకాని క్రీస్తుపూర్వులు కారు. వీరినాణెములే వీరి కాలమునకు పరమప్రమాణము. తాము పరిపాలించిన రాజ్యకాలములను, సంవత్సరములను తమ నాణెములపైని ముద్రించిన రాజులు మొట్టమొదట వీరే. క్రీ.శ. 78 నుంచి ప్రారంభమయిన శక సంవత్సరమును పురస్కరించుకొని తమ నాణెములపైని తమరాజ్యసంవత్సరములను వేసిరి.

వీరిలోని ఆఖరు రాజులను జయించిన గుప్తచక్రవర్తి క్రీస్తు పూర్వుడున ఎట్లుండును ?

గుప్త చక్రవర్తులు క్రీ. శ. లోని వారని చెప్పుటకు మరియొక నిదర్శనము కలదు. రాజులు, రాగిరేకులపైని భూదాన శాసనములను చెక్కించి, బ్రాహ్మణులకు భూములను దానముచేయు ఆచారము క్రీ. శ. 3 వ శతాబ్దినుండివచ్చినది కాని అంతకుముందు లేదు. ఈ విధముగా నిచ్చిన తామ్రశాసనము, పల్లవరాజ ప్రతినిధి అయిన శివస్కంద వర్మయిచ్చిన "మైదవోలు" తామ్రశాసనమే ఇప్పటికి దొరకిన తామ్రశాసనములలో మొట్టమొదటిది. ఈ శివస్కందవర్మ క్రీ. శ. 3 వ శతాబ్ది నడిమి కాలములోనివాడు. ఈ ఆచారమునే గుప్తచక్రవర్తులుకూడ అవలంబించినట్లు కనబడుచున్నది 4,5 శతాబ్దములలో గుప్తరాజుల భూదానములు తామ్రశాసనములలో కనబడుచున్నవి. 4 వ శతాబ్ది ప్రారంభమున రాజ్యము స్థాపించిన చంద్రగుప్తుని మరిఎనిమిదివందల సంవత్సరములు వెనుకకు నెట్టుట పనికిరాదు.

శాస్త్రిగారు మరియొకమాటకూడా అన్నారు. అశోక చక్రవర్తి వని, అనుకొనుచున్న శాసనములు కొన్ని సముద్రగుప్తుని వట. ఈ వాక్యము మరీ విచిత్రముగా ఉన్నది. అశోకుని శాసనముల భాష ప్రాకృతము, లిపి బ్రాహ్మీలిపి. గుప్తచక్రవర్తుల శాసనపుభాష సంస్కృతము, లిపి దేవనాగరికి పూర్వరూపమయిన గుప్తలిపి. అలహాబాదులోని రాతి స్తంభముపైన ఉన్న రెండు లిఖితములు రెండు రాజవంశములకు చెందినవి. మొదటిది అశోకునిచే రచింపబడిన బ్రాహ్మీలిపిలోనున్న ప్రాకృతశాసనము. రెండవది, సముద్రగుప్తుని సేనానాయకుడయిన హరిసేనుని కావ్యము (ప్రశస్తి). రెంటెని తయారుచేసిన రెండులిఖితములకును మధ్యను కొన్నిశతాబ్దులు గడచినట్లు రుజువగును. అట్టి సందర్భములో అశోకశాసనములలో కొన్ని సముద్రగుప్తుని వనుకొనుటకు అవకాశమున్నదా? అశోక శాసనములలో ఏ ఒక్కదానికైనను హరిసేనుని అలహాబాదుప్రశస్తితో పోలిక ఉన్నదా? చారిత్రక పరిశోధనలో ఇలాటి వాక్యములను పలుకుట చాలా సాహసము.

హిందూదేశములో కాలమును లెక్కించుటకు యుగములను కాని సంవత్సరముపేర్లు (ప్రభవ, విభవ మొదలయినవి) కాని, మాసములు, వారములు పేర్లుకాని పేర్కొనుట అతి ప్రాచీన కాలమునలేదు. అందుచేతనే అశోకుని శాసనములలోను, భారతదేశపు ప్రాచీనచరిత్ర లిఖితములలోను, శాతవాహన చక్రవర్తుల శాసనములలోను ఆయారాజుల వర్ధమాన సంవత్సరములనే వ్రాయుచుండిరికాని యుగములను పేర్కొనలేదు. రాను రాను, యుగములను మాసములను, వారములను పేర్కొనుచు వచ్చిరి. ఈ ప్రమాణములను లిపి పరిణామములనుబట్టి పరిశీలించిన, గుప్త చక్రవర్తులు క్రీ. శ. 4, 5 శతాబ్దులవారు కాని క్రీస్తుకుపూర్వమువారు కారని నిర్ధారణ కాగలదు.

శాస్త్రిగారు చూచిన కలియుగ రాజవంశములలోని కథ గుప్తవంశీయులకు చెందినదే. అయితే ఇలాంటి కథనే క్రీ. శ. 40 సం॥ నాడయిన రుఫస్ చెప్పినాడు. గుప్తరాజవంశము తనకు చాలా ముందటిది కాకపోయిన ఆ కథను తానెట్లు చెప్పగలడు ? కాబట్టి గుప్తవంశీయులు రుఫస్‌కు పూర్వులని నిర్ధారణచేసుకొని, ఆ పునాదిరాయిపయిని కొత్త సిద్ధాంతములను నిర్మించి, ఇది వరకున్న చరిత్రజ్ఞానమును సవరించుకోమన్నారు.

రుఫస్ చెప్పినకథయున్నూ, కలియుగ రాజవంశ గ్రంథమున్నూ చెప్పేకథ ఒకరినిగురించే అయిన శాస్త్రిగారివాదము బలపడవలసినదే. కాని, రెండు కథలకు సరాసరి పోలికలున్నవేకాని ఒకరినిగురించి కాకపోవచ్చును. రాణులచేత ప్రేరేపింపబడి, రాజులనుచంపి తాము రాజులగుట ప్రతి కాలములోను ప్రతి రాజ్యములోను పరిపాటే. ఒకేపోలిక గలిగినకథలు ఇంకా ఎన్ని జరిగినవో ! కనుక చిన్నపోలికను తీసుకొని పరమ ప్రమాణములను బుగ్గిలోకలిపి, చరిత్రను తారుమారుచేయ పనికట్టరాదు.

శాస్త్రిగారు తమవ్యాసము కొసనువేసిన ప్రశ్నలకు జవాబు చెప్పుతున్నాను. క్రీ. శ. 420 నుంచి 440 వరకు సింధు, కనోజ రాజులు అశ్వమేధముకు సామంతలయిన అవుదురుగాక. అప్పటికి ఈ రాజ్యములు గుప్త సామ్రాజ్యములో లేకపోవచ్చును. గుప్తులు స్వతంత్రముగా, అంతకు పూర్వగా రాజ్యము చేయవచ్చును.

క్రీ. శ. 264 మొదలు 340 వరకు, కాన్‌సాన్‌రాజును తమ సార్వభౌమునిగా పరిగణించిన భారతీయరాజులు ఏ ప్రాంతమువారో చెప్పుటకు అవకాశము గల్గునా ? అప్పటికి గుప్తరాజ్యము గొప్ప సామ్రాజ్యముగా ప్రబలలేదు. హిందూదేశము భిన్నరాజ్యముల క్రింద చీలియున్నది. ఆ పరిస్థితులలో ఏ హిందూరాజ్యములు, విదేశీరాజుల ఏలుబడిలో నున్నవో చెప్పజాలము. ఇటువంటిపనులు సముద్రగుప్తుడు చేయనవసరములేదు.

భారతదేశము అపారమయిన దేశము. భారతదేశమంతయూ ఎన్నడూ, అశోకరాజ్యమువలె గుప్తచక్రవర్తుల పాలనలో లేదు. భారతదేశపురాజులు అనుసరికి గుప్తరాజులే అని భ్రమపడ నవసరము లేదు. గుప్తసామ్రాజ్యములో లేనిరాజ్యము లేవయినను పెద్ద రాజుల ఏలుబడియందుండిన ఉండునుగాక. రాయబారులను పంపినంత మాత్రమున తాము సామంతరాజులమని చెప్పుటకు వీలులేదు.

# కథకంచికి

శ్రీ రావికొండలరావు

## పాత్రలు :

వల్లకాట్లో రామనాథయ్య (50 సం॥)
అబాలగోపాలం (35 సం॥)
అన్నమోరామచంద్ర (45 సం॥)
అరిచేతిలో వైకుంఠం (30 సం॥)
రసికజన మనోభిరామం (27 సం॥)
లోగుట్టుపెరుమాళ్ళు (18 సం॥)
పీతిచంద్రిక (24 సం॥)

[ఒక పెద్దహాలు, హాలుమధ్య చిన్న టీపాయ్, చుట్టూ మూడు కుర్చీలూ, టీపాయ్‌మీద 'ఆష్‌ట్రే', కొన్ని పుస్తకాలూ వున్నయ్. గోడలనిండా కొన్ని పటాలూ, కాలెండర్లూ, ఒక కుర్చీలో నాయిక కూచుని వుంటుంది. ఒక పత్రికతీసి, పేజీలు తిప్పి చూసి, మళ్ళీ పడేసి, నిట్టూరుస్తుంది. ఏదో ఆలోచించి, వీధిలోకి చూస్తుంది–ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్టు. అరిచేతిలో వైకుంఠం ప్రవేశిస్తాడు. అతన్ని చూసి ఆమె చీదరించుకున్నట్టు మొహంపెట్టి అటు తిరుగుతుంది. వైకుంఠం దగ్గరగా వస్తాడు. రెండు జేబుల్లోనూ చేతులుపెట్టి, ఆమెకేసి చూసి విచ్చునవ్వు నవ్వుతాడు. ఆ నవ్వుతో ఆమె లేస్తుంది. ముందుకు వచ్చి,]

ఆమె : ఛీ—మగజాతి లక్షణమే ఇది! ఒకసారి చెబితే ఈ పురుషులకు బుద్ధివుండదు. మా ఇంటికి రావొద్దనీ, నన్ను చూడవద్దనీ ఎన్నిసార్లు చెప్పినా, దున్నపోతుమీద వాన కురిసినట్టు లక్ష్యపెట్టకుండా వున్నావుకదా—

అ. వై : ఏమిటో దున్నపోతూ, వానా అంటున్నావులే. అసు. నిజంగా నువ్వు నన్ను తిట్టినా ఆ తిట్లు అందంగానే వుంటాయ్; సౌందర్యంగా వుంటాయ్, మనోహరంగా వుంటాయ్!

ఆమె : ప్రసాద్! కట్టిపెట్టు నీ కవిత్వం! నీ మాటలూ పలుకులూ వింటూ కూచోటానికి నాకేం తీరికలేదు. తక్షణం నాయింటి నుంచి వెళ్ళిపో. పోఁ!

అ. వై : (నవ్వి, తగ్గి) ప్రేయసీ! నీకోసం నేను ఎన్ని గాలిమేడలు కట్టానో, ఎన్ని వూహాసౌధాలు సృష్టించానో, ఎన్ని ఆకాశ హర్మ్యాలు నిర్మించానో, నీకు తెలియని విషయంకాదు. ఏనాడైతే నీ సుందరవదనాన్ని దర్శించే సందర్భం నాకు కలిగిందో, ఆనాడే నేను నిన్ను వలచాను. నువ్వులేని నా జీవితం సూర్యుడులేని పగలు, సురభిళంలేని పుష్పం—సుగుణంలేని సుందరి!

ఆమె : ఆ మాటలన్నీ ఏనాటినుంచో నువ్వు చెబుతూనే వున్నావు. నా మాటవిను, ఇక్కడినుంచి వెళ్ళిపో.

అ. వై : వెళ్ళిపొమ్మని అంత తేలిగ్గా అనేస్తావేం చంద్రికా! నిన్ను వొదిలి నేను ఎక్కడికీ వెళ్ళలేను. నా వూహాలూ, వుద్దేశాలూ వుత్తి పేకమేడల్లాగా కూల్చేస్తావా చంద్రికా?

ఆమె : నీ వూహాలూ వుద్దేశాలతో నాకేం పని? నిన్ను నేను ఏనాటికీ వరించలేను. (తన్మయత్వంతో) నా మనస్సు ఏనాడో అతనిపై లగ్నమయింది. నా హృదయాన్ని అతనికి ఏనాడో అర్పించాను.

అ. వై : ఆఁ! ఏమిటంటున్నావు చంద్రికా! నీ మనస్సు ఇంకొకడిపై లగ్నమయిందా? నువ్వు ఇంకొకడిని ప్రేమిస్తున్నావా? (కోపంగా) ఎవడు వాడు?

ఆమె : నా ప్రేమమూర్తి, నా ఆరాధ్యదైవం, నా నిండుజాబిల్లి—మోహన్!

అ. వై : ఆఁ! ఏమిటి చంద్రికా—ఆ వ్యానిర్భాగ్యుడు మోహన్‌గాడిని మోహిస్తున్నావా!

ఆమె : అతనేం నిర్భాగ్యుడుకాదు—నిందగా మాట్లాడకు!

అ. వై : నిర్భాగ్యుడు కాకపోవటమేం? వాడికేందబ్బా – మేడలా – కారా?

ఆమె : ఈ ఆడంబరాలు లేనంతమాత్రాన అతనెన్నటికీ నిర్భాగ్యుడు కాడు. అతని హృదయమే నా ధనం—అతని పలుకే నా బంగారం!

అ. వై : చాలించు చంద్రికా ఈ దండకం! పూటపూటకీ కూటికీ వెతికే కటిక దరిద్రుడు, చింకిగుడ్డలూ చింపిరిజుట్టూతో జీవించే నిరుద్యోగి, అనురాగం అంటే ఎరుగని అధమాధముడు, వాడా నీ ప్రియుడు? నిన్ను కన్నెత్తి చూడటానికయినా వాడికి అర్హతలేదు చంద్రికా!

ఆమె : అనవసరప్రసంగం ప్రసాద్! ఇక నీతో నేను మాట్లాడదల్చుకోలేదు. నువ్వు తక్షణం దయచెయ్యి!

అ. వై : (కోపంగా) చంద్రికా!

ఆమె : ఏం—బెదిరించి ప్రేమించవేసుకుందా మనుకుంటున్నావా? కల్ల. నీ బెదిరింపులకు బెదిరిపోయే బేలనుకాను. ఇది చెబుతున్నాను విను—నువ్వు మళ్ళీ నా మేడ ఎక్కేమాత్రం మాట దక్కదు! (లోపలికి పోబోతుంది)

అ. వై : (గొంతు తగ్గించి, మెత్తగా) చంద్రికా—

ఆమె : (గిరుక్కున తిరిగిచూసి) ఏం?

అ. వై : ఒక్కమాట! (దగ్గరకు రాబోతాడు)



# డాడ్జ్

## డీసెల్లు



అభివృద్ధికరంగా నిర్మించువారు
**ది ప్రీమియర్ ఆటోమోబైల్స్ లిమిటెడ్**
బొంబాయి

**డీలర్లు:**

మెసర్సు బెజవాడ మోటారు స్టోర్సు
పోస్టు బాక్సు-84, కాన్వెంటు వీధి
విజయవాడ-1

మెసర్సు, అసోసియేటెడ్ ఆక్సెసరీస్
(ప్రైవేట్) లిమిటెడ్, నెం. 43/184
నర్సింగ్ రావుపేట. కర్నూలు (ఆంధ్రాస్టేటు)

SISTA'S-PAL-246-TEL

ఆమె : అక్కడినుంచే చెప్పు ఆమాట వినిటో!

అ. శై : నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమించాను; నువ్వే నా సర్వస్వం అనుకున్నాను. నీకోసం ఎంతటి త్యాగాన్నయినా చెయ్యటానికి సిద్ధంగా వున్నాను. నన్ను ప్రేమిస్తున్నావు. ఇంట్లో నా తండ్రికి చెప్పయినాను. నిన్ను వివాహం చేసుకుంటే దమ్మిడీ ఆస్తయినా దక్కనివ్వనంటున్నాడు మా నాన్న! దానికీ తలవొగ్గాను. నా తండ్రి తర్వాత ఏకైక వారసుడినైన నాకు సంక్రమించాల్సిన లక్షల ఆస్తిని నీ కోసం త్యజిస్తున్నాను. ఆలోచించు—నువ్వు 'వూఁ' అంటే నీ కాళ్ళకు బంగారు చెప్పులు చేయిస్తాను. చెప్పు చంద్రికా—ఒక్కమాట చెప్పు!

ఆమె : అతుమాటలు చెప్పాను. నువ్వన్ని త్యజించినా, ఎన్ని కోట్లుకున్నా నేనెం భాధ్యురాలిని కాను. అట్టే నన్ను వాగించకు. వెళ్లు త్వరగా. నా మోహన్ వచ్చే వేళకూడా అయింది. తక్షణం వెళ్లు.

అ. శై : (వికృతంగా నవ్వి) నయానా భయానా చెప్పినా, లాలించి బెల్లించినా నువ్వు వినవు. చూస్తాను—ఎవడు అడ్డువస్తాడో! ఆ గర్భదరిద్రుడు మోహన్ గాడు కాదు—వాడి తాత దిగివచ్చినా సరే, నన్నడ్డగించలేడు! (నవ్వి) నన్ను తప్పించుకుని నువ్వెక్కడికీ పారిపోలేవు. (చంద్రిక లోపలకు పోబోతే ఛటాలునవెళ్లి ఆమెకు అడ్డంగా నించుంటాడు. మళ్లీ నవ్వి) ఎక్కడికి పారిపోతావ్ (పళ్లునొక్కుతూ) చి—లు—కా— (ఆమెచేతిని పట్టుకుని లాగబోతాడు. ఆమె ఓ కేకవేసి, చెయ్యి విడిలించుకొని, అతన్ని లెంపకాయ కొట్టటానికి చెయ్యెత్తి కొట్టబోయి, అతనిముఖంలోకి చూస్తూ వుండిపోతుంది. అతనూ అట్లాగే ఆమెకేసి చూస్తూవుంటాడు. ఆమె చలనం లేకుండా, ఎత్తినచెయ్యి ఎత్తినట్టేవుంచి అతని కేసి నిశ్చలంగా చూస్తూ వుంటుంది. ఆమె కేకతోనే వీధిలోంచి రసికజనమనోభిరామం ఆత్రుతగా ప్రవేశించి, "చంద్రికా" అనిపిలిచి, "ఏం జరిగింది, చంద్రికా ఏం జరిగింది?" అని ముందుకు రాబోయి, ఆమెనుచూసి అక్కడే తక్కున నించుని చూస్తూవుంటాడు. ఒక్కక్షణం ముగ్గురూ అట్లావున్న తర్వాత లోపల్నుంచి నాటకం దర్శకుడు అవాలగోపాలం ఆత్రుతగా ప్రవేశించాడు.)

అవాలగోపాలం: (వస్తూ) అబ్బబ్బబ్బ... బ్రహ్మాండంగా వస్తున్న సీనును ఏమి టిలా ఆపేశారు? కానీండి. అమ్మా, చంద్రికా, కొట్టు—కొట్టూ—

అన్నమో రామచంద్ర: (లోపల్నుంచి వస్తూ) కొట్టవమ్మా చంద్రికా, వండర్ ఫుల్ గావుంది సీను. కానీండి — కంటిన్యూ చెయ్యండి వూఁ—

కల్లకాల్లో రామనాథయ్య: అఁ. రాకు వనకాలే (తొందరగావస్తూ) కొట్టవేం అమ్మా—తెల్లారితే నాటకం! ఇంకా ప్రేమకేం?

అ. రా: క్లయిమాక్సుకుపోయే సన్నివేశం, వారంరోజులు కష్టపడి స్క్రిప్టు కూచుని రాశాను. పవర్ ఫుల్ సీక్వెన్స్—ఏమిటీ చెల్లంకొట్టిన రాయిలాగా నువ్వు కొట్టకుండా నించుంటే ఎట్లా చెప్పమ్మా—చంద్రికా—

నీలి చంద్రిక: అబ్బ! ఎట్లా కొట్టమంటారండీ! ఇతేం చెయ్యను కున్నారా—ఏదన్నా ప్రాణంలేని ఆయుధం అనుకున్నారా! ఆయన్ను నేను కొట్టటం ఏమిటి? 'కవిగారూ కొత్తమూర్ఖంది బాబూ!' అంటే మీరు వినరు!

అ. గో: కొట్టటం అంటే నిజంగా కొడుతున్నావా ఏమిటి చంద్రికా —నటన! నటించేటప్పుడు అనేకవిషయాలు జరుగుతూ వుంటయ్. అవన్నీ నిజమనుకుంటే ఎట్లా? సరే, కంటిన్యూ చెయ్యండి. (వీళ్లతో) పదండి—(వెళ్లబోతాడు)

చంద్రి: కొట్టాననుకుందురూ—తర్వాతది ప్రారంభిద్దాం.

వ. రా : అనుకుంటే ఎట్లాగమ్మా కుదిరేది? కొట్టాల్సిన సీనులో కొట్టకా, తిట్టాల్సిన సీనులో తిట్టకా, ఏమిటిది? నాటకాల్లోనూ సినిమాల్లోనూ ఇవ్వన్నీ చూసుకుంటే ఎట్లా? మొన్న ముద్రానుపోయినప్పుడు షూటింగుకు పోయినాను కవిగారూ—సారి! కొరడా బట్టుకుని ఆ ఇన్స్పెక్టరు—ఇదిగో— చెయ్యెత్తి యాక్షను చెయ్యబోతాడు)

అ. గో : పదండి, పదండి. (ఆ చేతిని పట్టుకుని లోపలకు లాక్కుపోతాడు)

(రసికజనమనోభిరామం వీధివేపు పోతాడు)

అ. రా : అమ్మాయ్—చంద్రికా—కొట్టకపోయినా నువ్వా ఎమోషన్లో చెయ్యిచాచి అతనిబుగ్గమీద వేసినా చాలు—ఏమిటీ

చంద్రి : ఎఫెక్టు రాదు గదండీ!

అ. శై : అబ్బ—ఎఫెక్టు ఆర్కెస్ట్రా వాళ్లు దాని ఇప్పిద్దాంలే!

చంద్రి : మీ రుందురూ గొడవ!

అ. గో : (లోపల్నించి, రెండడుగులు ముందుకువచ్చి) కమాన్, కమాన్.

అ. రా : మనడైరెక్టరుగారు కేకలు మొదలెట్టాడు. చూడూ— (ఆమెచెవిలో ఏదోచెప్పి నవ్వుతూ) ఏమిటీ—

చంద్రి : రేపునాటకంలో స్టేజిమీద కొడతానులెద్దురూ!

వ. రా : అన్నన్నన్నా...(అంటూ ఆత్రుతగా రాబోతాడు. గోపాలం 'ఇశ్' అని అతన్ని లాక్కుపోతాడు)

అ. గో : (కంఠం) కానీండి, కానీండి. అన్నమో రామచంద్ర గారూ—మీ రొచ్చేసెయ్యండి! (అ. రామచంద్ర వెళ్ళిపోతాడు. రంగంమీద ఇద్దరేవుంటారు)

చంద్రి : (లోపలకుచూస్తు) హీరోగారు వచ్చిన దగ్గర్నుంచి మొదలెడతాం—

అ. రా : (వస్తూ) అదికుదరదమ్మా అమ్మాయ్—నువ్వాలెంపకాయ...(అనబోతూవుంటే, ఒకడుగు ముందుకువేసి, వ. రామనాథయ్య 'ఇశ్' అని అతన్ని లోపలకు లాగేస్తాడు)

రామం : (వీధివేపునుంచి వస్తూ) నన్నురమ్మంటారా అండీ!

అ. గో : (కంఠం) అఁ అఁ—మీ పొజిషన్లో మీరు నించోండి. (రామం నించుంటాడు)

చంద్రి : (వైకుంఠాన్ని చెయ్యెత్తి కొట్టబోయి తగ్గుతుంది)

రామం : కొట్టండీ, కోమలహస్తమేగా—ఏం దెబ్బతగుల్తుందీ!

అ. వై : (సీరియస్‌గా చూస్తూ) కోమలహృదయమో, వజ్రాయుధమో మీరురండి. తెలుస్తుంది. (చంద్రికతో) చంద్రికా, కొట్టి నట్టు చెయ్యి చాచుదూ, చాలు—(తనే ఆమె చేతిని తీసుకుని తనబుగ్గమీద పెట్టుకుంటాడు.) మీరు రండీ రామంగారూ!

రామం : వచ్చేశానుగా.

చం : డైలాగు చెప్పండి.

రామం : (వెనక్కు వెళ్లి ఆత్రుతగా ముందుకువస్తూ) చంద్రికా, ఏంజరిగింది చంద్రికా ఏంజరిగింది?

[అతన్ని చూడగానే వైకుంఠం తత్తరపాటుపడి, దూరంగా పోతాడు. చంద్రిక రామంకేసి తిరిగి దుఃఖం పొంగిరాగా]

చంద్రి : మోహన్!

రామం : ఏమిటి చంద్రికా—ఏమిటి! (గోపాలంకేసి చూస్తాడు. గోపాలం పారిపోతాడు) ఆగు! ఇక్కడేంపని అని అడగ బడావ్?

అ. వై : (నిలదొక్కుకుని) మోహన్! చంద్రికను నేను పెళ్లి చేసుకోబోతున్నాను. నువ్విగుమ్మం తొక్కటానికిగాని, చంద్రికను పలకరించటానికిగాని, వీల్లేదు. తక్షణం బయటకు నడువ్—ఊఁ—

రామం : ప్రసాద్! నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలియటం లేదు. నా చంద్రికను నువ్వు పెళ్లి చేసుకోబోతున్నావా? (నవ్వి) కలగంటున్నావా—భ్రమపడుతున్నావా?

అ. వై : అనవసరప్రసంగం! అర్థంకాని అవకతవకవాగుడు! సరే, నువ్వు పోకపోయినా, మేమేపోతాం. రా చంద్రికా రా పోదాం. (ఆమె చెయ్యి పట్టుకుని లాగుతాడు. ఆమె అతని దగ్గరగా పోతుంది)

రామం : (చూసి) చంద్రికా—మీరే డైలాగ్ చెప్పాలి. ఆ చెయ్యి వదిలించుకోండి.

చం : (గుర్తొచ్చి వొదిలించుకోబోతుంది. వైకుంఠం వొదలడు)

రామం : వొదలండి వైకుంఠంగారు—ఆమె చెయ్యి వొదలండి.

అ. గో : (తొందరగా వస్తూ) చెయ్యి వొదలవేమయ్యా—చెయ్యాల్సిందేదో సరిగ్గా చెయ్యలేం—వొదులు—(వైకుంఠం ఆమె చెయ్యి వదుల్తాడు)

అ. రా : (వస్తూ) ఏమండీ—వాట్ హేపెన్డ్? ఏంజరిగింది?

చం : ఏమీ జరగలేదు—మీరంతా లోపలకువెళ్లండి. రిహార్సల్ని కానిద్దాం.

క. రా : (వస్తూ) కానిద్దాం కానిద్దాం అంటూనే మధ్యలో ఇట్లా చేస్తున్నారు. తెల్లారితే నాటకం ఏమిటి—

అ. వై : తెల్లారుఝామునా ఏమిటి నాటకం?

క. రా : తెల్లారితే అంటే 'రేపు' అని అర్థం. కావాలంటే మన కవి గారిని అడగండి.

అ. రా : అవును...'తెల్లవారినచో' అనగా, ఈ రోజుపోతుందనీ, తర్వాతిరోజు వస్తుందనీ అర్థం వుంది. ఏమిటీ—

అ. గో : అయ్యా, అన్నమో రామచంద్రా—ఈ సందట్లో ఈ గొడవంతా ఇక్కడెందుకు మహాశయా! పదండి లోపలికి—

అ. రా : (కొంతదూరం వెళ్ళి, ఆగి వెనక్కి చూస్తూ) అయ్యా కంట్రాక్టరురామనాథయ్యగారూ, వల్లకొట్లో రామనాథయ్య గారూ—రండి—రండి. (పోతాడు)

క. రా : అఁ అఁ......కొంతదూరంవెళ్ళి ఆగి వెనక్కు చూస్తూ) గోపాలంగారు—ఏ గోపాలంగారూ, అయ్యా అబాల గోపాలంగారూ రండి బాబూ రండి!

5

అ. గో : వస్తున్నా వస్తున్నా—మీరు పదండి. (రామనాథయ్య పోతాడు) ఏమండీ—ఈ నాటకానికి నేను డైరక్టరును. నాటకం ఏ మాత్రం బాగులేకపోయినా, ఆ అక్షింతలన్నీ నావి. నా మాటవిని, రిహార్సల్ని సరిగ్గా జరుపుతారా, జరపరా?

క. రా : (వస్తూ) ఒక్క డైరక్టరుకు మాత్రమేనుటయ్యా—నాటకం కంట్రాక్టు తీసుకున్న నాకూ...

అ. గో : (వెనక్కి తిరిగి 'ఇష్' అంటాడు. క. రా. పోతాడు) ఏమండీ!

అ. వై : నాటకం బాగా లేకపోతే ఆ అక్షింతలు మేమూ వేసు కోవాలి సార్, అంచాత ఆ బాధ్యత మాకూ వుంది.

అ. గో : వుంటే మరి సరిగ్గా చెయ్యండి. మిమ్మల్ని లెంపకాయ కొట్టాల్సివస్తే ఆమె కొట్టకా మీ రామె చెయ్యి విడవాల్సి వస్తే విడవకా, ఏమి టిదంతా?

అ. వై : చెయ్యి ఆమె విడిపించుకోకుండా నేనెట్లా విడవను చెప్పండి!

చం : చాల్లెండి—మీరు గట్టిగా పట్టుకు కూచుని, నేను చెయ్యి విదిలించుకో లేదంటా రేమిటి మధ్య?

రామం : ఏమయినా, ఇద్దరిదీ తప్పే ననిపిస్తోంది.

అ. వై : మిమ్మల్ని ఎవరూ అడగలేదు లెండి. కాస్త నిశ్శబ్దంగా వుండండి.

అ. గో : సైలెన్స ప్లీజ్......చూడండీ అయ్యా, అరిచేతిలో వైకుంఠంగారూ—ఈ నాటకంలో మీరు ప్రసాద్ పాత్ర ధరిస్తున్నారు. ప్రసాద్ అంటే ఈ నాటకంలో విలన్!

అ. రా : (వస్తూ) వొట్టి విలనే ఖర్మం—ఘటుక్లాసయిన ఒకటో నెంబరు విలను. ఏమిటీ—

అ. గో : ఇష్...(అ. రా. పోతాడు. వైకుంఠంతో) అందువల్ల మీరు ఆ అమ్మాయి దగ్గరకు పోవటానికి ప్రయత్నిస్తారు తప్ప, ఆమె రానివ్వదు.

అ. వై : రానివ్వొద్దని ఆమెతో చెప్పండి. నన్ను లెంపకాయ కొట్టాల్సి వచ్చినప్పుడు కొట్టకపోతే అతప్పు ఆమెది!

చం : అవునండీ—అంతా నా తప్పే. అందరూ నన్నే అనండి. అందరికీ తేలికయినదాన్ని నేనేగా ఆడదాన్నయి పుట్టాను మరి! (వెళ్లి కుర్చీలో కూర్చుంటుంది)

అ. వై : చంద్రికా—(దగ్గరగా వెళ్ళి) ఏమిటా చిన్నతనం! నిన్నిప్పుడు ఏమన్నాననీ! లే—రా రిహార్సల్ని వేద్దాం.

చం : నాకేం రిహార్సల్సూ వద్దు, నాటకమూ వద్దు—సైకిల్ రిక్షా తెప్పించండి, ఇంటికిపోతాను.

(లోగుట్టుపెరుమాళ్లు వీధి వేపునుంచి వస్తూ)

పెరు : ఇందాక మీ రెక్కివచ్చిన రిక్షా ఇంకా గుమ్మంలోనే వుందండమ్మగారూ—ఎల్లి పోతారేటి?

అ. గో : వీడెవడ్రా మధ్య పానకంలో పుడకలాగా—గెటవుట్!

పెరు : గెటవుటేటండీ—అటెల్తే ఆ రిచ్చావాడు నన్ను గెటక టంటున్నాడు—లోపలికొస్తే మీరంటున్నారు—

అ. గో : ఏం—ఎందుకున్నాడా రిక్షావాడింకా అక్కడ?

రామం : వాడికి డబ్బులివ్వలేదుటగా—నాతో కూడా చెప్పాడు!

అ. గో : ఏమండీ, వల్లకొట్లోరామనాథయ్యగారూ—ఆ రిక్షా వాడిని పంపేయలా?

క. రా : (వస్తూ) ఏంటా లోగుట్టుపెరుమాళ్లూ—పంపేయలా!

పెరు: బాగుందండయ్యా. 'పంపెయ్యాలా' అని నన్నంటారేటండి! డబ్బులిచ్చేస్తే ఆడు ఎల్లిపోడేటి?

అ. గో: ఏం ఎందు కివ్వలేదు వాడికి డబ్బులు?

పెరు: బాగుందండయ్యా, అయ్యగారిస్తే కదటండీ ఆడి కివ్వటానికి-

వ. రా: నేనిచ్చేదేమిట్రా—నీ దగ్గరలేవూ?

పెరు: (ఉలిక్కిపడి) నా డబ్బు లిమ్మంటారా?

వ. రా: నీ డబ్బులు కాదురా పుల్లయ్యా—

పెరు: నా పేరు పుల్లయ్య కాదులెండి—పెరుమాళ్ళు!

వ. రా: ఏడిశావుగాని—పొద్దున్నే నీ చేతికిచ్చిన రూపాయిలో చిల్లర మిగలలేదూ?

పెరు: బాగుందండయ్యా—ఇంకా చిల్లరేటండి! మరా చిల్లరలోనే కదా మీకు సిగరెట్లు తెచ్చాను—ఆ రేవతో, మన కవి గారికి, అదేటమ్మా, అదీ టీ తెచ్చాను. ఇంకా నేమో తెరట్రుగారికీ—

వ. రా: సరేలే, ఇహ ఆపు నీ పురాణం. ఈ డబ్బులు తీసుకెళ్ళి వాడికిచ్చి పొమ్మను.

(డబ్బులిస్తాడు. పెరుమాళ్ళు పోతాడు.)

చం: ఎట్లాగూ ఇంతసేపున్నాడు—మరో పదినిమిషా లుండ మనండి. వెళ్ళిపోవచ్చు.

అ. గో: మరో పదినిమిషాల్లో రిహార్సల్సు ఐపోతాయేమిటి?

చం: ఏమిటో నా మనస్సేం బాగాలేదు. నేను పోతాను.

వ. రా: చంపేశావ్ తల్లీ! తెల్లారితే నాటకం. టిక్కట్లు అమ్మేస్తున్నాం. తల్లి తల్లీ—ఈపూట రిహార్సల్సు జరిపించేసి మరీ వెళ్లమ్మా—చచ్చి నీ కడుపున పుడతాను.

చం: బావుంది—ఏమిటా మాటలు? నిజంగా నాకేం వంట్లో బాగులేదండీ!

అ. వై: నీ వంట్లో ఏముందో నాకు తెలుసులే.

అ. గో: ఎందుకొచ్చిన కబుర్లండీ ఇవన్నీ! రిహార్సల్ ఈపాటికి కొంతయినా అయేది. ఛీఛీ—టైమ్ వేస్...టైమ్ వేస్టు!

వ. రా: కానీండి బాబూ! బాబూ—అరిచేతిలో వైకుంఠంగారూ (నమస్కరిస్తాడు.)

అ. వై: (నమస్కారం విడదీస్తూ) ఏమిటండీ మీరు మరీనూ—అంత ప్రార్థించాలటండీ—ప్రారంభిద్దాం.

వ. రా: అయ్యా—నాటకాల కంట్రాక్టర్ని. అంటే మానం, సిగ్గు, లజ్జా అన్నీ విడిచిపెట్టి యీ వ్యాపారంలోకి దిగాను. ఏదేనా చెయ్యాల్సిందే, తప్పదు. (అన్నమోరామచంద్ర వసాడు.) వెనకటికోసారి ఒక పౌరాణిక నాటకం కంట్రాక్టు తీసుకుని ఆడిస్తున్నాను. ఇట్లాగే తెల్లారితే నాటకం. అయ్యా—అందులో ఒకనటుడికి, ఆరాత్రికి రాత్రి ఏం వచ్చిందో మరి—'అదిస్తేనేగాని రానుపొమ్మంటాడు!'

అ. గో: "అదే"మిటి?

వ. రా: అదేనండీ! (నెమ్మదిగా) బుడ్డీ. 'నే నెక్కడతేను బాబూ, ప్రొహిబీషను' అన్నాను. 'జాంతానై, తే' అంటాడు; లేక పోతే నాటకం ఆంధ్రరాజధానికి మార్చుకోమంటాడు! ఏం చెయ్యమంటారు? రెండుకాళ్ళమీదాపడి, ఎప్పుడూ ఏ దేవుడికీ అట్లా సాష్టాంగపడలేదు బాబూ—ఇదిగో ఇట్లా పడి—(యాక్షన్ చెయ్యబోతాడు)

చంద్రి: (పకపకనవ్వుతూ) భలేవారండీ! (నవ్వాపుకుంటూ) అబ్బ ఆ చెప్పటం చూద్దురూ!

అ. రా: చెయ్యగాలేనిది, చెబితే తప్పేమిటమ్మా చంద్రికా—నువ్వు అప్పటికి పుట్టివుండవుగాని—వసుదేవుడు లాంటివాడు గాడిదకాళ్లు పట్టుకున్నాడు! ఏమిటీ—

అ. వై: ఈయన మహాపుట్టినట్టు!

అ. రా: (తనహాస్యానికి తనే నవ్వుతూ) ఏమిటే—

అ. గో: ఏమిటండీ—ఏమిటండీ ఇదంతా!

అ. రా: పిడకలవేట లేందీ రామాయణం రక్తికట్టదు. ఏమిటీ—

పెరు: (బయటనించి వస్తూ) ఆడు పుచ్చుకోట్టండీ ఈ డబ్బులు. గంటసేపున్నరయిందిటా—అవతల బేరాలు మానుకుని కూచున్నాట్ట—మరో పావలా పారేయమంటున్నాడు!

వ. రా: అబ్బబ్బబ్బబ్బ...వీ డొకడు తినేస్తున్నాడు మధ్య.

పెరు: నేనా—రిక్షావాడాండీ?

వ. రా: ఇద్దరూనూ—

పెరు: బాగుందండయ్యా (ఏదో చెప్పబోగా)

అ. రా: ఒరే పెరుమాళ్ళూ—నువ్వు పేరుమార్చుకోరా, చెప్తాను.

పేరు: మార్చుకుంటే రిక్షావాడు ఎల్లిపోతా డటండి?

అ. రా: నీ మొహంరా నాగమ్మా—

పెరు: కళ, నా పేరు నాగ...

అ. రా: ఈ రోజునుంచీ నీపేరు పి. పుడక. అంటే పానకంలో పుడక. ఏమిటీ—నీకు సార్థకనామంరా అది!

అ. గో: ఆపేరు మీకుపెట్టాలి. పదండి (లాక్కుపోతాడు. వెనకాలే రామనాథయ్యా, ఆవెనకాలే పెరుమాళ్లూ పోతారు)

అ. గో: (కొద్దిగా ముందుకొచ్చి) అమ్మా, చంద్రికా—ప్లీజ్!

చం: ఊఁ—కానీండి. (అ. గోపాలం పోతాడు.)

రామం: ఎక్కడినుంచి మొదలెడదా మంటారు?

అ. వై: ఆగిపోయిన దగ్గర్నుంచీ—

రామం: అదే, ఎక్కణ్ణుంచీ అని?

చం: ఎక్కడినుంచో, ఓక్కడినుంచి. కానిద్దురూ తలనొప్పి!

అ. వై: ఊఁ సరే (రామంతో) మీరు అక్కడ నించోండి. (చంద్రికచేతిని పట్టుకుని లాక్కుపోతూ) రా చంద్రికా రా పోదాం!

చం: (వదిలించుకుని రామంకేసి పరుగెత్తి) మోహన్!

రామం: చంద్రికా—(తన వెనక్కు ఆమెను లాక్కుని, తన ఆమెముందుకొచ్చి నుంచుంటాడు.)
ప్రసాద్! నువ్వాడుతున్న నాటకం, నువ్వు ధరిస్తున్న పాత్ర, నువ్వు వేస్తున్న వేషం—ఇహ చాలు. బయటకు నడువ్—లేదా—ముందుకు (రాబోతాడు)

చంద్రి: మోహన్! (వెనక్కు లాగుతూ) వద్దు మోహన్! అతనిమీద చెయ్యి చేసుకోవద్దు—నామాట విను మోహన్!

అ. వై: (అహ్హాహ్హాహ్హా అని నవ్వి) ఏం—తగ్గిపోయావేం—రా. ఊఁ—(ముందుకొస్తాడు. రామంకూడా ముందుకు వస్తాడు. ఆమె 'మోహన్' అని అరుస్తుంది. రామం, "ద్రోహీ! నీచుడా!" అని వైకుంఠం గడ్డంమీద ఒక్కటి కొడతాడు. పౌరుషంగా ముందుకువచ్చి, వైకుంఠం రామాన్ని నిజంగా కొడతాడు. రామం దూరంగా తుళ్లిపడి పోతాడు.)

అ. గో: (ఆత్రుతగా వస్తూ) చంపేశారు, చంపేశారు. ఎన్నిసార్లు చెప్పినా సరిగ్గా చెయ్యరుకదా. మీరతన్ని కొట్టకూడదండీ—అతని దెబ్బలో మీరు పడిపోయి, పారిపోవాలి.

అ. శై : ఛీఛీ—వీడు నన్ను కొట్టటం ఏమిటి—నేను పారిపోవటం ఏమిటి ?

అ. గో: నటనండీ మహాత్మా! ఇదేం ఖర్మండీ మీతో! ఒక్కరూ నటించలేరం—నటించడం చాతకానివాళ్ళంతా నటులై పోయారా ఏమిటి ఖర్మ!

అ. శై : నటించడం చాతకాకపోవటం కాదండీ!...అసలు సంగతి చెబుతున్నా వినండి. ఈ రామం నిజంగా చంద్రికను లవ్ చెయ్యడం ప్రారంభించాడు. నాటకంలో లవ్ సీను చెయ్యి మంటే, బయటకూడా మొదలెడితే ఎట్లా? పైగా చంద్రిక నా భార్య కాబోతోంది. వీడి రొమాన్సు విషయాలన్నీ నాతో చెప్పింది. నేను ఎన్ని చీవాట్లు పెట్టినా వీడు వినిపించుకోవటం లేదు. (దెబ్బ తగిలినచోట చెయ్యి పెట్టుకొని, రామం మెల్లిగా వస్తాడు.)

రామం: వీడు గీడు అని అమర్యాదగా మాట్లాడకు శైకుంఠం!

అ. గో: ఇశ్...ఆఁ—తర్వాత?

అ. శై : తర్వాతేముంది తర్వాత? పైగా వీడు ఈ రిహార్సల్సులో నిజంగా కొట్టాడు నన్ను! తిరిగి కొట్టకుండా వుంటటానికి నేనేం వాజమ్మనా?—అంత చాతకాని వాడినా!

అ. గో: నిజంగా కొట్టారేమిటి రామంగారూ!

రామం: ఫైనల్ రిహార్సల్సకదా అని కొట్టానండీ! (ఈలోగానే రామనాధయ్య, రామచంద్ర వచ్చి అక్కడ నించుంటారు.)

అ. గో: బావుందండీ—ఈ కథ బావుంది.

అ. రా: అయ్యా, ఆ కథనికొస్తా కంచికి పంపించి, మనకథ సంగతి చూద్దురూ! ఏమిట—

అ. గో: అయ్యా ఒక్కమాట వినండి. మీరు బయట ఎట్లా వున్నా, ఎంతైనా ఇది నాటకం! మీరంతా చక్కని నటులు. మీకు చెప్పటానికేముంది? అంచేత, అవన్నీ మరిచిపోయి, కేవలం ఇక్కడ నటించాలి.

రామం: నాకు చాలా అవమానం జరిగింది. నేనింటికిపోతాను.

శేరు : (లోపల్నుంచి వస్తూ) రిక్షావాడు డబలే బేరాలు పోతున్నా యంటున్నాడు—అలాగేనా అడిగే బేరాలు తగలిద్దురూ!

అ. గో: ఉండ్రా నువ్వు (రామం పోబోతాడు) ఆగండ—బావా అంతమనిషిని పట్టుకొని మీరు బాగా కొడితే ఎట్లా చెప్పండి !

రామం: బావుంది. పాత్రలో లీనమైన తర్వాత...

అ. శై . అబ్బా—పాత్రలో లీనం అట !

వ. రా: ఐపోయిందేదో ఐపోయింది. కానీండి—కొట్టడంసీనుఅయిందనుకోండి; ఆ తర్వాతనుంచి చెయ్యండి! ఐనా ఈ కొట్లాటలూ, ఇవీ స్టేజిమీద ఎందుకయ్యా అంటే ఈ కవిగారు విన్నాడా—

అ. రా: బావుందండీ! అవన్నీ మీకేకదా పెట్టమన్నారు—రేపు ఫిల్మ్ తీస్తే బాక్సాఫీసు హిట్టవుతుందనీ! ఏమిటే—

అ. శై : (సంతోషంగా) ఫిల్మ్ తీస్తారా యేమిటండీ?

అ. గో: తీసినా మిమ్మల్ని పెట్టి తీశామూ—చచ్చామే.

వ. రా: ఆలూ లేదు చూలూ లేదు అన్నట్టు అవన్నీ ఎందుకండీ! ఈ నాటకం సంగతి చూద్దురూ బాబ్బాబూ!

అ. శై : నాటకం సంగతి చూడమని అంటారేగాని—ఈ రామం లవ్ గొడవ మాన్పించాలని చూడరేం?

వ. రా: ఏమయ్యా రామంగారూ—ఏమిటయ్యా ఈ గొడవంతా!

రామం: గొడవేం లేదండీ. (గడ్డంమీద చెయ్యి తియ్యబోయి) అబ్బా! (అంటాడు)

అ. రా: ఏమిటి రక్తం కారుతోందా ఏమిటి?

అ. గో: ఏమండీ, ఏదీ—(ఆ చెయ్యి కదిలించబోతాడు)

రామం: ఫరవాలేదులెండి!

అ. గో: గట్టిగా వాచినట్టుంది—ఒరే పెరుమాళ్లూ—(గట్టిగా పిలుస్తాడు.)

పెరు: అబ్బ! ఇక్కడే వున్నాగదండీ! అంత కేకపెట్టారేటి!

అ. రా: నీకు బ్రహ్మాండమైన చెవుడని అంతకేక పెట్టారు. ఏమిటీ—('హి హి' అని తనే నవ్వుతాడు.)

అ. గో: ఈయన్ని లోపలకు తీసుకుపోయి, ఆ మందుల డబ్బాలో వున్న కాస్త మందుపెట్టి చిన్నపట్టీ కట్టు. ఊఁ—(పెరుమాళ్లు రామాన్ని లోపలికి తీసుకుపోతాడు.)

అ. రా: ఏమండీ, నిజంగా ప్రేమలో పడ్డాడా ఏమిటీ కుర్రాడు?

అ. వై: ఇంతా అంతానా? అసలు వీడు కస్తూరిని చాలాకాలంగా ప్రేమించటం మొదలెట్టాట్ట! ఆ తర్వాత ఈ నాటకం ఛాన్సు తగిలి, వీడు హీరోగా నటించాల్సిన ఖర్మం పట్టగానే లవ్ డైలాగ్స్ చెప్పటానికి ఛాన్సుదొరికింది చూడండీ—దాంతో మరీ పిచ్చిలోపడ్డాడు!

అ. గో: అంటే అయ్యా—ఇంతకు పూర్వంనుంచి నిన్ను ఎరుగునా ఏమిటి ఈయన?

చం: ఆఁ ఏముందిలెండి! ఇదివరకు నేను ఏదో ఒకనాటకంలో రిహార్సలు చేస్తూవుంటే వచ్చాడు. వచ్చి కూచుని పాపం, రిహార్సలు చూస్తున్నాడు. ఇంతలో ఇట్లాగే కొట్టాల్సిన సీను ఏదో వచ్చింది. నేనేకొట్టాలి ఎవర్నో. అక్కడే దగ్గరున్న పూలకుండీతీసి విసుర్తానన్నమాట! అట్లా విసిరే ఆ పాత్ర నటించే ఆయన తప్పుకుంటాడు—అదివెళ్లి గోడకు కొట్టుకుంటుంది. కాని ఏమయింది? నేను మామూలుగానే విసిరేశాను—ఆయన తప్పుకున్నారు. ఇంతలో ఈ రామంగారు ఎక్కడి నుంచి వచ్చాడోమరి, ఆ పూలకుండీవెళ్లి ఠపీమని ఇతనికి తగిలింది.

అ. రా: అదిగో—అట్లా తగలాలి మన నాటకంలో! ఎక్కడంటే—

అ. గో: ఉండండీ—ఈ కథ చాలా ఇంటరెస్టింగ్‌గా వుంటే మధ్యలో మీరు మనసంగతి ఎత్తుతారు! ఆఁ తర్వాత?—

అ. వై: తర్వాతేముంది? పాపం ఆ దెబ్బ తగిలిందికదా అని, చంద్రిక బాధపడి, వెంటనేవెళ్లి ఉపచారాలూ అవీచేసి, క్షమించమనీ ఇలాఅనీ అలాఅనీ ఏదో పాపం ప్రాధేయపడింది. నిజంగానే చాలా విచారపడింది లెండి!

వ. రా: మీరూ వున్నారేమిటి అప్పుడు అక్కడ?

అ. వై: సరిపోయింది. ఉండడమేమిటి—ఆ పూలకుండీ ఆమె ఎవరిమీదికి విసిరిందో, ఆ పాత్ర ధరిస్తున్నది నేనేగా!

అ. రా: అహాఁ!

అ. వై: ఆఁ! సరి, వీడేం చేశాడు? ఆమె అంత మంచిగా మాట్లాడిందికదా అని, ఆ ఆసరా తీసుకుని, వెంటనే ఆమెఇంటికి వెళ్లి వీడామెను ప్రేమిస్తున్నట్టు వ్యక్తపరిచాడు.

అ. రా: భేష్! అక్కడ ప్రారంభమైందన్నమాట కథ! ఏమిటీ—

అ. వై: తర్వాత కస్తూరి ఏవో చివాట్లు వేసిందనుకోండి!

చం: చివాట్లేం పెట్టలేదులెండి. ఎందుకొచ్చిన అన్యాయం మాటలుగాని—నెమ్మదిగానే బుద్ధిచెప్పి పంపేశాను!

అ. వై: వీడా వాడు వొదల్లేదు. వాడి ప్రేమ వాడిది! ఆ తర్వాత ఎట్లాగో మననాటకంలో ఆవిడ పక్కనే ఈ హీరోపాత్ర నటించాల్సివచ్చేసరికి—ఇహ స్వర్గంలోపడ్డాననే అనుకున్నాడు!

చం: పాపం—పొట్టి అమాయకుడు లెద్దురూ—

అ. గో: ఐతే మొత్తానికి పెద్దకథే వుందన్నమాట!

అ. రా: ఆఁ! ఒక తెలుగుసినిమా తియ్యగలడానికి సరైనంత కథ వుంది. ఏమిటీ.

చం: కొంపదీసి రాసెయ్యగలరు సుమండీ!

అ. రా: ఆఁ ఇదోకథా! ఇంతకంటె వండర్‌ఫుల్ స్టోరీస్ వున్నాయి మనదగ్గర స్క్రీన్ ప్లేలతోసహా రాసేవి! ఏమిటీ అందులో రెండుమూడు బ్రహ్మాండమైన కామెడీలు. వన్ థౌజండ్ వన్ లాఫ్టర్స్ అన్నమాట! ఏమిటీ, జనం నవ్వలేకచావాలి! (బయటనుంచి రిక్షావాడు "అయ్యా, అయ్యగారూ" అని కేకలు వేస్తాడు.)

వ. రా: ఎవడ్రా అది? ఒరే పెరుమాళ్లూ, లోగుట్టు పెరుమాళ్లూ!

పెరు: (వస్తూ) ఏటండీ!

వ. రా: ఏమిట్రా—అవతల ఆ రిక్షావాడేనా ఏమిటి ఆ కేకలు?

పెరు: (ఆలోచించి) రిక్షావాడే ననుకుంటానండి. కాకపోతే... ఆఁ—ఆ ఈడ యుంటాడండీ—ఈ పక్క సిగరెట్లకొట్టోడు—ఎవడు? మనబొందెలో కైలాసం! నిన్న సాయంత్రం డబ్బుకోసం వస్తే ఇప్పుడు రమ్మన్నారుగదండీ తమరు! పరే—ఎల్లుండి రమ్మంటానండీ—

వ. రా: ఎందుకూ?

పెరు: అదు మళ్లీ ఎప్పుడు రావడమో మీరు చెప్పడానికి!

వ. రా: ఐతే ఇంటికి రావేనంటా వేమిటి? చూడు చూడు చూడోరే—

పెరు: చూసేదేటి? ఐతే అదు—కాపోతే మన రిచ్చావాడూ! (పోతాడు).

చం: రామనాథయ్యగారూ! నేను వెళ్ళిపోతానండి—చాలా విపరీతంగా వుంది తలనొప్పి!

అ. వై: నీకూనా?

అ. గో: ఏం మీకూ వచ్చిందా ఏమిటి?

అ. రా: (రామనాథయ్యకేసి చూస్తూ) మీకు రాలేదుగదా కొంపదీసి! ఏమిటీ—

వ. రా: ఇదంతా చూస్తూవుంటే ఇప్పుడిప్పుడే ప్రవేశిస్తోంది.

అ. రా: ఐతే తలనొప్పి పేషెంట్లతో ఒకనాటకం రాసేస్తే—ఇప్పుడందరూ చాలా సహజంగా నటించే మూడ్‌లో వున్నారన్నమాట! ఏమిటీ—(తనే నవ్వుతాడు)

పెరు: (వస్తూ) మన రిచ్చావాడే నండయ్యగారూ—ఆడికి వేరాలు పోతున్నాయటా మరోపావలా ఇమ్మంటున్నాడని చెప్పాడు గదండీ—

వ. రా: ఇవ్వలేదా ఏమిటి?

పెరు: నేనట్టా ఇస్తానండీ - మీరివ్వకపోతేనూ—

వ. రా: అదే, నేన్రా వెధవా — నీకివ్వలేదా అని అడుగుతున్నాను.

పెరు: కాగుందండయ్యా—మీరిస్తే...

అ. గో : అదా మీ ఖరీదూ! ఈ ఆలోచన నాకూ తట్టింది. కానీ—

వ. రా : కానీ కాకపోతే, తట్టినప్పుడు చెప్పలేకపోయారా? ఇది బాగానే వుందిగా!

అ. రా : పైగా ఎఫెక్టూ వస్తుంది. ఎంచాతంటారా—నీలిచంద్రికా, అరిచేతిలో వైకుంఠం ఇద్దరూ నిజజీవితంలో కూడా హీరో హీరోయిన్లే కాబట్టి, స్టేజిమీద హాయిగా; సహజంగా నటిస్తారు. ఏమిటీ—రసికజనమనోభిరాముం ఇద్దరి మధ్యా సరయిన విలన్ అవుతాడు!

అ. గో : బాగానేవుంది అక్కడికది ఒప్పుకున్నాం. కానీ, అందులోనూ కొన్ని ఇబ్బందులున్నై మన యాక్టర్సుతో.

వ. రా : ఏమటవి?

అ. గో : వైకుంఠం, చంద్రికా నిజజీవితంలో కూడా 'హీరో హీరోయిన్లే' అని కదూ అన్నారు—వేషాలు మరిస్తే పీక్లెంచేస్తారంటే, లవ్‌సీను వచ్చేసరికి, నిజంగా స్టేజిమీదే లవ్ మొదలెటి, అవకాశం వొచ్చిందికదా అని—నిజంగానే ఎక్కువ మాట్లాడేసుకుని—ఎక్కడలేవాలో అక్కడలేవరు, అతన్మయత్వంలో పడిపోయి!

అ. రా : అబ్బే—

అ. గో : అబ్బే కాదు. మనవాళ్ల తత్వం అది! ఎప్పుడయితే విలన్ పాత్రలో వున్న తన ప్రియుణ్ణి తిట్టాల్సివచ్చిందో, అప్పుడు తిట్టలేకపోయిన మన హీరోయిన్నూ—అతనితోనే లవ్‌సీను నటించాల్సివచ్చినప్పుడు నిజంగా తన్మయత్వం ఎందుకు పొందదు? మొదటి 'నటన' అని అర్థమైతే, ఇదీనటనే అని వున్నంతమట్టుకే నటిస్తారు. ఎంత చెప్పినా వీళ్లు నటనగా భావించుకోటంలేదు. కాకపోయినా, ఇంతవరకూ ఏదో, దేవుడి దయవల్ల అపోర్షన్లు కొంత కంతలా పెట్టారు. కాకపోయినా, వైకుంఠం హీరో వేషానికీ, రామం విలన్ వేషానికీ ఏ మాత్రం పనికిరారు—పెర్సనాలిటీల దృష్ట్యా. అది కొప్పుకున్నా-ఈ క్షణంలో వేషాలుమార్చి, రేపు స్టేజి ఎక్కిస్తే అసలుకే మోసం వొస్తుంది!...

వ. రా : నిజమే-నిజమే-ఏమయినా మన గోపాలంగారి బుర్రవుందే—

అ. రా : చూడటానికి చిన్నదైనా వూహించటానికి (ఎగతాళిగా) పెద్దబుర్ర! ఏమిటీ—

వ. రా : ఆ కాఫీ కాస్తా తాగించేసి, ఆ రిహార్సల్సు కానివ్వండి బాబూ-గోపాలంగారూ కానీండి, కానీండి.

అ. రా : వచ్చిందేమిటి కాఫీ?

అ. గో : "వచ్చుచున్నది!"

అ. రా : "త్వరలో వచ్చుచున్నదా?" ఏమిటీ — (హీ హీ అని తనే నవ్వుతాడు).

[రామం గడ్డంమీద చిన్నపట్టీ వేసుకుని నీరసంగా వొస్తాడు]

అ. గో : ఏమండీ ఎట్లావుంది?

రామం : పెద్దబాధేం లేదులెండి. కానీండి రిహార్సల్సు చేద్దాం.

వ. రా : (ఛటుక్కున గుర్తొచ్చి) గోపాలంగారూ వచ్చాం!

అ. రా.
అ. గో. } ఏం? (ఆత్రుతగా)

వ. రా : పిల్చిద్దరూ ఆలోచలకు వెళ్ళారు — లవ్‌సీను మొదలెట్టి వుంటారయ్యా!

అ. గో : వైకుంఠంగారూ - అరిచేతిలోవైకుంఠంగారూ (గట్టిగా పిలుస్తాడు.)

అ. రా : అయ్యాయ్, చంద్రికా-నీలిచంద్రికా! (గట్టిగా పిలుస్తాడు

[ఇద్దరూ వస్తారు]

అ. వై : (వస్తూనే) ఆఁ-వచ్చిందా కాఫీ?

వ. రా : ఎంతసేపూ ఇదీ అదీ అడుగుతారేగాని - 'రిహార్సల్సు చేద్దామా, నాటకం ఆడదామా' అని ఒక్కరూ అడగరేం?

చం : నేనడుగుతున్నాను - రండి చేద్దాం!

అ. రా : ఆహా - ఏమయినా, చంద్రిక నిజంగా నీలిచంద్రికే! లేవండి.

[అంతా లేస్తారు. గోపాలం ఓసారి అదీ ఇదీ సర్దాడు]

అ. గో : (తనుపోతూ, తిరిగిచూసి) రండిరండి రామచంద్రగారూ—రామనాథయ్యగారూ రండి!

[ముగ్గురూ పోతారు]

అ. వై : ఎక్కడినుంచి మొదలెడదాం?

అ. గో : (ముందుకొచ్చి) అదే! హీరో విలన్ను కొడతాడు—అతను పారిపోతాడు. అక్కడినుంచి చేద్దాం. అంటే (స్క్రిప్టు చూస్తూ ముందుకొస్తూ) ఇప్పుడూ మోహన్‌వచ్చి ఆమెతో మాట్లాడే సీను. అంటే నాటకంలో ముఖ్యమైన లవ్‌సీను!

చం : ఆ సీనుమాత్రం ఇప్పుడు చెయ్యటం కష్టం! అదితప్ప ఇంకే దన్నా చేద్దాం.

అ. గో : కష్టంఅనుకుంటే ఎట్లాగండీ? వరసగా కానివ్వండి. ఎంతసేపు—అతను మీదగ్గరకు వస్తాడు. మీరూ అతనూ ఆ సంభాషణలు చెప్తారు. తర్వాత హాయిగా, తీయగా—'డ్యూయెట్' పాడుకుంటారు. అన్నట్టు ఆ టేప్‌రికార్డర్ రెడీగావుందా రామనాథయ్యగారూ!

వ. రా : ఆఁ ఆఁ—ఆ పాటకు లెట్టా పెదవులు ఆడిస్తారో ఒక్కసారి చూడాలనివుంది. ఇంతవరకూ ఏమీ చెయ్యలేదు.

చం : పాట కంఠతా వచ్చుగా. ఫరవాలేదులెండి—చేసేస్తాం.

వ. రా : మరే ఇప్పుడు చెయ్యరూ?

అ. వై : ఇప్పుడు చెయ్యటానికి వీలులేదండీ. చెప్పిందంతావిని మళ్లీ మొదటికొస్తున్నారు. ఆ రామంతో లవ్‌సీను యాక్టు చెయ్యటం చంద్రికకు ఇష్టంలేదు. పోనీ, చేసినా—అతను మాత్రం తన ధోరణి మొదలెడతాడు! ఛీ ఛీ—నా ప్రాణాల మీదికి విలన్‌లా తయారయ్యాడు!

[ఎవరూ మాట్లాడక, అట్లా చూస్తూ నించుంటారు]

చం : ఇంకే సీను మొదలెట్టమంటారో చెప్పండి!

అ. గో : (నిట్టూర్చి) కానీండి, మీ యిష్టం. ఆ క్లయిమాక్సు సీను ఒక్కసారన్నా రిహార్సలు చెయ్యలేదు—అదిచేదాం!

చం : అంటే ఏమిటది?

అ. గో : (అఖరి పేజీలు తిప్పి పుస్తకంలోకి చూస్తూ) అదే—మీరు గదిలో వుంటారు—విలన్ వస్తాడు—

చం : ఇందాక చేసిందేగా!

అ. రా : (వస్తూ) అదికాదూ ఇదికాదూ-అమ్మా చంద్రికా! ఇదేమిటంటే లాస్టుసీను. అంటే ఆఖరిసీనులో, నువ్వు గదిలో వుంటావు. పెళ్ళి ఆ రాత్రే నీకూ హీరోకూ జరగబోయేం దన్నమాట! నువ్వు చాలా కులాసాగా (ఏదో వరస పాడుతూ) "హాయి హాయి ఈ రేయీ, చెంతకిదిపోద మాయీ"—ఏమిటీ, అని పాటపాడుకుంటూ అద్దంలోకి చూస్తూ సింగారించుకుంటూ వుంటావు. ఏమిటీ—ఈ క్షణంలో మనవాడు—విలన్‌వస్తాడు. ఈ పెళ్లి తప్పించి,

దివ్వ ఎత్తుకుని పారిపోదామని చూస్తాను. ఏమిటే—నీకు సైలెంటుగా వస్తూవుంటే నువ్వు చూస్తావు—కేకలువేస్తావు. అతను మీదికి రాబోతాడు. ఆక్రోశంలో నువ్వు పక్కన ఏమిటుంటే అది తీసి అతనిమీదికి విసిరేస్తావు. అతను అన్నిం టినీ తప్పించుకుంటూవుంటాడు — నీమీదికి రాబోతూ వుంటాడు. సీను మాంఛి క్లైమాక్సుకి పోతూవుంటుంది.

నీ కేకలూ, అతని నవ్వూ, నువ్వు విసరటం ఇదంతా అన్న మాట. ఏమిటీ—ఈ హడావుడిలో మన హీరో పోలీసుల్ని వెంటబెట్టుకుని అకాత్తుగా గదిలోకి ప్రవేశిస్తాడు. తర్వాత విలన్ చేసిన దుర్మార్గాలు బయటపడటం—వాడిని పోలీసులు ఎరెస్టుచెయ్యటం, ఇవన్నీ వుంటాయనుకో. ఇదీ సీక్వెన్సు. మాంఛి యాక్టింగ్‌కి స్కోపున్నమాట! ఏమిటే—

చం : వూఁ—సరే, కానీండి.

ఆ. గో : షేక్‌రికార్డరు తీసుకురండి రామనాథయ్యగారూ—

[రామనాథయ్య వెళతాడు]

చం : ఆ చివరకూడా పాటుందన్నారుగా—ఏమిటో—ఆ పాటేమీ చూసుకోలేదు. ఐనా ఇప్పుడు పాంగుకు నటించే మూడ్‌లో లేనులెండి!

ఆ. గో : (కొంపమునిగినట్టు) రామనాథయ్యగారూ, త్వరగారండి.

వ. రా : (ఆత్రుతగావస్తూ) ఏమిటేమిటి ?

ఆ. గో : (కూల్‌గా) ఆమె, ఆ పాట ఇప్పుడు పాడనంటున్నారు. ఐనా ఆ పాట తీసేద్దాంలెండి. ఎందుకంటే, నాటకం క్లయిమాక్సు సీనుముందు మళ్ళీ పాటా అదీ అంత రక్తికట్టదు. వీలైతే ఇంకోచోట పెట్టుకుందాం.

వ. రా : కానీండి, కానీండి. అంతా మీదయ.

ఆ. గో : అమ్మా—నువ్వు ఇట్లా కూచుని సింగారించుకుంటూ వుంటావు. విలన్ వస్తాడు. మీరంతా అవతలకు వెళ్లిపోండి

[రామనాథయ్య, రామచంద్ర లోపలకుపోతారు—వైకుంఠం, రామం వీధివైపుపోతారు. గోపాలం అంతా ఓసారిచూసి, ఓకే అనుకుని, 'రెడీ' అని లోపలకుపోతాడు. చంద్రిక అద్దంలో సింగారించుకుంటున్నట్టు నటిస్తూవుండగా, పెరుమాళ్లు కాఫీకెటిల్‌తో ప్రవేశం.]

పెరు : (వస్తూనే, గట్టిగా) అయ్యగారూ—సైకిల్‌రిక్షావాడికి మొత్తం రెండురూపాయిలయింది.

ఆ. గో : (వస్తూ) అబ్బబ్బబ్బ...మాంఛివేళ చూసివస్తావురా నువ్వు!

అ. రా : ఒరే, నేను ఏ పేరుపెట్టినా వతినే పెట్టరా పుణ్యాత్ముడా-ఏమిటే—

అ. వై : (వస్తూ) తలనొప్పిమాత్రలు తెచ్చావా ? (పెరుమాళ్లు ఇస్తాడు.)

వ. రా. (వస్తూ) సరే, అందరికీ ఆ కాఫీ ఇచ్చేయ్.

ఆ. గో : కాఫీ ఇవ్వొచ్చునులెండి. రిహార్సల్సు కావటానికేం ? మీరంతా పదండి.

[పెరుమాళ్ళు, రామనాథయ్య, రామచంద్ర లోపలకుపోతారు. రామం, వైకుంఠం బయటకు పోతారు. తర్వాత గోపాలం కూడా లోపలకుపోతాడు. చంద్రిక సింగారించుకున్నట్టు నటించి, అటూఇటూ చూసి కుర్చీలో కూర్చుంటుంది. వనక నుంచి దొంగలాగా వైకుంఠం ప్రవేశిస్తాడు. దగ్గరగా వచ్చే సరికి ఆమె లేస్తుంది. దూరంగాపోయి, "నెల్లిప్రసాద్ వర్లు"

అంటుంది. వైకుంఠం క్రోధంగా వచ్చి మీదకు పోబోతాడు. ఆమె అటూ ఇటూ చూసి, మొండిగావున్న చిన్న పిడికెల దువ్వెన పక్కనే వుంటే, అదితీసి అతనిమీదకు విసుర్తుంది. వైకుంఠం తప్పించుకుంటాడు. దువ్వెన వీధిద్వారంలోకి పోతుంది. లోపల్నుంచి 'అబ్బా' అని అరుస్తాడు రామం. చంద్రిక ఆత్రుతగా అటుచూస్తుంది. వైకుంఠం కూడా చూస్తాడు.]

చం : (అటు వెళ్తూ) ఏంజరిగిందండీ, ఏంజరిగింది?

[రామం కుడికన్ను మూసుకుని, తలవొంచుకుని బాధగా 'అమ్మా' అని మూలుగుతూ లోపలకు వస్తాడు.]

చం : ఏమిటండీ?

రామం : ఆ దువ్వెన మొన, సరిగ్గా......కంట్లో......తగిలిందండి. అబ్బా...(నెమ్మదిగా కుర్చీలో కూర్చుంటాడు.)

అ. గో: (వస్తూ) ఏదో ఒకటి, ఏదో ఒకటా! ఐనా ఆగమ్యంలో నించోవాలటండీ—అబ్బబ్బబ్బ...దెబ్బ బాగా తగిలిందా ఏమిటి?

[రామం తలవంచుకుని, ఆ చెయ్యిపెట్టుకుని అట్లాగే వుంటాడు.]

పెరు : (ముందుకొచ్చి) అయ్యగారూ, కాఫీకొస్తారా—అక్కడికే తెమ్మంటారా అండీ?

అ. గో: పిడోకల్రా మధ్య తెగతి సేస్తున్నాడూ—

[పెరుమాళ్ళు పోతాడు. వైకుంఠం లోపలకు పోతాడు.]

చం : ఏమండీ రామంగారూ, (పలకరు) చూపించండి. చూసుకోలేదు.

రామం : ఏం ఫరవాలేదులెండి. అదే తగ్గుతుంది. అబ్బ (తలదించుకునే వుంటాడు.)

చం : చాలా బాధగావుందా? (దగ్గరగా వెళ్ళబోయి తక్కున ఆగిపోతుంది. వెంటనే ఆమెకు ఇట్లాగే జరిగిన పాతసంఘటన గుర్తుకురాగా, కంపించి అట్లాగే వుండిపోతుంది)

అ. గో: ఏమిటయ్యా ఏమిటి?

చం : (నిట్టూరుస్తూ) ఇదివరకోసారి ఇట్లాగే రిహార్సల్‌లో నాచార దెబ్బతిన్నాడు. అదేసంఘటన మళ్ళీ ఇవాళ!

అ. రా: (వస్తూ) మీకెవరికీ కాఫీ అక్కర్లేదా ఏమిటి—ఏమండీ—(వెనకాలే రామనాథయ్య వస్తాడు)

అ. గో: ఇష్—(వాళ్లిద్దరూ నెమ్మదిగా వస్తారు.)

చం : కంట్లో వెయ్యడానికి మందేమయినా వుందా?

రామం: ఏమందూ అక్కర్లేదులెండి, అదేపోతుంది—కాస్సేపట్లో. ఐనా ఎందుకంత బాధపడతారు—పొరపాటున తగిలిన దెబ్బకి!

(చంద్రిక ఒక్కక్షణం ఆలోచించి ఏదో నిర్ధారణకు వచ్చి అతనిదగ్గరగావచ్చి కంటి మీదనుంచి చెయ్యితీస్తుంది. అతను 'అబ్బా' అంటాడు. వైకుంఠం చేతిలో కాఫీతో ప్రవేశించి, ఈ దృశ్యంచూసి అక్కడనుంచే 'చంద్రికా' అంటాడు)

అ. వై: (దగ్గరగావచ్చి) ఏమిటది చంద్రికా మళ్ళీ ఉపచారాలు మొదలెట్టావ్?—ఇదివరకు జరిగిన సంగతి గుర్తులేదూ?—నా అక్కణ్ణుంచి. ఇంద కాఫీతాగు.

చం : అక్కడుంచండి—మందు తెస్తా. (లోపలకు వెళ్లబోతుంది)

అ. వై: ఆగు! ఏమిటిది చంద్రికా—మందు నువ్వుతీసుకురావాలా ఏమిటి? (లోపలకు చూస్తూ) పెరుమాళ్ళూ—మందు తీసుకురా. ఐనా ఇందులో మళ్ళీ చేసిందేముంది? అడ్డం వస్తే తగిలింది. అంతేగా! దీనికింత రాద్ధాంతం—గోలానా? పూర్వపూర్వ—రిహార్సల్సు కానివ్వండి. (రామం నెమ్మదిగా లేస్తాడు) ఇదివరకు ఇట్లాగే అడ్డం వొచ్చి దెబ్బతిన్నావు కదా—సిగ్గులేదుటయ్యా—పోనీఅని ఆమె మంచిమాటలాడుతోంది. ఇవాళ మళ్ళీ వెళ్ళి చెప్పు—నిన్ను ప్రేమిస్తున్నానని! ఛీ ఛీ—

[రామం అతనికేసి తలతిప్పిచూసి, మళ్ళీ తిప్పుకొని వీధిలోకి పోబోతాడు.]

అ. వై: తగినశాస్తి జరిగిందిలే: లేకపోతే, ప్రేమా అవ్వా—

చం : ఏమండీ రామంగారూ, ఎక్కడికి, ఎక్కడికి బయల్దేరుతున్నారు?

రామం: ఎక్కడికీ లేదండీ. మీరు రిహార్సల్స్ చేస్తారుగా. బయట కూచుంటాను.

చం : కంట్లో కాస్త మందువేసుకుని వెళ్లండి.

అ. వై: నీకెందుకు చంద్రికా మధ్య? చెబుతూంటే వినిపించుకోవేమిటి? రా, రిహార్సల్స్ వేద్దాం.

చం : (అతనికేసి తీక్షణంగాచూసి) పెరుమాళ్ళూ-పెరుమాళ్ళూ-

పెరు : వచ్చానండమ్మగారు(వస్తూ) ఇదిగోమందు. (సీసా ఇస్తాడు)

చం : (తీసుకుని) రండి మందువేస్తాను. (రామాన్ని తీసుకొచ్చి కూచోపెట్టి, కంట్లో మందు వెయ్యబోతుంది)

అ. వై: (ఈపాటికే ఉగ్రుడైపోతాడు) చెబుతూవుంటే కొస్త కూడా వినిపించుకోవేం—వీల్లేదు, నువు మందు వెయ్యటానికి వీల్లేదు! (ఆమె చేతిమీదకొట్టి సీసాను తుళ్లించివేస్తాడు. రామంవేపు తిరిగి) ఛీ—(రామం నెమ్మదిగా కంటిమీద చెయ్యిపెట్టుకుని లోపలకు పోతాడు.)

చం : మీకేం మతుందా పోయిందా—ఆయన కంటిమీద దెబ్బకొట్టింది నేను. కాకపోయినా, తోటినటుడు బాధపడుతూ వుంటే మందువెయ్యటం సహించలేరూ?

అ.వై: నిన్ను అగౌరవం చేస్తున్న ఈ విలన్‌గాడికి మందువేస్తావా!

చం : అతనేం విలన్ కాదు—నన్ను ప్రేమించా నన్నాడేగాని—నన్నేమన్నా హింసలుపెట్టాడా — పెళ్లిచేసుకోమని బలవంతం చేశాడా!

అ.వై: ఏమిటిది చంద్రికా—అయ్యా రామనాథయ్యగారూ — మీరు వెంటనే ఈ రామాన్ని తీసి పారేసి ఇంకో వ్యక్తిని ఆ వేషానికి నియోగిస్తారా లేక, నన్ను వెళ్లిపొమ్మంటారా? (పోబోతాడు.)

అ.రా: అయ్యా—వైకుంఠంగారూ, అయ్యా (వెనకాల వెళ్లిపోతాడు.)

చం : అయనన్నే వెళ్లనివ్వండి రామనాథయ్యగారూ—ఎంతదూరం వెళ్తాడో నేనూ చూస్తాను.

అ.వై: (ఆగి, ఆమెకేసి కోపంగాచూస్తూ) అంటే నేనెక్కడికీ వెళ్లలేనని నీ ఉద్దేశం? చంద్రికా—నిన్ను నేను ప్రేమిస్తున్నాను కాబట్టి మూర్ఖంచేసినా నేను సహిస్తాననుకుంటున్నావు! కాని నాముందే మళ్ళీ విలన్‌గాడిని పట్టుకుని లాలిస్తూ బుజ్జగిస్తూ వుంటే కళ్లుమూసుకుని కూచుంటాననుకున్నావుకాబోలు! నన్ను ప్రేమిస్తున్నానని, పెళ్లి చేసుకుంటానని మాయమాటలుచెప్పి నాటకంలో నటించినట్టు నటించావన్నమాట!

చం : మిమ్మల్ని ప్రేమించటం లేదని, పెళ్ళి చేసుకోటం లేదని ఎవరు చెప్పారు? ఎందుకట్లా లేనిపోనివి కల్పించుకుంటారు?

అ.వై : మరేమిటి దీనర్థం? నిజంగా నన్నే ప్రేమిస్తూవుంటే నేను వద్దంటూ వున్నా ఈ విలన్‌గాడిపై జాలిచూపిస్తావా?

చం : చూస్తూవుంటే మీ ధోరణి శ్రుతిమించిపోతోంది. మిమ్మల్ని ప్రేమిస్తున్నంతమాత్రాన ఇంకో వ్యక్తిపై జాలిచూపకూడదన్న మాట!

అ.వై : కాదు. ఒక దుర్మార్గుడిపై జాలిచూపిస్తున్నావు అని చెబితే నేను నమ్ముతాననుకున్నావా? నిన్ను ప్రేమించి పెళ్ళిచేసుకుని భర్త కాబోతున్న వ్యక్తిముందు, నువ్వు ఇంకొకడితో సయ్యాటలాడుతూ—

చం : ఛీ—కనికరం, జాలి, మంచీ-చెడ్డా ఏమీ లేని వట్టి రాతిగుండె! మీ లాంటివాళ్ళయినా సహృదయంతోని మీలాంటి మనిషిని నేను పెళ్ళిచేసుకోలేను!

అ.వై : చంద్రికా—ఏం మాట్లాడుతున్నావో ఆలోచించే మాట్లాడుతున్నావా?

చం : (వినిపించుకోక) కేవలం నామీద మీకున్న ప్రేమే కాదు నాక్కావలసింది—మీలోవున్న కరుణకూడా నాక్కావాలి. —ఇటువంటి సమయంలోకూడా స్వార్థం చూపించుకుంటున్న మీరు—నిజమైన దుష్టులు!

అ.వై : చంద్రికా—మాటలు జాగ్రత్తగా రానీ! (పైకిరాబోతాడు).

చం : ఆగండి—ఈ క్షణంనుంచీ నామీద మీకేమీ అధికారం లేదు. మిమ్మల్ని నేను పూర్తిగా వొదులుకుంటున్నాను.

అ. వై. నోరుజారి ఏమేమిటో మాట్లాడుతున్నావు—తర్వాత విచారిస్తావు చంద్రికా?

చం : విచారించాల్సిన అవసరం నాకేంలేదు. ఏ వ్యక్తి హృదయంలో ఏముందో తెలుసుకున్నందుకు నిజంగా నేనిప్పుడు సంతోషిస్తున్నాను. మీ కంటె రామంగారు ఎన్నివిధాలో గొప్పవారు! మీరే అనవసరంగా అతనిపై లేనిపోనివన్నీ కల్పించి నన్ను రెచ్చగొట్టారు! ఇహ వాదన అనవసరం! మీరు వెళ్ళండి!

[గోపాలం నిర్ఘాంతపోతాడు, ఇంతవరకూ దూరంగావుండి ఇదంతా చూస్తున్న వాళ్ళంతా, దగ్గరగావస్తారు.]

అ. రా : (చప్పట్లుకొట్టి) ఆహా! కథకి బ్రహ్మాండమయిన ట్విస్టు!

వ. రా : ఎంతమార్పు!

అ. గో : కొద్ది సెకండ్లలో, చిన్న సంఘటనతో గొప్పమార్పు!

చం : (సర్దుకొని) అయ్యా, రిహార్సల్స్‌లో ఈ గొడవంతా తీసుకొచ్చి డిస్టర్బ్ చేశాను. క్షమించండి. ఇక మన నాటకం ఎట్లా జరగాలో అట్లా సవ్యంగా జరుగుతుంది—ఎవరికి లభించాల్సిన పాత్రలు వాళ్ళకు లభించాయి!

అ. వై. (నోటమాటరానివాడల్లే) అయితే అంతా నిజమేనా చంద్రికా?

చం : నిజంకాక, నాటకం రిహార్సలు అనుకున్నారా? సరే, ఆ సంగతేం ఇంక ఎత్తవద్దు. అయ్యా, నేనిప్పుడు రిహార్సల్స్ చేయకూడలేను. రామశాస్త్రయ్యగారూ, రేపంతా రిహార్సల్స్ సరిగ్గా చేసుకొని, నాటకం చక్కగా ఆడదాం. సెలవు—(పోబోతుంది)

అ. వై : ఆగు! ఇటువంటి నిర్ణయాలు చెయ్యటానికి నీ ఇష్టమేం వనికిరాదు. ఇకమీదట నీముందు నేను ఏరకమయిన పాత్ర కూడా ధరించను. ఇది నా నిర్ణయం! రామశాస్త్రయ్యగారూ—దేయవుంచి, ఇంకెవర్నైనా చూసుకోండి సెలవు—(వరచారాపోతాడు)

అ. గో : కొంపముంచేశాడు రామశాస్త్రయ్యగారూ!

అ. రా : చచ్చాం!

వ. రా : (తెప్పరిల్లి) వెళ్ళనివ్వండి. 'అంతయు మనమేలు కొరకే' అన్నారు. ఇటువంటి మనిషితో ఎప్పుడూ మనకు చిక్కే వుండనే వుంటుంది. ఏం ఫరవాలేదు— కొన్ని కారణాలవల్ల నాటకంతేదీ మార్చాల్సివచ్చిందని నోటీసులు వంపుతాను. రెండురోజుల్లో ఎవర్నైనా తయారుచెయ్యవచ్చు!

అ. రా : శేష్! మీదీ గొప్పనిర్ణయమే. కాని దీనివల్ల మన నాటకం మాత్రమే దారిలో పడలేదు. —చంద్రిక జీవితంకూడా దారిలో పడింది. ఏమిటీ —

వ. రా : అమ్మా కస్తూరీ—ఏమిటో అనుకున్నాను గానీ—నీది మా గొప్ప సున్నితహృదయం సుమా!

అ. రా : మొత్తానికి నీతికథలాంటి కథగల కథ నీకథ! ఏమిటీ—(నవ్వుతాడు)

అ. గో : ఇంతకూ హీరోగారు కనిపించరేం?

వ. రా : ఆయన పాపం లోపలకుపోయారు. రామంగారూ —

[రామం లోపల్నుంచివస్తాడు.]

అ. గో : మీ నాయక పాత్రను మీరు శాశ్వతంగా నిలబెట్టుకున్నందుకు మిమ్మల్ని అభినందించకతప్పదు. (షేక్‌హాండ్ చేస్తాడు. అ. రా., వ. రా. కూడా అతన్ని నవ్వుతూ అభినందిస్తారు).

రామం : ఏమిటండీ—నాకేం అర్థంకావటంలేదు. ఎందుకండీ ఇదంతా?

చం : ఈ నాటకంలో మీరు హీరో పాత్ర ధరిస్తున్నందుకు — వస్తారా పోదాం!

రామం : (ఆగమ్యంగా) ఎక్కడికి?—

చం : రండి—(పోతుంది)

రామం : (అర్థంకాక చూస్తాడు)

అ. రా : వెళ్ళండీ—ఆమె జీవితనాటకంలోనే హీరో పాత్ర ధరించేస్తున్నారు—

రామం : ఆఁ!

అ. గో : వెళ్ళండి—వెళ్ళండి—

రామం : సెలవు—(పోతాడు)

వ. రా : కథ మాబాగా కంచికి వెళ్ళింది.

అ. గో : ఇహ మనమూ ఇంటికిపోవొచ్చు!

పెరు : (వీధిలోంచివస్తూ)అయ్యగారు—సైకిల్ రిక్షావాడికి మూడు రూపాయిలయిందంటా—ఇచ్చేస్తే అమ్మగార్ని ఇంటికాడ దింపి అలా పోతాట్ట!

అ. రా : ఈ కథ మాత్రం కంచికివెళ్ళదు కాబోలు!

అ. గో : హీరోయిన్‌గారు ఇంటికిపోతున్నారుగా—ఈ కథ కూడా ఇక కంచికి పోతుంది!

పెరు : అమ్మగార్ని ఇంటికాడ దింపి రిక్షావాడిని మళ్లీ రమ్మని చెప్పమంటూ లేటండీ!

వ. రా : ఇంకా ఎందుకురా—ఇందు ఇచ్చేయి (డబ్బులిచ్చి నవ్వుతూ) పదండి—మనమూ ఇళ్ళకుపోదాం!

[అంతా పోతూ వుండగా తెర]

# శిల్పకళకు నవజీవమిచ్చిన జైనమతం

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

మహాత్ముల శేషము మతముగా పరిణమించును. వర్ధమాను డొక మహాత్ముడు. ఆయన శేషము జైనమతము. జినుడు అనికూడా ఇతని నంటారు. జయించినవాడు కాబట్టి జినుడు. జినునిమతం జైనమతం. భారతదేశమందు వెలసిన ఇతరదేవతలవలెనే ఇతనికి కూడ పెక్కు పేర్లు కలవు.

క్రీస్తుకు పూర్వం ఆరవశతాబ్దములో ఇతని జీవితము. గౌతమ బుద్ధుడు, మహావీరుడు సమకాలికులే. గౌతమబుద్ధుని మహాపరినిర్వాణమునకు దాదాపు పదునారు సంవత్సరములకు పూర్వమే మహావీరుడు సిద్ధిపొందినది.

మగధదేశమందు పాటలీపుత్ర నగరమునకు ఇరువదియైదుమైళ్ళ దూరమునందున్న వైశాలి నగరమునందు మహావీరుని జన్మ. నాడు వైశాలియందుండినది నాయక సత్తారాజ్యము. (అలిగార్కికల్ రిపబ్లిక్ అని ఆంగ్లమున అంటారు.) అనగా క్షత్రియనాయకు లందరుకలసి అచట రాజ్యపాలన చేయుచుండిరి. అట్టి నాయకు లందు ఒకనికి ఇతడు కనిష్ఠపుత్రుడు. ముప్పదియేండ్ల ప్రాయముననే ఇతడు సర్వము త్యజించి, పార్శ్వనాథులను సన్యాసులతో కలసి రెండుసంవత్సరములు సంచారముచేసి, కేవల జ్ఞానమును సముపార్జించి తన మతమును స్థాపించెను. నలుబది సంవత్సరములు ధర్మపర్యటన మొనరించి, మగధదేశమందే కొన్ని మఠములనుస్థాపించి, మహావీరుడు మరణమునందెను.

నాటినుంచి జైనమతము దేశమతములలో నొకటయినది. నాడే ఉదయించిన బౌద్ధమతము లోకమతమై, నలుదిక్కుల వ్యాపించి మూలస్థానమైన భారతదేశములోనే మటుమాయమయినది. ఈనాడు సయితము దాదాపు ఇరువదిలక్షలకుపైగా జైనమతావలంబకులు మనదేశమందున్నారు. బౌద్ధమతము, జైనమతము, రెండును దాదాపు ఒకేకాలముననే ఉదయించి, ఒకేరకముగా కన్పడుచున్నను, బౌద్ధమతము మనదేశమున మటుమాయమయి, జైనమతము మాత్రమే నిలచియుండుట కొంత వింతగా తోచును. కాని ఇందుకు కారణము కలదు. వేదములు పౌరుషేయములే అని, జైనమతమే ఆదిమతమనీ, అది చెడిపోయి, మిగిలినది బ్రాహ్మణులు, ఇతర హిందువులు అనుసరించు వైదిక మతమనీ, జైనుల సిద్ధాంతము.

హైందవమందు ఉదయించి వర్ధిల్లిన అన్ని ఇతర మతములవలెనే, జైనులందు సయితము శాఖోపశాఖలు చాల కలవు. ఇందు ముఖ్యమయినవి రెండుశాఖలు, దిగంబరులు, శ్వేతాంబరులని వీరి నందురు. జైనులందు ఈ రెండు శాఖలు ఏర్పడిన కాలము సరిగా నిర్ణయించుట సాధ్యముకాదు. అయినప్పటికి క్రీస్తుకు తర్వాత ప్రథమ శతాబ్దమందే ఈ రెండు శాఖ లేర్పడినట్లు పండితుల ఊహ. ఈ శాఖాద్వయము ఏర్పడిన విషయమును గురించి జైన వాఙ్మయమున ఒక చిత్రమైన కథకలదు.

మహావీరుడు గతించిన తర్వాత, దాదాపు రెండు శతాబ్దములకు చంద్రగుప్త మౌర్యుడు మగధరాజ్య మేలుచుండెను. ఆనాడు భద్రబాహుపేరుడు జైనుల ముఖ్యుడు. నాడు మగధదేశమందు ఒక పెద్ద కరువువచ్చి, ఏకముగా పన్నెండు సంవత్సరములు దేశమును క్షోభ పెట్టినది. భద్రబాహు తన జైనులను రక్షించుకొనుటకు, సపరివారముగా మగధను వీడి దక్షిణమున కర్ణాటకమునకు తరలివచ్చెను. కాలము గడచుకొలది, జైనులు తమ శాస్త్రములను, సిద్ధాంతములను విస్మరింపసాగిరి. అందుచేత దేశమందలి జైనులందరు తమ శాస్త్రముల నన్నింటిని పరిదిద్దుకొనుటకు పాటలీపుత్రమందొక సభ గావించిరి. ఈ సభ క్రీస్తుకు తర్వాత దాదాపు ఏబది సంవత్సరములకు జరిగెనని పండితవాక్యము. ఆ సభకు దక్షిణమునుండి, భద్రబాహు వర్గమునకు చెందిన జైనులు కూడవచ్చిరి. అప్పటికి ఉత్తరమున నిలిచిపోయిన జైనులందరు దిగంబరరూపమును వదలి, తెల్లని బట్టలను కట్టుకొనుట కలవాటుపడి యుండిరి. ఇది భద్రబాహు వర్గమునకు రుచించలేదు. వారు ఈ ధవళవస్త్రములను ధరించు ఆచారమును పూర్తిగా ఖండించిరి. అదే జైనులందు ఈ శాఖాద్వయాంకురము. దిగంబరులు ఏవస్త్రములను ధరింపరు. శ్వేతాంబరులు ధవళవస్త్రములను ధరింతురు. ముఖ్య సిద్ధాంతములు ఏకమయినప్పటికిని, విడిగా వృద్ధి అయిన ఈ రెండు శాఖలందును కొంత సంప్రదాయభేదములు కలిగిన మాట వాస్తవము.

మతభేదమున్నప్పటికీ, జాతి ఒకటే అయినందున, అనేక జైన సంప్రదాయములు, వాఙ్మయము, వాస్తువు, శిల్పములు, అన్నియు, చాలవరకు ప్రాచీనమందున్న హైందవపద్ధతులనే ఆధారములు చేసికొని వృద్ధిచెందినవనుటకు సందేహములేదు. జైనవాఙ్మయమంతయూ క్రీస్తుకు అయిదు ఆరు శతాబ్దముల తర్వాతనే పరివృద్ధిచెందినదని పండితవాక్యము. జైన మతమునకు సంబంధించిన మహాత్ముల జీవితములు, నియమములు, ఆచారవ్యవహారములు, మొదలగునవన్నియు మాత్రమేగాక, నాడు భారతదేశమం దెరిగిన ఇతిహాస సంపద యంతయు జైన వాఙ్మయమందు చేర్చబడినదని చెప్పవచ్చును. కృష్ణుని జీవితము, రామాయణకథలు, అనేక ఇతర పురాణ కథలు కూడ మనము జైనుల గ్రంథములందు చూడవచ్చును. కాని మతము భేదించుటవలన, మతము ననుసరించు పరిణామములు సయితము ఈ కథలయందు తెలియగలదు.

ఉదాహరణకు జైన రామాయణకథ రూపమును మనము గమనించవచ్చును. [illegible] రామాయణ కథనుగురించి అనేక

సందేహములు కలిగెను. అప్పుడు బింబిసారుడు గోమయుడను ఒక మహాత్ముని వద్ద కరిగెను. గోమయుడు బింబిసారునికి తెల్పినరీతిగా ఈ గ్రంథము రచన జరిగినది. ఉద్గ్రంథముల నీరీతి రచించుట మనదేశమందలి ప్రాచీన సంప్రదాయమే.

మన పురాణ రచనల ననుసరించి, విశ్వ వర్ణన, అటుతర్వాత ప్రథమ జినుడయిన ఋషభుని వృత్తాంతముతో మొదలు పెట్టి అనేక ఇతరజైన ఉపాఖ్యానములతో ఈ గ్రంథమును జైనులు రచించిరి. దశరథునికి ముగ్గురుభార్యలు: అపరాజిత,సుమిత్ర,కైకేయి. నలుగురు కొడుకులు: పద్మ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు. రాముడిందు పద్ముడయినాడు. కాని పద్మ రాముడనికూడ ఇతనిపేరు. దశరథుడు సంసారమును త్యజించి సన్యాసి కాదలచికొనెను. అప్పుడు పద్మరాముని రాజుగా చేయదలచెను. కాని కైకేయి పద్మరాముడు భరతుడిని రాజుగా కమ్మనికోరిరి. కాని భరతుడు కూడ సన్యాసమును స్వీకరింప దలచియుండెను. తల్లి, సోదరుడు కోరినమీదట, వారిమాట తోసివేయలేక, రాముడరణ్యవాసము నుంచి తిరిగి వచ్చువరకు తాను సింహాసనము నధిష్ఠింతుననియు అపైన తప్పక సన్యాసము స్వీకరింతుననియు భరతుడు మాటఇచ్చెను. పద్మరాముడు సీతతోసహా అరణ్యమునకేగెను. అటుతర్వాత రావణ సంహారము, లవకుశ జననము మొదలయిన యావత్తుకథ దాదాపు వాల్మీకి రామాయణమునే అనుకరించును. చివరకు ఈ కథయందు పద్మరాముడు సయితము సంసారమును త్యజించి జైనసన్యాసి అయి కేవలజ్ఞానమును సముపార్జించును.

జైనుల కథయందు రావణునకు పదితలలుండవు. తాను ధరించిన ముత్యాలహారమందు రావణుని ముఖమునకు తొమ్మిది ప్రతిబింబము లగుపడును. అందుచేత రావణునకు దశముఖుడను పేరుకలిగినది. కిష్కింధావాసులు కోతులుకారు. వారికేతనముపైన కోతి చిహ్నముండును. ఈ రీతిననే, రామాయణమునందు అసంభవములుగా తోచెడి ఘట్టములన్నీ, ప్రకృతికి విరుద్ధగా లేకుండునట్లు సమన్వయముచేసి వర్ణించిరి.

వాఙ్మయమువలెనే జైన వాస్తు శిల్పములు సైతము, ప్రాచీన హైందవ సంప్రదాయములనే ఆధారములు చేసికొని పరివృద్ధి నందినవి. మత భేదము ననుసరించి, వీరి వాస్తువులకు, శిల్పములకు కూడ కొంత రూపభేదము కలిగినమాట వాస్తవము. బౌద్ధులవలెనే జైనులుకూడ ప్రప్రథమమున స్తూపములను నిర్మించుచుండి యుండవలయును. ఏలనన 1887 వ సంవత్సరమున మధుర ప్రాంతమున జనరల్ కన్నింగు హాముగారు, భూగర్భమునగల జైన స్తూప శిలాఫలకములను, శిల్పములను త్రొవ్వి బయలువెట్టిరి. ఈ స్తూపము కుషాణరాజుల కాలమునాటిదై యుండవచ్చునని పండితుల ఊహ.

ఈ శిల్పములందు కొన్ని పదునొకండవ శతాబ్దమునకు కూడా చెందినవియున్నవి. అందుచేత ఈ స్తూపము పదకొండవ శతాబ్దమువరకు నిలిచి, పూజ లందుకొనుచుండెడిదని మనమూహింపవచ్చును.

ఇవిగాక, అనేక జైనగుహాలయములు, ప్రాచీన వస్తువులు, శిల్పములు, మన దేశమందంతటా నిలిచియున్నవి. ఎల్లోరా గుహాలయములలో కొన్ని జైనగుహాలు. ఇందుఇంద్రసభ చాలప్రసిద్ధికెక్కినది.



ఇదిగాక ఛోటా కైలాసము గుహాలయ మతిచిత్రమయినది. ఇది దాదాపు కైలాసగుహాలయమురీతినే మలచిన చిన్న గుహాలయము. కాని ఇందలి పనితనము అంత ఉత్తమమయినదికాదు. ఇదిగాక జగన్నాథ సభయను మరొక గుహనుకూడ జైను లిచట మలిచిరి. ఒరిస్సాలోను, బాదామివద్ద, ఐహొలెవద్ద, పాట్నావద్దను, దక్కను నందు కూడ అనేక జైనగుహాలయములు కలవు. ఇవన్నియు దాదాపు ఆరవశతాబ్దము తర్వాత మలచినవే. వీటన్నిటినిమించి ఉత్తమమైన జైనగుహాలయములు గ్వాలియర్ ప్రాంతంలోనివి. ఇవి పదిహేనవ

శతాబ్దమునందు మలచినదని పండితాభిప్రాయము. ఈ గుహాలయములందు జైనతీర్థంకరుల శిల్పములు, మహా ఘనములైనవి ఇరువది అడుగులకు మించి, ఏబదిఏడు అడుగులవరకు ఎత్తయి అత్యద్భుతములని చెప్పక తప్పదు. ఇవన్నియు దిగంబరమూర్తులే.

ఇదిగాక జైన ప్రాచీనశిల్పములు, కట్టిన ప్రాచీన దేవాలయములు, ఘనమయినవి దేశము దశదిశలలో కలవు. మైసూరు ప్రాంతమందు శ్రావణబెళగోళవద్ద ఉన్న గోమటేశ్వరుని రాతి విగ్రహము అతి అద్భుతమయినది. ఏబదియొనిమిది అడుగుల ఎత్తైన సుందరముగా మలచిన ఏకశిలావిగ్రహము నేటిమానవుని సయితము విస్మయానందముల తేల్పివైచును. ఈ జగత్తునందుకూడ ఇంతటి శిలావిగ్రహము లేదని పండితాభిప్రాయము. దీనిపైనున్న శాసనము పదవ శతాబ్దములో చాముండరాయ లీవిగ్రహమును మలిపించెను. దక్షిణదేశమున ఇటువంటి జైనవిగ్రహములు మరి రెండుకలవు; మైసూరు రాష్ట్రములోని కార్కళయందు మరియొక విగ్రహమిట్టిది యున్నది. దీనిఎత్తు నలుబదిరెండడుగులు. ఇది పదునైదవ శతాబ్దమందు మలచినది. మూడవదికూడ ఆ ప్రాంతములోని ఏనూరువద్ద యున్నది. ఈ విగ్రహము ముప్పదిఅయిదు అడుగులఎత్తు. దీనిని పదునేడవ శతాబ్దమందు మలచిరి. ఈ మూడు విగ్రహములు దిగంబర జైనులవే.

జైనుల పురాతన దేవాలయములందు అతిప్రసిద్ధి కెక్కినవి అబూపర్వతముపైన ఉన్నవి. ఇందు తేజపాల దేవాలయము అత్యద్భుతమైన కట్టడము. ఈ దేవాలయమును చూచుటకు వేయి కండ్లైన చాలవని చెప్పుటయందేమి అతిశయోక్తి లేదు. ఇది తెల్లని చలువరాతి కట్టడము. ఈ దేవాలయమందు గోడలు; స్తంభములు, కప్పు, అన్ని ప్రతి అంగుళము అత్యద్భుత శిల్పములచే అలంకృతమయినవి. వెండి, బంగారు పనులన్నిటిని మరిపించు, ఈ శిల్పములను చెక్కినపుడు రాలిన చలువరాతి పొడిని తూచి, దానికి సమముగా, బంగారము వెండిని ఇచ్చి, తేజపాలుడు, వస్తుపాలుడను సోదరులు ఈ దేవాలయమును నిర్మించిరని ప్రతీతి. నిజముగా ఆదేవాలయమందలి శిల్పములను చూచిన, బంగారు వెండితో వాటి విలువ కట్టుట అసంభవమని తెలియగలదు. ఈ దేవాలయపు నిర్మాణము పదమూడవ శతాబ్దమందు.

దీనిప్రక్కనే, అంతకుముందు రెండు వందలేండ్లకు పూర్వమే కట్టిన విమలనాథుని దేవాలయము కలదు. ఈదేవాలయము సయితము తేజపాలుని దేవాలయమునకు సమానముగనే చెప్పవలయును. ఇదిగాక లక్కుండి, పాలిటానా, గిరినారు, గ్వాలియరు, ఖజురాహో, చిత్తోరు మొదలయినచోట్ల ప్రాచీన జైనదేవాలయములు, వాస్తువులు అద్భుతమయిన వెన్నో కలవు. ఇంతేగాక అహమదాబాదు, ఢిల్లీ మొదలయినచోట, ఈమధ్య నిర్మితమయిన దివ్య జైన దేవాలయము లనేకము లున్నవి.

నిజముగా బౌద్ధమతమువలెనే జైనమతము హిందూదేశమంతటా ఒకప్పుడు వ్యాపించినమాట వాస్తవము.

అశోకుడు బౌద్ధమతము నాదరించినట్లు, అశోకుని మనుమడు జైనమతము నాదరించెను. అట్లే పల్లవులు రాజులు జైన మతావలంబులయి, జైన మతమును ఆదరించి ప్రోత్సహించిరి. ఒకప్పుడు ఈ మతము మన ఆంధ్రమునకూడ వ్యాపించి వర్ధిల్లినది. కాకతీయ ప్రతాపరుద్రుని కాలమున ధాన్యకటకము, అనగా నేటి అమరావతి జైనులవశమందుండెడిదని పండిత చిలుకూరి వీరభద్రరావుగారి నిర్వచనము.

జైనుల పూజలందు గాను రూపములందు తీర్థంకరుల విగ్రహములు ముఖ్యమయినవి. తీర్థంకరులని కూడ వీరి నందురు. ఆదినాథునినుంచి, మహావీరునివరకు వీ రిరువది నలుగురు. ఈతీర్థంకరులేగాక అనేక ఇతరదేవతా స్వరూపములు జైన దేవతలందగుపడును. హైందవ కథలను, వాస్తువులను, ఇతర సంప్రదాయములను దిద్దికొని తమదిగా చేసికొనినట్లే, హైందవ దేవతలనుసయితము వీరు తమ వారినిగా చేసికొనిరి. ఇంద్రుడు, ఇంద్రాణి, నవగ్రహములు, హనుమంతుడు, భైరవుడు, దిక్పాలకులు, యోగినిలు ఇతర దేవతలు హిందువులకు వలెనే జైనులకుకూడ చెందుచున్నవి.

ఈ దేవతా స్వరూపములన్నిటియందును, సరస్వతీరూప మతి ప్రముఖముగా కనుపించును. ఏలనన జైనులకు విద్యాపాండిత్యము లన్న అతిప్రీతి. సరస్వతిని అనుసరించు విద్యాదేవతలు పదునార్గురు. వీరి పేర్లుకూడ శ్రుతదేవి, రోహిణి, ప్రజ్ఞాపతి, వజ్రశృంఖల, కాళి, మహాకాళి, గౌరి- మానవి మొదలయినవిగా హైందవ దేవతలపేర్ల వలెనే యుండును.

ఈ దేవతా స్వరూపములన్నియు హైందవదేవతలను పోలియుండును. కాని తీర్థంకరుల మూర్తులుమాత్రము ఒక ప్రత్యేకత కలిగియుండును. జైనతీర్థంకరుల రూపములు కొంచెమించుమించుగా బౌద్ధ మానవ బుద్ధరూపములను పోలియుండునని చెప్పవచ్చును. అయినను ఈ రెండురూపములకు రూపభేదము తప్పక కలదు. కాని ఈ ప్రత్యేకత నెరుగనివారు, జైన తీర్థంకరమూర్తులను, బౌద్ధ మానవ బుద్ధరూపములేయని భ్రమపడవచ్చును.

బౌద్ధమతమందు మానవబుద్ధులవలెనే జైనులందు తీర్థంకరులు కలరు. వా రిరువది నలుగురు, వీరుకూడ ఇరువది నలుగురే. గౌతమునికి పూర్వమే అనేకమంది బుద్ధు లుదయించి, బౌద్ధమతమును ప్రబోధించిరని, అది మనుజులు విస్మరించగా, గౌతముడు భూలోకమునకు వచ్చి మరల ఆ మతమును చాటెనని బౌద్ధుల నమ్మకము. అదేరీతిన, యుగములందనేక జినులు, జైనమతమును ప్రబోధించిరని, మరల ఆ మతమునే మహావీరుడు పునశ్చరణ చేసెనని జైనులందురు. అంతే కాని మహావీరునితోనే జైనమతారంభము కాదని, అది అనాదిగత మని జైనుల విశ్వాసము. ఈ విశ్వాసము సంపూర్ణముగా నిర్హేతుకము కాదు. ఏలనన మహావీరుడు ముప్పదవఏట పార్శ్వనాథ సన్యాసులలో చేరి, రెండుసంవత్సరముల తర్వాత కేవలజ్ఞానమును పొంది తన మతమును ప్రబోధించెను. మహావీరుని సిద్ధాంతములు సయితము పార్శ్వనాథుని సిద్ధాంతములనే అనుసరించినవి. ఈ పార్శ్వనాథుడు ఇరువది మూడవ తీర్థంకరుడు. తర్వాత ఆఖరు తీర్థంకరుడు మహావీరుడు. మహావీరునికి దాదాపు రెండువందల ఏబది సంవత్సరములకు పూర్వము పార్శ్వనాథుడు జీవించియుండవచ్చునని పండితుల ఊహ. అయినప్పటికిని జైనుల విశ్వాసము ననుసరించి, తక్కిన ఇరువది

ఇద్దరు తీర్థంకరులు యుగాంతరములందు జీవించి జైనమతమును ప్రబోధించిరనుట చరిత్రకాదు.

ఇరువది నలుగురు తీర్థంకరులందు ముఖ్యముగా విడిగా శిల్పరూపముల నందికొని పూజలందుకొనువారు అయిదుగురని చెప్పవచ్చును. వీరు ఆదినాథుడు, లేక ఋషభనాథుడు, పద్మప్రభుడు, నేమినాథుడు, పార్శ్వనాథుడు, మహావీరుడు, వీరుగాక ఋషభనాథుని రెండవ కుమారుడయిన గోమటేశ్వరునికూడ దిగంబర జైనులు కొలుతురు. ఇతడుకూడ, కేవల జ్ఞానముపొంది- కాయోత్సర్గ ముద్రయందు నిలచి మోక్షమును పొందెను. ఇతనినే శ్వేతాంబరులు బాహుబలి యందురు. ఇతడు శ్వేతాంబరులకంత ముఖ్యుడుకాడు.

తీర్థంకరులు, అనేక దేవతలు సామాన్యమే అయినప్పటికినీ, దిగంబరులకు శ్వేతాంబరులకు సంప్రదాయములందు అనేక భేదములున్నవి. దిగంబరులు నిర్వస్త్రులు; అదేరీతిన వారి తీర్థంకరులు కూడ నిర్వస్త్రులు. శ్వేతాంబరులు తెల్లనివస్త్రములను ధరింతురు. అట్లే వారి తీర్థంకరులుకూడ కటియందొక చిన్నవస్త్రమును ధరించి కనబడుదురు. ఇతర ఆచార వ్యవహారములందు కూడ ఈ రెండు శాఖలందు సంప్రదాయ భేదములు స్పష్టముగ కన్పడును. దిగంబరులు తమ విగ్రహమును మొదటజలముతో అభిషేకించెదరు.అపయినపంచామృతములతో సహా కడిగెదరు. శ్వేతాంబరు లట్లుచేయరు. దిగంబరులు రాత్రులందు దీపములను వెలిగించి, వారిదేవాలయములలో, ప్రార్థనలను, మంత్రములను స్పష్టముగా పల్లెవేయుదురు. శ్వేతాంబరులు జీవహింసకు జడిసి, రాత్రులసలే దీపములు వెలిగించరు. ఇంతేగాక క్రిమి కీటకములు నోటిలోకి పోయిన జీవహింసలు కలుగునన్న భయముచేత తెల్లగుడ్డలచే మూతులు కూడ బిగించుకొందురు. దిగంబరులు తక్కిన హిందువులవలె బొట్టుపెట్టుకొందురు. శ్వేతాంబరులు బొట్టు పెట్టుకొనరు.

జైనులు సామాన్యముగా తమ విగ్రహములను తెల్లని చలువ రాతియందు మలుతురు. తెలుపు స్వచ్ఛతను సూచించును. హైందవ సంప్రదాయమందు దేవతావిగ్రహములను చలువరాతియందు మలుచు నలవాటులేదు. ఏలనన మ్రోగని చలువరాయి నపుంసకశిల. నపుంసక శిలయందు మలచిన దేవతా విగ్రహమునకు శక్తి, మాహాత్మ్యములు కలుగవని, అందుచేత పూజ కనర్హములని హైందవ విశ్వాసము. పుంశిలయయిన కృష్ణ శిలయందో, లేక బ్రహ్మశిలయందో మలచిన విగ్రహములే ఉత్తమములు కాగలవని మన సంప్రదాయము. ఇట్టి సంప్రదాయము జైనులయందున్నట్లు లేదు. వారి ఉత్తమ విగ్రహములన్నియు తెల్లని పాలరాతియందే కావచ్చును.

నిలిచియున్న తీర్థంకర శిల్పములన్నీ, కాయోత్సర్గ ముద్రయందుండును. అనగా సమపాదమున నిలిచి, చేతులను జారవిడిచి, అరచేతులు తొడలకానించి నిలచి వీరు యోగమున నుందురు. తీర్థంకరులందరు ఈ ముద్రయందే నిలిచి మోక్షమును పొందిరి. అందుచేతనే, శ్రావణబెళ్గోళ యందున్న గోమటేశ్వరుని విగ్రహమునకు వలె, ఇట్లు మలచిన తీర్థంకరుల విగ్రహములకు, నేల నుంచి లతలు తొడలపైకి ఎగబ్రాకుచున్నట్లు చిత్రింతురు. అనగా ఈ ముద్రయందు [illegible]

పైకి ఎగ్రబ్రాకుటయేగాక, చీకుల సంతతిని పుట్టలుపెట్టి వారలను తప్పించేయగలవు. అయినప్పటికిని, నిశ్చలులై ఈ జనులు కాయోత్సర్గముద్రయందే యుండి కైవల్య పదమును చేరుకొందురు.

ఉపవిష్టుడైన తీర్థంకరుడు తనకరములను ధ్యానముద్రయందు నిలుపును. అనగా పద్మాసనా సీనుడై, అరచేతులను రెంటిని ఒకదానిపై నొకటి వెల్లకిల ఉంచి, ఒడిలోనుంచుకొని యోగమున నుండును. తీర్థంకరు లందరు ఆజానులంబి బాహువులు. ఈ విషయము నిలచియున్న తీర్థంకరుల శిల్పములందు స్పష్టముగా తెలియగలదు. ఆజానులంబి బాహువులనగా వారి చేతులు మోకాళ్ళ నుదాటి క్రిందగానుండును. ముఖ్యముగా తీర్థంకరుడు నిలచియున్నను ఉపవిష్టుడైయున్నను, త్రిరేఖా ఛత్ర మొకటి అతని శిరస్సు పైన అలంకరించియుండును. త్రిరేఖా ఛత్రమనగా మూడు భాగములుగా నుండిన ఛత్రము. ఇది మూడు భాగములుగా నుండిన కిరీటమువలె జైన శిల్పములందు కానవచ్చును. అందుచేత పాశ్చాత్య విమర్శకులందరు దీనిని త్రిముకుటమని (Triple Crown) నిర్వచించిరి.

ప్రతి తీర్థంకరుని వక్షస్థలము మీద శ్రీవత్సమను పుట్టుమచ్చ స్పష్టముగా కానవచ్చును. విష్ణుమూర్తి సయితము శ్రీవత్సాంకితుడు. శ్రీవత్సము జైనులు నిర్వచించిన మహాపురుష లక్షణములలో నొకటి. బౌద్ధులు ముప్పది రెండు మహాపురుష లక్షణములను నిర్వచించిరి. అదే రీతిగా జైనుల అష్టమంగళములను, ప్రతిహార్యములను పేర్కొనిరి.

ఈ అష్టమంగళములన్నియు తీర్థంకరుని దేహమందే కనుపింపనక్కరలేదు. ఒక్కొక్కప్పుడు, మంగళ చిహ్నములు తీర్థంకరుడున్న పీఠముమీదకూడ కనుపించవచ్చును. స్వస్తికము, దర్పణము, కుంభము, పీఠము, మీనయుగము, పుష్పమాల, పుస్తకము, అను ఈ ఎనిమిది చిహ్నములు అష్టమంగళములుగా ఒకచోట వర్ణించిరి. మీనయుగము, పీఠము, శ్రీవత్సము, నైవేద్యము, నంద్యావర్తము, అరుదొప్పలో పూలమాల, పుస్తకము, కుంభము, లేక భద్రఘటమని మరొకచోట చెప్పిరి. ప్రతిహార్యములు కూడ కొన్ని చిహ్నములే. ఈ చిహ్నములు సామాన్యముగా తీర్థంకరుల ప్రభావళిపైన కానవచ్చును. కల్పతరువు, నాకపుష్పములు, మృదంగము, సింహాసనము, దివ్యగానము, వింజామరలు, త్రిరేఖాఛత్రము, తేజోమయమైన అర, మొదలయిన వి ప్రతిహార్యములు. సామాన్యముగా—అష్టమంగళములు, ప్రతిహార్యములు, అన్నియు జైనతీర్థంకరుల విగ్రహములమీద అగుపడకపోవచ్చును. కాని శ్రీవత్సము, త్రిరేఖాఛత్రములుమాత్రము తప్పవు.

బౌద్ధమందు మానుష బుద్ధులున్నట్లు తీర్థంకరులకును ప్రత్యేక బోధిమంతులు కలరు. కాని బౌద్ధశిల్పములందున్న ప్రాముఖ్యము ఈ బోధివృక్షములకు జైనశిల్పములందు అగుపడదు.

ప్రతి తీర్థంకరునకు ఒక ప్రత్యేక చిహ్నముండును. దీనినే లాంఛనమనికూడ నారందరు. ఇంతేగాక ప్రతి తీర్థంకరునకు ఒక యక్షుడు, ఒక యక్షిణి కలరు. యక్షుని ఉపాసకుడని, యక్షిణిని శాసనదేవి యనికూడ అనుటకలదు. తీర్థంకరుని కుడివైపున యక్షుడు, ఎడమవైపున యక్షిణి కానబడుదురు. తీర్థంకరుడు నిలచియున్న, వారుకూడ నిలచియుందురు. తీర్థంకరుడు కూర్చునియున్న, వారుకూడ కూర్చుందురు. కాని తీర్థంకరుడు పద్మాసనమున నుండును. వారు లలితాసనమున కూర్చునియుందురు.

లాంఛనభేదములు, ప్రత్యేక యక్షయక్షిణులనుతప్పి తీర్థంకరు లందరు ఒకేరీతిగనే కన్పించును. కాని సుపార్శ్వనాథుడు, పార్శ్వనాథుడు కొంత రూపభేదముతో కనుపింతురు. వీరు శేషఫణులు. అనగా వీరితలలమీద నాగపాముపడగలు కనుపించును. సుపార్శ్వనాథుని శిరస్సుమీద అయిదు పడగల నాగుబాము, పార్శ్వనాథుని శిరస్సుమీద ఏడుపడగల నాగుబాము కనుపించును.

| | తీర్థంకరుడు | చిహ్నము | యక్షుడు | యక్షిణి |
|---|---|---|---|---|
| 1 | ఆదినాథుడు, లేక ఋషభనాథుడు | వృషభము | గోముఖుడు | చక్రేశ్వరి |
| 2 | అజితనాథుడు | ఏనుగు | మహాయక్షుడు | అజితబల |
| 3 | శంభవనాథుడు | గుర్రము | త్రిముఖుడు | దురితారి |
| 4 | అభినందననాథుడు | కోతి | యక్షనాయకుడు | కాళిక |
| 5 | సమతినాథుడు | క్రౌంచపక్షి | తుంబురుడు | మహాకాళి |
| 6 | పద్మప్రభుడు | పద్మము | కుసుముడు | శ్యామ |
| 7 | సుపార్శ్వనాథుడు | స్వస్తిక | మాతంగుడు | శాంత |
| 8 | చంద్రప్రభుడు | అర్ధచంద్రము | విజయుడు | భృకుటి |
| 9 | సువిధినాథుడు | మకరము | అజితుడు | సుతారకా |
| 10 | శీతలనాథుడు | శ్రీవత్సము | బ్రహ్మ | అశోకా |
| 11 | శ్రేయాంశనాథుడు | ఖడ్గమృగము | యక్షేశుడు | మానవి |
| 12 | వాసుపూజ్యుడు | మహిషము | కుమారుడు | చండా |
| 13 | విమలనాథుడు | వరాహము | షణ్ముఖుడు | విదితా |
| 14 | అనంతనాథుడు | డేగ | పాతాళుడు | అంకుశా |
| 15 | ధర్మనాథుడు | వజ్రము | కిన్నరుడు | కందర్పా |
| 16 | శాంతినాథుడు | జింక | గరుడుడు | నిర్వాణీ |
| 17 | కుంథునాథుడు | మేక | గంధర్వుడు | బలా |
| 18 | అరనాథుడు | నంద్యావర్తం | యక్షేశుడు | ధారిణి |
| 19 | మల్లినాథుడు | కుంభము | కుబేరుడు | ధర్మప్రియా |
| 20 | మునిసువ్రతుడు | కూర్మము | వరుణుడు | నరదత్తా |
| 21 | నమినాథుడు | నీలోత్పలము | భృకుటి | గాంధారి |
| 22 | నేమినాథుడు | శంఖము | గోమేధుడు | అంబికా |
| 23 | పార్శ్వనాథుడు | సర్పము | పార్శ్వుడు | పద్మావతి |
| 24 | మహావీరుడు | సింహము | మాతంగుడు | సిద్ధాయిక. |

తీర్థంకరులవలెనే, యక్షయక్షిణులకుకూడ వారివారి ప్రత్యేకచిహ్నము లుండును. కాని కొన్ని యక్షయక్షిణులపేర్లు శ్వేతాంబరులందును, దిగంబరులందును వేరుగా నుండును. పైన ఇచ్చిన పట్టికయందలి యక్షయక్షిణుల పేర్లన్నియు శ్వేతాంబర సంప్రదాయమునకు చెందినవే.

మనకిప్పటికి తెలిసిన చరిత్రను బట్టి భారతదేశమున వర్ధమానమహావీరుడు స్థాపించిన ఈ మతము ఉత్పన్నమయినది ఒక విశేషము. నిజముగా రెండువేల సంవత్సరములకుపైగా ఈ దివ్యమతము మన దేశమునందు జీవించియుండుట హైందవుల ఉత్తమ సాంఘికమున కెంతయు తార్కారణమని చెప్పవచ్చును. మనదేశమందు ఇట్టి మతములు, పుట్టి వర్ధిల్లుట నిజముగా మన అదృష్టమే. తక్కిన మతములవలెనే, ఈ మత శేషములయిన అనేక ఉద్గ్రంథములు, మహావాస్తువులు, అద్భుతమగు శిల్పములు, ఇవన్నియు మనదేశమందు నెలకొని జీవించియున్నవి. [illegible]

# ఇంగ్లీషులకు రాజ్యమిచ్చిన పెనుగొండ

[1930 లో కృష్ణదేవరాయల చతుశ్శత వార్షిక జయంత్యుత్సవం జరిగినప్పుడు పెనుగొండ నగరంలో శ్రీ హరిసర్వోత్తమ రావుగారి అధ్యక్షతన జరిగిన సభలో శ్రీ రాళ్లపల్లి గోపాల కృష్ణమాచార్యులుగారు రచించగా, శ్రీ అనంతకృష్ణశర్మగారుపాడిన గేయమిది.]

తందానా తందానా దై
తందానా తందానా!

కొండ గట్టిన కోట, కోట గట్టిన కొండ
కోట కొండలలోన, గొప్ప మా పెనుగొండ.

కొండ కోనలలోన, కొలువుండి జగమేలు
యోగ నరసిం[1]హు పేరోలగము పెనుగొండ.

రసదాడి తోట్లతో, రాజనాల్మళ్ళతో
ముత్యాల[2]చెరువుతో, మురిసేది పెనుగొండ.

ఏనుగుల ఎలుగుతో, రౌతులా రవళితో
మేనాల మెరుపుతో, మెరిసింది పెనుగొండ.

కులికేటి గానాలు, కుణిసేటి ఖడ్గాలు
పలికేటి ఘంటాలు, ప్రతిబలింది......

ద్రాక్షారసము[4]తోడ, దానిమ్మలను చేర్చి
జంటి తేనియలతో, జుర్రింది......

భల్లాళరాయని, బాహుదర్పములోన
నేల వీడై[5]యుండి, నెగిడింది......

భోజరాయని గద్దె, [6]భూస్థాపితము చేసి
బుక్కరాయని కిచ్చి, పంపింది......

కర్ణాట రాజ్యంపు కడగండ్లు బాపిన
మాధవా[7]చార్యునికి, మందిరము......

పెన్న నీటిని[8] తెచ్చి, పాలుకై నింపిన
పర్తాప బుక్కయ్య, పట్టింది......

రాజరాజు[9]లు మెచ్చ, రాయబాచని మంత్రి
స్తోత్రాలు కట్టి పో, షించింది......

---

(1) పెనుగొండ కొండపైన యోగనృసింహస్వామి ఆలయమున్నది. ఈ మూర్తియే నగరమునకు అధిదేవతయట.

"పెనుగొండపురాధీశో యోగానంద నృకేసరీ."

అని శాసనములలో చూపట్టును.

2. పెనుగొండలో వ్రాయబడిన కావ్యము వసుచరిత్ర. అందుల వర్ణన ఇది.

"చెన్నగు రస దాడిసంపులు పురాంతిక సీమల శాలిపాలికా
జగదభివంద్య గానరస సంగతి కన్నులు నీరు గ్రమ్మగన్."

పెనుగొండ కొండ కానుకొని చిన్న సెల యేరొకటి కలదు. దానిలో గవ్వలు హెచ్చు. ఈ ఏటి నీరు ముత్యాల చెరువను తటాకమును నించుచున్నది. ఈ కొండనే కోలాహల పర్వతముగా, ఈ ఏటినే శుక్తిమతిగా రామరాజ భూషణుడు వర్ణించి యుండుట.

3. తత్రాస్తి నగరీ రమ్యా పెనుగొండేతి విశ్రుతా,
పురీ ధర్మస్య వసతిః, వాణ్యాకల్పావనిః, శ్రియాంగృహం.

అనియు

పెనుకొండ పురీ గరీయసీ త్రిదివాదస్తి తదీయ రాజధానీ.
భువనత్రయసారభూమి రుర్వ్యాః ముకుర శ్రీరివ యా కృతై ప్రకల్ప్తా.

అనియు శాసనములలో యీ నగరము వర్ణింపబడినది.

(4) ద్రాక్షతీగలను, దానిమ్మలను భట్టుమూర్తి వసుచరిత్రమున వర్ణించినట్లు ఇతరు లెవరు కాని వర్ణించలేదని పాఠకులోకమెరుగును. [illegible] ప్రసిద్ధములు.

(5) హొయ్సల భల్లాణ రాజుల కాలములో వీరభల్లాణుని భావమరది అళియమాచయదండనాథుడు పెనుగొండ నేలవీడు పాలించుచుండెనని శాసన ప్రమాణము కలదు.

(6) (7) విక్రమార్కుని సింహాసనము భోజరాజు అనంతరము కాలక్రమమున హొయ్సల రాజులకు లభించియుండెననియు, మాలిక్ కాఫురు దండయాత్ర కాలములో దానిని పెనుగొండ కొండలో నొక గుహలో అపార ధనములో సహా దాచి యుంచిరనియు, ఈ రహస్యము తెలిసిన మాధవ విద్యారణ్యుడు హరిహర బుక్కరాయలకు దానిని చూపెననియు ప్రతీతి. 'రత్న సింహాసనద చరిత్రె' అను కన్నడ గ్రంథమును చూడుడు.

(8) ప్రతాప బుక్కరాయలు పెనుగొండదుర్గమును పాలించుచుండగా గొప్ప క్షామమువచ్చి నీరు లభించుట కష్టము కాగా, అతని ఆజ్ఞచే జలసూత్ర సింగరభట్టు అను ఇంజనీయరు పినాకిని నదికి గోరిదినూరువద్ద ఆనకట్టకట్టి కాలువతీసి ఆ నీటిని అనేక తటాకముల గుండా పెనుగొండకు తెచ్చెనట. ఈ విషయము ఆ ఆనకట్ట సమీపమందున్న శిలాశాసనములో నున్నది.

(9) కొండవీ డుదయగిరి పెనుగొండ గుత్తి
పానగల్వి జయనగరపట్టణముల
అర్థులకు నిచ్చు నిత డిష్టార్థమనుచు,
జగము రాయని భాస్కర ప్రెగడ బొగడు.

అను చాటుధార కలదు.

గజపతుల నోడించి, కటకాన కంపిన
సాళ్వ నరసింహయ్య, సాకింది......

సాళువప్పా[10]జీని, సత్రాలలో పెంచి
బుద్ధిమంతుని చేసి, పంపింది......

మూరురాయర గండ, మునలిమానుల మిండ
కృష్ణరాయుడు రాజ్య మేలింది......

మునలిమానుల బట్టి, ముప్పతిప్పలు పెట్టి
మూడుగుటకలు నీళ్లు, తాపింది......

దానధర్మాలతో, ధరణి శాశ్వతమైన
గోడుగుపాలుని [11]కీర్తి కోరింది......

మూడు ముక్కాల్ గడియ, ముద్రాధికారాన
రాజ్యమేలిన వ్యాస [12]రాయనిది......

రుద్రుడైనా వట్టి, ముద్దర్లు కాల్చిన
తిరుమల తాతయ్య తిరుమలిగి......

వట్టి వాదములోన, బ్రహ్మనైనా గెల్చు
అద్వైత మప్పయ్య, ఆడింది......

భామినీ రాజ్యాల, పట్టి ఊగించిన
అళియ రామప్ప పోరాడింది......

వీర ప్రతాప తిర్మల దేవ రాయడై
మొరదిమ్మ రాజయ్య ఏలింది......

భావనయ్యల నడుమ పల్లకీనెక్కించి
భట్టుమూర్తికి కీర్తి తెచ్చింది......

తిట్లలో తిమ్మయ్య కవితలో బ్రహ్మయ్య
తెన్నాలి [13]రామయ్య తిరిగింది......

మహారాజుతో గొప్ప జహాగీరుసాధించి
బాబయ్య [14]పక్కీరు బ్రతికింది......

చంద్రగిరి దుర్గాన సామ్రాజ్యమేలిన
వీర వెంకటపతికి విడిదిల్లు......

శ్రీరంగపట్టణము సింహాసనము నిచ్చి
మైసూరు రాజలను మెచ్చింది......

రంగమ్మ కుట్రతో [15]బంగారు తిమ్మయ్య
హాతమారగా అంగలార్చింది......

మంచి మంచి దొరలు మాయమైపోవగా
ఇంగ్లీషులకు రాజ్య మిచ్చింది......

---

(10) భట్టిమూర్తి చాటుధార.
"గుత్తిక్ పుల్లెలుగుట్టి, చంద్రగిరిలో కూడెత్తి పెక్ గొండలో,
కాత్తిక్ పత్రమునన్ భుజించి......"
ఈ విషయమును సూచించినది.

(11) గోడుగు భూమానాయకుని సేవకు మెచ్చి మూడు గడియలు రాజముద్రికను రాయ లతనికియ్యగా, ఆ కాలములో అత డనేకులకు అగ్రహారాదిదానములు చేసెనని ప్రతీతికలదు. అట్టి అగ్రహార గ్రామముల పొలిమేరలో గోడుగుపాలుని బొమ్మ చెక్కిన శిల చూపట్టుచున్నది.

(12) కృష్ణరాయలు రాజ్యకాలమున రాజుకు నాశనమును సూచించు కుహూయోగము రాగా, ఆకాలములో రాజుగా తానుండరాదని వ్యాసతీర్థులను మధ్వమతాచార్యునికి రాజ్యదానము చేసినందున, అతుని ఆ మూడు గడియలు రాజ్యాధికారము వహించి తిరుగా రాయలకే అధికారమును ఒప్పగించెనట. అందువలననే వ్యాసరాయలని అతనికి పేరు. ఆ మతమునకు చెందిన యతులిప్పటికి కొన్ని రాచరికపు మర్యాద లనుభవించుచున్నారు.

(13) "పెనుగొండ నిలువు తరుచుగ." అని తెన్నాలి రాము కృష్ణకవి పాండురంగమాహాత్మ్యములో ఒకచోట సూచించినాడు.

(14) బాబాసాహెబు అను మహమ్మదీయ ఫకీరు గొప్ప మహిమ గలవాడుగా నుండి విజయనగర రాజులతో జాగీరులుపొందెనట. బాబయ్య దర్గాకు ఇప్పటికిని ఆ జాగీరు లున్నవి. తామ్ర శాసనములు సయితము కలవు.

(15) భోగము రంగాసాని చిత్రాంగివలె కుట్రచేసి బంగారు తిమ్మరాజను రాజపుత్రుని చంపించెనను విషాదగాథ "బంగారు తిమ్మరాజు కథ." అను బుర్రకథగా నాటకముగానున్నది.

# ఆంధ్రచిత్రకారుల అపూర్వప్రతిభ

శ్రీ ఎ. పైడిరాజు

బ్రిటిష్‌వారు పరిపాలనకు రాక పూర్వము మనదేశచరిత్ర సర్వకళా వైభవముతో తులతూగినది. మన కళకు ప్రత్యక్షముగాక మరుగుపడియున్న శిల్పచిత్రకళా నిలయములే తార్కాణము. అజంతా, ఎల్లోరా, సాంచీ, మధుర, ఖజరహో, మహాబలిపురం, భువనేశ్వర్, కోణార్క, సిత్తన్నవాశల్, ఎలిఫెంటా, బాగ్, ఆంధ్రలో అమరావతి, నాగార్జునకొండ, గోలి, లేపాక్షి, కర్ణాటకంలో హంపి, తరువాత మొగలాయీ, పహాడీ, రాజపుత్ర, కాంగ్డా—ఇవే శిల్పచిత్రకళా సంప్రదాయాలకు, చిత్రకళకు నిలయాలై విలసిల్లుచున్న వి. 2000 ఏండ్లకు పైబడి ఈ సంప్రదాయము వృద్ధిపొందుతూ వచ్చినది.

విదేశీయులు మొట్టమొదట బొంబాయిలో దిగి, బొంబాయి నాక్రమించుకొని, తరువాత కలకత్తానగరమును వశపరుచుకొని, అలా నలుమూలలా వ్యాపించి తుదకు ప్రజలు సంస్కృతిని మరచేటట్లు చేసిరి. వారి ప్రభావాన్ని బోధనాలయములలో బోధించేటట్లుచేసి భారతీయులను తమ సాంస్కృతిక రంగాలకు దూరులనుగాచేసి వారి బ్రతుకే దుర్భరమై పోవునట్లు చేసిరి. తరువాత విదేశాలనుండి 60 మంది చిత్రకారులు మన దేశమునకువచ్చి మొట్టమొదటి సారిగా కలకత్తానగరముచేరి మన దేశమునలుమూలలా వ్యాపించిరి. పాశ్చాత్య చిత్రరచనా ప్రావీణ్యముతో వీరు చిత్రించిన చిత్రాలతో భూస్వాములను, జమీందారులను, ధనవంతులను ఆకర్షింపజేసి, వారి వారి భవనాలలో అలంకరించుకునేటట్లు చేసిరి. వారి ప్రభావము ఇంతవరకు మన దేశముపై బడినదనుటకు సందేహములేదు. తుదకు పాశ్చాత్య చిత్రకారులు మనదేశమునకు ఏలాగున వచ్చిరో అలాగునే తిరిగిపోయిరి.

మొట్టమొదటి భారతీయ కళాప్రబోధకులు హావెల్, డాక్టర్ జేమ్సుకజిన్స్, లార్డుజట్లండు, ఆనందకుమారస్వామి గారలు. వీరు భారతీయ కళలను ప్రోత్సహించి ప్రచారములోపెట్టిరి. తరువాత అవనీంద్రనాథఠాకూరు పాశ్చాత్య చిత్రకారులైన పామర్ గారివద్ద, ఇటాలియన్ చిత్రకారులైన గిలార్డువద్ద పాశ్చాత్య చిత్రలేఖనమందు తర్ఫీదు పొందిరి. ఇదనికంటె పూర్వము రాజా రవివర్మ చిత్రకారులైన "థియోడర్ జాన్సన్"గారి వద్ద తర్ఫీదుపొంది రామాయణ, భారతగాథలనుంచి పాశ్చాత్య విధానములో చిత్రరచన కొనసాగించిరి. ఆసేతుహిమాచలము అతని చిత్రరచనాశైలితో నిమగ్నమై ముఖ్యవిషయమును పూర్తిగా మరుగుపరుచుకున్నది. రసానుభూతి కేవలము మృగ్యమైనది కదా! ఈ విషయము జనసామాన్యానికి అర్థముకాలేదు.

ఆ సమయములో మనకళల పునరుద్ధరణమునకు వంగదేశములో కళోద్ధారకులుగా శ్రీ అవనీంద్రనాథఠాగూరు హావెలుతోపాటు ఒక అపూర్వ సందేశమును దేశము నలుమూలలా చాటిరి. హావెల్ పాశ్చాత్యుడైనప్పటికీ భారతీయ కళాభిమాని. ఆయన కలకత్తా చిత్రకళాశాలలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిరి. ఆయన పాశ్చాత్య చిత్రాలకు అనుకరణ మానిపించి భారతీయశైలిలో చిత్రరచన సాగించేటట్లు చేయవలెనని శ్రీ అవనీంద్రనాథఠాగూరుగారి పరిచయము కలుసుకొని, అతనితో కలసి భారతదేశపు కళాభివృద్ధికొరకు కంకణము కట్టుకొనిరి. ఆ విధముగా కలకత్తానగరము భారతీయ కళాపునరుద్ధరణమునకు తత్ప్రచారమునకు కేంద్రముగా రూపొందినది. తరువాత కలకత్తాలో అవనీంద్రుడు కలకత్తా చిత్రకళాశాలలో సహాయోపాధ్యాయుడుగా పనిచేసెను. తరువాత రవీంద్రనాథఠాగూరు కలకత్తా దగ్గర భోల్పూరులో నిర్మించిన "శాంతి నికేతనము"లో అవనీంద్రునితో కేవలము కళాసాధనకు కళాభవనము ఏర్పరుచుకొనిరి. వీరి ప్రథమ శిష్యగణము అసమాన ప్రజ్ఞ చూపినది. ఈయన రాజపుత్రశైలిని పదిసంవత్సరాలు కృషిచేసి 1905 లో 'మాడర్న్ స్కూలును' స్థాపించిరి. వీరి శిష్యులలో మొట్టమొదట చెప్పుకోదగ్గవారు—సురేంద్రగంగూలీ. ఈయన చిన్న వయస్సులోనే పరమపదించిరి. తరువాత చెప్పదగినవారు నందలాల్ బోసు, అసిత్ కుమార్ హాల్దారు, దేవీప్రసాద్ రాయ్‌చౌధురి, వెంకటప్ప, ముకుల్ దే, క్షితీంద్ర మజుందారు, శారదాఉకీల్, డి. వి. బర్మన్, ప్రమోదకుమార్ చటర్జీ, చుగ్‌తాయిగారు.

## ప్రమోదకుమార్ చటర్జీ

వీరు బందరు జాతీయకళాశాలలో అధ్యాపకులుగా నుండిరి. వీరు ఆంధ్రలోను—శైలేంద్రనాథదే జయపూరు (రాజస్థాను) లోను, పులిన్ బిహారీదత్ బొంబాయిలోను, ఎస్. ఎన్. గుప్త లాహోరులోను, అసిత్ కుమార్ హాల్దారు లక్నోలోను, క్షితీన్ మోహన్ మజుందారు కలకత్తాలోను, దేవీప్రసాద్ రాయ్‌చౌధురి మద్రాసులోను, వెంకటప్ప మైసూరులోను, శారదాఉకీల్ ఢిల్లీలోను, ముకుల్ దే కలకత్తాలోను వంగదేశకళను ప్రచారములో పెట్టిరి. వీరివలె రవిశంకర్ రావల్ కూడ గుజరాతులోను ఎక్కువ మంది శిష్యులను తయారుచేసిరి.

బొంబాయిలో వారికిపాశ్చాత్య విధానములు తప్ప వంగీయుల ప్రభావము పడలేదు. బొంబాయి చిత్రకారులు వంగీయుల చిత్రకళను హేళనచేయుటయే ప్రధానలక్ష్యముగా పెట్టుకొనిరి. తరువాత రాను రాను బొంబాయి పాశ్చాత్య విధానమునతో భారతీయవిధానము మేళవించి ఒక నూతనకల్పన చేసిన అమృత షరిగిల్ ప్రభావము ఎక్కువగా పడినది. బెంగాలులో జామినీరాయ్ కలకత్తాకు దగ్గరగావున్న గ్రామాలకువెళ్ళి జానపదచిత్రాలు మట్టి

పాత్రలపై చిత్రించిన కళామర్మాలు తెలుసుకొని ఆధునిక భావాలకు అనుగుణముగా ఒక నూతనమార్గమును త్రొక్కిరి. ఆయన భారతీయ శాస్త్రబద్ధమైన సనాతన ఆధునికభావాలను మేళవించి తన జీవితము సార్థకముచేసుకున్న ధన్యుడు. ఆయనమార్గము కొంత మంది వంగీయులకును, కొంతమంది మహారాష్ట్రులకును, కొంత మంది ఆంధ్రులకు మార్గదర్శక మైనదనుటకు సందేహము లేదు.

అదేసమయములో ఆంధ్రదేశానికి సంస్కృతి కేంద్రమైన రాజమహేంద్రవరములో ఆర్ట్సు కాలేజీ ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిన కూర్ద్ దొరగారి చేతిచలువను, వారి ప్రోత్సాహము తోను బొంబాయికళాశాలలో విద్య నభ్యసించి అసమానప్రజ్ఞ చూపినవారు మన దామెర్ల రామారావుగారు. వీరు 1916 లో బొంబాయి కళాశాలలో ప్రవేశించి 1922 లో తిరిగివచ్చిరి. వీరు అజంతా, ఎల్లోరా మొదలగు ప్రాంతాలకువెళ్ళి భారతీయకళను ఆకళించుకొని, పాశ్చాత్యవిధానాలతో మేళవించి—ఆంధ్ర చిత్ర కళాసంపదకు నూతనత్వాన్ని చేకూర్చాలని అఖండకృషి చేసిరి. 1925 లో చాలా చిన్నవయస్సు - అనగా 29 వ ఏటనే - ఆంధ్ర దేశము ఆయనను కోల్పోయినది. ఆయనపేరనే నిర్మించిన, శ్రీ వరదా వెంకటరత్నంగారి ఆధ్వర్యాన నడుపబడుతున్న 'రామారావు ఆర్టుగేలరీ అండ్ స్కూల్' వారి కృషికి తార్కాణము.

## శ్రీ అడివి బాపిరాజు

ఆయనలాగే కీర్తిశేషులు శ్రీ అడివి బాపిరాజుగారు అటు కవిత్వములోను, ఇటు చిత్రలేఖనములోను పేరుగాంచిన బహుముఖ ప్రతిభాశాలి. ఈయన బందరు జాతీయ కళాశాలలో శ్రీ ప్రమోదకుమార్ చటర్జీగారి ప్రియశిష్యులలో ఒకడు. శ్రీ కాశా రామమోహనశాస్త్రిగారు, శ్రీ గుర్రం మల్లయ్యగారు కూడా ఛటర్జీగారి శిష్యులే. వీరందరిచిత్రాలు శ్రీ ఛటర్జీగారి ముఖ చిత్రంతో "శారదా" పత్రికలో వెలువడుచుండెడివి. అప్పట్లో ఆంధ్ర చిత్రకళలను ప్రోత్సహించిన పత్రిక అది ఒక్కటే. వీరి కుమారులే ప్రఖ్యాత చిత్రకారులు ఆనందమోహన, రామమోహన శాస్త్రి సోదరులు. తరువాత కీర్తిశేషులు శ్రీ కాశీనాథ నాగేశ్వర రావు పంతులుగారు మద్రాసులో "భారతి" పత్రికద్వారా కేవలము మనసంస్కృతిని ప్రోత్సహించుట ప్రధానలక్ష్యముగా పెట్టుకొని, రంగుచిత్రాలను ప్రకటించుచు చిత్రకారులను ప్రోత్సహించుచు వచ్చినారు.

కాశా రామమోహన శాస్త్రిగారు పాశ్చాత్య దేశాలలో విద్యాభ్యాసము చేసి కీర్తి నార్జించినారు. వీరిచేత లిఖింపబడినదే మన ఆంధ్ర యూనివర్సిటీ అధికార చిహ్నము.

ఇంకను రామారావు వర్గమునకు చెంది, ఆంధ్రదేశములో అసమాన కళాసేవచేసి, ఆంధ్ర యువ చిత్రకారులకు మార్గదర్శకుల యినవారు శ్రీ వరదా వెంకటరత్నం, శ్రీ దామెర్ల సత్యవాణి, బుచ్చి కృష్ణమ్మ, భగీరథిగార్లు.

శ్రీ వి. వి. భగీరథిగారు దృశ్య చిత్రాలు చిత్రించుటలో అసమాన ప్రజ్ఞ చూపి సిద్ధహస్తులయినారు. ఏ వర్గమునకు చెంద కుండా కళాసాధన చేసినవారు ఎంతోమంది యున్నారు. ఇందులో

పేర్కొనదగ్గవారు—అంకాల వెంకట సుబ్బారావుగారు, భాగేశ్వర శర్మగారు, ఎస్. ఎన్. వెంకటరావుగారు మొదలగు వారు; శ్రీ నందలాల్ బోసు శిష్యులయిన శ్రీ తేజోమూర్తుల కేశవరావుగారు, జి. వి. సుబ్బారావుగారు. వి. ఆర్. చిత్రాగారు మొదలగు వారు.

భారతదేశములోనే కాక పాశ్చాత్య దేశములలో కూడ అంకాల వెంకటసుబ్బారావుగారి చిత్రాలు ప్రదర్శింపబడి పేరు గాంచినవి. వి. ఆర్. చిత్రాగారు శాంతినికేతనములో విద్య నభ్యసించినారు. జపానులో కుటీర పరిశ్రమ కళను జీర్ణము చేసుకొని మద్రాసు చిత్ర కళాశాలలో అధ్యాపకులుగా నుండి ప్రస్తుతము ఇంటర్ నేషనల్ లేబర్ ఆర్గనైజర్ లో కుప్య పరిశ్రమ సలహాదారులగా నున్నారు. 'శిల్పి' పత్రికను ఆంధ్ర, ఆంగ్లములలో నడిపి లలిత కళకు అసమాన సేవ చేసిరి.

గురుపాదులు శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌధురీగారు వంగదేశీయులు. మద్రాసు చిత్ర కళాశాలలో ప్రిన్సిపాల్ గా పనిచేసి రిటైరు అయినారు. ప్రస్తుతము "అఖిల భారత లలిత కళా ఎకాడమీ"కి అధ్యక్షులుగా నున్నారు. వీరు చిత్ర రచనకంటె శిల్పము చేయుటలో నిపుణులు. భారతీయ శైలికంటె పాశ్చాత్య శైలిలో ఎక్కువగా కృషిసల్పి కృతకృత్యులయినారు. ప్రకృతి ప్రతిబింబాలను స్వకీయ కల్పనతో సృష్టించుట అంత తేలికయిన పని కానప్పటికీ, అది బాహ్యరూప ప్రతిబింబము మాత్రమే అగును. గత కాలములో పాశ్చాత్యులకు, మనకు ముఖ్యమైన వ్యత్యాసమే అది. అయితే రానురాను పాశ్చాత్యులు ఎన్నో విధానాలు కనిపెట్టి ముందంజవేసినారనుటకు సందేహము లేదు. అప్పటిలో వారికి కలిగిన అవకాశాలే దీనికి కారణమయినది.

ఆంధ్రదేశములో నున్న ఆధునిక యువ చిత్రకారులకు దారి చూపిన మహానుభావుడు—చౌధురీగారు. ఎవరి స్వకీయ కల్పనలలో వారికి అనుగుణముగా ప్రోత్సహించుటయే గాక, భారత దేశములోనే కాక పాశ్చాత్య దేశాలలో కూడా విశిష్ట స్థానాన్ని అందుకున్నారు. అందువలననే ఆంధ్ర యువ చిత్రకారులు ఎంతోమంది పేరు ప్రపంచ చిత్రకారులతో సరితూగుచున్నారు. ఆ కీర్తి శ్రీ చౌధురిగారికి దక్కినది.

ప్రస్తుతము వీరి శిష్యులలో అఖండమైన ప్రతిభ సంపాదించిన వారిలో ముఖ్యముగా పేర్కొనదగ్గవారు శ్రీ దేవీప్రసాద్ నారాయణరావు, ఎస్. వి. ఎస్. రామారావు, గోఖలే, డి. బదరీ, పెుక్కపాటి కృష్ణమూర్తి, ధనపాల్, శ్రీనివాసులు, హెచ్. వి. రామగోపాల్, వేలూరి రాధాకృష్ణ, వశిక రాములింగేశ్వరరావు గార్లు. విజయనగరములో చిత్రకళాశాలను స్థాపించి కళాసేవచేస్తున్న నేనుకూడ శ్రీ దేవీప్రసాద్ రాయ్‌చౌధురిగారి వద్దనే చిత్రకళ, శిల్పము నేర్చుకున్నాను. వీరిలో కొంతమంది చిత్రాలు భారత దేశములోని వివిధ ప్రాంతములలోను, విదేశములలోను ప్రదర్శింపబడుటయేగాక ఎన్నో ప్రథమబహుమతులుకూడ పొందినవి.

శ్రీ దేవీప్రసాద్ నారాయణరావుగారు: మద్రాసు చిత్ర [illegible] కొంతకాలము పనిచేసిరి. వీరు శిల్ప, చిత్రలేఖనములో అఖండ కృషిచేసి భారతదేశంలో గొప్పకీర్తి నార్జించినారు. వీరు నాట్యములోకూడ అపారమైన కృషిచేసినారు.

శ్రీ ఎస్. వి. ఎస్. రామారావు, గోఖలేగార్లు: వీరిరువురు ప్రస్తుతము సినిమారంగములో ఆర్టుడైరెక్టర్లుగా కీర్తినార్జించి ఆంధ్రలో ఉత్తమ 'సినిమా ఆర్టుడైరెక్టర్లుగా' రాణిస్తున్నారు. వీరిలో ప్రథమముగా గోఖలేగారిని పేర్కొనవచ్చు. వీరు రచయితకూడాను.

శ్రీ డి. బద్రీగారు: వీరు ఢిల్లీ కేంద్రములో "ఆల్ ఇండియా రేడియో ఫైన్ ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు సొసైటీ"లో ఒక ప్రత్యేక స్థానమాక్రమించి భారతీయ చిత్రకళారంగములో ఎంతో కృషి చేసిరి.

శ్రీ పెుక్కపాటి కృష్ణమూర్తిగారు: స్వస్థ[illegible]ములో చిత్రకళలో అఖండ కృషిచేసి తమ చిత్రకళకు—ఆధునికభావాలు మేళవించి—పల్లెప్రజల రూపలావణ్యాలను జీర్ణముచేసుకొని జాతీయతతో సమకూర్చి ఒక ప్రత్యేకమైన బాణీలో రూపకల్పన చేసినారు.

శ్రీ పిలకా లక్ష్మీనరసింహమూర్తిగారు: వీరిది ప్రత్యేకశైలి. అటు దేవతల విగ్రహములు మొదలుకొని ఇటు కొండపల్లి బొమ్మలు, తిరుపతి బొమ్మలు మీదనుంచి సమగ్రదృష్టితో ఈజిప్టు మొదలగు చిత్రాలు పరిశీలించి, జానపద చిత్రశైలిలో ఒక నూతనపథమును త్రొక్కినారు. వీరి చిత్రాలు విశేషకీర్తి నార్జించినవి. సనాతన, ఆధునికభావాలు మేళవించి ఆంధ్రదేశంలో అగ్రగణ్యు లనిపించుకున్న వారిలో వీరొకరు. వీరి రేఖలు రంగులు విశిష్టగుణములు గలిగియుండును.

శ్రీ ధనపాల్ గారు: వీరు ప్రస్తుతము మద్రాసు చిత్ర కళాశాలలో ఉపాధ్యాయులుగా పనిచేయుచున్నారు. వీరు ఆధునిక కళారీతులలో ఎన్నో చిత్రాలు, శిల్పాలు సృష్టించినారు. అంతే కాదు. వీరు నాట్యములోను అఖండకృషి చేసినారు.

శ్రీ శ్రీనివాసులుగారు: వీరు ప్రస్తుతము అడయారు కళాశాలలో కళాబోధకులుగా నున్నారు. సనాతన ఆధునికభావాలు మేళవించి అటు లేపాక్షి, ఇటు పల్లెజీవనము జీర్ణముచేసుకొని గ్రామీణ కళారీతులలో అపారమైన కృషిచేసి సిద్ధహస్తులైనారు. జానపద చిత్రరచనలో అందెవేసినచేయి. వీరి రంగులు, రేఖావిన్యాసములు అతిగంభీరంగా నుండును. ఆంధ్ర చిత్రకారులలో అగ్రగణ్యత వహించుచున్న వారిలో ఒకరు వీరు.

శ్రీ హోతా రామగోపాల్ గారు: వీరు మద్రాసు చిత్రకళాశాలలో ఉపాధ్యాయులుగా నున్నారు. వీరు మూర్తిచిత్రాలు వేయుటలో నిపుణులు. లేపాక్షి శిల్ప మొట్టమొదటిసారిగ ఆ చిత్రాలకు నకళ్లుతీసి ఆంధ్రదేశానికి అందజేసిన కీర్తి వీరికే దక్కినది. చిత్రలేఖనములో, శిల్పములో అఖండకీర్తి నార్జించినారు.

శ్రీ వేలూరి రాధాకృష్ణగారు: వీరు బచ్‌మహిలో కళాబోధకులుగా నున్నారు. వీరు చిత్రాలుకూడ ఎన్నో చిత్రించి కీర్తి నార్జించినారు. వీరు కళపై [illegible] ఎంతో [illegible] చేయుచున్నారు.

శ్రీ దశిక రామలింగేశ్వరరావుగారు: వీరు శిల్పము, చిత్రలేఖనములలో తర్ఫీదుపొంది ఎంతో పేరుగడించి ఆంధ్రపత్రిక కళాకారులుగా పనిచేయుచున్నారు. వీరికి 1946 లో ఢిల్లీలో జరిగిన 'అంతర్జాతీయ సమకాలిక చిత్రకళా ప్రదర్శనము'లో "A" ప్రైజు లభించినది. 'ప్రోగ్రెసివ్ పెయింటర్స్ అసోసియేషన్'లోను ప్రథమబహుమతి లభించినది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఆంధ్ర చిత్రకళా సంపద యింకా విశాలమైనది. తెలంగాణా చిత్రకారుల కృషికూడ యిందులో పేర్కొనక తప్పదు. వీరి చిత్రాలు భారత పాశ్చాత్య దేశాలలో ప్రదర్శింపబడి ఎన్నో ప్రథమ బహుమతులు పొందినవి. కె. రాజయ్య, కొండపల్లి శేషగిరిరావు, వడ్లమాని మధుసూధన రావు, పి.టి. రెడ్డిగార్లు మొదలయినవారు వీరిలో ప్రముఖులు.

శ్రీ కె. రాజయ్యగారు:—గ్రామీణ చిత్రకళలో కర్ణాటక బాణీ మేళవించి ఒక నూతనమైన పంథాను తొక్కినారు. వీరి రంగుల కలయిక, రేఖలు చాలా ఆకర్షణీయముగా నుండును.

శ్రీ కొండపల్లి శేషగిరిరావుగారు:—చైనావారి చిత్రకళ, పాశ్చాత్య చిత్రకళ, వంగీయుల చిత్రకళ జీర్ణము చేసుకొని స్వకీయ కల్పనలో చిత్రాలు చిత్రించిరి.

శ్రీ వడ్లమాని మధుసూదనరావుగారు:—వీరు వాణిజ్య కళ (Commercial Art) లో ఎక్కువ కృషిచేసినారు. తరువాత వీరు చిత్రకళలో పాశ్చాత్య విధానాలు పరిశీలించి రూప కల్పన చేసినారు.

శ్రీ పి. టి. రెడ్డిగారు:—వీరు పాశ్చాత్య రీతులలో ఆధునిక విధానాలతో స్వకీయకల్పన చేసి సిద్ధహస్తులైనారు. వీరు భారత దేశములోనే కాక పాశ్చాత్య దేశములలో అనేకసార్లు స్వంతముగా ప్రదర్శనములు ఏర్పాటుచేసి గౌరవము పొందిరి.

## చిత్రకారిణులు

ఆంధ్రదేశములో చిత్రకారిణు లెందరో కృషిచేసి భారత, పాశ్చాత్య దేశాలలో తమ చిత్రాలను ప్రదర్శించటమే కాక బహుమానాలు కూడ పొందగల్గుచున్నారు. అందులో ముఖ్యముగా పేర్కొనదగ్గవారు శ్రీమతులు పిలకా విజయలక్ష్మి, పి. సీతాదేవి, శ్యామసుందరీదేవి, వేదుల రాజ్యలక్ష్మి, కృపావతి, కరుణారావు, నాగేశ్వరీబాయి, రుక్మిణీబాయి, వై. జె. శ్రీమతి, ఆర్. కమలాబాయి, అద్దేపల్లి కృష్ణాబాయి మొదలగువారు.

## కళా విమర్శకులు, ప్రోత్సాహకులు

ఇక నవ్యాంధ్ర చిత్రకళాభివృద్ధిని ప్రేమించి, విమర్శించి, దోహదంచేసి, ప్రాంతీయ పరిషత్తు నిర్మాణాన్ని ఆకాంక్షించిన సమకాలికు లయిన పెద్దలను, యువకులను పేర్కొనుట నా కర్తవ్యము.

శ్రీ ఎస్. సంజీవదేవ్, శ్రీ ఆచంట జానకిరామ్, పేరెన్నికగన్న కళావిమర్శకులు. శ్రీ కోలవెన్ను రామకోటేశ్వర రావుగారు, త్రివేణిద్వారా 80 యేళ్ళు అనల్పమైన ప్రచారము చేసిరి.

రాజమహేంద్రవరము నుండి యీ రంగములో ఆచార్య దామెర్ల వెంకటరావు, ఆచార్య విస్సా అప్పారావు, శ్రీ ముద్దాల సూర్యప్రకాశరావు గారలు ప్రచారము చేసిరి. శ్రీ దాగంటి సోమయాజులు విజయనగరము చిత్రకళా శాలకు ప్రోత్సాహమిచ్చుచు చక్కని వ్యాసాలు వ్రాసి ప్రచారము చేసి కళాసేవ చేసిరి.

శ్రీ అడుంచర్ల గోపాలరావుగారు ఆంగ్లాంధ్రాలలో వ్యాసకర్తలు. రోణంకి అప్పలస్వామిగారు ఆంగ్లములో వ్యాసకర్తలు. శ్రీ జేకసుప్రాళ్ళ విశ్వేశ్వరరావుగారు ఆంధ్రనుంచి ఏనాడో అఖిల భారత లలితకళా పరిషత్తు ప్రాంతీయశాఖల స్థాపనగురించి ప్రచారము చేసిరి. శ్రీ పి. ఆర్. రామచంద్ర రావుగారు చక్కని కళా విమర్శకులు.

యువకులలో చెప్పుకో దగ్గవారు శ్రీ వేలూరి రాధాకృష్ణ, ఎం. రాజా, బి. శశిబాలుగార్లు. వీరు చక్కని వ్యాసాలు వ్రాసి, కళాసేవ చేయుచున్నారు.

శ్రీ ఎ. యస్. రామన్‌గారు యిల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా (బొంబాయి) లో సహాయ సంపాదకులుగానుండి ఆంధ్ర చిత్రకళా వ్యాప్తికి అపారమైన కృషి చేయుచున్నారు. వారు 'థాట్' అన్న పత్రికలో ఆంధ్రుల చిత్రకళపైని యెన్నో వ్యాసాలు వ్రాసి ప్రచారము చేసిరి.

## చిత్రకళా పోషకులు

శ్రీ పాకాల రాజమన్నారు, శ్రీ నూతక్కి రామశేషయ్య, విజయనగరము సీనియరు డవేజరు రాణీసాహెబా, ఆంధ్రపత్రికా సంపాదకులు శ్రీ శివలెంక శంభూప్రసాద్, శ్రీ ఎం. రంగయ్యప్పారావు, శ్రీ కె. వి. గోపాలస్వామి గారలను, కళా పోషకులుగా పేర్కొనవలసి యున్నది.

ఆధునిక చిత్రకళా రంగములో పెక్కుమంది పెక్కురీతులలో చిత్రశిల్పములు సృష్టించిరి. వారిలో ఎంతోమంది సిద్ధహస్తులైనారు. ఆంధ్రదేశములో నున్న వారందరిని గురించి ప్రత్యేకముగా చెప్పుట కష్టసాధ్యమైన పని. స్వాతంత్ర్యము వచ్చి కొద్ది సంవత్సరములే గడచినప్పటికి చిత్రకారులు పురోగమించిరని చెప్పుటకు సందేహము లేదు. వీరు మన కళాప్రపంచము పోకడలను ఆకళించుకొని భారతీయ కళకు క్రొత్త మెరుగులుదిద్ది ప్రపంచముతో పాటు పురోగమించ గలరనుటకు సందేహము లేదు. ఇందుకు మన ఆంధ్రదేశములో మొట్టమొదట జరిగిన కృషి అనల్పము; అమూల్యము. ఇకమీదట మన ప్రభుత్వమువారి, ప్రజల ప్రోత్సాహముపైని మన కళా సంస్కృతుల భవిష్యత్తు ఆధారపడి యున్నది. ఏనాడు అన్ని ప్రాంతాలలోను, అన్ని రంగాలలోను భారతీయతతో కూడిన అకాడమీలు, గ్యాలరీలు, ప్రదర్శనాలు, చిత్రకళాశాలలు ఏర్పడ గలవో, అనాడే ప్రథమశ్రేణి కళాకారులు తయారు కాగలరు; అనాడే లలితకళాభివృద్ధికి నూతన [illegible] కాగలదు.

# నిశీథినీ శంఖారావం

శ్రీ "కాంకలూరి"

గూడ్సుబండి కుసుకుస్తూ నడుస్తోంది.

లోకంచుట్టూ చీకటి నగ్నంగా నృత్యం చేస్తోంది. ఆకాశంలో చుక్కలు ప్రపంచాన్ని క్రమ్మిన అంధకారాన్ని చూచి, గొంతెత్తి అరుస్తున్నాయి. ఆ అరుపులు అర్థంలేని ధ్వనుల్ని నింపుకొని అనంతంలో మిళితమైపోతున్నాయి.

గూడ్సుబండి కుసుకుసుతూ కూతవేసింది.

దూరంగా పర్వతం లోయల్లో కొండరాళ్లను దాటుకుంటూ ప్రవహించే సెలయేళ్ళ ఏడ్పు, చిన్నగా, మరీచిన్నగా అవ్యక్తంగా వినవస్తోంది. ఎందుకో నక్కలు, ఒక్కసారిగా ఎక్కడో అరుపులు మొదలుపెట్టాయి. గుడ్లగూబలు కేకలుపెట్టాయి. కీచురాళ్ళ మర్మర రవం వినవస్తోంది. ప్రశాంత వాతావరణంలో ప్రకృతి వ్యతిరేకమైన ప్రతిపని ధ్వనీ వినవస్తోంది. ఒక్క నిమిషం నిశ్శబ్దం. పూర్తి నిశ్శబ్దం. భరింపరాని నిశ్శబ్దం. భయంకరమైన నిశ్శబ్దం. ప్రళయమైన నిశ్శబ్దం. ఇంతలో ప్రాణంమీదికి ముంచుకొచ్చినట్లు, ప్రపంచంపైన ప్రళయకాల మహాపయోధి వచ్చి పడుతున్నట్లు, గొంతుపూడిపి ఆడకపోయినా, శక్తినంతా ఉపయోగించి, ప్రయత్నించి, చస్తున్న రాక్షసికంటే భయంకరంగా, నిశ్శబ్దానికి భంగకరంగా గోండ్రుపెట్టి అరచింది గూడ్సు బండి.

గూడ్సుబండి కొండ ఎక్కుతోంది.

చుట్టూ దట్టంగా పెరిగిన చెట్లనుదాటుకుంటూ సాగిన రైలురోడ్డుమీద గూడ్సుబండి పైకి పాములాగా మెలికలు తిరుగుతూ ప్రాకుతోంది.

గూడ్సుబండి ఇంజనులో డ్రైవరు గురవయ్య ప్రశాంతంగా కనిపిస్తున్నాడు.

ఇంజను పొయ్యిలోంచి, విచిత్రంగా, అపూర్వంగా కంపు వచ్చి, నాసికా రంధ్రాల్ని పగలగొడుతోంది.

గురవయ్యకు ముక్కు మూసుకోవాలని తెలియని పరిస్థితి. డ్రైవరు ప్రక్కననున్న ఫైరమన్ రెండుచేతులతో ప్రయత్నించి ముక్కు మూసు కున్నాడు.

గురవయ్య వంటినిండా చెమట పట్టింది. బట్టలు ముద్దముద్దగా తడిసిపోయాయి. ఆ చెమట బట్టలపైన బొగ్గు నుసి కొట్టుక అద్దినట్లు వుంది. బట్టలు మరీ నల్లగా కనిపిస్తున్నాయి. ఆ బట్టలు పడిన నీరుగానీ, నెత్తురుగానీ గుర్తురానంత నల్లగావున్నాయి.

గురవయ్య పిడికిలి ముడుచుకొని వుంది. పళ్ళు నోటిలో ఒకదానినొకటి నొక్కిపట్టుకున్నాయి. నొసటి మీద చిక్కు చిక్కుగా ముడతలు పడివున్నాయి. నొసటిమీద చెమటబిందువులు తళతళ లాడుతున్నాయి. ముఖంలో వెలుగునీడలు వ్యాపిస్తున్నాయి. గురవయ్యముఖంమీద సాలెగూడులాగా వెలుతురు, మండుతున్న పొయ్యిమూత కన్నాలలోంచి వచ్చి పడుతోంది. ముక్కుపైగా చెమటబిందువులు జారుతున్నాయి. కనురెప్పలు చెమటతో తడిసిపోయాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మందంగా సాగుతున్నాయి. ముక్కుపుటాలు కంపిస్తున్నాయి. కఠినమైన అధరాలు వణుకుతున్నాయి. ముఖంలోని ప్రతి పంట్రుకపొడు కంపరమెత్తిపోతోంది.

గూడ్సు బండి కొండ ఎక్కిందిు.

గురకపెడుతూ గాలి తోలింది.

గాలి విసురికి ఇంజనుపొయ్యి చలించింది. పొయ్యిలోంచి ప్రకృతికి పళ్ళు తెలియకపోతే పుట్టినగాలి బైటకివచ్చింది. ఆ గాలి చస్తూ బ్రతుకుతూ వాసన మోసితెచ్చింది.

కంపు! ముక్కులో రక్తనాళాలు పగిలిపోయే కంపు. స్మశానంలో మనిషిని కాలుస్తుంటే వచ్చేకంపు.

గురవయ్యకు ముక్కుమూసుకోవాలని తట్టలేదు. ముక్కు ముక్కుమూసుకున్న ఫైరమన్ గూడ్సుబండి నడుపుతున్నాడు. ఎర్రని గాజుగోళిల్లాంటి రక్తం గడ్డకట్టినకళ్ళలోంచి చూపులు నిర్వ్యాపారంగా మండుతున్న పొయ్యిపై పునూటిగా విసిరాడు.

గురవయ్య ఆలోచనలులాగా పొయ్యిలో సుడులుతిరుగుతున్నాయి పొగలు. ఆ పొగల్లో అంతకు ముందు జరిగిపోయిన విషయం గుర్తుకొచ్చింది. పొయ్యిలోంచి వచ్చే వాసనకు, అంతకు ముందు జరిగిన సంఘటనకు సంబంధం అతని ముఖంలో తేలుతోంది.

అంతకు కొంచెం ముందు.........

గూడ్సుబండి కొండకు రెండు మైళ్ళదూరంలో దట్టమైన అడవిలోంచి నడచింది.

అప్పుడు........................

భూమిమీద చీకటి పెత్తనం ముమ్మరంగా చెలాయిస్తోంది. మిణుగురుపురుగులు వెలుగునిద్దామని ప్రయత్నించి, ఏడ్చి, కిక్కురుమనకుండ వూరుకున్నాయి. చీకటి సింగారించుకొని చిత్రంగా నవ్వి నగ్నంగా, భీకరంగా, నర్తిస్తూ వర్తించింది.

అంతలో.......................

గుబురుగావున్న కొండ దగ్గర అడవిలో చెట్ల మధ్యగా ఒక అరుపు వినవచ్చింది. పూర్ణశ్రోతలు వినిపించాయి. దశదిశలూ ప్రతిధ్వనించాయి. సాశనమయిన నక్క అరుపు కాదు. పడుం విరిగిన ఏనుగుఘీంకారం కాదు. కాలంమూడిన కుక్క అరుపు కాదు. చిక్కిపోయిన సింహగర్జన కాదు. చీకట్లో పిస్తతో

తలొంచుకుపోయే రైలింజనుకూతకూడా కాదు. అన్నిటికీ అతీతం. అర్థంగాని ధ్వని. ఊహించలేని శబ్దం.

—మనిషి చావబోయేముందు చివరిసారిగా, ఉన్నతమైన స్వరంతో పెట్టే గావుకేక.

అనుకున్నట్లు గూడ్సుబండి మెల్లగా నడిపాడు గురవయ్య. గూడ్సుబండి వెలుగులో రైలురోడ్డు ప్రక్కగా ఫర్లాంగుదూరంలో ఎవరో ఏదో ఎత్తుకొని నిలబడ్డాడు. గురవయ్య అందుకున్నాడు. ఇంజను ప్రక్కగా మూడో మెట్టుమీదికి దిగి.

క్రింద నిలబడినవాడు అందించిన బరువు అందుకున్న గురువయ్య వెంటనే ఇంజనుపొయ్యి మూతతీసి, దాంట్లో పెట్టి, బొగ్గువేసి, మూతవేశాడు. బట్టలమీద రక్తం పడింది. ముఖంలో ఆతృతపోయింది. శరీరానికి చెమట పట్టటం మొదలు పెట్టింది. అప్పుడు తను బైటికిచూశాడు. అందించిన వాడు గూడ్సు గార్డుపెట్టె దాటకముందే కనిపించకుండా అడవిలోకి వెళ్లిపోయాడు. వాడు వెళిపోవటం తను చూడలేదు.

గూడ్సుబండి కొండదాటి లోయలోకి దిగుతోంది.

భోరున గాలి తోలింది. కంపు! సహించరాని కంపు, కండలు కాలిన కంపు. నరాలు మాడిన కంపు. వెంట్రుకలు చిటుకురించే కంపు.

పొగలు పొరలుతున్న పొయ్యిమూత తీశాడు గురవయ్య. లోప శవం కాలిపోతోంది. పూర్తిగా కాలిపోలేదు. గుర్తుపట్టటానికి మాత్రం వీలులేదు. ఊచల్లాంటి చేతులు, కట్టెల్లాంటి కాళ్లు, ముడుచుకొనిపోయిన దుంగలాంటి శరీరం. రాయిలాంటి తల పగిలిపోయింది. అన్నీ మండుతూనే వున్నాయి. ఉమ్మివేశాడు కుపుక్కున గురవయ్య.

బొగ్గువైపు చూశాడు. పొయ్యివైపు చూశాడు. బొగ్గు పొయ్యిలో వేశాడు. శవం ఛాయలు కనిపించకుండ చేశాడు. బొగ్గు పూర్తిగా పొయ్యిని క్రమ్మింది. పొగలు దట్టంగా వస్తున్నాయి మూతవేశాడు గురవయ్య.

డ్రైవరు దూరంగా నిలబడ్డాడు. ఫైర్‌మెన్ ఇంజను నడుపుతున్నాడు. గురవయ్య చెమట మెల్లగా చల్లారుతోంది. బట్టలు బొగ్గులో, రక్తంలో, చెమటలో తడిసి నల్లగా తయారయ్యాయి. ముఖం చిత్రంగా మార్పులు పొందుతోంది. పైపంటిక్రింద క్రింద పెదిమ నొక్కబడింది. కళ్ళు చిన్నవయ్యాయి. ముఖం కుంచించుకుపోయింది.

గూడ్సుబండి లోయలో పోతోంది.

ఇంజను పొయిలోంచి పొగలు సుడులు సుడులుగా కంపు కంపుగా వస్తున్నాయి.

కంపుకి—ఇంజను పొయిలోంచి రావటానికి కారణాలు అతని ఆలోచనల్లో కదలాడుతూవున్నాయి.

వెధవ మాడిపోతున్నాడు, అనుకున్నాడు గురవయ్య. మళ్లీ అనుకున్నాడు, తప్పుడు బుద్ధులున్నవాళ్ళు బ్రతక్కూడదు.

బాబు మంచివాడు. తనమాట విన్నాడు. తను చేయమన్న పని చేశాడు. వాడు తనని ఎప్పుడూ కాదనలేదు. అసలు బాబు అచ్చంగా తన కొడుకు. తండ్రికి తగిన కొడుకు. అందరిలాంటివాడు కాదు.

పొయ్యివైపు చూశాడు.

కాలుతున్నాడు వెధవ. అసలు వాడెవడో తనకు తెలియదు. పెళ్ళాం తన తరఫు చుట్టమని చెప్పింది. తన పెళ్ళాన్ని వాడు అక్కా అని పిలిచేవాడు.

వాడు—కోటిగాడు—తన కింత ద్రోహం చేస్తాడని తను అనుకోలేదు. ఏదో లేనివాడుకదా అని తను వాడికి స్టేషనులో కూలీ మోసుకునేందుకు లైసెన్సు ఇప్పించాడు. వాడు ఇంత ద్రోహం చేస్తాడా?

వాడు వచ్చి సరిగ్గా సంవత్సరం కూడా కాలేదు. ఇంతలో ఎంతపని చేశాడు. ఎంత ద్రోహం. ఇంతగా ప్రవర్తిస్తాడని తెలిస్తే తాను వాణ్ణి చేరనిచ్చేవాడు కూడా కాదు.

వాడికి తను బుద్ధి బాగా చెప్పాడు.

బాబు లేకపోతే కోటిగాడికి తను శిక్షవేయగలిగేవాడుకాదు. బాబు సహాయం చాలా వుంది. బాబుది ఆరోగ్యమైన శరీరం. కోటిగాడిది కూడా అంతే. ఇద్దరి వయస్సూ ఇరవై సంవత్సరాలకు మించదు. ఇద్దరి శరీరాలూ బొద్దుగానే వుంటాయి. ఇద్దరి ముఖ కవళికలు దగ్గర దగ్గరగా ఒకేలాగ వుంటాయి. జాగ్రత్తగా చూస్తే తప్ప పోల్చుకోలేము.

పాసింజరు ట్రెయిన్‌లో ఫైర్‌మన్‌గా పగలు డ్యూటీ చేసి వచ్చి పడుకున్నాడు బాబు. వాడి పక్కలోనే కోటిగాడు కూడా వున్నాడు. రాత్రి పదిగంటలకి తను డ్యూటీకి వస్తూ బాబుని లేపి చేయవలసిన కార్యక్రమమంతా చెప్పి, తను ఇంజనుదగ్గరకు వచ్చాడు. రాత్రి ఒంటిగంటకల్లా కార్యక్రమం నెరవేర్చాడు బాబు. వాణ్ని చంపి ఇవ్వమని తను బాబుతో చెప్పాడు. అల్లాగే బాబు చేశాడు. తను ఆ వెధవ కోటిగాణ్ణి ఇంజను పొయ్యిలో వేసి బూడిదచేసి వేశాడు.

పొయిలోంచి సన్నగా వాసన వస్తోంది.

చూడివా! బోడి వెధవా! ద్రోహంచేస్తావటరా అనుకున్నాడు తను. ఫైర్‌మన్ నడుపుతున్నాడు, ఇంజను.

గూడ్సుబండి కొండప్రాంతంలోనే నడుస్తోంది.

గురవయ్య పొయ్యివైపు చూశాడు.

కోటిగాడు తనకింత అన్యాయం తలపెడతాడని తెలిస్తే తను వాణ్ణి చేరనిచ్చేవాడుకాదు. ఎంత అప్రతిష్ఠ, ఎంత అపకీర్తి. తన గౌరవానికి చోదాకి మచ్చతెచ్చేపని చేస్తాడా వాడు. చావరా వెధవా అనుకున్నాడు గురవయ్య పొయ్యివైపు చూస్తూ.

—కృతజ్ఞత లేని ఒక వెధవకి ఉద్యోగం చూపించటం తనది తప్పు. తనది బుద్ధిలేని పని. తను వెధవ. వట్టి వెధవ. వెర్రి వెధవ. వాడికి తను లైసెన్సు కూలీ ఉద్యోగం ఇప్పించాడు.

ఒకప్పుడు తనుకూడా లైసెన్సు కూలీయే. ఇప్పటికి పాతిక సంవత్సరాలనాడు తను లైసెన్సు కూలి. అప్పుడు తనకి పదిహేను సంవత్సరాలు. తనకి కూలీ మోయటానికి లైసెన్సు లేదుగాని తను కూలీ మోసేవాడు అప్పుడు.

తనకు తల్లిదండ్రు లెవరో తెలియనప్పుడు తను స్టేషనులో చేరాడు.

ఇంజను పొయ్యిలోంచి వాసన వస్తూనే వుంది.
ఫైర్‌మన్ బండి నడుపుతూనే వున్నాడు.
గూడ్సుబండి గునుస్తూ నడుస్తూవుంది.
గురవయ్య ఆలోచనలు సాగుతూవున్నాయి.

రైలుస్టేషనులో తన జీవితం పది సంవత్సరాలనాడు ప్రారంభమయింది. అంతకుముందు తనెవరో తనకు తెలియదు. లోకానికి అంతకంటే తెలియదు. కూలీ నాలీ మోసేవాడు. ప్రయాణీకులదగ్గర డబ్బు లడుక్కునేవాడు. ఎవరు ఏం పెట్టినా తీసుకునేవాడు. ఎక్కడో ఎత్తేసిన పుల్లాకుల్లో మెతుకులు తినేవాడు. ఏ ప్లాటుఫారంమీదనో, ఏ లైటుక్రిందనో, ఏ ఫెన్సింగుప్రక్కనో నిద్రపోయేవాడు.

కూలీ మోసేటప్పుడు మాచిన లైసెన్సుకూలీల తిట్లుతిన్నాడు. తన్నులు భరాయించాడు. ప్లాటుఫారంమీద పోలీసుల అదమాయింపులకు తట్టుకున్నాడు. అనేక సందర్భాల్లో దొంగని అనుమానించి తన్నేటప్పుడు తమాయించుకున్నాడు. దున్నపోతులాగా వున్నావనే దున్నపోతుల్లాంటి ప్రయాణీకుల బెదిరింపులకు ఓర్చుకున్నాడు. ఘరానా మనుష్యుల చేతుల్లో కిక్కురు మనలేదు.

—నూరు సంవత్సరాల కష్టాలు తను చిన్నతనంలోనే అనుభవించాడు. కన్ను మూస్తూ తెరుస్తూ లోకంవైపు చూడకుండ జోగుతూ కాలంగడిపే తనకు కనువిప్పు కలిగించింది లోకం. దానితో ఎన్నడూ లేని క్రూరత్వం తనలో కూడా పీఠం వేసుకుంది.

ఒకసారి కూలీకి అడ్డంవచ్చిన ఒకణ్ణి పచ్చడి పచ్చడిగా చితగ్గొట్టాడు. ముఖం పగలగొట్టాడు. నడుం విరగదన్నాడు. రక్తం కళ్ళచూశాడు.

మరొకసారి తను ఏరుకునే పుల్లాకుల్లో మెతుకులు లాక్కోబోయిన మరొకణ్ణి చింతకాయ చట్నీ చేశాడు. పళ్ళురాలగొట్టాడు. దవడ పగలగొట్టాడు. కసి తీర్చుకున్నాడు.

తను పాయికాన దొడ్డదగ్గర, లైటుకి దూరంగా, క్రీనీడన జీవితంలోని మురికిని పీల్చుకొంటూ, యాతన్ని విడుస్తూ నిద్రపోతుంటే తన ప్రక్క కండువా కొస్తా ఆ రాత్రి లాక్కుపోయిన వాడిని తెల్లారింతరవాత చావబాది కోపం చల్లార్చుకున్నాడు తను.

ప్రపంచం తనకప్పుడు అందించిన మహాప్రసాదం క్రూరత్వం. మూర్ఖంగా ప్రవర్తించటం, పరిస్థితులమీద బలంగా మరోతోవలో అడ్డదిడ్డంగా, ఆలోచన లేకుండా ఎదుర్కొనేట్టు చేయటం.

ఆ క్రూరత్వానికిది పరాకాష్ఠ. చచ్చిపోతున్నాడు వెధవ. మూర్ఖంగా మూర్ఖత్వంమీద తిరగబడి నిలువలేక మిడతలాగా మాడిపోతున్నాడు.

నాకు ద్రోహం తలపెడితే నువ్వా ద్రోహి అనుకున్నాడు గురవయ్య. ఇంజను బాయ్లి మండిపోతూనే వుంది.

కొంచెం కొంచెంగా వాసన ఇంజన్లో కొడుతోంది.

గూడ్సుబండి నడుపుతున్న ఫైర్‌మన్ తీగ లాగేసరికి ఇంజను కూతవేసింది. దూరంగా మునగదీసుకు పడుకున్న కొంప, నల్ల దుప్పట్లో నిశ్శబ్దంగా నిద్రపోయే నిశీథి ఒక్కసారి ఉలిక్కిపడి లేచి ఆవులించి వూరుకున్నది.

కోటిగాడి కిప్పుడు ఇరవై సంవత్సరాలు. తనకప్పుడు పదహారు పదిహేడు సంవత్సరాలు వయస్సు. ఆరోజు తను ఎవరి దగ్గరో కూలీ అందుకొని మోసుకొని పోతున్నాడు. అంతలో లైసెన్సు కూలీవచ్చి, కాలితో వీపుమీద తన్ని, నెత్తిబరువు మార్చుకొని, గుండెల్లో కొండంతబరువు విడిచి, పోతూ పోతూ 'దున్నపోతు! పోయి బొగ్గు మోసుకోరాదు' లైసెన్సుకూలీ ధర్మబోధచేసి వెళ్లిపోయాడు.

ఒకనాడు మరొకడికీ తనకీ కూలిపంపకందగ్గర పేచీవచ్చి తగాదాపడి తన్నుకుంటుంటే స్టేషనుగార్డు వచ్చి, వీపుచరిచి విడదీసి, నానా చివాట్లుపెట్టి, 'వెధవల్లారా! పనీపాటా లేకుండ తన్నుకోకపోతే పోయి బొగ్గు మోసుకోరదటండ్రా' అని వెళ్లిపోతున్న గార్డువెనక తను పరుగెత్తి 'బాబ్బాబు ఎక్కడ బాబుబొగ్గు మోసేది' అని అడిగి తెలుసుకున్నాడు.

మరునాడు తెల్లవారకముందే మసక చీకట్లోనే, లోకో షెడ్డు దగ్గరకుపోయి, మేస్త్రీని కలుసుకొని, తను బొగ్గు మోస్తానని మనవి చేసుకున్నాడు. మేస్త్రీ తనవైపు దృష్టిసారించి తీక్ష్ణంగా చూశాడు. తను కండలుబ్బించి నరాలు బిగబట్టి వళ్లు పనిచేయగలదనే అభిప్రాయం కలిగేట్టు చేసే ప్రయత్నం కొనసాగిస్తూ వినయంగా నిలబడ్డాడు.

మేస్త్రీ ముఖంలో ఆనందం కనిపించింది. తను తృప్తిగా గాలి పీల్చుకున్నాడు. మేస్త్రీ అడిగాడు 'బొగ్గు మోస్తావా' అని. తను మాట్లాడలేదు బుర్రమాత్రం, గట్టిగా, మంచి వూపుతో రెండుసార్లు అటూ ఇటూ వూపాడు.

గూడ్సుబండిలో నిలబడి గతం కళ్లఎదుటకు తెచ్చుకుని చూచుకుంటూ ఆలోచనల్లో లీనం అయిపోయిన గురవయ్య వీపుకి ఐరన్ రాడ్ ఒకటి గట్టిగా పొడుచుకుంది.

వెనక్కు తిరిగి చూశాడు గురవయ్య.

ఫైర్‌మన్ ఇంజను బాయ్లిలో బొగ్గువేసి, బొగ్గుని కదిలిస్తున్నాడు. ఆ కదలికతో రాడ్ రెండోభాగం అనుకోకుండా గురవయ్యకు పొడుచుకుంది. ఆలోచనల గొలుసు తెగిపోయింది. కోపం వచ్చింది. ఫైర్‌మన్ డ్రైవర్ వైపు చూడకుండా కూడా పనిలో నిమగ్నుడైపోయాడు. గురవయ్యకోపం పోయింది. ఫైర్‌మన్ ఇంజనుబాయ్లిలో బొగ్గువేశాడు.

గురవయ్య ఆలోచనలు బొగ్గు వైపు మళ్ళాయి.

తను లోకోషెడ్డులో బొగ్గుమోసేవాడు మొదట్లో, మేస్త్రీ సహాయంతో షెడ్లో పనిలో చేరినప్పుడు. వాగన్లలోంచి దిగుమతైన బొగ్గు వేరొకచోట చేర్చటం కొన్నాళ్లు చేశాడు. తరవాత వాగన్లలోంచి బొగ్గుదించటం కొన్నాళ్లు చేశాడు. క్రిందవున్న బొగ్గుని ఇంజన్లో వేయటం మరికొన్నాళ్లు చేశాడు. ఇలా సంవత్సరం గడిచిపోయింది.

ఏదో అవసరమైన సందర్భంలో ఇంజను బాయ్లిలో బొగ్గు వేయవలసిందని మేస్త్రీ చెప్పి పంపించాడు. తను అలాగ్గా కొంత కాలం గూడ్సుబండిలో బాయ్లిలో బొగ్గు వేస్తూవుండేవాడు. మరి కొంత కాలానికి తనని ఫైర్‌మన్ అన్నారు. అప్పట్నుంచి తనకు వారం జీతంకాదు. నెలజీతం.

అప్పుడు తను ఫైర్‌మన్. అప్పట్లో తను ఫైర్‌మన్. అదే మొదలు తనలో తనుకూడా ఒకవ్యక్తి అని భావం రావటానికి. తనకు వ్యక్తిత్వంవుంది.

అంతకుముందు తను రిక్షావాళ్ళు తినే సీతిహోటల్లో నాలుగు మెతుకులు కతికేవాడు. ఓవర్ బ్రిడ్జిమీద ఎక్కడో నిద్రపోయేవాడు. అయితే పరిస్థితి తారుమారయింది. పగలు నిద్రపోవాలి. రాత్రి డ్యూటీకి పోవాలి. వేళగానివేళ అన్నంతినాలి. ఇదీ పరిస్థితి. ఇట్టి విషమ పరిస్థితి తనకు. ఓవర్ బ్రిడ్జిమీద పగలు నిద్రపోవటం కుదరదు. అనుకున్నప్పుడు అన్నం దొరకదు.

మేస్త్రీకి మగపిల్లలు లేరు. ఒక్కతే ఆడపిల్ల. తను మేస్త్రీని అడిగాడు పరిస్థితి వివరించి చెప్పి. మేస్త్రీ తెలుసుకున్నాడు. ముద్దుగా పిలుస్తూ 'నా యింటో వుండు బాబు' అన్నాడు. మేస్త్రీ భార్య ఒప్పుకుంది. తను మేస్త్రీ ననుసరించాడు.

సాగిపోతున్న గూడ్సుబండి బాయ్లిలో వాసనలేదు. గురవయ్య బాయ్లివైపు చూశాడు.

బాయ్లివైపుచూస్తూ వీడికి—కోటిగాడికి తను ఆశ్రయం ఇచ్చాడు. వీడు తన యింటికి వచ్చి సంవత్సరం కావస్తోంది. తను మేస్త్రీ ఇంట్లోచేరి ఇరవై సంవత్సరాలపైగా అవుతుంది.

వీడూ మేస్త్రీ దూరంచుట్టం. లైసెన్సుకూలీగా స్టేషనులో చేరాడు. ఉండటానికి ఇల్లు లేకపోవటంతో తన యింట్లో చేరాడు. తను చేరనిచ్చాడు. ద్రోహి అని తెలియదు. తెలిస్తే చేరనిచ్చేవాడు కాదు.

తనకిప్పుడు నలభైసంవత్సరాలకు పైచిలుకే వుంటుంది వయస్సు. ఇప్పుడు తనకొక కొడుకు, కూతురూ వున్నారు. కోటిగాడికి ఇరవై సంవత్సరాలు. బాబుకి ఇరవై సంవత్సరాలు. కూతురికి పద్దెనిమిది సంవత్సరాలు. తను మేస్త్రీఇంటిలో చేరినప్పుడు మేస్త్రీ కూతురికి పద్దెనిమిది సంవత్సరాలు.

గూడ్సుబండి ఇంజను తెంపులేకుండా కూతలు వేస్తోంది.

గురవయ్య ఆలోచనలకు అంతరాయం కలిగింది.

ఫైర్‌మన్ లైటుకి చూస్తూ తీగలాగుతూ వున్నాడు. గురవయ్య లైటుకి చూశాడు. దూరంగా కొంచెం ఎత్తులో ఎర్రలైటు కనిపిస్తోంది. సిగ్నలు ఇవ్వలేదు. మరి రెండుసార్లు తీగలాగాడు ఫైర్‌మన్. దూరంగావున్న ఎర్రలైటు పచ్చలైటుగా మారింది. సిగ్నలు వంగిపోయింది.

కూతలుమాని గూడ్సుబండి, సిగ్నలు దాటి స్టేషనులోకి వచ్చింది. స్టేషను చాలాచిన్నది. ఆగలేదు. దాటిపోయింది.

గురవయ్య గతం జ్ఞాపకాల సినిమా రీలు వర్తమానంలో గుర్తుకు తెచ్చుకొని చూచి ఎదురుగావున్న పొయ్యిలో తగలేస్తున్నాడు.

అప్పుడు తనని మేస్త్రీ భార్య 'బాబూ లేరా' అని లేపేది. స్నానం చేయించేది. బట్టలు ధరింపించేది. అన్నం పెట్టేది. డ్యూటీకి పంపేది. తను డ్యూటీకి పోయేవాడు. తను ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. కాదు—తను అసలు మాట్లాడే వాడే కాదు. ఎవరిఎదుటా నిలబడేవాడు కాదు. అసలు అవసరం కలిగేదే కాదు. పిలిస్తే తలవంచుకొనే పలికేవాడు. ఏమైనా అడిగితే తలవంచుకునే సమాధానం చెప్పేవాడు.

వీణ్ణి కూడా తనభార్య గౌరవంగా చూచేది. ఏలోపం రానీకుండా చేసేది. వాడు ఎప్పుడు ఎక్కడ వుండేవాడో ఎవరికీ తెలియదు. ఒకరోజు స్టేషనులో పడుకునేవాడు. మరొకరోజు ఇంట్లో పడుకునేవాడు. వాడు ఎప్పుడు కూలీమానేసేవాడో తెలియదు. డబ్బుమాత్రం ఏదో ఇంత తనభార్యకు వాడు ఇస్తూ వుండే వాడు.

అప్పుడు తనకు ఇరవై సంవత్సరాలు నిండాయి. ఆ ప్రాంతం లోనే క్రొత్తగా గూడ్సుబండి వేశారు. డ్రైవర్సుస్టేట్ తగ్గింది. ముగ్గురు డ్రైవర్లు అవసరమయ్యారు. సర్వీసున్న ఫైర్ మన్లను డ్రైవర్లుగా ప్రమోట్ చేసే ఏర్పాటు జరిగింది. తనకు ప్రమోషన్ వచ్చింది. అంతే మళ్ళీ ప్రమోషన్ లేదు. కారణం తనకు చదువు లేకపోవటం. అప్పట్నుంచి ఇప్పటిదాకా తను గూడ్సుబండి డ్రైవరుగానే వుండిపోయాడు.

వీడికేమీ ప్రమోషన్ లేదు. ఒకేఒక్క ప్రమోషన్, దేవుణ్ణి చూస్తున్నాడు కోటిగాడు.

తను డ్రైవరు అయింతరవాత కొంత విశ్రాంతి దొరకటం మొదలుపెట్టింది. తను ఇంటిదగ్గర వుంటే అవకాశం ఎక్కువ చిక్కింది. అదే తనకు మేలుచేసింది. జీవితం బాగుపడేట్టు చేసింది.

కోటిగాడూ కూడా అమధ్య ఇంటిదగ్గర ఎక్కువకాలం వుండటం మొదలు పెట్టాడు. తనకప్పుడే భయం కలిగింది. వాడి మన్న అవిశ్రాంతే తనకు కష్టం కలిగించింది. వాడికొంత ముంచింది. తనకు కోపం తెప్పించింది. వీణ్ణి తనచేతులతో చంపించింది.

—వెధవ స్వర్గంలో రంభతో తతంగాలూ తైతక్కలూ ఆడుతాడులే. కుక్క. ఛీ! ఇంజన్లోంచి ఉమ్మివేశాడు.

మేస్త్రీకి రోజువిడిచి రోజు రాత్రి డ్యూటీవుండేది. మేస్త్రీ భార్య పదిగంటలకే కునుకు తీస్తుంది. తనకు రాత్రి రెండుగంటల దాకా నిద్రపట్టేది కాదు. ఇంటిదగ్గరున్న రోజుల్లో మేస్త్రీ 'ఏంబాబూ ఇంకా నిద్రపోలేదూ' అని అడిగేవాడు. తను ఏ సమాధానమూ చెప్పేవాడు కాదు. 'పిచ్చిబాబు ఏమాలోచిస్తున్నాడో' అనుకుంటూ వెళిపోయేవాడు పిచ్చి మేస్త్రీ.

తనకు విశ్రాంతి ఎక్కువైనా రాత్రిడ్యూటీ కూడా వుండేది. కొడుక్కి కూడా ఎక్కువగా నైట్ డ్యూటీలు వస్తుండేవి. తనభార్య పదిగంటలలో పడుకుంటుంది. వాడు ఎప్పుడు ఎక్కడ పడుకునే వాడో ఎవరికీ తెలియదు! ఏరా ఎక్కడున్నావంటే ఏమీ చెప్పేవాడు కాదు.

—వెధవ, తనకు తెలియకుండా చేయగలడా! అనుభవించరా అప్రాచ్యపు ఫూల్. కాండ్రించి మంటే పొయ్యిలో ఉమ్మివేశాడు డ్రైవరు.

మేస్త్రీకి ఒక కూతురుంది. అప్పుడు దానికి పద్దెనిమిది సంవత్సరాలు. లోకోషెడ్డు చుట్టూ చిన్న చిన్న బొగ్గులేరి కాఫీహోటళ్లలో అమ్ముతూవుండేది. పెట్రోలు, కిరోసిను దిగుమతైనప్పుడు పనికిరాని ప్రతిబొట్టు గుడ్డతో అద్ది, అగుడ్డ డబ్బాలో పిండుకొని దాన్ని అమ్మి డబ్బు సంపాయించేది. వాగన్లులోంచి కట్టెలు దిగినప్పుడు దొంగిలించి అమ్మి, డబ్బు కూడబెట్టేది. మేస్త్రీముఖం చూచి, ఆపిల్లను చూచీ చూడనట్లు పోనిచ్చేవాడు కాపలాదారు. ఆ పిల్ల వస్తుంటే షెడ్డు కాపలా జవాను నోరు చప్పరిస్తూ డ్యూటీ మరిచి పోయేవాడు.

తనకూ ఒకకూతురుండేది. దానికిప్పుడు పద్దెనిమిది నిండాయి. అది విలువలేనిపిల్ల. తను దానికి గౌరవం తెద్దామని గొప్పవాడికిచ్చి పెళ్ళిచేద్దామనీ కలలుకన్నాడు. తను దాన్ని

ఎక్కడకూ ఎప్పుడూ పోనివ్వకుండా, అన్నీ ఇంట్లో అమర్చేట్టు చేశాడు. చివరకు అర్థంలేనిపని చేసింది. వెధవ కోటిగాడు దాన్ని చూస్తే ఏపనీ చేసేవాడుగాదు.

మేస్త్రీ కూతురు, మేస్త్రీ నైట్‌డ్యూటీకి పోయినప్పుడు ఒంటిగంటా రెండుగంటలుదాకా నిద్రపోయేదికాదు. తెల్లవారుజాము నాలిగింటికే లేచి, ఆపనీ, ఈపనీ చేసేది.

తనకూతురు, బాబూ తనూ, నైట్‌డ్యూటీకి పోయి పగలు నిద్రపోతుంటే అదికూడా ప్రక్కనే చేరి ఒళ్ళుమరచి నిద్రపోయేది.

కూతురు నలతగా వుంటోందని విచారించిన మేస్త్రీ, దాన్ని ఎక్కువగా పనిచేయనివ్వటంలేదు. కూతురు చురుగ్గా పనిచేయటం లేదు. కాని, తీర్చిదిద్దిన గుమ్మటంలాగా, బొద్దుగా, శుభ్రంగా కొంచెం చియ్యబట్టి సన్నగా, నిగనిగలాడుతూ అందంగా తయారవుతోంది. ఆతరవాత రెణ్ణెల్లకు తెలిసింది మేస్త్రీకి, కూతురికి నెలలు నిండుతున్నాయని.

రెండురోజుల క్రిందట తనకు తెలిసింది, తనకూతురికి నెలలు నిండుతున్నాయని.

అప్పుడు మేస్త్రీ గుండె పగిలిపోయింది.

మొన్న తనగుండె మంటే ఇంజను పొయ్యిలాగా అయిపోయింది.

మేస్త్రీ అసమర్థుడు. బలహీనుడు. పిరికివాడు.

తను ధైర్యం కలిగినవాడు. శక్తిమంతుడు, సామర్థ్యం వున్నవాడు.

ఆరోజు తను మేస్త్రీఇంటికి పోయేసరికి, మేస్త్రీ భార్య హృదయంలో బొగ్గులకుంపటి రాజుకున్నట్లు కూర్చుంది. మేస్త్రీ కూతురు విక్కి విక్కి మంటూ వాకిట్లో ఓ ప్రక్కగా నక్కింది.

మేస్త్రీ చిలపరపేడు తీసుకొని, అప్పుడే అలసిపోయి వచ్చిన తనని దుగ్గుదుగ్గగా బొగ్గుని చితగ్గొట్టినట్లు చితగొట్టాడు. తను కిక్కురుమనలేదు. 'నాయింటోనించి పో భడవా' అన్నాడు మేస్త్రీ. ఆరోజు తను తడబడుతున్న కాళ్ళతో వెనుదిరిగి చూచుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి తను డ్యూటీకి పోలేదు. లోకోషెడ్డు చుట్టూ అదేపనిగా తిరిగాడు. షెడ్డు ప్రక్కగా బొగ్గుగుట్ట దగ్గరగా మురికిగుంటలో కాళ్ళుపెట్టి బొగ్గుని చేత్తో గిల్లుతూ, మురికిగుంటలోని ఈదులాడే కప్పను చూస్తూ తను కూర్చున్నాడు.

ఆ రోజే మేస్త్రీ వెనకగా వచ్చి, లేపి తీసుకుపోయి తనని ఇంట్లోపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయి తెల్లవారిం తరవాత వచ్చాడు. మేస్త్రీ భార్య ఆ రోజు రాత్రి బైట పడుకుంది. ఆకాశంలో చంద్రుడున్నాడు. భూమ్మీద వెన్నెల వుంది. తనకు ఒంటినిండా దెబ్బలున్నాయి. హృదయం నిండా వెన్నెలుంది.

మేస్త్రీ శక్తిహీనుడు!

తను శక్తిగలవాడు.

తనకు ఏమీ తెలియనీయకుండ ఇంత పనిచేసిన కోటిగాణ్ణి తను క్షమించదలచుకోలేదు. చంపివేయాలి. అందుకే బాబుతో ఆలోచించి, నిర్ణయించుకొని, వీడ్ని గూడ్సుబండి ఇంజను పొయ్యిలో కూడ్చివేశా ననుకున్నాడు డ్రైవరు గురవయ్య.

ఇంజను టాపుమీద ఎవరో కదులుతున్నట్లు శబ్దం నిశ్శబ్దంలో స్పష్టంగా వినవచ్చింది. ఇదేదీ డ్రైవరుకు వినిపించదు. ఫైర్ మన్ ఇదేమీ పట్టించుకోలేదు.

ఇంజను మూడుసార్లు కూతవేసి, ఒక చిన్నస్టేషను ప్లాటుఫారం దాటి వెళిపోయింది.

ఇంజను పొయ్యిలోంచి వాసన వస్తున్న జాడలేమీ లేవు. పూర్తిగా వాసన ఆగిపోయింది. ఏ పరమాణువు దొరక్కుండా ఇరవై సంవత్సరాలు పెరిగిన శరీరం ఒక్కగంటలో కాలిపోయింది.

దూరంగావున్న నదిమీద బ్రిడ్జీ మినుకు మినుకుమనే దీపాలతో నే నిక్కడున్నాను సుమా అని హెచ్చరిక చేస్తోంది.

'నది కాళ్ళు చేతులూ ఆరజాపుకొని గాలికి కదులుతున్న చీరెను సరిచేసుకోకుండా నీటుగా నిద్రపోతోంది కాబోలు.

ఇంజను టాపుమీద మనిషి జాగ్రత్తగా నడుస్తున్నట్లు శబ్దం వినవస్తోంది. ఫైర్ మన్ ఏమిటో అనుకున్నాడు. ఇంజను నడుపుతున్నాడు.

చీకటి చీల్చుకుంటూ గూడ్సుబండి నడుస్తోంది.

గురవయ్య మామూలుస్థితికి వచ్చేప్రయత్నంలో వున్నాడు.

ఫైర్ మన్ గూడ్సుబండి డ్రైవ్ చేస్తున్నాడు. డ్రైవర్ ఇంజను పొయ్యిలో బొగ్గువేస్తున్నాడు. ఆ పని అసలు చేయవలసింది ఫైర్ మన్.

క్రిందవున్న బొగ్గుతీసి రెండుసార్లు పొయ్యిలో వేశాడు. మూడోసారి తీయబోతూ ఆగిపోయాడు. తీక్షణంగా బొగ్గు చిదుగుల వైపు చూస్తూ వుండిపోయాడు.

అలా ఎంతోసేపు చూడకుండ గురవయ్య వంగి ఏదో చేతికితీసి, ఊది, పైనున్న చొక్కాతో తుడిచి జాగ్రత్తగా చూశాడు.
పులిగోరు!

ఆ పులిగోరు తను బాబుకి రెండు సంవత్సరాలనాడు చేయించాడు. అది ఇక్కడెందుకు పడింది? బాబు ఇంజనులోకి రాలేదు. క్రింద వుండి అందించాడు. బాబుమెడలోవుంటే పులిగోరు ఎలా ఇంజనులోకి వచ్చింది?

హత్య జరిగేటప్పుడు అనుకోకుండా బాబు మెడలోని పులిగోరు కోటిగాడి చేతిలోకి వచ్చివుంటుంది.

ఇంజను టాపుమీద అలికిడి గురవయ్య విన్నాడు.

నిరామయంగా క్రిందకు వంగి బొగ్గు తీస్తున్నాడు.

ఇంజను టాపుమీంచి ఎవరో గుభిల్లున దూకారు.

డ్రైవరు తల ఎత్తేసరికి ఇంజను డ్రైవ్ చేస్తున్న ఫైర్ మన్ గుండెల్లో కత్తి గ్రుచ్చుకుపోయింది.

కత్తిపిడిని పట్టుకున్న పిడికిలి, కత్తిని గుండెల్లోంచి బైటికి లాగింది.

గురవయ్య కత్తిని చూశాడు. పిడిని చూశాడు. పిడికిలిని చూశాడు. వచ్చిన వ్యక్తి ముఖాన్ని చూశాడు.

ఆశ్చర్యపోయాడు. భయపడ్డాడు. నీరుగారిపోయాడు. వాడు తనమీద కొస్తున్నాడు. వాడు కోటిగాడు.

ఒడ్డుల్ని ఢీకొంటూ మదించి ఘోషతో ప్రవహిస్తున్న నది పైన బ్రిడ్జీమీదికి గూడ్సుబండి ఎక్కింది.

# శిల్పసఖి

**శ్రీ మోటూరి వేంకటరావు**

ప్రతిదినము సాంధ్యవేళ పాహ్యాళి కేను
చనఁగ నొంటిగ నిటఁ బథాంచల తటాంక
చారు మూర్త పురాశిల్ప శకల మొందు
ప్రీతి వీక్షించి నను బల్కరించుచుండు.

సంజనీడల ఆ చూపు చల్లదనము
వెల్లి విరిసి, సురాపగా వీచి లోని
యమృత సేచనముగ నా హృదంతరమును
దడిపి వేసి, పరాధీనతను రచించు.

సకియ చందాన — మందహాసమ్ము చిందు
వదన బింబమ్ములో, జిగి కదలియాడు
సోగ కండోయిలో, దివ్యరాగ మూని
ఈ శిథిల శిల్ప సుందరి హేలఁ గ్రాలు.
ఏ మహాశిల్పి తనగుండె నిచటఁ బిండి
ఈ శిలాఖండమున జీవ మొలయఁ జిలుక
రించెనో! ముగ్ధ చైతన్య రేఖ లిందు
మొలచి సుషమా కళాద్యుతు లొలకఁబోసె.

కాల కూలంకషా తరంగములఁ జిక్కి
నలిఁగి జీర్ణిల్లి నానాఁడు నవసి నవసి
నగము మిగిలియుఁ బ్రాభాతి చిగురుఁబోఁడి
కలకఁ బాఱని నగవు వెన్నెల వెలార్చు

జలదరింపు లెడందలోఁ దొలకరింప —
కమ్మ పూఁదేనెఁ గ్రోలు భృంగమ్ము లీల
శిల్ప రుచిర ప్రియాధర స్మేర మధువు
ప్రతి నిశా ముఖచ్ఛాయ నేఁ ద్రావు దిచట.

మధురమూర్తి — శిలాకాంత — మన్మనోజ్ఞ
హృదయ రాజ్ఞి — సుధాకాంతి పొదలు నేత్ర
సదమ లార్ద్ర కళాద్యంత సాంద్రశోభ
లొదవ, నాకు రహశ్శాంతి నొసఁగుఁ బ్రీతి.

సాంధ్య రాగమ్ములో రాగసరణిఁ బఱపి
అస్మదీయాగమమునకు స్వాగతమ్ము
నెఱపు — మును చీకటుల నేను దొలఁగు వేళ
క్షుభిత దృక్తమ మొల్కు వీడ్కొల్పుఁ జెలియ.

ఎన్ని సందెలనో ఈ ప్రసన్న శిల్ప
సుందరికి హృది విప్పి, నా సొదలు చెప్పి,
వేడి కన్నీటి చుక్కలు విడుతు నామె
యెదుట దమ్ముల స్నిగ్ధ చిహ్నములు ప్రమ్మ
అణ్వణువు, నేను శిల్ప ప్రియాంతికమున
రక్త మాంస శరీర ప్రయుక్త మాన
వత్వమును వీడి యశ్మతత్త్వము వహించి
దివ్య రేఖలు నాలోన దిద్దుకొందు.



జననం 27-6-1900] కీర్తిశేషులు శ్రీ కళా వేంకటరావు [అస్తమయం 7-3-59

# శ్రీపర్వతసీమ

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

(నాగార్జున కొండను దర్శించినప్పుడు కల్గిన భావావేశ సన్నివేశ మీ రచన)

ఇచట వెల్గిన సంజ ఏ తెల్గురాణుల కాళ్ల పారాణి రాగమును గనెనో !
ఇచట క్రమ్మిన మొయిళ్లే తెల్గురాజుల అధ్వరమ్ముల ధూమ మలమికొనెనో ?
ఇచట వీచిన గాలి ఏ తెల్గుబౌద్ధుల త్రిశరణ స్వరములఁ దేమగిలెనో ?
ఇచట ప్రాకిన జ్యోత్స్న ఏ తెల్గుశిల్పుల కల్పనావిభవముఁ గ్రందుకొనెనో ?

ఇచట పూచిన పూలలో నే తెలుంగు
కవుల కవితామరందము గడలుకొనెనో ?
ఇచటి ప్రత్యూషమున వికసించినట్టి
తెలుగు భాగ్యము దిక్కుల నలవరించె.

చీకటి కోనలందొదిగి, చిందిలి ముందిలియై కృశించు ఇ
క్ష్వాకుల, శాతవాహనుల ప్రాభవముల్ గునపమ్ముపోటులో
వేకువ వెల్గులో నడుగుబెట్టుచు తొల్లిటి యాంధ్రవైభవ
శ్రీ కథలన్ వచించె గగురించిన లోకము అబ్బురం పడన్.

తెలుగువారి కెంతటి కళాదీప్తి గలదొ
ఇచటి పాషాణములు కంఠమెత్తి పలుకు;
తెలుగు వారల కెంతటి కలిమిగలదొ
ఇచటి ధారుణి ఎద విదళించి చూపు

ఈడున్ జోడును లేని పద్ధతులతో నేనాడు నిర్మించిరో
క్రీడారంగము, యజ్ఞవాటిక, సుధాకేళీ నివేశంబులున్,
మేడల్, వాడలు, శిల్పకల్పిత కళా నిర్మాణ జాతంబు లి
చ్చో డెందమ్ముల కందళించు నటులన్ జూపట్టు చిత్రంబుగన్.

ఓ నాగార్జున బోధిసత్వ ! కరుణాబ్ధీ ! నీవు వెల్గించు వి
జ్ఞాన జ్యోతులు చేతులెత్తి శరదభ్ర స్నిగ్ధ రోచిస్సుతో
చైనా, సింహళ మాదిగా గలుగు దేశాలన్ సమోత్తేజ సం
ధానంబున్ వెలయించి, చేకొన అనంత స్నేహాభావాంజలుల్,

నాడు నీ ప్రబోధములు మానవ విషాద
జీవితములందు అమృతము చిలుకరించె
నేడు నీపేర కృష్ణవేణీమతల్లి
వార్ధియై నిల్చి బంగారు పంటలెత్తు.

# నాట్య పుష్పాంజలి - అలరిప్పు

శ్రీ జగన్నాథ శర్మ

ఉత్సవము—భక్తి యమరిన నృత్తము సందర్శనీయమయినంతనే స్వాభావికముగ చిత్తసన్నికర్షణము సంఘటిల్లును. జనసముదాయము నెదుట తౌర్యత్రిక శక్తిని విజృంభింపఁజేసిన నర్తనము సభ్యులెంచియుండని వారలయ్యుఁ గొంద ఱువ్వెత్తున లేచి "యాడఁ దివురుదము" యన్నట్టు ఔత్సుక్యమందుదురు. అబాలగోపాలము నిలుచుండి తౌర్యత్రికమును దిలకించుచుండు పట్టున నట్టువనార్—నృత్తమును ఖండగతికి మరల్చినయెడలఁ జూచువారి హృదయోల్లాసము—భక్తి పారవశ్యమట్లుగా వెల్లివిరిసి అందెల్లరికిని గ్రీవాచాలనము గావించును. ఇట్లు గనుకనే నృత్తవిద్య శోభాజనక మనఁజెల్లినది. అది సర్వారిష్ట సంహారిణి—మంగళదాయకము. అది ప్రాజ్ఞ పామర విభేదముగాని బాల వృద్ధ భేదముగాని పాశ్చాత్యప్రాచ్యాదివిభేదముగాని స్త్రీ పురుష భేదముగాని లేకుండ ఎల్లరికింగూర్చువినోదము లన్నింటిలోను మిన్నయనిపించుకొన్నది—నృత్తము ఆనందాద్వయసిద్ధి నొడఁగూర్పఁగలదని భారతీయ లేనాఁడో అనుభవజ్ఞులు కాఁగలిగిరి. ఎల్ల దేశములందును ప్రాచీన జనతానృత్తవిధమున మతావేశపుఁ జోకడ లగపడుచుండును. ఇట్లెన్నెన్ని సందర్భముల మీఁదుగా నరసినను యావత్ప్రపంచిక భూభాగమున—దేశదేశములందు—ఊరూరా—ఇంటింటా ప్రతిహృదయమందును నృత్తవిధమునకు సహజ సన్నివేశ బీజమున్నది. ఈ బీజము కారణముగా ఉచ్ఛ్వాస నిశ్వాస మార్గమునకుఁ గమనవాగతి నందించినంతనే—హార్ద మార్దవ ప్రదర్శకమైన అంకుర మేర్పడి సహజాంగ విన్యాసము చూపట్టును. ఇట్టిస్థితి—పీఠకము కాఁగా అముష్మిక సమన్వయాత్మకములగు కరణములు—స్థిరహస్తాద్యంగహారములు—నృత్తమునందలి అద్యంత కళానికలు దైవాంకితములయినవి. గాంధర్వవిద్యను వెలయించినవారి యుద్దేశమేమని?—సాంఖ్యము, యోగము, ఉపాసనావిధులు, గాంధర్వాది సకలవిద్యలు చిత్తైకాగ్రతను గలుగజేయుట కుత్పన్నములయినవి అని.

"సాంఖ్యయోగాదయో ఉపాసనావిధయశ్చ గాంధర్వాదయశ్చ విద్యాస్సకలాశ్చిత్తైకాగ్రతా ముపపాదకతయోత్పన్నాః"

పాతంజల యోగశాస్త్రము చిత్తవృత్తి నిరోధమే యోగమగు నన్న నివృత్తిని జెప్పినది. నర్తనాదికములోఁగూడిన గాంధర్వ వ్యాయామము ప్రాణాయామ ప్రత్యాహారాదికాత్మకముగాఁ బ్రత్యక్ష యోగవిధానము కాకపోవచ్చును. వినను ఏతత్ వ్యాయామ విధులన్నియుఁ బరోక్షముగా యోగశబ్ద నివృత్తి సమన్వయింపఁబడఁదగినవే! "గాంధర్వ విద్యాభిజ్ఞస్తు—తదనవిద్ధ బ్రహ్మోపాసనతయా — తాలాది భంగ భయాత్ — చిత్తవృత్తేరాత్మైకాగ్ర [illegible] సుకరత్వాత్ అల్పాయాసే నైవ ముక్తి పథం నియచ్ఛతి."—అని. గాంధర్వవిద్యావేత్తయైనవాఁడు దానితోఁ గూర్పఁబడిన బ్రహ్మోపాసన గలవాఁడయినప్పుడు తాళ—రాగ—భావాది భంగ భయమువల్ల చిత్తవృత్తికి ఆత్మయే ముఖ్య స్థానముగా సంయమింపఁగల్గును. అట్లు సుకరత్వముం బొంది అల్పపరిశ్రమవల్లనే ముక్తిపథ మందఁగల్గును. ఇట్టి నమ్మిక యేర్పడినందువల్లనే గాంధర్వవిద్య ప్రాచీనకాలమునందే ప్రాజ్ఞులయొక్క యవలంబనకుఁ బాత్రమైనది. ఔపదేశిక మర్మవేత్తలనఁదగిన ఆచార్య పరంపరలు నిర్వివికొన్నవి. భాండాళికమందు నీళ్ళునింపి యాడుట—ఇట్లే శిరోబాహువుల పయిని గాజు గళాసునయినను సోడా బుడ్డినైనను ధరించి ఆడుటందు ఔపదేశిక మర్మవిధులే శరణ్యములయి యున్నవి. ఇంతటి పట్టుఁదలతోనే ఆడుట=(భరతనాట్యము)—తంజాపురి శైలిలో హలారిప్పునందు ముఖ్యావశ్యక మనవచ్చును. అలారింపు=దైవస్తుతిపరమైన నర్తనము.

"శోభాం జనయత్యతో నృత్తం ప్రవర్తితమ్
ప్రాయేణ సర్వలోకస్య నృత్త మిష్టం స్వభావతః
మాంగళ్యమితి కృత్వాచ నృత్తమేతత్ ప్రకీర్తితం
వివాహ ప్రసవావాహ ప్రమోదాభ్యుదయాదిషు
వినోద కారణం చేతి నృత్తమేతత్ ప్రవర్తితమ్

*  *  *  *

దేవేన చాఽపి సంప్రోక్తః తండుస్తాండవ పూర్వకం
గీతప్రయోగమాశ్రిత్య నృత్తమేతత్ ప్రవర్త్యతామ్
ప్రాయేణ తాండవ విధిః దేవ—స్తుత్యాశ్రయోభవేత్"

—భరతుఁడు

ఇట్టి దైవస్తుతిపరముకాని నాట్యము నీచనాట్యమని పూర్వులు పలుకుచుండిరి. అద్దానినే బహురూపి యున్నట్లుగా నీ[illegible]డించుచును వచ్చిరి.

క్రియారంభ సంప్రదాయసహాత్తు హంగిన్య నృత్తము పుష్పాంజలినాట్యముగా గుర్తింపవచ్చును. ఇందులకు ఉత్తర సర్కారుల నాఁదగిన తెలుఁగుప్రాంతమునందు కుటుంబివారి భక్తి అతి ప్రాచీనమయి యున్నది. 'భరతాభిధాన దర్పణము' శ్రీకుటుంబి వారికి అనుశాసక గ్రంథము.

సీ॥ దైవాభివాదమై వరలు స్థానకమందు
పాత్రరేచకరీతి పదము విడుచు
అతి సువాసనగల యలల పుష్పాళుల
అంజలి ధరియించి యతివ రంగ
మండపంబున బ్రాహ్మ్యమండలమున బ్రహ్మ
పీఠముందుంచుచుఁ బ్రీతిఁ గలిసి

రంగపీఠము నెక్కి...రమణి...బ్రహ్మకుఁగుసు
మాంజలి యొసఁగి......
రంగపీఠము వీడుచు...దేవ వంద
నార్పణముతో...నటి...
నృత్తమునుజేయ నిహము పరమును బొందు......
సీ॥ ఆది పుష్పాంజలి అంత్య పుష్పాంజలి
దేవునికిని...అర్ధదేవునికి అర్పించి
ఆయత స్థానకమందున నిలుచుండి
కుందపున్నాగాది కుసుమములను
పుష్పాంజలిగఁ బట్టి పురుషోత్తమునికయి
విడుతంగవలయును...
నాల్గుదిక్కులకును దాను నతులుజేసి
మొల్లకుసుమములు రాజుపైఁ జల్లవలయు.
చ॥ క్రమముగఁ దాళమర్దళులు ...
మ్రోయఁగపాత్ర—"త ద్ధిమిం
ధిమిధిమి"తాది శబ్దములు
ధీరత నాట్యముసేయు వేళ నా
కుసుమములు జల్లి రాజుపయి......
సభవారు మెచ్చఁగా
నవరసభావనాట్యములు
నర్తకిసేయవలె నృపాలోన్నతిన్.
గీ॥ వరఁగ నాస్థాన దక్షిణభాగమందు
నటి(యు) నిలుచుండి అచ్చటి నాయకుని
దక్షిణంబయి విలసిల్లు వక్షిచేతఁ
జూచి నాట్యంబు చేయంగ శుభమెలర్పు.
చ॥ కుడియగుపాదఘాతమునఁ
గూడును "ఝుం ఝుణుతా—ఝుణంఝణల్"
విడి "తత కుంద" తత్పదము
వీచెవు "నాకిణ కిణ్ణ" శబ్దముల్
ఎడమను పాదఘాతమున
నేర్పడు "ధీంధిమితా"ది శబ్దముల్
తడయక శాస్త్రరీతిగను
తా నటి నాట్యముసేయు నత్తఱిన్.

ఏతావత్తు ఉత్తరసర్కారులందుఁ బుష్పాంజలివిధము ఈ యరీతిగ ననుశాసింపఁబడినదే; ఈ విధమునకుఁ గొంచె మించు మించుగ కార్వేటినగరము వెంకటగిరి మున్నగు ఆస్థానములం దిది

ప్రదర్శితమగుచుండెడిది. "పాత్ర—రంగమధ్యమునకు వచ్చి పతాక హస్తములతో గరుడపక్షి రెక్కలవలె చేతులు పక్కలకు జాచి శిఖ ప్రమాణముగా నిలిచి సభానాయకుని నుదికంటజూచి యెడమకాలి మడిమకు కుడికాలి పెద్దవ్రేలు పూని అక్కడినుండి కుడివైపుగా ఆ బొటనవ్రేలును నేలమీద రేఖగా అన్ని గజ్జెలు అదరులాగున ముందుకు కుడిపాదము రానిచ్చేది. ఈ రీతిగ మూడుమారులు చేసి సరిగా నిల్చి దండము పెట్టుట—యిది పుష్పాంజలి" సభారంజని—వెంకటగిరి.

తంజావూరు నట్టువనార్లు అలరిప్పు అను పేరుతో పుష్పాంజలి నృత్తమును సేయింతురు. పుష్పాంజలి=పుష్ప+అంజలి=పుష్పములతోఁ గూడిన అంజలి. "పాణిః నికుంజః ప్రసృతిః = కుంచితః పాణిః ప్రసృతి రుచ్యతే-పాణిః నికుబ్జః ప్రసృతిః = ప్రసార్యతే విరుద్ధ లక్షణయా సంకుచ్యత ఇతి ప్రసృతిః తౌయుతావంజలిః పుమాన్-అంజ్యతే వ్యజ్యతే భక్తి రనేనేతి అంజలిః పుష్పము=అలరు అలరు+ఇంపు=పూలసొబగు. అలరింపు=ఆనంద ప్రతిపాదనము. అలారింపు=ద్వైవార్థమున్న వైష్ణవపాదప్రక్రియలో పూలను సేకరించి అంజలి పూర్వకముగా నింపునింపు నృత్తక్రియ.

కొందలు చేర్చినవిధములో పుష్పాంజలి పద్ధతులు ముఖ్యముగా రెండు. ౧ పూర్ణపుష్పాంజలి. ౨ లఘు పుష్పాంజలి. ఈ లఘు పుష్పాంజలి తంజావూరునఁ దొంటి లాక్షణికులచే లాస్యపుష్పాంజలి యను పేరున వ్యవహరింపఁ బడినది. ఇయ్యది నాటకరంగ నాందికిం జెందిన శుద్ధప్రక్రియగాక మార్గ+దేశి=విమిశ్రిత ప్రక్రియలు గలది—లావుక త్రిశ్రీత్యాది వివిధగతులు ఈ లాస్యపుష్పాంజలికి బహిఃప్రాణములు. క్రీ॥ శ॥ 1680 నాఁటినుండి రాజనర్తకి సంప్రదాయమునకుఁ జేరి యిది అనూచానవద్ధిష్ఠత నందినది.

నాటక నాందినాఁదగు శుద్ధప్రక్రియయే పూర్ణపుష్పాంజలి-పూర్వరంగమని వ్యవహరింపఁబడుచున్నది. ఇది 22 అంగములుగాఁ జూపట్టునప్పుడు పూర్ణపుష్పాంజలి, 12 అంగములుగ నుండునప్పుడు పూర్వరంగము నాఁదగునని కొందఱనిరి. ఉత్థాపన నాల్గు రెండంగులగు పరివర్తనలు. ఏకుభాగములు నాంది. త్రిగత, ప్రరోచనచారి, మహాచారి మున్నగునవి సప్తనాంతులు. ఈ పన్నెండు ఇట్టివానినెల్ల విస్తరించుట ఇచ్చోట అప్రస్తుతము. ఎందువల్లనన నిట్టివెల్లను ఆచార్యునివలన శిష్యులెఱుంగఁదగినవే. ౧ దేవతాకీర్తనాంకము. ౨ కాలతాళ విభాగము. ౩ తంత్రీభాండ వాద్యమేళన. ౪ పాణివిభాగము. ౫ తంత్రీ పిణ్డీకరణ ౬ వాద్యవృత్తి విభాగము. ౭ ఆతోద్యరంజనము. ౮ ఆలపన క్రియారంభము. ౯ రంగస్థలి పాత్రసన్నివేశము. ఇట్టి పూర్వరంగ బాధ్యతలన్నియు నాటకమందు సూత్రధారునివిగాను; నాట్యమందు నట్టువనారునివిగాను ఉండును.

అలారింపును గురించి పుష్పాంజలి పేరున అవసరోచిత ప్రస్తావన. దీని నింతకంటె పొడిగింపఁబనిలేదు. మఱియు ఏతంవిధ నృత్తమును పుష్పపరముగాఁ బ్రసంగించుట ప్రౌఢవాదము మాత్రమే! నర్తనమభ్యసించువారిచే ఆచార్యుఁడు అంఘ్రి - జంఘా-పాదాగ్ర పార్ష్ణిభాగముల యొక్క భ్రమణ - కంపన - కుట్టనాదిక్రియల నవలీలగా లగాదిరు, అలగాదిమ, హాలాభిగ - అనుఘుర్ఘరికలుగాఁ బ్రదర్శించుటే అందలి నిజతత్త్వము; వాస్తవము. "తాంధితా - ధిగితతాం - ధత్తా" - తైతత్తై - తైతత్తై - తైతత్తై - ఇత్యాదిగ ఖండగతి - ఈ హాలాభిగకు దేశవాళీ మాటయే హాలరిప్పు = అలరింపు. ఇట్టిదానియొక్క నిర్వహణోద్దేశమో—ఇది:—

విఘ్నానాం నాశనం కర్తుం భూతానాం రక్షణాయ చ,
దేవానాం తుష్టయే చాఽపి ప్రేక్షకాణాం విభూతయే.
శ్రేయసే నాయకస్యాఽత్ర పాత్ర సంరక్షణాయచ,
ఆచార్య శిక్షా సిద్ధ్యర్థమ్ పుష్పాంజలి మథాఽరభేత్.

ప్రాచీనకాలమునందు ఈ హాలరిప్పను నేర్పుట విద్యార్థినియొక్క ప్రాథమికావసరముగా నుండెడిది. ఈనాఁడో హాలరిప్పు నాడఁగలగూడ అయితే చాలును. విదుషీమణిగాఁ బరిగణింపఁబడుచున్నది. ఇట్లగుట కేమి కారణమనఁగా - వేద - శాస్త్ర - నాటకాదులందేమి, సాహిత్యవిధమందేమి విద్వల్లోకములోఁ బూర్వికులకంటె అర్వాచీనులలోఁ గాలక్రమమునఁ బ్రమాణము తగ్గుచుండుట. ఇట్లే ప్రాచీనులయట్లుగాక అర్వాచీనులు నాట్యవిద్యయందును బ్రమాణము తగ్గించి పని వడుచున్నారు. ఈ యంశము ఏఁబది సంవత్సరముల క్రిందట అమలునందుండిన విద్యావిధానము నెఱిఁగిన విద్వాంసులందఱిచే ఏకగ్రీవముగా నంగీకరింపఁబడినదే! నాట్యాచార్యులుగాని, నర్తకీజనముగాని తొల్లి జయదేవాష్టపదులు—అమరుకశ్లోకములు—పుష్పబాణ విలాసశ్లోకములు—కృష్ణకర్ణామృత శ్లోకములు—భరతరసప్రకరణము—అభినయదర్పణము ఈ మున్నగు సంస్కృత సాహిత్యగ్రంథముల నన్నిటిని కంఠస్థము చేసికొనియుండిన వారు! అవ్వానికి సమగ్రముగా సమన్వయవిధానము నెఱిఁగినవారు! అతిపాండిత్యప్రకర్ష ఈనాఁడు సార్వత్రికముగాదాయెను.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S. Radhakrishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor S. Sambhu Prasad.

